**SARATHA KATHALU (TELUGU) Vol. 1**
**- Saradha (S. Natarajan, 1924 - Aug 17, 1955)**

ప్రతులు - 1000

ప్రథమ ముద్రణ - జూలై '1998

కవర్‌డిజైన్ : ముఖచిత్రం - లక్ష్మణ్ ఏలే
వెనక అట్ట : **పిలిశెట్టి**

**వెల : రూ. 30/-**

(ఈ పుస్తకం ద్వారా వచ్చిన ఆదాయం మొత్తం శారద సాహిత్య ప్రచురణకై వినియోగించబడుతుంది.)

ప్రతులకు :

1. **విశాలాంధ్ర బుక్‌హౌస్**, అన్ని శాఖలూ
2. **దిశ పుస్తక కేంద్రం**, చిక్కడపల్లి, హైదరాబాద్.
3. **నవోదయ బుక్‌హౌస్**, కాచిగూడ, హైదరాబాద్.
4. **నవయుగ బుక్‌హౌస్**, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.
5. **నవోదయ బుక్‌హౌస్**, ఏలూరు రోడ్, విజయవాడ
6. **మైత్రి బుక్ హౌస్**, ఏలూరు రోడ్, విజయవాడ
7. **ప్రగతి బుక్‌హౌస్**, ఏలూరు రోడ్, విజయవాడ
8. **నవోదయ బుక్‌హౌస్**, ఏలూరు రోడ్, విజయవాడ

*Composed and Printed at :*
**Kalajyothi Process**, R.T.C. 'X' Roads, Musheerabad, Hyderabad - 20

# దాదాపు నాలుగేళ్లక్రితం...

శారద రచనలన్నీ సేకరించి ప్రచురించాలన్న మా ప్రయత్నాన్ని తెలుసుకొని హర్షించి, వారి వద్ద ఉన్న పాత జ్యోతి సంచికలలోని శారదకథలను అందించి తగిన తోడ్పాటు నిస్తామని హామీ ఇచ్చారు - ఆనాటి 'జ్యోతి'కీ ఈ నాటి 'మిసిమి'కీ స్థాపకులయిన ఆలపాటి రవీంద్రనాథ్‌గారు. వారిప్పుడు లేరు.

ఈలోగా... 1948-55ల మధ్య ఈ శారద రచనల వెలికితీతలోని జాప్యం, ఆర్థిక పరిమితులు, అనేకానేక ఒడిదుడుకుల వల్ల ఇక శారద కథల ప్రచురణ అసాధ్యమని నిర్ధారించుకొని, నిరాశలో మునిగిన మాకు రవీంద్రనాథ్ గారి వారసులూ, కళాజ్యోతి ప్రెస్ అధినేతలు ఆలపాటి దేవేందర్, బాపన్నగార్లిచ్చిన సహకారం వెలకట్ట లేనిదీ, మరువకూడనిదీ. వారికి మా కృతజ్ఞతలు.

నిరాడంబర శీలీ, మనస్తత్వవేత్తా అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డిగారి చేయూత మాటల కందనిది.

శారదను తనలోనూ మనలోనూ బ్రతికించిన సహబాటసారీ, నిరంతర చలనశీలి ఆలూరి భుజంగరావుకు...

ఇంత ఆలశ్యాన్నీ, పుస్తకభారాన్నీ మాతోపాటు పంచుకున్న చలసాని ప్రసాదరావు గారికీ...

తెనాలిపై, శారదపై ప్రేమతో ఎన్నో వత్తిళ్ల మధ్య కూడా వీలుచూసుకొని ముందుమాట ఇచ్చిన వరవరరావు గారికీ....

ఆది నుండీ ఈ పుస్తకం వరకూ ఎంతో శ్రమనూ, ఓర్పునూ పంచుకొని - ప్రోత్సహించిన కాత్యాయనీ విద్మహేగారికీ...

కవర్ పేజీ సృష్టికర్తలు లక్ష్మణ్ ఏలే, పినిశెట్టి లకూ...

విలువయిన సహకారాన్నిచ్చిన మునిపల్లె రాజు, బి. శకుంతలాదేవి, బొల్లిముంత, నేతి పరమేశ్వర శర్మ, మాధవాచారి, రాధాకృష్ణమూర్తి, ఆర్.కె, నవీన్, చరిత సుబ్బయ్య గార్లకూ....

విపుల జ్యోతిరాణి గారికీ...

వేటపాలెం గ్రంథాలయ సిబ్బందికీ, నిర్వాహకులకూ...

ఇంతభారాన్ని వహించి, తెరవెనుకే ఉండిపోతున్న మా సభ్యులకూ, సన్నిహితులకూ, సాహిత్యాభిమానులకు....

మా కృతజ్ఞతలు

– శారద సాహిత్య వేదిక

# మన 'శారద'

శారద (ఎస్. నటరాజన్) జీవితాంతం సాధారణ ప్రజల్లో వారి కష్టసుఖాల్లో తానూ ఒకడై గడిపాడు చనిపోతున్న రోజువరకూ, చివరి క్షణం వరకు! తన చుట్టూ వున్న ప్రజల్నించే తన కథలకూ, ఇతర రచనలకూ విషయాన్ని స్వీకరించాడు.

అతడు నిరంతర అధ్యయన శీలి, నిరంతర రచయిత. అతడి 32 ఏండ్ల జీవిత కాలంలో కడుపు నిండా తిన్నరోజులు అరుదే! ఇంత అన్నం, కొంచెం చారు, ఇన్ని మజ్జిగ చాలు వాడికి! ఈ తిండితిని గొడ్డు చాకిరీ చేస్తూ, నిరంతర రచనా వ్యాసంగాన్ని సాగిస్తుంటే - మృత్యువు మూర్ఛవ్యాధి రూపంలో కాచుకుని వున్న సందర్భంలో మనిషి ఏమవుతాడు?

శారద కథలు ప్రచురించి - శారదకు సాహిత్యకమైన పునర్జన్మ నిస్తున్న తెనాలి మిత్రులకు అభినందనలు !

**ఆలూరి భుజంగరావు**
షాహబాద్ - కర్నాటక

ఆనాటి తెనాలి ప్రాంత జీవితాన్ని, శారద జీవిత సంఘర్షణనూ హృద్యంగా చిత్రించిన ఆలూరి భుజంగరావు రచన 'సాహిత్యబాటసారి శారద' చదవండి.

# 'వేయి రేకులై వికసించిన... అతడి సాహితీ సృజన'

తెలుగు సాహిత్యంలో శారదది అరుదయిన వ్యక్తిత్వం. తెలుగువాడుకాని తెలుగు రచయిత ఆయన. లిఖిత సాహిత్యానికున్న ఒక సంప్రదాయం దృష్టితో చూస్తే ఆయన తెలుగులో రచయితలు ఏర్పడిన కోవలోంచి వచ్చిన వాడుకాడు. జానెడు పొట్టచేత బట్టుకొని బతుకు తెరువుకోసం తెనాలికి వచ్చి జీవితాంతం హోటల్‌వర్కర్‌గా బతికిన నటరాజన్ తమిళుడు, అటువంటి నటరాజన్‌లు మద్రాసు, కేరళనుంచి వచ్చి మనవైపు బతుకుతున్న వాళ్లు ఎందరో వుండవచ్చు. కాని అప్పటికే ప్యారిస్ నగరం వలెఎన్నో సంస్కరణోద్యమాలకు, కమ్యూనిస్టు ఉద్యమానికి కూడ కేంద్రమైన తెనాలి నటరాజన్‌ను 'శారద'గా తెలుగు సాహిత్య పాఠకుల హృదయాల్లో చెరగని ముద్రగా నిలిపింది. మరికొన్ని ఇతర విషయాలూ దోహదం చేసాయి. అవి ఈ శతాబ్దపు నాలుగో దశాబ్దం ప్రపంచమంతా ఆర్థిక మాంద్యం నుంచి రెండో ప్రపంచ యుద్ధంలోకి అడుగు పెడుతున్న రోజులు. సామ్రాజ్యవాద ఆర్థిక సంక్షోభం, వలస దేశాలనన్నిటినీ కష్టాల్లో వున్నవాళ్ల దగ్గరికి వచ్చినట్లుగా సన్నిహితం చేసింది. లండన్, ప్యారిస్ నగరాల్లో ఆర్థికరంగంలోనే కాదు సాహిత్య, కళారంగాల్లో జరుగుతున్న ప్రయోగాలు కూడ తెనాలి వంటి పట్టణానికి పరిచయం కావడానికి ఎక్కువ కాలం పట్టలేదు. తెనాలికి 'ఆంధ్రప్యారిస్' అని ఏ అర్థంలో అన్నారో కానీ చలం, కుటుంబరావులు మొదలు తెలుగు సామాజిక, సాంస్కృతిక రంగాల్లో జరిగిన భౌద్ధిక ప్రయోగాలన్నిటికీ తెనాలి కేంద్రంగా వుండింది. చారిత్రాత్మకమైన కమ్యూనిస్టు పాఠశాల నెలరోజులపాటు తెనాలి దగ్గరి మంతెన వారి పాలెం లోనే జరిగింది. చేనేత రంగం మీద మిల్లు బట్టల దాడి, కృష్ణానది మీది ఆనకట్ట తెచ్చిన వ్యవసాయంలోని అభివృద్ధి, చీరాల పేరాల ఉద్యమం మొదలు జాతీయోద్యమంలో వచ్చిన ఎన్నో పరిణామాలు మధ్యతరగతి వికాసానికి దారితీసినవి. వ్యవసాయంలోని పాతపద్ధతులు, వృత్తులు అడుగంటి, కష్టకాలువల వెంబడి పెట్టుబడి పరుగులు పెట్టినకాలం, సహజంగానే నూతన ఉత్పత్తి శక్తులకు ద్వారాలు తెరచింది. ఈ అభివృద్ధికి అనుగుణమైన ఆలోచనా ధోరణులు అన్నిరంగాల్లో పెల్లుబికాయి. నాసికోద్యమం, హేతువాదం, ఎం. ఎన్. రాయ్ నవ్యమానవవాదం, మార్క్సిజం అన్నీ తెనాలిలో తమ అస్తిత్వాన్ని ఆవిష్కరించాయి.

'మాలపల్లి' నాటికే 1917 విప్లవం గురించి బోల్షివిజం గురించి విని వున్న గుంటూరు జిల్లా 1933 'మహాప్రస్థానం' గీతాలతో, అంత కన్నా ముఖ్యంగా 1925 లో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావంలో ప్రముఖస్థానాన్ని పంచుకున్నది. నటరాజన్ బతుకు దెరువు కోసం వచ్చేనాటికి తెనాలిలో తెలుగు సమాజం కొత్త బతుకుదారులు వెతుక్కుంటున్నది. యువత అంతా ప్రజాస్వామ్య శక్తులను సమీకరిస్తున్న సోషలిస్టు శిబిరం వైపు కవోష్ణ రక్తంతో ఉత్తేజితులవుతున్నారు.

దోసెలు పోసే గంటెతో పాటు కలంపట్టిన నటరాజన్ ఆనాటి భుజంగరావు, ప్రకాశంవంటి మిత్రుల సాహచర్యంలో చక్కగా కమ్యూనిజంలోకి ప్రవేశించాడు. అభ్యుదయ రచయితల సంఘంలో ఆయనకు ఎంతటి ప్రముఖ స్థానం లభించిందో తెలియదు గానీ అభ్యుదయ సాహిత్యంలో మాత్రం ఆయన నవలలు' మంచీ చెడూ'' 'అపస్వరాలు', కథలు 'రక్తస్పర్శ' శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నాయి.

'రక్తస్పర్శ' సంపుటిలో వచ్చినవే కాకుండా వేరువేరు పత్రికల్లో నలభైలలో, ఏభైలలో అచ్చయిన

అతని కథలన్నీ సేకరించి మొదటిసారిగా తెనాలి మిత్రులు ప్రచురిస్తున్నారు. ఇది అపూర్వమైన ప్రయత్నం. ఈ కృషిలో భాగంగా శారద సాహిత్యమంతా కొత్త వెలుగులో చదవాల్సివున్నది.

కొన్ని నెలలుగా ఈ కథలు నేను మళ్లా మళ్లా చదువుకున్నాను. నలభైలనుంచి ప్రస్తుత నేపథ్యానికి వస్తే - ఈకథలు చదవడానికన్నా ముందు, చదువుతున్న కాలంలోనూ సాహిత్యవిమర్శలో ఒక ధోరణి వ్యక్తమవుతున్నది. అది ఇతర రంగాలలో లేనిది కాదు. ఉదాహరణకు ఇదివరలో ఒక సరుకు చలామణీలో పెట్టడానికి దాని విశిష్టతలగురించి చెప్పి అదిచాలా గొప్పదని చెప్పేవాళ్లు. ఇటీవల కాలంలో ఆ సరుకుతో ఇతర సరుకుల పోలికలు తెచ్చి, అవి ఎందుకు పనికి రాని నాసిరకం అని చెప్పి వాటిని తిరస్కరిస్తూ ఆ ఒకే ఒక్క సరుకు గొప్పతనాన్ని స్థాపిస్తున్నారు.

ఇది బహుశా 91 నుంచి అమలులోకి వచ్చిన నూతన ఆర్థిక విధానం, విశ్వీకరణ ప్రభావం అనుకుంటాను. ఈ విశ్వీకరణ వెనుక తూర్పు యూరపు పరిణామాలు, సోవియట్ రష్యాలో సారంలోనే కాకుండా రూపంలో కూడ రిపబ్లిక్కుల విచ్ఛిత్తి, కమ్యూనిస్టు పార్టీ అధికార పతనం, ఎర్రజెండా నిక్కు మాత్రమే కాదు రంగుకూడా మారిపోవడం కారణాలు.

కనుకనే సహజంగానే మార్క్సిస్టు సాహిత్యం మీద కూడా దాడి చేసే సౌకర్యం చాలామందికి కలిగింది. మార్క్సిస్టు సాహిత్యం మీద దాడికూడ కొత్తగా జరుగుతున్నదేమీ కాదు. యూరపులో 19వ శతాబ్దంలో జరిగిందే మానవ సంబంధాల పేరుతో తెలుగులో ఈ దశాబ్దంలో మొదలయింది.

ఈ సాహిత్య విమర్శ ప్రతిపాదిస్తున్న అంశాల్లో ముఖ్యమైంది మార్క్సిస్టు సాహిత్యంలో వైవిధ్యం వుండదని. వస్తువు ఎంపికలోనూ, దానికి సాహిత్య రూపం ఇవ్వడంలోనూ మార్క్సిస్టు సాహిత్యం మూస ధోరణికి బలి అయిందని, అందువల్ల జీవితంలోని, వైవిధ్యం సాహిత్యంలో చోటు చేసుకోవడం లేదని, మార్క్సిస్టు సాహిత్యం విధి, నిషేధాలు విధించడం వల్ల కూడ నమూనా సాహిత్యం మాత్రమే వెలుగు చూసి జీవితంలోని చాల చీకటి కోణాలు మరుగున పడిపోయాయన్నది ఈ విమర్శ సారం. మొదటి అంశం ఏమిటంటే ఇది ఉపపత్తి ఇవ్వని నిరాధారమైన ఆరోపణ. రష్యన్‌సాహిత్యంలో గోర్కీ, చెఖోవ్, మయకొవస్కీ వంటి రచయితల రచనలు చూసినా, అందులోనూ మళ్లా వాళ్లే రాసిన ఆయాకాలాల సాహిత్యాన్నీ, ప్రక్రియలను చూసినా ఇది ఎంత నిరాధారమో తేలిపోతుంది. ఉదాహరణకు తెలుగు సాహిత్యంలో ఫాంటసీలు లేకపోవడం వైవిధ్యం లేక పోవడంగా ఒక ఆరోపణ. అభ్యుదయ తెలుగు సాహిత్యంలో ఫాంటసీలు లేవా? శ్రీ శ్రీ, కొకు, తెన్నేటి సూరి మొదలైన వారందరూ ఫాంటసీలే రాసారు. బహుశా తెలుగు సాహిత్యంలో ఫాంటసీని ప్రవేశపెట్టింది కూడ శ్రీ శ్రీ వంటి మార్క్సిస్టు రచయితలే. ఆ మాట కొస్తే రెండో ప్రపంచ యుద్ధకాలంలో పాశ్చాత్య దేశాల్లో సాహిత్యంలో వచ్చిన అన్ని ప్రయోగాలను వాస్తవిక, అధివాస్తవిక ధోరణులను తెలుగు సాహిత్యంలోకి శ్రీ శ్రీ వంటి అభ్యుదయ రచయితలే తెచ్చారు. శ్రీ శ్రీ, కొకు వంటి లబ్ధప్రతిష్ఠుల పేర్లు వదిలేద్దాం. విషయ వైవిధ్యం కోసమైనా, కథాశిల్పంలో ప్రయోగాల కోసమైనా ఈ 'శారద కథలే తీసుకుందాం. ఇందులో 'వింతలోకం' వంటి కనీసం మూడు, నాలుగు ఫాంటసీలు వున్నాయి. ఒక్కొక్క దానిలో ప్రతిపాదించిన విషయాలు ఒకదానికొకటి పోలికలేనివి. ప్రపంచ శాంతి, యుద్ధ వ్యతిరేకత, అణుశక్తిని ప్రజావసరాలకుపయోగించు కునేలాచేయడం సాంకేతిక విజ్ఞాన బాధ్యత - ఒక్కమాటలో అప్పటి సోవియట్ రష్యావైఖరి ఒక కథలో వ్యక్తమయితే, శ్రీ శ్రీ 1+1=1 నాటికలో

కలగన్నట్లు భారతదేశంలో అన్ని భాషాజాతుల రిపబ్లిక్కులు ఏర్పడి తెలుగునాడు ఒక స్వతంత్రదేశంగా ఇతర దేశాలతో వాణిజ్యవ్యాపారాలు చేయడం మరొక కథలో ఫాంటసీగా రూపొందుతుంది. నిజానికిది ఫాంటసీగా మాత్రమే లేదు. ఇవ్వాళ తెలంగాణ అనుభవంతో పోలిస్తే ఇబ్బందిగా కూడా వున్నది. ఇదే సంపుటిలో మద్రాసు మహానగరం ఎవరికి చెందాలని ఇద్దరు మధ్యతరగతి మనుషులు (ఇంటి యజమాని, ఇంట్లో కిరాయికున్నాయన) తమిళ - తెలుగు ప్రాతినిధ్యం వహించి ఘర్షణ పడి ఇల్లు ఖాళీ చేయించి, చేసే స్థితి వచ్చి మద్రాసు మహానగరం ఆంధ్రలో చేరినా, మద్రాసు రాష్ట్రంలోనే వున్నా పేద ప్రజలకు ఒరిగేదేమీ లేదనే అవగాహనకు వస్తారు.

మార్క్సిస్టు సాహిత్యం మీద పైన పేర్కొన్న విమర్శలో చేసిన మరొకదాడి ఆర్థిక నియతి వాదానికి గురయి ఈ సాహిత్యం మనస్తత్వాల చిత్రణ మరచిపోయిందని - మార్క్స్‌తో పాటు ఏ కొంచెమైనా తెలుగు రచయితలు ఫ్రాయిడ్‌ను చదివితే బాగుండునని ( నిజానికి తెలుగు మేధావులది శ్రుతపాండిత్యమే కానీ మార్క్సిజాన్నీ కూడా చదివారా - అన్నది ఈ దాడిచేసే వారి మరొక అభియోగం). 'శారద' కథలు చదువుతుంటే దుర్భర దారిద్ర్యం, మధ్య తరగతి ఆర్థిక పరిస్థితులు - మనుషుల మనస్తత్వాల మీద ఎటువంటి ప్రభావాలువేస్తాయో, మనుషులు అల్పులు గానూ, పిరికి వాళ్ళు గానూ, స్వార్థపరులు గానూ ఎందుకు మారతారు, ఏపరిస్థితులు మనుషులనెట్లా ప్రభావితం చేసి ఆలోచింప చేస్తాయి, ప్రవర్తింప చేస్తాయి- అన్నది మనసును కలచి వేస్తుంది.

ప్రభావాల రీత్యా 'శారద' మీద చలం, కొకుల ముద్ర జమిలిగా వుంది. చాల సందర్భాల్లో ఈ కథలు చదువుతుంటే కుంటుంబరావు కథలు చదువుతున్న ధ్యాసే కలుగుతుంది. మనుషుల ప్రవర్తనల గురించిన సజీవ సాహిత్య విశ్లేషణకు శారద కథలు మంచి జవాబవుతాయి.

కొత్తగా ఇటీవలనే మార్క్సిస్టు సాహిత్య శిల్పం మీదమరొక దాడి జరిగింది. చాల మంచి పుస్తకాన్ని పరిచయం చేసే సందర్భంగా మార్క్సిస్టు సాహిత్యం కూడ నాయకుణ్ని ఆశ్రయించే శిల్పానికే కట్టుబడి ఒక కథా శిల్పాన్ని, నవలా శిల్పాన్ని ఎంచుకోలేక పోయిందని, సామాన్యుణ్నీ నాయకుణ్నీ చేయడం వరకు వస్తువులో తెచ్చిన మార్పు శిల్పంలో మాత్రం తేలేక పోయిందని ఆ విమర్శ. నాయికా, నాయకులను ఆశ్రయించి కాకుండా సాహిత్యం మనుషులను, మనుషుల అవసరాలను, ప్రవృత్తులను చైతన్యాన్ని ఆవరించి వుంటుందనడానికి కూడా 'శారద' కథలు నిదర్శనంగా వున్నాయి.

అభ్యుదయ సాహిత్యంలో, కథల్లో వస్తువైవిధ్యానికి, శిల్పవైవిధ్యానికి సజీవమైన దాఖలాలు శారద కథలు.

నా వరకు నాకు ఒక పాఠకునిగా మార్క్సిస్టు సాహిత్యం మీద ఆరోపణలకు సృజనాత్మకమైన జవాబులు ఈ కథల్లో లభించాయి. ఈ కథల్లో కొన్ని విషయాల్లో నాకివ్వాళ ఏకీభావం లేదు. కొన్ని అంశాలు మోతాదు మించి వున్నాయనిపించింది. కొన్ని బలహీనమైన కథలనిపించింది. కొన్ని భావాలకు నాకు ఆమోదం లేదు. కాని జీవితంలోని, అనుభవం, సృజనాత్మకత - మార్క్సిస్టు కావడంవల్ల చచ్చిపోవు - సరి కదా చైతన్యంవల్ల, దృక్పథం వల్ల అర్థవంతమైన జీవన విధానంగా రూపొందుతాయని ఈ కథలు మనకు మరో మారు విశ్వాసాన్నిచ్చాయి.

**8.6.98.** **– వి.వి.**

# సాహిత్యాభిమానులకు విజ్ఞప్తి

ఇది ప్రతీఘాతుక భావజాలం రకరకాల రూపాల్లో రాజ్యం చేస్తున్న కాలం. సమస్త విలువలూ విచ్ఛిన్నమవుతున్న సంక్షుభిత వర్తమానం. ఈ సందర్భంలో మంచి సాహిత్యాన్ని సృజించటమే కాక గతంలోని ఉత్తమ సాహిత్యాన్ని, తెలుగు నేల ఉత్థాన పతనాన్ని వర్తమానతరాలకు అందించటం ఒక అవసరంగా గుర్తించి - విభిన్న స్వరాల సాహిత్యాభిమానుల కలయికగా 'శారద సాహిత్య వేదిక' ను తెనాలిలో ఏర్పరిచాం.

దీనికి తోడ్పాటు నిచ్చేందుకూ, సాహిత్య కార్యక్రమ నిర్వహణకూ అప్పటి, ఇప్పటి సాహితీ వేత్తలు కాళీపట్నం రామారావు, చలసాని ప్రసాదరావు, మునిపల్లెరాజు, వరవరరావు, కాత్యాయనీ విద్మహే, ఆలూరి భుజంగరావు, వేగుంట మోహన ప్రసాద్, కె. శివారెడ్డి, కృష్ణాబాయి, కె. చిరంజీవి, వెలగా వెంకటప్పయ్య, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి తదితరుల సారధ్యంలో ఒక సలహా సంఘం ఏర్పడింది.

తెనాలి అధ్యాపకులు పి. జె. వర్ధనరావు అధ్యక్షతన ఒక కార్యవర్గం ఏర్పడి సల్పిన కృషి ఫలితంగా శారద రచనలెన్నో వెలుగులోకి వచ్చాయి. 'క్షణంలో సగం' పేరుతో శారద రచించిన రాజకీయ వ్యంగ్య రచనలూ, కొన్ని నాటికలూ, నాలుగు నవలలూ, అందుబాటులో ఉన్నాయి. ఇంకా 'చీకటి తెరలు' (అముద్రితం), 'సందేశం'. 'నాగరీకుని ప్రేమ' వంటి నవలలూ, అరవై వరకు కథలూ, 'హోటల్ వర్కర్' నాటిక, లేఖా సాహిత్యం దొరకాల్సి ఉన్నాయి.

ఆనాటి (1948 - 55) అభ్యుదయ, హంస, తెలుగు స్వతంత్ర, జ్యోతి, విశాలాంధ్ర, ప్రజాశక్తి పత్రికలలో శారద రచనలెన్నో ప్రచురింపబడినాయి. సాహిత్యాభిమానులు తమ వద్ద ఉన్న శారద రచనలనూ, ఆయా పత్రికలనూ మాకు అందజేయ వలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

ఈ అన్నింటి సేకరణ, ప్రచురణ అనేక వ్యయప్రయాసలకు సంబంధించినదీ, ఆర్థిక భారాన్ని కల్గించేదీ కూడా. సాహిత్యాభిమానులు తమ ఆర్థిక హార్థిక సహకారాన్నం దించి, మాతో భాగ స్వాములు కమ్మని విజ్ఞప్తి చేస్తున్నాం. ఈ పుస్తకం అమ్మకాల ద్వారా వచ్చిన ప్రతిరూపాయి తిరిగి శారద సాహిత్య ప్రచురణకే వినియోగ పడుతుంది కనుక, ఈ పుస్తకాన్ని మీ మిత్రులకి పరిచయం చేయ వలసిందిగా కోరుతున్నాం.

మీ శారద సాహిత్య వేదిక


చిరునామా:

**పి. జె. వర్ధనరావు,**
ఇంగ్లీష్ లెక్చరర్
వి. ఎస్. ఆర్. కాలేజి, తెనాలి.
Ph : 08644-28967

# కథాక్రమం

# రక్తస్పర్శ

జీవితమంటే మజాకా గాదు. అది ఒక అగ్నిగుండం. ఒక వ్యక్తి జీవితాన్ని అన్ని విధాలా బాగుచేసినా, అమాంతం నాశనం చేసినా, సంఘం తను చేసినపనికి తనే సంతోషిస్తుంది. అదే దాని నైజం. తనకు ఎదురుతిరిగిన వాళ్ళని అది నీచంగా చిత్రించి బాధపెట్టి, స్మశానంలో వాళ్ళ శవం తాలూకా పొగ కన్పించేవారకూ సంతృప్తి పడకపోయినా, శృతిమించినట్లైతే వాళ్ళనే తప్పక పొగిడి తీరుతుంది. ఇదే దాని రూపం. సంఘానికి ఆత్మవుందో, లేదో అనేది అనిర్ణీతమైన విషయం. ఆత్మలంటూ వున్న వ్యక్తులు కలిసిందే సంఘం కనుక, దానికి లక్ష ఆత్మలూ, కోటి ఉద్దేశాలూ వుంటాయనేది కేవలం వాదనకి పనికివచ్చే విషయం మాత్రమే. ఒకణ్ణి సర్వనాశనంచేసే విషయంలోనూ, ఇంకొకడు తను విధించిన నీతుల్ని బహిరంగంగా ఆమోదిస్తూ, రహస్యంగా వాటినన్నిటినీ వ్యతిరేకిస్తున్నా - వాణ్ణి, వాడి రహస్య నేరాల్నీ క్షమించే విషయంలోనూ, సంఘం తన లక్ష ఆత్మల్నీ, కోటి ఉద్దేశాల్నీ వికృతంగా ప్రదర్శిస్తూనే వున్నది. ఒక చండశాసనుణ్ణి అది తల వొగ్గి భరిస్తున్నది. పదిమందిని ఏదోరకంగా గొప్ప పేర్లతో మోసం చేస్తున్న పెద్దమనిషిని సహిస్తున్నది. తెల్లగా బట్ట లేసుకుని తిరిగే లక్షమంది లోపాయికారీ దుర్మార్గుల్ని అది మాట అనలేక పోతున్నది. తన శ్రమకు తగిన ప్రతిఫలం ఎట్లాగు పొందలేని కూలివాణ్ణి అది కనికరిస్తున్నది. కాని వాడే దేనికోసమన్నాగాని సమ్మె అంటూ చేస్తే దాన్ని చచ్చేట్టు వ్యతిరేకిస్తున్నది. జేబులు కొట్టే వాణ్ణి దొంగ అని కోర్టులో శిక్షిస్తున్నది. వ్యాపారంలో లక్షలార్జించేవాణ్ణి అదృష్టవంతుడని పొగడుచున్నది. ఒకణ్ణి చంపితే నేరమని ఉరిశిక్ష విధిస్తున్నది. పదిమందిని చంపితే పరాక్రమమంటున్నది. ఇదీ మధ్యతరగతి లక్షణం !

## 2

స్మశానంలో దక్షిణవైపు మూలగా శవంనుంచి పొగలేస్తున్నది. కొత్త పేట మూడోలైను చివరి పెంకుటింటికి చెందిన కరణంగారికి అంత్యక్రియలు జరుగుతున్నై. ఆయనకి ఒక్క కొడుకు ప్రసాదరావు. వాడికన్న పెద్దది అనసూయ. ఇద్దరే, చుట్టాలంటూ భూమిమీద మిగిలినవాళ్ళు. భార్య పోవడం, కరణంగారు మళ్ళీ పెళ్ళికి ఇష్టపడకపోవడం, అందువల్ల కొన్ని ఇబ్బందులు కలిగినా, వాటిని లెక్కచెయ్యకుండా వంటమనిషిని పెట్టుకుని కాలం గడపటం; ఇవన్నీ కరణంగారి వంటరి బుద్ధిని వ్యక్తీకరిస్తాయి. అయినప్పటికీ ఆయన బతికున్నంత కాలమూ పలుకుబడితో కాలం వెళ్ళబుచ్చాడు. కరణీకం వదులుకున్నప్పటికీ ఆయనకి కరణంగారనే పేరు స్థిరపడిపోయింది.

నోటి మంచితనాన ఎంతపనైనా సాధించవచ్చునని ఆయన చెబుతుండేవాడు. తీరా ఆయన మరణించేటప్పటికి దూరపు బంధువులైనా ఎక్కడన్నా ఉన్నారేమో అన్న భోగట్టాకూడా చుట్టుపక్కలవాళ్ళకి అంతుచిక్కలేదు. చిట్టచివరికి ఇరుగుపొరుగన వున్న సాంబయ్యగారూ, అవధానులుగారూ నిలబడి నలుగుర్ని పోగుచేసి కరణంగారి అంత్యక్రియలు జరిపించారు. ప్రసాదరావుకి పన్నెండేళ్ళూ, అనసూయకి పదిహేనేళ్ళూ ఉంటాయి తండ్రిపోయేటప్పటికి. ఇద్దరూ తండ్రి కోసం దిగులుపడ్డారు. అయితే ఎంత చిన్నదైనా ఆడది గనుక అనసూయ తమ్ముణ్ణి ఓదార్చింది. ఆమెలోనూ దుఃఖం లేక పోలేదు. స్మశానంనుంచి ఇంటికి వచ్చింతర్వాత అనసూయ అవధానిగారి భార్యచేతనే అన్నం ఉడకేయించి, తమ్ముడికి పెట్టి, తనూ ఇంత తిన్నది. తమ్ముడికి జ్ఞానోదయం కానందు వల్ల ఎక్కడ దిగులు పడిపోతాడో అని దుఃఖాన్ని లోలోపల దిగమింగి 'నాయనా ఏం చేస్తాం! ఏడవకు, మనం నోచుకున్నదంతే!' అని ఓదార్చింది. కర్మవగైరా చేయడానికి గానుతండ్రి పెట్టెతాళాలు తీసి పైకంకోసం వెతికింది. ఒక కవరులో యాభై, రూపాయలనోట్లు కనిపించినై. ఆమె వాటిని తెల్లారి అవధానులగారికిచ్చి ''ఇదిగో బాబాయి పైకం. మిగతా పని కూడా తెల్లార్చండి. ఎట్లాగోట్లా'' అన్నది. అవధానులుగారు ఉదారుడు, అభిమాని, ఆయన పైకం లెక్క పెట్టి తీసుకుని, పాతిక రూపాయలు తిరిగి ఇచ్చేసి, ''అమ్మాయీ! లోకజ్ఞానం లేనిదానివి. ఏదో కర్మంటూ చెయ్యాలిగాని, దానికి యాభయిలూ, వందలూ ఖర్చుపెట్టక్కర్లేదు. మీరెట్లా బతుకుతారో కద!'' అని నిటూర్చి మిగతా ఏర్పాట్లు చేయడానికి వెళ్ళిపోయినాడు.

## 3

ఇది జరిగిన రెణ్ణెల్లకి, కరణంగారి పొలాలు చేసే రైతు వచ్చాడు. అనసూయనీ, ప్రసాదరావునీ చూసి అతను కళ్ళ నీళ్ళు పెట్టుకుని '' ఏదో జరిగిపోయింది, వెళ్ళిపోయాడు. మహరాజు పాపం! పసికందులు మీరెట్లా బతుకుతారో! పెళ్ళీ, పేరంటం కావల్సినవారు, అబ్బాయి చదువుకోవాల్సినవాడు. ఏమిటో నాకు కుడిభుజం పోయినట్లున్నది'' అని అంగలార్చి, ఈ సంవత్సరం పొలం తాలూకు శిస్తుపోను పైకం తెచ్చాను, నూట ఎనభయి రూపాయలొచ్చినై.'' అని పైకం బొడ్లోంచి తీసియిచ్చాడు. అనసూయ పైకం అందుకుంటూ ''బాబూ! అప్పుడప్పుడు కనబడుతూండు. మాకు ఇంకా చుట్టా లెవరున్నారు నాయనా!'' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. రైతు సాయంత్రందాకా వుండి అనసూయ బలవంతంచేస్తే అన్నంతిని పోతూ పోతూ జాగర్తలు చెప్పివెళ్లాడు. అనసూయ తెలివితేటలుగలది. తండ్రి వున్నప్పుడే ఇంటిపనులు చేస్తూ, తీరిక సమయాల్లో రామాయణ భారతాలు చదువుతుండేది, బోర్డు ఎలిమెంటరీ స్కూల్లో చదువుకోవడం వల్ల రెండు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకున్నది. ఈ స్వల్ప విజ్ఞానంతోటే ఆమె తమ్ముణ్ణి కూచోపెట్టి పాఠాలు చదవమని, తనకు తెలిసింది వాడికి చెబుతూవుండేది. ప్రసాదరావు కుర్రతనంవల్ల తండ్రిని త్వరలోనే మరచి పోయినాడు. అదివరకే ఐదో తరగతి పూర్తి చేసి వుండటంవల్ల ఫస్టు ఫారం చదవటానికి హైస్కూల్లో చేరాడు.

ఆ యేడు అవధాన్లుగారు, ఆయన భార్య, అనసూయకి చేదోడువాదోడుగా వుంటూ ఆమెకు చుట్టాలు లేని లోపం తీరుస్తూవచ్చారు. చేతిలో సమృద్ధిగా పైకంవుండి, అన్ని హంగామాలు చుట్టంపక్కం వుంటేనే ఆడపిల్లకి వరుడు దొరకడం అంతమాత్రం. ఇవేవీ లేని అనసూయకి పెళ్ళీడు వచ్చిన వరుడు దొరకడం ఎంత కష్టం! ఉండటానికి పెంకుటిల్లు, ఆరెకరాల మాగాణి వున్నది. సాలుసరి తిండికి లోటువుండదు. ఇంట్లో ఒక భాగంలో ఎవర్నో అద్దెకు కుదిర్చారు అవధానిగారు. అదొక ఎనిమిదిరూపాయలొస్తాయి. అయితే కట్నం, కానుక లివ్వందే జాలిదలిచి ఎవరూ అనసూయని పెళ్ళాడేందుకు రారు. ఇవన్నీ అవధానులుగారు ఆలోచించారు; ఆయనకు సంతానము లేక పోవడమే, కరణంగారి సంతానంమీద మమకారం కలిగివుండేట్లు చేసింది అనొచ్చు.

పెళ్ళికేం తొందర! అని వూరుకోటానికి ఆయన మనసొప్పలేదు. పెళ్ళి ఎప్పటికైనా కావల్సిందే, అసలు కరణంగారు బాగుంటే ఈయేడే పిల్ల పెండ్లి చేయాలని ప్రయత్నం చేసివుండేవారు. ఒక రోజున తనతో ఆ మాటే అన్నారు కూడాను. అనసూయతో ఈ గొడవంతా చెప్పి ఆ అమ్మాయి మనస్సు చెడగొట్టడంకన్న, తనే ఒక సంబంధం కుదిర్చి, ఆ తర్వాత చెబితే, ఆ అమ్మాయైనా తనని కాదనదు. అంతవరకూ అవధానిగారికి గట్టి విశ్వాసంవుంది. అయితే, ఎట్లాగైనా పరాయివాళ్ళు! లోకం తనని ఏదో తప్పుబట్టిదూషించవచ్చు. నిందమోపడం ఎంత తేలిక! కాని ఎంత మంచిపని చేసినా లోకాపవాదం తప్పదని అవధానులుగారు తీర్మానించుకొని, వరాన్వేషణకు పూనుకొన్నారు. తన శక్తి కొద్దీ ప్రయత్నమంతా చేస్తే విఫలమయే షష్లే వుండవు, ఆ ప్రయత్నంలో లోపముండకపోతె. అట్లాగే మరొక రెండు నెలల ప్రయత్నం తరువాత అవధానిగారికి ఒక వరుడు దొరికాడు. ఇతనికి తల్లీ దండ్రీ లేరు. మేనమామ గారి ఇంట్లో వుంటూ ఏదో ఆఫీసులో ఉద్యోగం చేస్తూ వున్నాడు. పాతిక రూపాయలు తెస్తాడు. ఇరవైనాలుగేళ్ళు వయస్సు. ఆస్తంటూ సెంటు భూమిలేదు. జానెడు కొంపా లేదు. జీతంరాళ్ళతో ఈసురోమని మేనమామగారింట్లో కాలం వెళ్ళబోసుకుంటున్నాడు. అసలు తనకి పెళ్ళి అవుతుందా అని నిరుత్సాహపడ్డాడుట. ఈ సంబంధం కుదర్చడంలో అవధానిగారికి రెండు సౌకర్యాలు కనబడ్డయి. మొదటిది కట్నం ఏమీ ఇవ్వనక్కరలేకపోవడం, రెండోది వరుడు ఉన్న వూళ్ళోవాడే కావటం. మరొక్క ఆశకూడా వున్నది అవధానిగారికి, అల్లుడుకూడా కరణంగారింట్లో ఉండిపోయ్యే అవకాశం లేక పోలేదని.

వెండి చెంబులూ, పట్టుబట్టలూ, పెళ్ళి ఖర్చులూ భరించేటట్లయితే, వచ్చే వైశాఖంలోనే శుభముహూర్తము చూడవచ్చు అన్నాడు వరుడి మేనమామ. ఆయన పేరు సత్యనారాయణ. లావుగా, పొట్టిగా వుంటాడు. స్వభావం కూడా రూపానికి తోడుబోయిందే! తన మేనల్లుణ్ణి ఏట్లాగన్నా ఇంట్లోంచి వొదిలించుకోవాలనేది ఆయన ఏకైక ఆశయంగా కనపడ్డది. ఈ మాటలను ఆయన రహస్యంగా దాచుకోలేదు. పైకి అన్నాడు మహారాజు, అవధానిగారు సత్యనారాయణగారు బెట్టిన షరతులన్నీ ఒప్పుకొని ''అట్లాగేనండీ! అబద్ధాలాడన్నా ఒక పెళ్ళి చేయమన్నారుగదండీ- అట్లా అబద్ధం ఏమీ అవసరం లేకుండా పుణ్యం కట్టుకుందాం మనం'' అన్నాడు. సత్యనారాయణ ఆమోదసూచకంగా తలూపి ''ఏదో లెండి వాళ్ళిద్దరూ బాగుండటం మనకి కావాలి. కట్నాలూ, కానుకలూ పుచ్చుకోడం బొత్తిగా నా

మతానికి వ్యతిరేకం'' అన్నాడు. తనకొడుక్కి వెయ్యి నూట పదహార్లు చాలవని, సైకిలూ రిస్టువాచీ ఇవ్వాలనీ కాబోయే వియ్యంకుడితో బేరమాడుతున్న పెద్దమనిషి! వాళ్ళ ప్రవృత్తిలోపాలతో తనకేంపని అనుకున్నాడు అవధాని, ''సరే, కానీండి - శుభముహూర్తం పెట్టించమంటారా?'' అని అవధాని ఇంటికి వెళ్తూ అడిగాడు. సత్యనారాయణ ''అలాగే, అలాగే'' అన్నాడు.

పెళ్ళికి సుముహూర్తం వైశాఖంలోనే కుదిరింది. ఇక మూడు నెలల వ్యవధి వుంది. ఈలోగా అవధాని అనసూయకు ఒకనాటి రాత్రి జరిగిందంతా చెప్పి, ''అమ్మాయీ! నీ వుద్దేశం ఏమిటో చెప్పు; నా లోపం లేకుండా తంటాలు పడుతున్నాను, నీకేమయినా ఆక్షపణవుంటే నాతో చేప్పేసెయ్ : కలకాలం కాపురం చేసేది నువ్వు'' అని అన్నాడు, అనసూయ పెళ్ళిమాట ఏత్తేటప్పటికి సిగ్గుపడి ''బాబాయి, కానీండి'' అని వూరుకుంది, నేలకేసి చూస్తూ.

''అట్లా కాదమ్మా! చెప్పు వరుడి వయస్సూ అదీ, ఈడూజోడుగానే ఉంది. ఇంకో విశేషం ఆలోచించు ఆ పిల్లాడుగూడా మన ఇంటికే వచ్చేస్తాడు. ఆ మేనమామ దగ్గిర వుండటంవల్ల నేమో ఊసూరుమని వున్నాడు. ఇక్కడికి వస్తే బాగా ఉంటాడు.''

అనసూయ ఎక్కువగా యేమీ మాట్లాడలేదు. ''మీరు నన్ను చెడగొట్టాలని పెళ్లి చేయటం లేదుగదా. బాబాయి'' అని నవ్వి వూరుకున్నదామె, అవధాన్లు ఆమెలో కనిపించిన ఆమోద భావనని అర్థంచేసుకుని సంతోషించాడు. మరుసటి రోజునుంచే అవధాన్లు పెళ్ళి ప్రయత్నాలలో లీనమైనాడు. ''పెళ్ళి జరగటమూ, ఆరోనెలకే పునస్సంధానము కావడమూ, వెంకట్రావు అవధాన్లుగారి సలహాతో అనసూయ దగ్గిర ఉండిపోవడం జరిగినై, వెంకట్రావు నిమ్మదస్తుడు. అనసూయతో అతను చాలా అన్యోన్యంగా ఉంటూ వచ్చాడు. ఉద్యోగంలో తను సంపాయించేదీ, భార్య తాలూకు సొమ్మూ కలిపి జయప్రదంగా కాపురాన్ని నడుపుకుంటూ వచ్చాడు అతను. అవధాన్లుగారి మనసు కుదుట పడ్డది. మగ దిక్కంటూ యేర్పడ్డ తరువాత సంసారానికి ఇంకేంకావాలీ?

ప్రసాదరావు ఆ యేడు ఫస్టుపారం ప్యాసైనాడు. అనసూయ ఎంతో సంతోషపడ్డది. తమ్ముడు బి.ఏ., చదవాలని ఆమె ఆశపడ్డది. దానికి తగ్గట్లు ప్రాసదరావు చదువే లక్ష్యంగా అల్లరి, ఆగం లేకుండా బడికిపోతూ వచ్చాడు. బావగారు బావమరిదిని ప్రేమతో చూడటమే కాకుండా అతని చదువులోనూ శ్రద్ధ తీసుకొని ఆ ద్వారా భార్యని సంతోష పెడ్తూ వచ్చాడు. సంవత్సరంపాటు ఏ విశేషాలు లేకుండా జరిగిపోయింది. అయితే అది ఎల్లకాలమూ సాఫీగా జరుగుతుందా? అట్లా సాఫీగా జరిగేటట్లయితే జీవితాల్లోంచి కథలెల్లావస్తాయి గనక? అనసూయ భర్తకి ఒక రోజున తలనొప్పి వచ్చింది. మరుసటి రోజు జ్వరం తగిలింది. డాక్టరు దగ్గరికి తమ్ముణ్ణి పంపింది అనసూయ. డాక్టర్ విధిగా చేయాల్సిన చికిత్స అంతా చేశాడు. ఊహుఁ, డాక్టర్‌కి అలవికాలేదు. ఐదురోజులు నిద్రాహారాలు లేకుండా శుశ్రూష చేసింది అనసూయ, ఇంకో డాక్టరు వచ్చాడు. ఆయనవైద్యం ఇంకో రెండు రోజులు జరిగింది. తర్వాత వెంకట్రావు వైద్యాలూ, భార్య ప్రేమా, రక్షించ లేనిస్థితిలో మృతినొందాడు.

మళ్ళీ ఇరుగుపొరుగు పోగైనారు. వెంకట్రావు మేనమామ, ఆయన భార్య విచ్చేశారు. అనసూయని నానామాటలు అన్నారు వాళ్ళు. '' ఈ ముదనష్టపు పెళ్ళి చేయబట్టి నిక్షేపరాయడల్లే వున్నవాడు తెల్లార్చుకు పోయినాడు'' అని సత్యనారాయణ భార్య పెద్దగా యేడ్చింది. అనసూయకు యివన్నీ శూలాలల్లే తగిలినై. తను నూరేళ్ళ కాపురం తగలబడిపోయి ఏడుస్తుంటే ఈ నిందగూడా ఏమిటని ఆమె వాపోయింది. ఆవధానిగారిభార్య అనసూయని కావిలించుకుని ఓదార్చింది. కాని ఓదార్పులతో గాయం మానుతుందా? అయితే ఒకటి - వెంకట్రావు శవాన్ని స్మశానం చేర్చి దహన క్రియలు అయేదాకా వుండి, సత్యనారాయణ, ఆయన భార్యా ఎటువాళ్ళు అటే పోయినారు. మళ్ళీ అవధాన్లుగారూ, అనసూయ, ప్రసాదు మిగిలారు. కాలవలో స్నానం చేసి ముగ్గురూ ఇంటికొచ్చారు. ఇల్లంతా వెలా తెలా పోతున్నది. అనసూయ యేడుపుకు అంతులేదు. ఇట్లాంటప్పుడు అవధాన్లుగారు మళ్ళీ ధైర్యం చెప్పాల్సి వచ్చేటప్పటికి చాలా ఇదయినాడు. ఏం చెబుతాడూ? పదిహేడేళ్ళన్నా నిండని అనసూయకు వైధవ్యం ప్రాప్తించిందంటే ఆయనకే చాలా కోపం వచ్చేసింది, ఆ నీతిమీద. ఆ కోపం విచారంగా మారి ఓదార్పుమాటలుగా వెలువడ్డవి.

''అమ్మా! మనుష్య ప్రయత్నానికి లోటులేకుండా మందిప్పించాం, డబ్బు ఖర్చుపెట్టాం. ఎవరికి ఎన్నాళ్ళు రాసిపెట్టివుందో ఎవరెరుగుదురమ్మా! ఏభైయేళ్ళు వచ్చి నేను బ్రతికి వుండటం యేం? పాతికేళ్ళు నిండని వాడికి నూరేళ్లు నిండడం ఏమిటి? అంతా ఈశ్వర విలాసం కాకపోతే? అమ్మాయి, యేడవకమ్మా! ఏడిస్తే పోయిన వాళ్లు వస్తారు గనకనా'' అని చాలా రాత్రివరకూ కూర్చుని - అవధాని గారూ, ఆయన భార్య అనసూయను అనునయించారు. పదిరోజులవరకూ అనసూయకు మనస్సు మనసులో లేదు. కాని రోజులు గడిచినకొద్దీ జరిగిన వాటిని మర్చిపోవటమే జరగక పోతే మానవజీవితం దుర్భరమౌతుంది. అట్లాగే అనసూయకు అన్నీ నీడలవలె మరుగుపడసాగినై. ఆమె తన జీవితానికిక తమ్ముడే ఆధారమనకోవటంలో అసహజ మేముంది. తన ఆశలన్నిటినీ తమ్ముడిమీదే వుంచి అనసూయ జీవితాన్ని బరువుగా నెట్టసాగింది.

## 4

నిమ్నోన్నతాల సహజమైన సాంఘిక జీవనం అసహజత్వంలో నలిగి నాశనమై పోతుంది, ఒక్కొక్కప్పుడు. లేదా, ఉజ్వలంగా పైకివచ్చి అన్ని సాంఘిక మర్యాదల్నీ పొందుతుంది. జీవితంలో సుఖభాగ్యాలకు బహిరంగంగా తిలోదకాలిచ్చి అనసూయ సంఘనీతికి బద్ధురాలై నూరేళ్లు నిండిన వయోవృద్ధురాలిగా కనుపడసాగింది, కాని ఒక వంక భర్త కలిగించిన నూత్న సుఖావశేషం ఆమెని ఏదో అర్థంకాని ఆందోళనలో పడవేసింది. అయితే ఆ ఆందోళనని వెనక్కి నెట్టి అనసూయ, తమ్ముణ్ని ప్రాణప్రదంగా చూస్తూ, వాడి చదువుమీద తన దృష్టినంతా కేంద్రీకరించి ప్రసాదరావు ఒక్కొక్క క్లాసే పైకి పోతున్న కొద్దీ ఇంట్లో ఖర్చులు తగ్గించుకుంటూ జీతాలకీ, పుస్తకాలకీ కడుతున్నది అనసూయ.

ప్రసాదరావు రాను రాను షోకిల్లాగా తయారు కాసాగాడు. న్యాయమైన బడిజీతమూ, పుస్తకాల ఖర్చే భరించటం కష్టంగా ఉన్నప్పుడు వాడి సిగరెట్ల ఖర్చూ, సినిమాల ఖర్చూ భరించటం అనసూయకు గడ్డు సమస్య అయింది. అయితే ఈ క్లిష్టపరిస్థితి తమ్ముడికి తెలియవచ్చినందువల్ల వాడి మనసు చెడి చదువు పాడవుతుందేమోనని అనసూయ తమ్ముడికి ఇవేమీ తెలియనియ్యకుండానే నెట్టుకువస్తున్నది. ఎంతయినా మోయలేని బరువు వేస్తే బండి బోల్తాకొట్టకేం చేస్తుంది? అయితే అనసూయకి ఒక్క పట్టుదల బాగా హెచ్చసాగింది. ఎన్ని కష్టాలయినా భరించాలి. అసలెందుకు కష్టాలు రావాలి? తను యే సుఖాలకీ నోచుకోలేదు. సరే, తనది ఆడపుటుక, మగపిల్లాడు చదువుకునైనా పైకి రావలిసినవాడు. వాడికి కూడా సుఖం లేకుండా ఇట్లా దరిద్రమేమిటి? దీన్ని ఎట్లా పరిష్కరించడం? ఆమె రాత్రులకి రాత్రులు ఈ ఆలోచనలో నిద్రగూడా పోవటం లేదు. ప్రసాదరావు కనీసం ఈ పరిస్థితిని గుర్తించడానికి గూడా తయారయినట్టు ఏ కోశానా కనిపించలేదు.

వాడిదీ మొండిమతం. 'అక్కా! పావలా యియ్యవే' అనేవాడు. 'సాయంత్రం ఇస్తా, బాబూ!' అనేది అనసూయ. ప్రసాదరావు ఆ పూట భోంచెయ్యనని మొండికేసి పావలా గుంజుకుపోయేవాడు. స్కూల్లో హైరేంకు కుర్రాళ్ళతో తులదూగాలని వాడి కోర్కె. వాళ్ళందరూ ఖద్దరు సిల్కు లాల్చీలూ, ఫుల్ ట్రౌజర్లూ తొడుక్కుని ఇంట్రవల్ టైములో విల్స్ సిగరెట్లు తాగేస్తూ కులాసాగా వుంటూంటే, తనెందుకు అట్లా వుండగూడదు? అని ఆకుర్రాడు తెలియనితనంవల్ల అనుకుని బాధపడసాగాడు. ఈ సంగతులన్నీ సిగరెట్లని మినహాయించి అక్కతో చెప్పుకున్నాడు. వూరకే చెప్పటం కాకుండా నిరశన వ్రతాలు చేయ నారంభించాడు. అనసూయ తమ్ముడికి నయాన చెప్పి చూచింది. వినే ధోరణి లేదు వాడిలో. ఇక ఆమె వేరే మార్గం ఆలోచించాల్సి వచ్చింది. వాడి కోర్కెల్లో తప్పేమీ కన్పించలేదు. సరిగదా, అవి న్యాయంగానే తోచినై. మంచి గుడ్డలు కావాలనటంలో దోషమేమిటి? అని అనసూయ తనలో తను నిర్ధారణకు వచ్చి ''అట్లాగే బాబూ! గుడ్డలు కుట్టిస్తాను'' అని తమ్ముణ్ణి ఆ పూటకి ఓదార్చి బడికి పంపింది.

ప్రసాదరావు వెళ్ళింతర్వాత ఆమె అవధానిగారి దగ్గరకు వెళ్ళి ''బాబాయి! కాస్త పైకం కావాలి. మన రైతుని పిలిపిస్తావూ?'' అన్నది. అవధాన్లుగారు అదే నెలలో రెండు సార్లు పైకం తెప్పించి యిచ్చాడు గనక ఆశ్చర్యపడి, ''ఇదేమిటమ్మా, యీ సంవత్సర గ్రాసం రెండు నెలల్లోనే ఐపోతే ఎట్లా? పొదుపుగా వాడుకోవాలమ్మా! ముందు సంగతి ఆలోచించకపోతే ఇబ్బంది పడతావమ్మా! పెద్దో చిన్నో చెబుతున్నాను విను'' అన్నాడాయన. అనసూయ నిజంగానే తడుములాడింది కాసేపు. జరిగిన వాదన గుర్తు తెచ్చుకుని, ''నిజమే బాబాయి. కాని పిల్లవాడికి సరియైన చొక్కా ఒక్కటీ లేదు! ఏం చెయ్యమంటావు? వాడికన్న ఎక్కువా!'' అనగలిగింది. అవధాన్లు ఆ పైన ఏమీ అనలేక పోయినాడు. ఆయనకు తెలుసు అనసూయకు తమ్ముడంటే వుండే ప్రేమ సంగతి. ''సరేనమ్మా పిలుస్తాను!'' అనేసి వూరుకున్నాడు.

అట్లాగే తెల్లారి రామిరెడ్డి తన కొడుకు చేతికి ఏభయి రూపాయలిచ్చి పంపించాడు. అనసూయ

''ఈ పూటకి ఇక్కడే భోంచేసి వెళ్ళు, పొద్దుపోయిందిగా!'' అన్నది. రామిరెడ్డి కొడుకు శేషిరెడ్డి బలిష్ఠంగా, అందంగా వుంటాడు. స్వభావం అతి శాంతమైంది. మంచీ చెడ్డా తెలిసిన పల్లెటూరి రైతుబిడ్డ గాబట్టి ''అట్లాగేనమ్మా! మీరు కోప్పడకుండా వుంటే ఒక సంగతి చెబుతాను'' అన్నాడు మెల్లిగా. అనసూయ చిరునవ్వు నవ్వి ''చెప్పునాయనా, నాకు కోపం ఏమిటి?'' అన్నది. శేషిరెడ్డి వసారాలో మంచం వాల్చుకు కూర్చుని ''నాన్నగారున్నప్పుడు పొలం ఎవరికో తాకట్టు పెట్టారట. ఈ సంగతి మొన్న తెలిసింది. తాకట్టు విడిపించుకోకుంటే వచ్చేయేడు పంట రాదు. మా అయ్య మీతో చెప్పమన్నాడు'' అంటూ అనసూయవంక చూశాడు. అనసూయ దెబ్బతిన్న లేడి పిల్లలా అదిరిపోయి ''ఈ కష్టాలు చాలక ఇదొకటా నాయనా! ఎంతకి తాకట్టు పెట్టాడో ఆయన, ఇప్పుడు ఎంతపైకం ఇస్తే విడుదల అవుతుంది. ఇదేం ఖర్మం!'' అన్నది దిగాలు పడిపోయి. శేషిరెడ్డి నెమ్మదిగా ఆమెను ఓదార్చి, ''ఎంతో కాదమ్మా! దిగులు పడకండి. రెండొందల ఏభైయట. ఈ కిత్తా పంటవాళ్ళకిచ్చేశామంటే తాకట్టు విడుదలైపోతుంది'' అన్నాడు. అనసూయప్రాణం ఒక్కసారి దడదడలాడి మళ్లీ కుదుటికి వచ్చింది? '' ఏం ఫరవాలేదంటావు కాని వచ్చే ఏడు అబ్బాయి చదువెట్లా? మీ తిండీ తిప్పలూ ఎట్లా?'' అన్నది. శేషిరెడ్డి సాయంత్రం గుడ్డి వెలుగులో పరీక్షగా చూశాడు. ఆమె అమాయక మయిన వైఖరికి శేషిరెడ్డి హృదయం ద్రవించిపోయింది. పాపం ఆమెకు అన్ని కష్టాలూ ఒక్కసారి వరుసగా వచ్చి పడుతున్నాయి. ''భయపడకండమ్మా, మా అయ్య ఆపైకం కట్టేస్తాడు. తర్వాతనెమ్మదిమీద మనలో మనం సర్దుకోవచ్చు. అయితే మీరు కొంచెం పొదుపుగా కాలం గడపాలమ్మా రోజులు చాలా గడ్డుగా వున్నాయిసుమండీ'' అన్నాడు శేషిరెడ్డి.

అనసూయకి కృతజ్ఞతావేశంలో కళ్ళనిండా నీళ్ళు నిండినై. ''నాయనా, మీ ఋణం నేను తీర్చుకోలేను. నన్నూ పిల్లాణ్ణీ ఒడ్డెక్కించండి, మా అవస్థ భగవంతుడికే ఎరుక'' అన్నది గద్గదంగా. శేషిరెడ్డి మంచంమీదనుంచి లేస్తూ ''మరేం ఫర్వాలేదమ్మా, మనిషి అన్న తరువాత ఆ మాత్రం ఒకరికొకరం సాయం చేసుకోకపోతే ఎట్లా?'' అని, ''అమ్మా, నేను సినిమాకి వెళ్ళివస్తా. పదింటికే వచ్చేస్తాను. తలుపు తీయగలరా?'' అని అడిగాడు. ''దానికేంభాగ్యం నాయనా! నీ సొంత ఇల్లనుకొని రా, తలుపు తీస్తాలే. ఇప్పుడే భోంచేసి పోరాదు? తిరిగి వచ్చే టప్పటికి పొద్దు పోతుందిగా'' అన్నది యదార్థయిన ప్రేమతో. శేషిరెడ్డి మెట్లు దిగుతూ - '' ఇప్పుడు ఆకలిగా లేదమ్మా, మళ్ళీవచ్చి తింటాలెండి'' అంటూ సినిమాకివెళ్ళిపోయినాడు. అనసూయ అతను వెళ్ళినవైపే చూస్తూ వసారాలో కూలబడిపోయింది. జరిగిన సంభాషణంతా వింటున్న అద్దెభాగంలోని అన్నపూర్ణమ్మ వాళ్ళ భాగంలోని వసారలోనే కూర్చుని ''అనసూయమ్మా, ఏమిటి అంటున్నాడతను!'' అని అడిగింది. అనసూయ శూన్యమైన ఇంట్లోకి చూపు పోనిస్తూ '' ఏ ముందండీ, పొలం తాకట్టులో వుందట, విడిపించాలని చెప్పాడు; అట్లాగేనన్నా'' అని ఊరుకున్నది. ఇంతలో బూట్లు టకటక లాడిస్తూ ప్రసాదరావు వచ్చాడు. వొస్తూనే, ''అక్కా, అన్నం పెట్టవే, రెండో ఆటకి పోవాలి అన్నాడు. అనసూయ చప్పున లేచి ''రా నాయనా, అన్నం తిందువుగాని'' అంటూ లోపలికి వెళ్ళింది. ప్రసాదరావు బూట్లువిప్పి గుమ్మందగ్గిర పడేసి లోపలికి వెళ్ళి విస్తరిముందు కూర్చుని వడ్డించిన అన్నం

ముద్దెత్తకుండా ''అక్కాయ్, సినిమాకి డబ్బు లియ్యవే'' అని అడిగాడు. అనసూయ తమ్ముణ్ణి కాస్త విసుగ్గానే చూచింది. కాని వాడు అడిగింది మహావుంటే అర్థరూపాయి అనుకొని, స్థిమితపడి '' ఇస్తాలే బాబూ, భోంచెయి'' అన్నది ప్రసాదరావు అక్కయ్య హామీతో భోంచెయ్యనారంభించాడు.

# 5

ప్రసాదరావు ఆ ఏడు పరీక్ష తప్పాడు. కారణం పరీక్షలప్పుడు జ్వరం తగలడం వల్ల పరీక్షకి వెళ్ళలేక పోయినాడు. అనసూయ ఏమీ అనలేదు. ఇంకొక రెండు మూడు వందల రూపాయలు ఖర్చు కనబడుతున్నది. అయితే ఈ ఖర్చు ఎట్లాపూడటం? అనసూయ ఆలోచించాల్సిన అవసరం కనపడసాగింది. ప్రసాదరావు ప్రత్యేక ఖర్చులు పెరగడం కన్పించింది కాని ఎందులోనూ తరుగు కన్పించలేదు. అనసూయ మనస్సులో ద్వంద్వయుద్ధం పడ్డది. తనదేమీ గొప్ప సంపాదనకల కాపురం కాదు. నెలకి వందా, వందన్నర సంపాదించే వాళ్ళకే చేతిలో డబ్బు తెమలక ఇబ్బంది పడుతున్నారు. తనదేపాటి; సాలుకి రూ 240. లు వచ్చు సంసారం. ప్రసాదరావు డాబు దర్పాలకు భస్మమై పోతున్నది... అయితే తల్లీ తండ్రీలేని పిల్లాడు వాడికంటేనా?!..... ఇట్లా అనసూయ ఆలోచనతో బరువెక్కిన మనసుకి ఉప శాంతి నివ్వలేకపోయింది. ఈపరిస్థితుల్లో అద్దె భాగంలో యిదివరకున్న వాళ్ళు ఖాళీ చేసి వెళ్ళటమూ, ఎవరో కొత్త వారు రావటమూ జరిగినై.

కొత్తగా వచ్చిన సోమసుందరంగారు వ్యాపారస్తులు, ఆయన ఊరుచివర ఇల్లు కట్టిస్తున్నాడు. అది పూర్తయేవరకు వుంటానని చెప్పి అద్దె పదిహేనివ్వటాని కంగీకరించాడు. ఆయనకి 30 ఏళ్ళుంటాయి. భార్యని పుట్టింటికి పంపించాడు. ఆమె గర్భిణీగా వుండటం చేత, ఒంటరిగా హోటల్లో భోంచేసి వ్యాపారం చేస్తున్నాడు. ఆయన అడపా దడపా దొడ్లోకి స్నానానికి వచ్చినప్పుడు వేరేపనిమీద వచ్చినప్పుడు అనసూయ కనబడి తప్పుకోవడం జరిగింది రెండు రోజులపాటు. ఒకరోజు సాయంత్రం సోమసుందరం కావాలని దొడ్లో మంచం వేసుకుని కూర్చుని చదవడం ఇష్టంలేక పోయినా, ఒక పుస్తకం తిరగేస్తున్నాడు. అనసూయ కేమీ ఘోషానియమాలు లేవు. అనవసరపు సిగ్గూ లేదు. ఆమె తన పనేదో తను చేసుకుంటు రెండో వ్యక్తి ఒకడు దొడ్లో వున్నాడనే సంగతే పట్టించుకోలేదు. సోమసుందరం అనసూయ అందానికి కాస్త చలించాడు. ఆమెని ఎట్లాగన్నా పలకరించాలని తాపత్రయపడుతూ ఆలోచన సాగించాడు. చివరికి '' ఏమండి, కాసిని మంచినీళ్ళు ఇవ్వగలరా?'' అని అడిగాడు. అనసూయ అలాగేనని జవాబిచ్చి, గ్లాసులో మంచినీళ్ళు పట్టుకెళ్ళి ఆయనకి ఇచ్చింది. ఈ సంభాషణ కొంచెం విస్తరించటం, సోమసుందరం తన హోటల్ తిండి సంగతి అనసూయకి చెప్పటం, ''పోని నేనువండి పెడతానులెండి'' అని అనసూయ అనటమూ జరిగినై. అయితే సోమసుందరంగారి ఆశయం ఇంతటితో ఆగలేదు. అసలు మగవాడి ఆశయం ఇదా? స్త్రీ అంటూ కనబడితే, మగవాడు తన నిజస్వరూపం చూపక వొదలడు. నాలుగు రోజులు మామూలుగా జరిగిన తర్వాత అనసూయలో

కూడా కాస్త మార్పు కనపడ్డది. భర్త పోయిన నాలుగేళ్ళనుంచీ పరిచయం లేకపోవడంచేతనో లేక మరొక కారణమో తెలీదు. అనసూయ వొళ్ళు గుగుర్పాట్లు పొడవటమూ సోమసుందరంగారి ఆశయము నెరవేరటమూ జరిగినాయి.

అనసూయ ఆ రాత్రి సోమసుందరంగారితో తన ఆర్థిక స్థితిని గురించి హృదయం ద్రవించేటట్లు చెప్పుకున్నది. ఆయన ఒక్క క్షణంకూడా ఆలోచించకుండా జేబులోనుంచి నాలుగువందల రూపాయలు తీసి ఇచ్చి, ''నువ్వు డబ్బుకు ఎప్పుడూ ఇబ్బందిపడకు. ఇంకోటిగూడా ఉంది. నిన్ను లోకులు ఆడిపోస్తారని నువ్వు భ్రమపడవచ్చు; అదేమీ జరక్కుండా నేను చేయగలను'' అని హామీ పడ్డాడు. అనసూయ ఒక్క దెబ్బన రెండు విజయాలు సాధించింది గనుక, ''పోదురూ, లోకం నన్నేమన్నా ఉద్ధరించింది గనకనా? ప్రసాదమే కాస్త చదువుకుని సంపాదనపరుడైతే, అందరూ అప్పుడు మూగుతారు'' అన్నది ధైర్యంగా. సోమసుందరం ఆమె ధైర్యానికి మెచ్చుకుని ''అయితే మనకి చిక్కులేదు'' అన్నాడు. ప్రసాదరావు చదువు యస్. యస్. యల్. సి. లో పడ్డది. ఐదవ ఫారం పరీక్ష ప్యాసయిన రోజున ప్రసాదరావు అన్నం దగ్గర - ''అక్కా! ఒక సైకిల్ కొనిపెట్టవే, స్కూలుకి నడవడం యాతనగా వుంది'' అన్నాడు జాలి ముఖం పెట్టి. అనసూయ పులుసు వడ్డిస్తూ ''దానికేంరా, అట్లాగే కొనుక్కుందువుగాని'' అన్నది. ప్రసాదం సంతోషంగా స్కూలుకు వెళ్ళాడు. సోమసుందరంభార్య ఆడపిల్లని కని భర్త దగ్గరకి రావటం వల్ల ఎప్పుడో కాని ఆయనా అనసూయా కలుసుకోవటం సంభవం కావటం లేదు. అయితే సోమసుందరం భార్యతో అనసూయని తెగపొగిడి ఉండటం వల్ల, ఆమెకి ఏ ఇతర అనుమానాలకీ తావు లేకుండా పోయింది. అనసూయకీ, సోమసుందరానికీ వున్న వయోబేధం అన్ని అనుమానాలకీ పరిహారంగా పనిచేసింది. అనసూయ సోమ సుందరాన్ని 'మామయ్యగారూ' అని పిలుస్తుంది. ఆవేళ సోమ సుందరం స్నానం చేస్తున్నప్పుడు, అనసూయ అత్తయ్య గారు అక్కడే వున్నా - లక్ష్యం చెయ్యకుండానే ''మామయ్యా గారూ బాబు ఒక సైకిలు కావాలంటున్నాడు; పైకము ఇస్తాను, ఒకటి బేరం చేసి కొనిద్దురూ!'' అన్నది లౌక్యంగా. సోమసుందరం పెద్దమనిషి నవ్వినట్టేనవ్వి ''దానికేమమ్మా! రేప్పొద్దున పంపిస్తాను. పైకం ధర కనుక్కున్న తరువాత ఇద్దువుగాని అన్నాడు. అనసూయ ''మరచిపోకండి'' అని చెప్పివెళ్ళి పోయింది.

## 6

ఈ మధ్య శేషిరెడ్డి పట్నం వచ్చినప్పుడల్లా అనసూయ ఇంట్లోనే మకాం వేస్తున్నాడు. అతనైనా ఏమంత బీదరైతు కాదనే చెప్పాలి. పది పన్నెండెకరాల సొంత వ్యవసాయమూ, ఆ పైన కొంత కవులుకు పుచ్చుకొని వున్నదీ వున్నది. కాస్త పచ్చగా ఉన్న బాపతే. అనసూయ తరహా కాస్త పెద్దమనిషి తరహాయే! ఆమె మొదట్నించీ వున్నా లేకపోయినా హుందాగానే ప్రవర్తిస్తూ వచ్చింది. శేషిరెడ్డికి ఆమె పెట్టేనఖర్చు కాస్త ఆశ్చర్యాన్ని కలిగించినా, అనుమానానికి ఆస్కారం ఇవ్వలేదు. అతను మామూలు గానే ఒకరోజు

సినిమా చూసుకని పదిగంటల వేళవచ్చి తలుపు తట్టాడు. అనసూయ నిద్రమత్తుగా తలుపు తీసింది. శేషిరెడ్డి ''మిమ్మల్ని కష్టపెడుతున్నానండీ!'' అని నొచ్చుకున్నాడు. అనసూయ చిరునవ్వు నవ్వి ''అబ్బే. ఇదేమిటి నాయనా! మీ కష్టం ఎన్నాళ్ళకీ తీర్చుకోలేను'' అని అతనికి భోజనం పెట్టింది, భోంచేస్తున్నంతసేపూ శేషిరెడ్డి కళ్ళు అనసూయమీదే వున్నై. అనసూయకూడా అతని వైపే చూసింది.

శేషిరెడ్డికి ధైర్యం చాలలేదు. బ్రాహ్మణ వితంతువు. హుందాగా బ్రతుకుతున్నది. ఆమె చూస్తోందీ అంటే ఆ చూపు మామూలుచూపే నేమో?! అనుకుని వసారాలో మంచంమీద నడుంవాల్చాడు. అనసూయ వాకిలి లోపల వైపు కూర్చుని ''నాయనా, అంతా కులాసా?'' అని అడిగింది. ఆమె గొంతులోని మృదుత్వం శేషిరెడ్డిని ఒక్కవూపు వూపింది. మంచంమీద వెల్లకిలా పడుకుని ''అంతా బాగానే వున్నారండీ మీ దయవల్ల'' అన్నాడు శేషిరెడ్డి. అనసూయ అతని వైఖరిని పసిగట్టి వుండాలి. ''నాయనా ఓ వంద రూపాయలు ఎల్లుండికల్లా కావాలి. బాబుకి స్కూలు జీతం కట్టాలిసొచ్చింది. డబ్బెట్లా కూడుతుందా అని చస్తున్నాను'' అన్నది మెల్లిగా. ఆమె గొంతు అపూర్వంగాను, మాధుర్యంగాను వినపడ్డది శేషిరెడ్డికి. ''దాని కేమండి నేను తెచ్చి పెడతాలెండి. మీరు ఇబ్బంది పడకండి'' అన్నాడు అతను; అనసూయ శేషిరెడ్డిలో మార్పుకి సంతోషిస్తూ ''కాసిని మంచినీళ్ళు కావాలా?'' అంటూ ఇత్తడి చెంబుతో నీళ్ళు తెచ్చి అతని మంచం తలవైపున బెట్టింది. మసక చీకట్లో శేషిరెడ్డి అనసూయ చెయ్యి సరదాగా పట్టుకున్నాడు ఏమయితే అయిందని. అనసూయ అతన్ని నిరాకరించలేదు. శేషిరెడ్డి తెల్లారి తన వూరు పోయి గంటల మీద వందకి వందన్నర పట్టుకువచ్చి అనసూయ కిచ్చాడు. అనసూయ డబ్బు లెక్క పెట్టి తీసుకుంటూ ''చెల్లేసుకుందువుగానిలే నాయనా, సొలుకి ఇంత అని'' అన్నది మర్యాదకి. శేషిరెడ్డి తన హుందాకు లోటు రానివ్వటం, ఆమెకి ఇష్టంలేదు. దాన్నర్థం చేసుకున్న అతనుగూడా ''అలాగేనమ్మా'' అనేసి వెళ్ళి పోయినాడు.

అనసూయ తనవరకు ఖచ్చితంగానే వ్యవహరిస్తూ వచ్చింది. ఆమెకి తన వయస్సింకా ఇరవై ఒకటేననే జ్ఞాపకం బాగా వున్నది. తన భవిష్యత్తు గౌరవము లోకుల నోళ్ళల్లోనే ఉందనేది కూడా ఆమెకి బాగా తెలుసు. మరొక్కటికూడా ఆమెని జాగ్రత్తగా వుండటానికి అవకాశమిచ్చింది. తన తమ్ముడి పెళ్ళి - మర్యాదా, తన జీవితానికే ముడిపడి వున్నాయని ఆమెకు స్పష్టంగా తెలుసు. ఏమైనా తను చేస్తున్నది నీతిబాహ్యమైనదని ఆమె భావించినా, దాన్ని రెండు కారణాలచేత మాన లేకపోయింది. శరీరం అన్నతర్వాత కోర్కెలుంటాయి. వాటిని నిరోధించటం మంచిదేకావచ్చు. కాని నిరోధించే బలం ముసలి వాళ్ళకున్నట్లు ఇరవై ఒక్క సంవత్సరమన్నా నిండని తనకు లేదు. రెండోది - తన ప్రియులు తనని గౌరవంగా చూస్తూ తన ఆర్థిక అవసరాల్ని తీరుస్తున్నారు. అంతడబ్బును తాను న్యాయమార్గంగా సంపాదించడం చాలా వరకు అసంభవం, అసాధ్యమ్కూను. తన దృష్టి మేరలో ఎవరూ కష్టించి కట్టిన మేడలు ఎక్కడా కన్పించలేదు. అనసూయ తనకితను ధైర్యం చెప్పుకొనిమామూలుగా వుంటూవచ్చింది.

అవధాన్లుగారి సలహా, సోమసుందరంగారి అండ, ఇరుగుపొరుగువారి సాయమూ, ఆమెకి యధా ప్రకారంగా లభిస్తూనే వున్నాయి. ఆమె గయ్యాళిదైతే ఆమెని మూడు నిముషాల్లో తప్పు పట్టివుంటుంది

లోకం. కాని అనసూయ గుణం మంచిది. నోరు మంచిది. ఆమెలో జీవ కారుణ్యం కూడా ఆమె ప్రవర్తనలోని లోపానికి ఒక కారణమని చెప్పవచ్చు. ఆమె బయట వున్న మూడు రోజులూ సోమసుందరం గారి భార్యే ఇంత వుడకేసి పడేసేది. సోమసుందరంగారి పిల్ల పుట్టినప్పుడు ఏదో మైల వచ్చి బారసాల ఆగిపోయింది. మళ్ళీ నెలరోజులకి పుట్టిన రోజులనాటికి బారసాల చేసుకునే ప్రయత్నాలు చేశారు. రాజు తలపెడితే డాబుసరి కేంతక్కువ? బారసాలకి చుట్టాలు, స్నేహితులూ దాదాపు పాతికమంది వచ్చారు. ఇంట్లో పెత్తనమంతా సోమసుందరంగారు బతిమాలుకొని అనసూయ నెత్తిన వేశారు. ఆమె కాసేపు వద్దన్నా చివరికి ఒప్పుకున్నది అవును మరి - రేపు తన యింట్లోనూ శుభా శుభాలు వస్తాయి, తనకు పదిమందితో అవసరం వుంది అనుకున్నది అనసూయ. బారసాల ఇల్లంతా గంధంవాసనతో మల్లెపూలతో ముత్తైదువులతో కళకళలాడింది. అనసూయ జరీవున్న తెల్ల చీరె కట్టుకుని, పెత్తనం చేస్తున్నది లోపల. ఆమె బైటికి రావటానికి వీల్లేదని కాదు - ఆమెకే ఇష్టంలేక రాలేదు నలుగుర్లోకి. ఆమెకి ఆ వేళల్లా తన పెళ్ళినాటి సరదాలు జ్ఞాపకంవచ్చి కాస్త విచారం వేసింది కూడాను. ప్రతి ముత్తయిదువా ఆమె దగ్గరకు వెళ్ళి పలకరించి వచ్చేవాళ్ళు. మగవారు దూరాన వుండి, ఆమె ఎవరో తెలుసుకోవాలని కుతూహలం కనపర్చారు. అనసూయని ద్వేషించే వాళ్ళెవరూ లేరని చెప్పవచ్చు. అందుకు కారణం వెతకటం అనవసరం.

## 7

ప్రసాదరావు చదువులో ఎంత చురుకో నాజూకు లోనూ అంత ఘటికుడు. వాడు స్కూలుకు వెళ్ళేదారిలో ఒక పూరిల్లు వుంది. అందులో పదిహేనేళ్ళమ్మాయి మంచి అందంగా, కాస్త చలాకీగా అల్లరిగా కనపడ్డది ప్రసాదరావుకి ఒకరోజు. ప్రసాదరావు వస్తుతహా అందంగా నీటుగా వుంటాడు. గనుక ఆ అమ్మాయిని ఆకర్షించగలిగాడు. పది పన్నెండు రోజుల ప్రదక్షిణాలు చెయ్యగా ప్రసాదరావుకి ఆ అమ్మాయి సంగతులు తెలిసినై.

ఆ అమ్మాయి పేరు సీత, ఇంకా పెళ్ళి కాలేదు. వాళ్ళనాన్న బీద ప్లీడరు గుమాస్తా. ఇంటినిండా గంపెడు సంసారం. అందువల్లనే సీత పెండ్లి వాయిదా పడుతూ వచ్చింది. ఇన్ని వివరాల్లోకి వెళ్ళినా ప్రసాదరావుకి ఇంకా మనస్థిమితం కుదరలేదు. ఎందుకంటే ఆ అమ్మాయిని పలకరించి ఏదో ప్రేమ సామ్రాజ్యము నిర్మిద్దామని అతని వూహ. పధిహేనోరోజున సీత దొడ్డిగుమ్మంలో నిల్చుని ఉండగా ఆ వీధి హెచ్చుతగ్గులలో సైకిల్ పోవటానికి వీల్లేకపోయినా, ప్రసాదరావు శ్రమతో అటే వస్తూ ఆమెని చూచి అకారణంగా సైకిల్ ఆపాడు. సీత గిరుక్కున ఇంట్లోకి పారిపోతుందని అనుకుంటూ మెల్లిగా నడుస్తున్నప్పటికీ, అదేమీ జరక్కపోగా, సీత ప్రసాదరావుని పిలిచింది సైగతో. ప్రసాదరావు సైకిల్ని రోడ్డు మీదే వదిలి చప్పున ఒకసారి చుట్టూచూసి ఆమె దగ్గరికి వచ్చాడు. తరువాత ఒకరినొకరు పరిచయం చేసుకుని మాట్లాడటానికి వీలు ఎప్పుడూ ఉండదు కనుక లేఖలు వ్రాసుకోవచ్చునని

ఒడంబడిక చేసుకుని ఇద్దరూ విడిపోయి నారు ఆరోజుకు. అక్కడనుంచి ప్రసాదరావుకి ఇంకో ఖర్చు ఇదివరకటి ఖర్చులకి తోడైంది. సీత ప్రసాదరావు దగ్గిర రూపాయి, రెండూ తీసుకోవటం మామూలైంది అప్పు డప్పుడూ. ఏంజేస్తుంది దరిద్రగొట్టు సంసారమాయె! కాని సీత ప్రసాదరావు దగ్గర తనను పెళ్ళాడుతానని వాగ్దానం చేయించుకున్న తరువాతనే రూపాయి తీసుకున్నది. ప్రసాదరావుకి పెళ్ళంటే ఏమిటో తెలియక పోలేదు. పద్దెనిమిదేండ్ల వాడికి లోకం సరిగా తెలియకపోయినా అస్పష్టంగా గోతులూ మెట్టలూ ఏవో తెలుసుకోతగినంగా తప్పక తెలిసివుంటుంది. సీతతో పెళ్లి చేసుకుంటాను అని ప్రసాదరావు వాగ్దానం చేసేరోజుని అతనిలో సీత సౌందర్యమే ప్రధానంగా పని చేసింది. అతనూమనిషే. హైగా చదువుకుంటున్న మనిషి! అతను సీతను ప్రేమిస్తున్న సంగతి సీత తల్లిదండ్రులకు తెలిసి గూడా వూరుకున్నారు. తాము వరుణ్ణి ఎట్లాగూ తేలేక పోబట్టిన్నీ, కూతురైనా మంచి వరుణ్ణే వరించబట్టిన్నీ. ఒక రోజున ప్రసాదం సీతతో చేతులు కలిపి మాట్లాడుతూ, ''సీతా, ఇంక భయమెందుకు? నేను నిన్ను తప్ప ఇంకెవర్నీ పెండ్లి చేసుకోనుగదా?'' అన్నాడు నరాల బాధ కొద్దీ. ''సీత'' చలంగారి పుస్తకాలేమీ చదవలేదు గనుక ఆమెకి మగవాళ్ళు మోసం చేస్తారనే అభిప్రాయం లేదు. తలొంచుకుని ''భయంకాదు. పెళ్ళి చేసుకున్న తరువాతే....'' అని వూరుకొంది సిగ్గుగా. ప్రసాదరావు ఆమె భుజం మీద చెయ్యి వేసి ''ఇటు చూడు సీతా! అవన్నీ పూర్వాచారాలు, వాటిని ప్రేమించుకునే మనం లక్ష్య పెట్టగూడదు. ఎట్లాగూ నువ్వు నా దానివి. ఇక అనుమాన మెందుకు?'' అన్నాడు తను చదివిన ఆధునిక నవలల్లోవీ, చూసిన సినిమాల్లోవీ, భావాల్ని క్రోడీకరించి. సీత ఆవేళటికి ఒప్పుకోలేదు. పది రోజుల వరకూ ఆమె ఈ సంభాషణవస్తే, ఇంట్లో పనివున్నదని వెళ్ళిపోయేది. ప్రసాదరావు మాత్రం మగవాడు కాదూ? స్త్రీ కున్న ఓర్పు అతనికి ఎలా ఉంటుంది? ఒకరోజు పొద్దు కూకిం తర్వాత సీతని కలుసుకుని ప్రసాదరావు ఆమె ఎట్లాగూ అరవదన్న ధైర్యం కొద్దీ ఆమెను కావలించుకున్నాడు. సీత కూడా చేసేది ఏమీ లేక అదివరకే ప్రసాదరావు చేసిన వాగ్దానాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ''ప్రసాదం, నన్ను తప్పక పెళ్ళి చేసుకుంటావు కదూ?'' అని అడిగి ప్రసాదరావు కౌగిట్లో ఉండిపోయింది. ఇది జరిగిన రెండు నెలలకే ప్రసాదరావు పై చదువులకని మెడ్రాస్ వెళ్ళాలి సొచ్చింది. సీతతో చెప్పాడు. సీత గోల పెట్టింది. ''నెల వ్యవధి ఎట్లాగూ ఉందిగనక పెళ్ళిచేసుకునే ఎందుకు పోకూడదు?'' అని ఆమె ప్రసాదాన్ని నిలదీసింది. ప్రసాదరావు ఆమెకి కాస్త ఉపశమనం మాటలు చెప్పి మదరాసు వెళ్ళిపోయినాడు.

## 8

ప్రసాదరావు మద్రాసు వెళ్ళిం తరువాత అనసూయకి వాడి పెళ్ళి దిగులు పట్టుకు వేధించసాగింది. కుర్రాడు - మద్రాసులో ఏ లేడీనన్నా మరిగితే కష్టంగదా అని ఆమె లోలోపల బాధపడి అవధాన్లుగారితో చెప్పుకున్నది. అవధాన్లుగారు వధువుకోసం తిరిగే సత్తాలేక ''అమ్మాయీ మన సోమసుందరంగారితో గూడా చెప్పు. నాస్థితి చూస్తున్నావుకదా? వయస్సు మళ్ళుతున్న కొద్దీ ఎందుకూ పనికిరాకుండా

పోతున్నాను'' అన్నాడు కాస్త దిగులుగానే. అనసూయ గూడా ఆయన్ని అర్థం చేసుకుని ''అవునులే బాబాయి. నువ్వేం తిరగ్గలవులే! సోమసుందరం గారితోనే చెబుతాను'' అని, అయితే బాబాయి, మిగతా వ్యవహారమంతా నువ్వే నడపాలిసుమా!'' అన్నది. అవధాన్లు గారు కాస్త అత్మోన్నత్యంతో సవ్వి ''దానికి నువ్వు చెప్పాలా అమ్మా! మన ఇంట్లో పెండ్లికి ఒకరు పిలవాలి గనకనా!'' అన్నాడు. అనసూయ అవధాన్లుగారి సలహా ప్రకారం సోమసుందరంగారితో చెప్పింది. సోమసుందరం గారు మేడకట్టే పనిలో తీవ్రంగా నిమగ్నులై ఉన్నప్పటికి ''దానికేమండీ! మా బంధువుల్లోనే చాలా మంది పిల్లలున్నారు; కనుక్కొని చెబుతాను'' అని హామీపడి వెంటనే కార్యక్రమంలోకి దిగాడు. అనసూయకు బరువు తీరినట్లనిపించింది.

నాలుగు నెలలు జరిగింతర్వాతగాని వధువు దొరకలేదు. సోమసుందరంగారు మంచి పట్టుదలతో పనిచేసి, చివరకు తన బంధుకోటిలోనే ఒకపిల్లను వెతికి పట్టుకున్నాడు. వధువు కుదరటం వియ్యంకుల వివరాలు అన్నీ అనసూయ ప్రసాదరావుకి వ్రాసింది. ప్రసాదం ఉత్తరం చూచి సంతోషించాడు. కారణాలకేం? కాబోయ్యే మామ మంచి ఆస్తిపరుడూ, పలుకుబడి కలవాడు. పిల్ల కూడా కంటికి బాగానే ఉందని అనసూయ రాసింది కనుక తనరొట్టె నేతిలో పడ్డదని ప్రసాదరావు భావించటంలో తప్పేమిటి? ఐతే ప్రసాదరావు సీతమాటే మరచిపోయినాడనటానికి వీల్లేదు. మదరాసు వచ్చిన కొత్తలో పట్నంయొక్క అందంచందాల్లో లీనమై కొన్నాళ్లు చదువునే మరచిపోయాడు తరువాత ఒక్కొక్కటే జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అట్లాగే సీత విషయం కూడా జ్ఞప్తికి వచ్చింది. దీనికితోడు సీతదగ్గర ప్రసాదరావు అడ్రసు ఉండబట్టి ఆమె చాలా ఉత్తరాలు కూడా రాసింది, ఆ ఉత్తరాల్లో మొదటిదాన్ని మాత్రమే సొంతం చదివాడు ప్రసాదం. మామూలు కుటుంబంలో పుట్టి సంస్కారం, చదువుకూడా తక్కువైన సీత వ్రాసిన ఉత్తరాల్లో ప్రసాదరావు చదువుకుంటున్న అందులో షెల్లీ, కీట్సు, బైరన్‌వంటి ఆంగ్లకవుల ప్రణయలేఖలు చదువుతున్న యువకుడికి కవిత్వం కనిపిస్తుందా? రక్తం ఉంటుందా? అయితే సీత ఉత్తరాల్లో ఒక్క విషయం ప్రసాదాన్ని కలవర పెట్టింది. ఆ అమాయక బాలికను తను అనుభవించి కలిగించి వచ్చిన గర్భం నిరంతరం పెరుగుతున్నది. ఎట్లాగయినా తనని పెళ్ళిచేసుకుని ఒడ్డెక్కించమని ఆమె ప్రతి ఉత్తరం లోనూ బ్రతిమాలుతూ వ్రాసింది. ప్రసాదం ఈ విషయాన్ని తోటి స్టూడెంటు గోవిందరావుకి చెప్పి పరిష్కారం సూచించమని అడిగాడు. అతని కేం తెలుసు సీతబాధ? అసలు పురుషుడికీ స్త్రీ బాధలుగాని, బాధ్యతలుగాని తెలుస్తాయి గనుకనా? గోవిందరావు ''పోనియ్యవోయ్, డామిట్... ఇల్లాంటి వాటిని లెక్కచేయటం మేమిటి మనం?.....'' అనేశాడు. ప్రసాదరావు ఆ తర్వాత ఆ సంభాషణే తేలేదు. తెచ్చే అవసరంగూడా కలగలేదు.

పెళ్ళి ఉత్తరం వచ్చినరోజుని అకస్మాత్తుగా సీత జ్ఞాపకం వచ్చి, ప్రసాదం ఒకరవ్వ ఆలోచించి మళ్ళీ మామూలు ధోరణికే వచ్చేశాడు. అక్కయ్యకి తన సమ్మతిని తెలియ జేస్తూ ఉత్తరం వ్రాసి పోష్టులో పడేసి స్నేహితులకి కులాసాగా టీ పార్టీ చేశాడు ఆ సాయంత్రం.

# 9

మామూలుగా అప్పుడప్పుడు సమావేశమయ్యే లోకం ఆ వేళగూడా సోమసుందరం గారి అధ్యక్షతన ('లా' ప్రకారంగాదు) దీక్షితులుగారింట్లో సమావేశమయింది. ఈ సమావేశాన్నే 'సంఘం' అనొచ్చు; లేదా 'లోకం' అనొచ్చు; ఈ సమావేశానికి అందరు సభ్యులు హాజరుకానక్కరలేదు; అవరుగూడాను. దీక్షితులు, అవధానులు, సోమసుందరంగారు తీరికగా కూర్చుని వూళ్ళోవాళ్ల ప్రవర్తనలమీదా, రాబడి ఖర్చులమీదా తర్కాలూ, చర్చలూ సాగిస్తుంటారు తమల పాకులు నములుతూ, దీక్షితులు నెలలతరబడి అడగాలని లోలోపల ఆలోచిస్తున్న ప్రశ్నని బైటపెట్టాడు. ''ఏమండీ సుందరంగారూ, కరణంగారి దేపాటి ఆస్తి ఏమిటి? చాలా విరివిగా ఖర్చు పెడుతుందా అమ్మాయి'' అని అడిగాడు.

''నేను అదే అడగాలనుకుంటున్నానోయ్'' అన్నాడు కళ్యాణసుందరంగారు.

''ఆస్తికేం, నిక్షేపంలాంటి మాగాణి, ఆరెకరాలు ఉంది. ఇంటిలో భాగానికి నేను ముప్ఫైరూపాయలు ముట్ట చెబుతున్నానాయె, దర్జాకేం లోటూ!'' అన్నాడు సోమ సుందరంగారు.

''ఆరెకరాలటయ్యా?''! అని ఆశ్చర్యం వెళ్ళబోశాడు దీక్షితులు.

అప్పటిదాకా వూరుకున్న అవధాన్లుగారు '' ఏం అట్లా ఆశ్చర్యపడ్డావు? వాళ్ళు ఏమంత ఖర్చుదార్లని? నాకు తెలియకుండా చిల్లి గవ్వ ఖర్చుచేయదు అనసూయ'' అని సమర్థించాడు. ఆయనకు తెలిసినంతవరకు.

''మరే, ఎంత పొదుపుగా కాలం గడుపుతున్నదీ? ఆవిడపిల్లాడి చదువుకని అంత ప్రయాసపడుతున్నది'' అన్నాడు సోమసుందరంగారు.

సంఘం తరుపున సమావేశమైన సభ్యులు సంతృప్తితో సమావేశాన్ని పూర్తిచేశారు. ఆవేళ రాత్రి అనసూయతో మాట్లాడుతూ ''నిన్ను ఏ మాత్రమూ ఆక్షేపించడానికి వీలు లేకుండా చేశాను. అయినా నీ తెలివి తేటలు సామాన్యమా?'' అని తనను తాను మెచ్చుకుని అనసూయనీ మెచ్చుకున్నాడు. అనసూయ కాసేపు వూరుకుని ''అవునండీ మామయ్యగారూ, డబ్బువుంటే మాట్లాడేవాడుకూడా జంకుతాడు సుమా'' అన్నది విజయగర్వంతో.

''బాగా అన్నావు!'' అని సోమసుందరం ఆమెని ఒక క్షణం ఆనందంగా చూచి ''అయితే అనసూయా మా మేడ ప్రక్కన ఒక ఆరుంబాతికడాబా అమ్మకానికి వచ్చింది. నీ పేరకొనుమంటావా? ఒక చోట కలసిపడివుంటాం'' అని అడిగాడు.

''కొనద్దంటానా? తమ్ముడికి పెళ్ళయి పిల్లా జల్లా ఏర్పడితే ఈ కొంప వాడికే సరిపోతుంది. అసలు ఇదంతా వాడిది! నాకు మాత్రం ఓ జానెడు కొంప ఉండొద్దు?''

అన్నది దూరాలోచనతో.

''అయితే కొనేస్తాను'' అని సోమసుందరం సంభాషణ విరమించాడు.

## 10

ప్రసాదరావు పెళ్ళికి అన్ని ఏర్పాట్లు జరిగినై. కన్యా దాత కట్నం వెయ్యిన్నూట పదహార్లూ, మిగతా లాంఛనాలూ ఇవ్వటానికి ఒప్పుకోటమే కాకుండా అల్లుడికి రూ. 150 ల రిస్టువాచీ కొనిపెట్టడానికి అంగీకరించాడు. పైగా ఒక బ్యాంకులో ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు. ఇదంతా సోమసుందరంగారి పలుకుబడివల్ల కలిగిందే. ప్రసాదరావు బి. ఎ. పూర్తి చేసి కాని, ఉద్యోగం చెయ్యననటంవల్ల ఆ యేర్పాటు తాత్కాలికంగా వాయిదా పడ్డది. పెళ్ళి పదిరోజులుండగా ప్రసాదరావు మదరాసునుండి వచ్చాడు. అనసూయ చేయవలసిన అట్టహాసమంతా చేస్తున్నది. స్నాతకానికి ముందు సత్యనారాయణ వ్రతం చేసి పరిచయులందర్నీ భోజనానికి పిలిచింది. అందరు పెద్దలూ వచ్చారు. భోజనాలయ్యాక అందరూ ప్రసాదరావుని ఆశీర్వదించారు. అవధాన్లుగారికి కరణంగారు జ్ఞాపకం వచ్చి కాస్త ఇదయినాడు. అనసూయకూడా చాటుగా కళ్లు తుడుచుకున్నది. ఈ సందట్లోనే ఎవరో ఒకమ్మ మెల్లిగా తనప్రక్కన ఉన్న ఇంకొక ముత్తయిదువతో ''ఏమే విన్నావుటే?: అ కామేశ్వరమ్మకూతురు సీత లేదూ?...'' అన్నది. వినే ఆమె ''ఆ అవును ప్లీడరు గుమాస్తా చేస్తాడుగదూ శేషయ్యగారు...'' అని కుతూహలంగా అన్నది. ఆ ఆయన కూతురే... నిన్న రాత్రి బావిలో పడిందట!'' అన్నది మొదటి ముత్తయిదువ. రెండో ఆవిడ ముక్కు మీద వేలేసుకుని ' ఎందుకు? అని అడిగింది. ఏమోనమ్మా ఎవరికి తెలుసునమ్మా? కాలుజారి పడిపోయిందనుకుంటున్నారు'' అన్నది, మొదటావిడ, ఈ విషయం అట్లా పాకి, పాకి ప్రసాదరావు చెవినపడ్డది. రెండు నిముషాలపాటు ఈతను మౌనంగా ఉండిపోయినాడు. బహుశా సీత ఆత్మశాంతికి ప్రార్థన చేశాడేమో! ఇంకెవ్వరికీ ఈ సంగతి తెలియనందువల్ల ఏ గల్లంతూ కాలేదు.

పెళ్ళి, కన్యాదాత ఇంట్లో జరిగింది - ఐదురోజులూ చక్కగా, దర్జాగా చేశారు ఉన్న వాళ్ళు గనుక. ప్రసాదరావుకి పెళ్ళిపీటలమీద ఉన్నంతసేపూ, సీతరూపం తనముందు నిలుచున్నట్టే వుంది. అతను దయ్యాలు, భూతాలూ వున్నాయంటే నమ్మేవాడు కాదు. అయినా లోపల లోపల పీడిస్తూన్న తన అధర్మమట్లా కనిపిస్తున్నదని గుండె రాయిచేసుకొని మామూలుగా ఉండిపోయినాడు. ప్రసాదరావు తన పాపానికి మరే శిక్షా లేదని తెలిసిన వ్యక్తి ఏం చేస్తాడు? పెద్దమనిషిగా వూరుకున్నాడు. కత్తీ కటారు పుచ్చుకుని బహిరంగంగానో, దొంగతనంగానో, మనిషిని చంపి ముద్దాయి అయితేతప్ప, ఎవర్నీ శిక్షించలేని సంఘనీతికి; సీత ఎందుకు చచ్చిందో విచారించే వ్యవధి ఎట్లా వుంటుంది? ఒకవేళ ప్రసాదరావే ఆమె మరణానికి కారణమని ఈ నిర్జీవ సంఘానికి తెలిసినా ''ఆడది తొందర పడితే ఈడొచ్చిన మగవాడేమి చేస్తాడేమిటి?'' అంటుంది కాని, ప్రసాదరావు మీద వేలు కదపగలదా? అందుకనే ప్రసాదరావు

మామూలుగా ఉండిపోయినాడు. అతనూ ఆ సంఘంలోని సభ్యుడై పతితుల్ని శాసించే హక్కులు సంపాదించాడు. ఎవరెట్లా నడవాల్సిందీ నిర్ణయించే హక్కుదారుడైనాడు.

ఎవరు దాచినా, ఏ విషయమయినా, ఎన్నాళ్ళో దాగదు. అనసూయకు ప్రసాదము చేసిన ఘనకార్యమూ, అందువల్ల జరిగిన ఆత్మహత్యా పెళ్ళి అయిపోయి ప్రసాదరావు మద్రాసు వెళ్ళిన తరువాత తెలిసింది. ఆమె లోలోపల చాలా బాధపడ్డది. ఆమెకు చాల కోపం కూడా వచ్చింది ప్రసాదరావు మీద. ''ఓరి వీడినోరుపడా! నోరూ వాయీలేని అమాయకపు పిల్లని మోసం చేశాడే!'' అని ఆమె నొచ్చుకున్నది. అయితే వ్యవహారం ఏదోరకంగా ఒక ఆత్మ బలి అయిం తర్వాత పరిష్కారమై పోయింది గనుక ఆమె మెదలకుండా వూరుకున్నది. సీత విషయం ఇంతకన్నా ఏ మాత్రం పొక్కలేదు. దానికి కారణం ఆ దౌర్భాగ్యుడయిన ప్లీడరు గుమస్తా వూళ్ళోనుంచి లేచి పోవటమే. ఇదీ కొంత మంచిదే అనుకున్నది అనసూయ.

## 11

పెళ్ళయిన రెండో యేటనే ప్రసాదరావు భార్య రాజ్యం కాపరానికి వచ్చింది. ఇంకో ఏడాదిపాటు చదువు ఉండటం వల్ల భార్యా భర్తలు మద్రాసులోనే ఓయిల్లు తీసుకుని కాపరం పెట్టారు. కాపురము ఇటు మామగారి డబ్బు తోనూ, అక్కయ్యపంపే డబ్బుతోనూ కళకళ్ళాడుతోంది. రాజ్యం చదువుకున్న పిల్ల. అందంలోనూ తీసిపోయింది కాదు. భర్తను సంపూర్ణంగా ఆకర్షించిందామె. ప్రసాదరావుకి భార్య మీద అపారమైన అనురాగం వృద్ధి అయింది. అనసూయ గూడా ఒక నెలరోజులు వాళ్ళతో పాటు మద్రాసులో వుండి ఇల్లూ వాకిలీ సరిదిద్ది మద్రాసు నీళ్ళు సరిపడక తనవూరు వచ్చేసింది. ఆమె వూరికిపోయిం తరువాత రాజ్యం తన లోపల కుములుతున్న విషయాల్ని భర్త దగ్గర ఒక్కొక్కటే బయట పెట్ట నారంభించింది. ఒకనాడు రాత్రి ప్రసాదరావు కులాసాగా వెన్నెట్లో పడుకొని సిగరెట్టు కాలుస్తున్నపుడు రాజ్యం పక్కనే కూర్చుని '' ఏమండీ ఈ సంగతి విన్నారండీ?'' అన్నది. ప్రసాదరావు ''ఏసంగతి?'' అన్నాడు నెమ్మదిగా.

నెమ్మదిగా అడగండి. ఏ సంగతీ పట్టదు మీకు ''అన్నది రాజ్యం విసురుగా తన తరవాయి ఉపన్యాసానికి'' పునాదిని గట్టిపరుస్తూ.

''చెప్పరాదుటే నన్ను చంపకపోతేనూ'' అన్నాడు ప్రసాదరావు నెమ్మదిగానే.

''మీ అక్కయ్యగారు తనపేర రెండెకరాలు కొనుక్కున్నదట' అన్నది రాజ్యం ఆశ్చర్యం కలగ జెయ్యాలన్న స్వరంతో.

ఏం కొనుక్కుంటే? అది నోరు కట్టుకొని దమ్మిడీలు మిగిల్చి కొనుక్కుంటూంది మధ్య మన కెందుకంట? నువ్వేమో రాజ్యాలుపోగొట్టుకున్న దానిలా అయిపోతున్నావు'' అన్నాడు ప్రసాదరావు మందలింపుగా.

''రాజ్యాలు పోగొట్టుకోవాలా ఏమిటి? మన బతుక్కి తోడు. పరువుపోతే చాలదూ?'' అన్నది రాజ్యం మూతివిరిచి.

ఈ మాట వినేప్పటికి ప్రసాదరావు గుండె ఆగింది ఒక నిముషం. అతను అదివరకే వూళ్ళో వినివున్న గాలి వార్తలవల్ల అనసూయ ప్రవర్తనమీద కాస్త అనుమానంగా ఉన్నాడు. ఆ సంగతే చెబుతున్నదా ఏమిటి? ''గూఢంగా మాట్లాడుతున్నావేమో? సరిగ్గా చెప్పిచావరాదూ?'' అని విసుక్కున్నాడు.

''నేనడిగితే అట్లాగే విసుక్కుంటారు లెండి. మీ అక్కయ్యకి ఆ డాబా, అ పొలాలు, చేతి గాజులు, మెళ్ళో గొలుసూ ఎట్లా వచ్చినాయండీ? ఇంత డబ్బెక్కడిదంట?'' అని ఆశ్చర్యంతోనూ, ద్వేషంతోనూ, భర్తని తన వైపుకి మరల్చుకునే బుజ్జగింపు స్వరంతో నిలదీసింది రాజ్యం. నిజంగానే ప్రసాదరావు ఐదు నిమిషాలు ఏమీ మాట్లాడలేక పోయినాడు. తరవాత తమాయించుకుని

''ఇంతకీ నువ్వేమంటావో చెప్పుదూ!'' అన్నాడు లౌక్యంగా. తన యెదుటే అనసూయని తప్పులుపట్టే ధైర్యం భార్యకి వుండదనుకున్నాడు ప్రసాదం. కాని రాజ్యం తెలివిగలది. విషయాలన్నీ కుండ పగలగొట్టినట్టు అనకుండా డొంకతిరుగుడుగా బయట పెట్టింది. ''ఆ సోమ సుందరంగారి మేడపక్కనే ఇల్లు కొనడం దేనికండీ? ఇంకెక్కడా ఇల్లు దొరక్కనా? మంచీ చెడూ మాట్లాడాలంటే అవధాన్లు గారుండనే ఉన్నారాయె. ఆయన్ని వదిలిపెట్టి సోమసుందరంగార్నే పట్టుకుని వేళ్ళాడ్తుందేం మీ అక్కగారు? నాకు చెడ్డ సిగ్గుగా ఉందండి, ఇదంతా వింటే'' అంటూ రాజ్యం భర్తకేసి చూసింది, తన ఉపదేశం పనిచేస్తోందా, లేదా అన్నట్టు. ప్రసాదారావు ఏమీ మాట్లాడలేక పోయినాడు. అసలు శిల అయిపోయినాడనవచ్చు. అతనికి తన గత జీవితమంతా ఒక్కసారి సినిమాలా జ్ఞప్తిలోకొచ్చింది. ఇన్నేళ్ళబట్టి తన కింద అయిన ఖర్చే పది పన్నెండు వేలుండొచ్చు, ఆపయిన తన పెళ్ళీ, అక్కగారు కొనుక్కున్న డాబా, పొలమూ! ఇంత ఆదాయం తమకున్న ఆరెకరాల ద్వారానే వచ్చిందీ అంటే ఎవరూ నమ్మరు; తన భార్య తనని దెప్పిపొడవడంలో ఆశ్చర్యం ఏమిటి? అయితే ఇంత డబ్బునూ అక్కయ్య ఎట్లా సంపాదించిందీ... తెలుస్తూనే వుంది - రాజ్యం మొహాన అనలేదు కాని - ఆమె ధ్వనిస్తూన్న దేమిటి? - అయితే ఇదంతా నిజమా? అకారణంగా సోమసుందరంగారు తమ ఇంటి భాగంలో ఇంకా అద్దె ఇచ్చుకుంటూ ఉంటానికి కారణం ఏమిటి సొంత మేడ ఉండి గూడా?...

ప్రసాదరావు ఈ ఆలోచనలతో తలతిరిగి, మరుసటి రోజే మద్రాసునుంచి సొంతవూరు బయల్దేరాడు.

## 12

అకస్మాత్తుగా, ప్రసాదరావు ఒక్కడే పొద్దున బండికి రావడంతో అనసూయ ఆశ్చర్యపడ్డది. ''ఏం బాబూ, రాజ్యంయేదీ? నువ్విట్లా ఉత్తరంముక్కన్నా రాయకుండా బయల్దేరి వచ్చావేం?'' అని ప్రశ్న

మీద ప్రశ్న వేసింది తమ్ముణ్ణి. ప్రసాదరావు ఒక్కదానికన్నా జవాబివ్వకుండా, మౌనంగా దొడ్లోకి పోయి, కాళ్ళు కడుక్కొచ్చి కూర్చున్నాడు. '' ఏరా అట్లా ఉన్నావేం? దానికేమన్నా జబ్బుచేసిందా ఏమిరా, చెప్పరా?'' అని అడిగింది అనసూయ కంగారుగా, తమ్ముడి పక్కనే కూర్చుని. 'అక్కయ్యా' అని మాత్రం అన్నాడు, అనసూయకు తమ్ముడి గొడవేమీ అర్థంకాక, ''ఏం బాబూ! ఏమిటో చెప్పరా? నాకేదో దడగావుంది. నిన్ను చూస్తుంటే!' అన్నది మరీ ఖంగారైపోయి,

ప్రసాదరావు గుండెని కుదురుబాటులోకి తెచ్చుకుని ''కోప్పడకు అనసూయా! నీ కింత డబ్బు యెక్కడిది?'' అని అడిగాడు సీరియస్‌గా.

అనసూయ పిడుగుపడ్డా అంత చలించేది కాదు. అందులోనూ, ఎన్నడూ పేరుపెట్టి పిల్చి ఎరగని తమ్ముడు పేరుపెట్టి పిలవడం, డబ్బెక్కడిదని అడగడం! ఆమె ఒక్క క్షణం తమ్ముణ్ణి తేరిపార చూచి, పరిస్థితి అర్థం చేసుకుని, మరుక్షణమే తన సహజమైన శాంతగుణంలోకి మరలి '' ఇప్పుడా జిజ్ఞాస నీకు అకస్మాత్తుగా ఎందుకు కలిగింది ప్రసాదం?'' అని అడిగింది.

''నీకు ఈ డబ్బంతా ఎక్కడిదో చెప్పుముందు? తరవాత నేను చెబుతాను నా జిజ్ఞాస సంగతి'' అన్నాడు ప్రసాదం ఆమె శాంతమైన వైఖరికి మండిపోయి.

తమ్ముడి కోపానికి అక్క వెరవదల్చుకోలేదు. ఆమెకి భయం పోయి చాలా యేళ్ళయింది. ''నీకు తెలీదూ మనకి పొలాలున్న సంగతీ?'' అన్నది ఇంకా శాంతంగా!

''ఆ పొలాల ఆదాయమే నంటావా ఈడబ్బంతా?'' అని గర్జించాడు ప్రసాదం.

''కాక''

''ఊ ! ఈ పదేళ్ల నుంచీ, నాకింద ఖర్చయిన పది పన్నెండు వేలూ నీవు కొనుక్కున్న డాబా, పొలాలు, అన్నీ పొలాలమీద వచ్చిన ఆదాయమేనని లోకం నమ్మడం లేదు'' అన్నాడు ప్రసాదం, ఇక ముసుగులో గుద్దులాట దేనికని.

''నువ్విప్పుడు లోకం తరఫున వకాల్తా పుచ్చుకుని వచ్చావా. నన్ను జమాఖర్చు లడగటానికి వచ్చావా? ఇన్నాళ్ళబట్టి ఏం చేస్తున్నావు? పోనీ తెలివి వచ్చింతర్వాతే నీకింద వందలు ఖర్చవుతుంటె, అప్పుడల్లా వూరుకుని ఇప్పుడు వచ్చావేం. ప్రసాదం, నీ బాగుకోసమే నేను ఏంచేసినా! అది నీకు గుర్తు ఉండకపోతే నాకేమీ నష్టంలేదు. అయితే నన్ను నువ్వు ఇట్లా నిలవదియ్యటానికి నీకు ఏమీ హక్కు లేదు గూడాను'' అన్నది అనసూయ నిక్కచ్చిగా.

ప్రసాదం మళ్ళీ అరగంటసేపు ఏమీ మాట్లాడలేక పోయినాడు. కాని అతనిలో పనిచేస్తున్న సంఘ మర్యాద వూరుకోనియ్యలేదు. ''నీ మీద నాకేమీ హక్కులేకపోవచ్చును. కాని, నన్ను నువ్వు ఇట్లా అన్యాయమైన డబ్బుతో అభివృద్ధి చెయ్యాలని నిన్ను ఎవరు బలవంతం పెట్టారు? నేను ఏ మొహం పెట్టుకుని నలుగుర్లో తిర్గగలను? నా పరువూ, మర్యాద మంటగలిసిం తర్వాత ఈ బ్రతుకెందుకూ? ఈ డబ్బెందుకూ?'' అన్నాడు ప్రసాదం కోపం, పశ్చాత్తాపం కలిసిన స్వరంతో.

''నా అన్యాయానికి అంతగా పశ్చాత్తాప పడేవాడివి ఒక్కదానికి జవాబు చెప్పు. నేను చేసిందల్లా నా వరకే వుంటుంది. దానివల్ల ఇతరు లెవరూ బాధపడరు. నువ్వయినా నాతో తెగతెంపులు చేసుకున్నావంటే, చెడ్డదాన్ని ఎలాగూ నేను చెడిపోతాను. నన్ను ఆక్షేపించే ధైర్యం ఎవరికీ లేదని ఇదివరకే రుజువయ్యేవుంది. ఆ ధైర్యం ఏ ఒక్కరికి వున్నా నీకు పెళ్ళయ్యేదికాదు. ఆ భయం నాకు లేదు. ఒక వేళ నీకువుంటే, నా దిగులు నువ్వు పడనక్కరలేదు. ఎందుకంటావా? రక్తస్పర్శనైనా, నేను అవినీతిగా ప్రవర్తించాను గనక. కాని... నువ్వు వెనక్కి తిరిగి ఆలోచించు. నీ మూలంగా ఒక నిండు ప్రాణం బావిలో పడి విలవిలా తన్నుకు చచ్చింది. ఒక్క ప్రాణమా? కాదు; తనతో ఒక శిశువునుగూడా తీసికెళ్ళింది. నువ్వేం న్యాయం మండిస్తున్నావని నన్ను ఆక్షేపిస్తున్నావు? ఇప్పుడు పశ్చాత్తాప పడవలసిందెవరో ఆలోచించు. నేను ఎవర్నీ ఆత్మహత్యల పాలు చెయ్యలేదు. ఎవర్నీ మోసం చెయ్యలేదు. లోకం ఎరుగని దశలోవున్న పిల్లని మోసంచేసి, ఆమె ప్రాణం బలవంతంగా తీసినందుకు నీకు శిక్ష ఏమిటి? పైగా పై పంచ బుజాన వేసుకొని, మర్యాదస్తుడిగా, గౌరవ నీయుడిగా తిరిగే నీకు, నేను అమర్యాద చేసినాదాన్నైనాను కదూ?'' అన్నది అనసూయ. కోపంతో వొణికిపోయింది.

ప్రసాదరావు చప్పున లేచి నుంచుని ''నువ్వు పెంచి పెద్దవాణ్ణి చేసినందుకుగాను, నిన్ను ఏమీ అనకుండా ఇక్కణ్ణించి వెళ్ళిపోతున్నాను. ఇక నీ యిష్టం'' ఇన్నీ అనేసి గబుగబా ఇంట్లోంచి బైటికివచ్చి మెట్లు దిగి వెళ్ళిపోయినాడు. అనసూయ వాడు వెళ్ళినవైపే చూస్తూ పిచ్చిదానిలా నిలబడిపోయింది. ఆమె కళ్ళనుంచి అప్రయత్నంగా కన్నీళ్ళు ధారగా ప్రవహించినై. రక్తస్పర్శ ఎక్కడికి పోతుంది.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# వింతలోకం

ఆవేళ పత్రిక కోసం లేదా, రామారావు కోసమో ఎదురుచూస్తూ కూర్చున్నాను. ఎందుచేతంటే రామారావైనా, పత్రికైనా ఒకటే. అడ్వర్‌టైజ్‌మెంట్ల లగాయితు తాజావార్తల క్రింద కాళీస్థలం వరకూ ప్రతిదీ అప్పజెప్పగల మనిషి వాడు. మా ఆవిడ ఉదయం పనులలో నిమగ్నమై ఉంది. ఆమె లోకం అంతవరకే పరిమితమై వుంది. అలా ఆలోచిస్తే, ఎవరి లోకపు పరిమితులు వాళ్ళకే వుంటాయి కాబోలు! యుద్ధాలు చేసేవారికి ప్రపంచమంతా యుద్ధరంగంగా కనపడవచ్చు. సెక్సు సినిమాలు చూసేవారికి ప్రపంచం అంతా అందగత్తెలతో నిండివున్నట్లు తోచవచ్చు. రాష్ట్రీయ రాజకీయాలలో మునిగితేలే వారికి, ఇంకో లోకం కనపడక పోవచ్చు.

నాకైతే, ప్రొద్దున్నే పత్రిక చదవడం, పదిగంటలు కాగానే కాసిని మెతుకులు వేడి ఆరకుండా తిని బ్యాంకికి పరుగెత్తడం; ఐదు గంటలకు - తిరిగి ఇల్లూ, భార్య, తప్పిజారి ఒక్కొక్కనాడు సినిమా - ఇంతే!

ఎనిమిది గంటలు అయింది. పత్రిక యింకా రాలేదు. రామారావు రొప్పుతూ రోజుతూ పరుగెత్తుకొచ్చాడు. వాడిచేతిలో పత్రిక నలిగిపోయి ఓ మూల చినిగిపోయి, కనిపిస్తోంది.

రామారావు నన్ను కుర్చీలో నుంచి భుజం పట్టుకుని లేవనెత్తి నిల్చోబెట్టి, ''ఏరా! ఏమిటి ఇంకా ఇక్కడ కూర్చున్నావా? మామూలు ధోరణిలోనే వున్నావా?..... ఏం చేస్తున్నావురా నువ్వు...? ఈ మూల ఏకాకిగా కూర్చుని జపం చేస్తున్నావా - లోకం మునిగిపోతుంటేనూ?'' అన్నాడు. రాజకీయనాయకులు అప్పుడప్పుడు ఉద్రేకం పుట్టి ఇట్లానే ఉపన్యసిస్తూ వుంటారు. ఆ జాడ్యం వీడికీ పట్టుకుందేమోనని, ''అంత విశేషం ఏముందేం పేపర్లో?..... అన్నట్లు పేపరు ఇవ్వాళ బ్లాక్‌మార్కెట్లో అమ్మారటగా! మూడో యుద్ధం ప్రారంభించారేమిటి కొంపతీసి?'' అని అడిగాను ఒక్క గుక్కన.

రామారావు ఏదో అనబోతూవుంటే మా ఆవిడ కాఫీ పట్టుకొచ్చి రామారావు ముందు టేబిల్ మీద పెట్టి, తలుపుచాటుకుపోయి నుంచుంది.

రామారావు కాఫీగ్లాసు తీసుకోకుండా, పత్రికపై శీర్షిక మాత్రం చదివాడు. ''ఖగోళంలో నిర్విరామంగా తిరుగుతూన్న గ్రహాలలో భయంకర సంచలనం.''

అప్పటిదాకా నిర్లక్ష్యంగా వున్నానుగానీ, ఈ మాట వినగానే ఉలిక్కిపడి "ఏమిటి! పూర్తిగా చదువు" అన్నాను. పత్రిక మొదటి పేజీ అంతా ఈ వార్తకు సంబంధించే వుంది.

రామారావు నన్ను ఎగతాళి చేస్తున్నట్టు ఒక చూపుచూసి చదవసాగాడు. "బొంబాయి, కలకత్తా, మద్రాస్, చికాగో, లండన్, మాంచెస్టర్, బెర్లిన్, పారిస్, మాస్కో, టోకియో, చుంకింగ్ మొదలైన ప్రధాన నగరాలలోగల నక్షత్ర పరిశోధనాలయాలలో కొన్ని సూక్ష్మమైన వాతావరణ సూచకయంత్రాలు గత రాత్రి అకస్మాత్తుగా ఆగిపోయినాయి. అవి ఇలా ఆగిపోవడం భూమ్యాకర్షణ మీద సూర్యునికిగల ప్రభావం తగ్గటాన్ని నిరూపిస్తున్నదని ప్రపంచ విజ్ఞాన వేత్తలు భావిస్తున్నారు. ఇందుకు కారణం ఇంకా బోధపడకపోయినా, ఈ పరిస్థితివల్ల భూమికి, సౌరకుటుంబంలోని ఇతరగ్రహాలకి, వాని ఉపగ్రహాలకి అత్యంత ప్రమాదం సంభవించగలదని నేడు స్టాక్ హోంలోని విఖ్యాత శాస్త్రజ్ఞులు ప్రకటించారు. విజ్ఞాన శాస్త్రజ్ఞుల్లోకల్లా అగ్రగణ్యుడు అయిన డా॥..... నేడు చికాగోలో ఈ పరిణామాల కారణాలు వివరించాడు. సూర్యునికి కొన్ని కోట్లమైళ్ల దూరంలో ఉన్న ఒక నక్షత్రం ఊహించరాని కొన్ని కారణాలవల్ల ఆ నక్షత్రపు ఆకర్షణకి లోబడి, సూర్యుడు అతివేగంగా ఖగోళంలోకి పారిపోతున్నట్టు కనుక్కోబడింది. సూర్యుడు ఇప్పటికీ ఆ నక్షత్రంవైపుగా ప్రయాణం చేస్తూ, తన చుట్టూ పరిభ్రమిస్తూన్న గ్రహాలనుకూడా లాక్కుపోతున్నాడు. కాని, సూర్యుని ఆకర్షణ శక్తికి పరిమితి, నిర్ణీత స్థానం ఉన్నవి. ఆ స్థానాన్ని సూర్యగోళం కొద్ది రోజులలో దాటు తుందని అంచనా వేయబడింది. ఇందువల్ల సౌరకుటుంబంలోని గ్రహాలన్నిటిలోనూ 'జీవం'తో కళకళ లాడుతూవున్న భూమికి ముఖ్యావసరమైన ఉష్ణం క్షణక్షణం తరిగిపోతున్నది. రెండు మూడు రోజులలో గాని, వారం రోజులలో గాని భూమిపై అతి భయంకరమైన మంచు తుఫాను సంభవించ గలదని ఊహించబడుతున్నది. లక్ష సంవత్సరాల క్రితం భూమికి ఇలాటి హిమయుగం గడచింది. ఈ పరిస్థితుల్లో మనుష్యులు బతకడం అసంభవం."

రామారావు పత్రిక చదివి వినిపించి, "పద, ఇవ్వాళ ఆలిండియా రేడియో గంటకొక్కసారి ఈ వార్తల్ని వినిపిస్తుందట. ఇక్కడేం జేస్తావు పద" అన్నాడు.

మేము బయల్దేరబోతుంటే మా ఆవిడ "ఏమండీ! ఇల్లూ వాకిలీ ఏంగావాలండి ఇట్లా వొదిలేసిపోతే?" అని ఏడ్పు గొంతుతో అంది. దానికి దిగులుగానే ఉంది ఈ సమాచారం విన్న తర్వాత.

నేను ఎక్కడలేని ఫిలాసఫీ ఉపదేశించకపోతే ఆవిడ ప్రాణం నిలిచేట్టు కనిపించలేదు. "చూడూ...పిచ్చిదానా! ప్రపంచంలో జీవకోటి యావత్తూ నశించే ఈ సమయంలో నువ్వెవరూ, నే నెవర్ని! ఇల్లేమిటి? వాకిలేమిటి?... అది సరేగానీ వంట తొందరగా కానియ్యి..." అని మామూలు ఫిలాసఫీ చెప్పి రామారావు వెంట బయల్దేరా. వాతావరణం లోని విచిత్రమైనమార్పు బయట అడుగు పెట్టేంతర్వాతగాని బోధపడలేదు. అది మండు వేసవి. అప్పుడు ఉదయం తొమ్మిది గంటలు. ఎండ

నెత్తి మాడకొట్టవలసింది. కాని, శీతాకాలపు సాయంత్రంలాగా చలివేస్తూవుంది. రామారావు, నేనూ ఒకర్ని ఒకరం ఐదునిమిషాలపాటు నిర్ఘాంతపోయి చూసుకున్నాం. మళ్ళీ ఇంట్లోకి వెళ్ళి రెండు ఉలెన్ స్వెట్టర్లు తొడుక్కుని బయల్దేరాం. చలిగాలి ఈ చెవులోంచి ఆ చెవులోకి కొడుతోంది.

## 2

ఏ క్షణాన ఈ లోకం హిమాపాతానికిగురయి నశిస్తుందో అన్న భీతితో తలొంచుకు నడుస్తున్నాం. ఈ గ్రహాలు ఒకదానితో ఒకటి ఢీకొని ముక్కలై పోతాయేమో! మానవుడు లక్షల సంవత్సరాలుగా విశేష శ్రమకోర్చి నిర్మించిన ఈ నాగరికత యిలా ధ్వంసం కావలసిందేనా? భీకర జంతు సముదాయాన్ని ఎదుర్కుంటూ, నశిస్తూ, మధ్య మధ్య భూకంపాలు అగ్ని ప్రమాదాలు తప్పించుకుంటూ, మానవుడు మెల్లిగా అనంత కాలపరిణామంలో తన మృగప్రకోపాల్ని అణచుకొని, సహనమూ, సాంఘిక బుద్ధి బలపర్చుకుని నిర్మించిన ఈ నాగరిక సౌధం చిహ్నమైనా మిగలకుండా నశించవలసిందేనా!

రామారావు ఆకాశంవైపు చూశాడు. నేనూ చూశాను. సరిగ్గా అదేక్షణాన ఈ భూమిమీద కొన్ని లక్షల మంది వివిధ ప్రదేశాల్లో అలా చూస్తూ వుండి వుంటారు. ఆకాశం నీలంగానూ, నిర్మలంగానూ ఉంది. కాని - ఏవో విపరీతమైన కాంతులు అటూ యిటూ ఊహాతీతమైన వేగంతో సంచరిస్తున్నాయి. సూర్యుడు నడినెత్తి మీదవున్నా, తాపమూ లేదు, వెనకటంత కాంతీ లేదు. ఏమిటో ఈ ప్రళయం!

సరిగా రేడియోలో ఇదే పదం వినిపించింది. పెద్ద బజారంతా కిక్కిరిసివుంది. ప్రజలు ఆదుర్దాగా, కళ్ళు పెద్దవి చేసుకుని రేడియో లౌడ్‌స్పీకర్లని చూస్తూ వాళ్ళంతా చెవులు చేసుకొని వింటున్నారు. వాళ్లల్లోనే నెరిగిన వాళ్ళెంతోమంది వున్నారు. గౌరవనీయులైన పెద్దలూ, ఇతరుల్ని లెక్క చెయ్యని వాళ్ళూ, వ్యాపారంలో లక్ష లార్జించిన లక్ష్మీ పుత్రులూ, దేవాలయాలకి ఆస్తులు రాసిచ్చిన పుణ్యాత్ములూ అందరూ, అన్ని రకాల గర్వాలూ విడిచి ప్రళయం కోసం ఎదురు చూస్తున్నారే. ఆ నిలువ చేసుకున్న ఆస్తినీ, దాచుకున్న డబ్బునీ, కట్టించుకున్న మేడల్నీ పోషించుకున్న యౌవ్వనాన్నీ, భార్యల్ని - ప్రళయానికి అర్పించక తప్పదని దిగులు పడుతూ నుంచున్నారు. రేడియో చెబుతూ వుంది: ''భూమికీ ఇతర గ్రహాలకీ సంభవించనున్న ప్రమాదం అనుకున్న దానికన్న ఇంకా దగ్గరపడిందని తెలుస్తున్నది. సూర్యగోళం విశ్వాంతరాళంలోకి పరుగెత్తే వేగం ఈవేళ మరీ హెచ్చిందని తెలుస్తున్నది. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా సంయుక్త రాష్ట్రాలూ, రష్యా, చీనా, ఇండోచీనా ప్రభుత్వాల అధిపతులు నేడు ఉదయం చర్చించి ఇండోచీనా యుద్ధాన్ని ఆపివేశారు. అనుక్షణమూ యూరోప్ నుంచి భయానకమైన వార్తలు వస్తున్నాయి. అంతర్జాతీయ శాస్త్రజ్ఞుల సలహా యూరోపియన్, అమెరికన్, రష్యన్ ననుసరించి రాజ్యాలు, ఇంకా ఉత్తరధృవ ప్రాంతంలోని దేశాల ప్రజలూ, నాయకులు, విమానాల్లో దూర ప్రాచ్యానికి పారిపోయి వస్తున్నారు. యూరోప్ ఆకాశమంతా విమానాలతో

నిండిపోయింది. ఇంగ్లండ్ ఉత్తర భాగంలోనూ మంచుతుపాను అప్పుడే ప్రారంభమైంది. ఉత్తరధ్రువ ప్రాంతానికి సమీపాన గల ప్రదేశాలన్నీ ప్రాణి నిలవడానికి వీల్లేని భయంకర హిమపాతానికి లోనయినాయని తెలుస్తున్నది. దూరప్రాచ్యంలో ఏ ప్రాంతం నివాసయోగ్యం అన్న విషయం అతి రహస్యంగా వుంచబడింది'' రేడియో వార్తా ప్రసారం పూర్తికాగానే ప్రజాసమూహం కలవరపడుతూ తమ ఇళ్లకి పోతున్నారు. పదేసిమంది గుంపులుగా కలిసి రొటీన్ పనులు మరిచిపోయి ద్వేషాలూ, స్వభావాలూ ఒదులుకుని ఏమిటి - ఏం జరుగుతుంది? ఇందులోంచి తప్పించు కోనే మార్గం లేదా? అని ఆలోచిస్తున్నారు.

మేమిద్దరమూ ఆకాశం వేపు చూస్తూ, మనస్సుకూ ఊహలకీ అందని ఈ అనంత విశ్వాన్ని గురించి ఆలోచిస్తూ, మా మిడి మిడి జ్ఞానాన్ని మా చుట్టూ చేరి వింటున్న పదిమందికీ పంచి పెట్టుతున్నాం. ఆకాశం ఎక్కడ కక్కడ నల్లబడుతూ వుంది. గాలిహోరు ఎక్కువ అవుతోంది. గగన పథమంతా ఏవో విచిత్ర గతులతో, విపరీత వేగాలతో, ప్రయాణించే నెబ్యూలాలతో గందరగోళంగా వుంది. ఏ క్షణాన వుత్పాతం జరుగుతుందోనని ఒళ్ళు గగుర్పొడుస్తూ వుంది.

మేము ఒక హోటల్లోకి వెళ్లి కణకణలాడుతూన్న కుంపటి దగ్గిర కూర్చున్నాం. బయట ఏదో ఘోష వినపడుతోంది. కొండలు కరుగుతున్నప్పుడూ, సముద్రాలు పొంగినప్పుడు ఇలాంటి శబ్దాలే వినిపిస్తాయేమో! రామారావు మెల్లగా రామనామ స్మరణ ప్రారంభించాడు. నాకు నవ్వొచ్చింది.

''ఎందుకూ నవ్వుతావు!'' అని గదిమాడు రామారావు.

నాకు చాలా కసిగావుంది. ''ప్రపంచంలో జీవరాసులు అన్నీ అంతమయ్యే ఈ ప్రళయంలో నీ ఒక్కడి పాపాలు మాసిపోవాలని నువ్వు రాముణ్ణి ప్రార్థించటం చాలా ఆశ్చర్యంగా వుంది. ఇన్ని లక్షల జీవరాసుల్లో, మానవుడి పాప పుణ్యాల, లెక్కలు తయారుచేస్తూ, శిక్షలు విధిస్తూ కూర్చోవటమేనా నీ రాముడికి వుద్యోగం? దేవుడు దుష్టుల్ని మాత్రమే శిక్షించాలనే నియమం గల వాడైతే, ఈ ప్రళయం ఏమిటి చెప్పు!'' అని నిలదీశాను.

రామారావు కాస్త ఆలోచించి, ఎవరికర్మ కెవరు కర్తలురా? ఇలా జరగవలసి వుంది - జరుగుతోంది!'' అన్నాడు నిక్కచ్చిగా.

''అలాగని - పాపం చేసేవాణ్ణి చెయ్యనియ్యవేం? చచ్చేవాణ్ణి చావనియ్యక మందులకోసం, మంత్రాలకోసం పరిగెడతావేం? కాస్త అడ్డం తిరిగేప్పటికి కర్మ అని చూసుకుంటావ్! భేష్'' అని వాదనకి ఫుల్‌స్టాప్ పెట్టి ''పద ఇంటికి పోదాం. చలి ముదురుతోంది. మంచు తుఫాను ఏ నిమిషాన ముంచుకువస్తుందో! ఆఖరుసారిగా ఇల్లూ వాకిలీ ఒకసారి చూసుకోవాలి. లే! ఈ గాలి ఇంకా ఎక్కువ అయితే మనం బయటికైనా వెళ్ళలేం'' అన్నాను. రామారావు మాట్లాడకుండా బయల్దేరాడు. వాడికింకా పెళ్ళీ పెటాకులూ కాలేదు. దూరపు బంధువులున్నారుగాని, ప్రత్యేకంగా నా అన్న వాళ్ళెవరూ లేరు.

ఆస్తి కాలినంతవుంది. వాడికి నిన్నటిదాకా ఎంత ఆశ - జీవితం మీద! పెళ్ళి చేసుకోవాలని, పిల్లల్నీ గనాలని లోకాన్నేదో ఉద్ధరించాలని బోలెడు ఆదర్శాలతో ఎప్పుడూ కలవరిస్తూండేవాడు. అవన్నీ ఏమైనాయి ఇప్పుడు! నాకు మాత్రం! - నాకూ కోర్కెలున్నై. నా కొక్కడికేనా! లోకంలో ప్రతివాడికీ, సనాతనుడు లగాయతు సంసారివరకూ మెక్ ఆర్థర్ మొదలుకొని మావూరి మునిసిపల్ ఉద్యోగుల వరకూ అందరికీ తీరని కోర్కెలున్నాయి. అవన్నీ ఏమైనాయి! ఒక్క ప్రళయంతో పోవల్సిందేనా? వీల్లేదని ఘోషిస్తున్నాం. కాని, వినేదెవరు? యుద్ధ ప్రేరకులూ, శాంతి ప్రియులు, పాపులు, పుణ్యాత్ములూ, జర్నలిస్టులూ, ప్రధాన మంత్రులూ అందరూ ఒక్కసారిగా... నశించవలసిందే?

ఆలోచనలు తెగవు. కాని, మెల్లిగా తెంచుకుని ఇంట్లోక్లొచ్చి పడ్డాం. మా ఆవిడ తలుపు తీసింది. మళ్ళీ తలుపు మూసేందుకు మేము ముగ్గురం బ్రహ్మ ప్రయత్నం చెయ్యాల్సివచ్చింది. పైశాచికంగా వీస్తోంది గాలి. అప్పటికింకా సాయంత్రం మూడు గంటలన్నాకాలేదు - అయినా చీకటి దట్టంగా వ్యాపించింది. భోజనానికి కూర్చుంటూ రామారావు నా వేపు తిరిగి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. విచారం ఆగలేదు. పైకి ఎవ్వరం ఏడవలేదుగాని, ఆరాత్రల్లా విపరీతంగా భయపడుతూ కూర్చున్నాం. బైట హోరుగాలి. ఆకాశంలో గందరగోళం క్షణం క్షణం అధికమౌతూంది. ఆ రాత్రి విశాలమైన సుందర ప్రకృతిలో నివశించే ప్రతి వ్యక్తి ఘోర సంఘ మరణాన్ని ఎదురుచూస్తూ మేలుకుని కూర్చున్నాడు. ఉన్న మహారాజులు విమానాల్లో, రాకెట్లలో దూరప్రాచ్యంలోగల ఏదో రహస్య ప్రదేశానికి వెళ్ళిపోతున్నారట. మనిషి అంతరించే వరకూ స్వార్థం నశించదు కాబోలు! కాని ప్రతి వాడికి తనొక్కడేగాక, తనతోటి ఇంకా చాలామంది పోతున్నారు, అనే జిజ్ఞాసవల్ల ఆ ఉప శాంతి ఏర్పడుతోంది!

## 3

గంటలు గడిచి తెల్లవారిందని ఊహించుకుని బైటికి వెళ్ళటానికి ఉద్యుక్తులమైనాం. కొద్దిగా చీకటితగ్గి వెల్తురు వొచ్చింది తూర్పున. కిటికీ సందుల్లోంచి సూర్యబింబంవైపు ఆదుర్దాగా చూశాను. ఎర్రటి అగ్నిగోళంలా కన్పిస్తూంది. ఇదివరకు గ్రహణం రోజున మసిపూసిన అద్దం పెంకులో చూస్తే అట్లా కనబడేది. గాలి వేగంగాని, చలి ఉధృతంగాని ఒక్క రవ్వగూడా తగ్గలేదు. పైగా ఎక్కువౌతున్నాయి. కిటికీ సందుల్లోంచి కనిపిస్తున్నంతమేర ఆకాశం అంతటా లెక్కలేనన్ని జాజ్వల్యమానమైన ఉల్కలు - జ్యోతిర్మయమైన నెబ్యూలాలూ సమూహంగా నిండి భయంకరంగా వుంది. కొన్ని గంటలసేపు యీ గాలి యింకా యిలాగే వుంటే రక్తం గడ్డకట్టి ఎక్కడి ప్రాణి అక్కడే జడమైపోతుంది. ఇంతలో ఇంకో సంగతి జ్ఞాపకం వొచ్చింది. పత్రికలు వొస్తాయా ఇవ్వాళ?.... ఎలా వొస్తాయి? కాని రావాలనే కోర్కె మాత్రం పోలేదు. మామూలు మనుషులు కన్న పత్రికలవాళ్ళు, రైల్వేకంపెనీవాళ్లూ సాహసవంతులు కదా? ఎట్లాగైనా ధైర్యం చిక్కబట్టుకుని బజారుకుపోవాలి. కాఫీగూడా తాగాలాయె. హోటల్ అయ్యర్లు ఎన్ని ప్రళయాలు సంభవించినా కాఫీ అందిస్తారనిగా - ప్రతీతి!

రామారావు నా పక్కనే కూర్చుని కిటికీలోనుంచి ఆకాశం వేపు చూస్తున్న వాడల్లా - ఉలిక్కిపడి ''చూడు... చూడు...'' అన్నాడు కంగారుగా. ఒక బ్రహ్మాండమైన తేజోమండలం - భూమిమీదికి అతి వేగంగా వొచ్చి పడి పోయింది. దానివల్ల ఏమైనా ప్రమాదం జరిగిందో లేదో అప్పుడు నేను ఊహించలేదుగాని, అదొక ఉల్క అని మాత్రం పోల్చుకున్నాను. రామారావు మెల్లిగా లేచి నిలబడి ''పేపరుకోసమన్న బజారుకి పోవాలిగదా? కనీసం ఎక్కడైనా రేడియో ఐనా వినాలా?'' అన్నాడు.

''నిజమే!'' అన్నారు.

మా అవిడ, ''ఎక్కడికీ పోవద్దండీ, మీకు పుణ్యం వుంటుంది...'' అని ఏడ్పు లంకించుకుంది. ఆవిణ్ణి అతి కష్టం మీద సముదాయించి, ఎప్పుడో కొన్న పాలడబ్బాపుణ్యమా అని కాస్త కాఫీ కాయించుకు తాగి రెండు మూడు దుప్పట్లు కప్పుకుని యిద్దరమూ బయల్దేరాం. నీరెండ కాస్తూ వుంది. గాలివిసురుకు పూరిళ్ళూ, రేకుల షెడ్లూ ఎగిరిపోయాయి కాబోలు. నిరాశ్రయులైన ప్రజలు డాబాలలో జేరి చలికి వొణుకుతున్నారు. ఏ క్షణానైనా సంభవించగల మృత్యువు కోసం సిద్ధంగావుంది జీవకోటి. మాకన్న సాహసవంతులు అప్పటికే బజారులో హోటల్స్‌లోకి జేరారు. రేడియో చాలాగొడవ గొడవగా వినిపిస్తూవుంది. వాతావరణం సరిగా వుంటేనే అంతంతమాత్రంగా వినిపించే రేడియో ప్రసారాలు విపరీతమైన ఈ గందరగోళంలో సరిగా వినిపించమంటే ఎలా? ఏలాగో... రేడియోలో వినిపించిన మాటల్ని కూర్చుకుని అర్థం చేసుకుంటున్నాం. అయ్యరు ప్రజలకి వేడి కాఫీ అందిస్తున్నాడు. అదంతా ప్రజలమీద ప్రేమవల్ల కాక పోవచ్చు. కాని - ఏదయితేం? కాఫీ యిస్తున్నాడు గనుక అతన్ని లోలోపల అభినందించాం. భవిష్యత్తు అనేది ఏమీ లేదని స్పష్టమైనప్పుడు కూడా మనిషికి యింకా భవిష్యత్తు మీదగల విశ్వాసానికి ఆశ్చర్యపడుతూ, రేడియో వార్తలు వింటున్నాం.

''దూర ప్రాచ్యానికి, వెళ్ళాలని బయల్దేరిన యూరోపియన్ విమానాలు,. ఉధృతమైన హిమోత్పాతానికి గురై ఛిన్నాభిన్నమై పోయినట్లు తెలుస్తోంది. ఇప్పటికే ఉత్తర అమెరికా, యూరప్, ఇంగ్లండ్, రష్యా, చైనాల్లోని ఉత్తర ప్రాంతపు భూభాగాలు దట్టమైన మంచుతో కప్పబడిపోయినాయి...సోదరులారా! మీకు దగ్గిరలో కొండగుహలు ఉన్నట్లయితే తక్షణం వాటిల్లోకి వెళ్ళిపోండి. బతికితే బతకవచ్చు. కాని నిశ్చయంగా చెప్పలేము. వెళ్ళండి, ఢిల్లీనుంచి రేడియో ప్రసారం ఇంతటితో విరమిస్తున్నాం..'' అరక్షణం సేపు ఆగిపోయిన రేడియోగొంతు మళ్ళీ ఆరంభించింది: ''హిమాలయ పర్వత శ్రేణినుండి విపరీతంగా వీస్తున్న మంచు తుపానువల్ల గంగా సింధుమైదానం దట్టమైనమంచు పట్టి...'' రేడియో ప్రసారం ఆగిపోయింది.

## 4

మనుష్యులు గందరగోళంగా పారిపోతూన్నారు. ఈ క్షణంలో వీళ్ళకి ఏ ఆశయమూ, ఆదర్శమూ లేదు. ఎక్కడికి పోవాలో ఏం చెయ్యాలో తెలియదు. అక్కణ్ణించి పారిపోవటమే వాళ్ల

లక్ష్యంగా వున్నట్లు కనిపిస్తోంది. అందరూ సమానంగా పరిగెడుతున్నారు. పిక్క బలంలేని ముసలి వాళ్ళూ, చిన్న పిల్లలూ, అనాధలు ఒగర్చుకుంటూ నడుస్తున్నారు. చీకటి; ఆకాశంనిండా విచిత్రమైన కాంతులు, ఎర్రని సూర్యుడు కొడిగట్టిన దీపంలా కనిపిస్తున్నాడు. గుడ్డి వెన్నెలలా వుంది ఎండ. ఊళ్ళకు ఊళ్ళు ఖాళీ ఐపోతున్నాయి. ఎవరికి వారు మృత్యువునుంచి తప్పించుకోవాలని పారిపోతున్నారు.

వాళ్ళని వెంబడిస్తున్న ఆ మృత్యువుకి మాత్రం తరతమ భేదాలు లేవు; కులాలూ, జాతులూ, ఖండాలూ అనే భేదంలేకుండా, ఆసన్న మృత్యువునుండి తప్పించుకోవాలని కాలాన్ని దూరంతో జయించాలనో దూరాన్ని కాలంతో జయించాలనో పరిగెత్తుతున్నారు అంతా! బలహీనులు, రోగిష్టులు, బాలింతలూ మృత్యు దేవతకి మొదటే బలి అయిపోతున్నారు. మంచు కురుగుతూ ఇళ్ళనూ, రోడ్లనూ, హిమమయం చేస్తున్నది. పక్షులు ఎగిరేవి ఎగురుతున్నట్టే నీలుక్కు పోతున్నాయి.

ఉత్తరాన్నుంచి, మంచు తుఫాను సాగింది. ఒక... యీ నాగరికత, యీ ఆటంబాంబులు, నూట ఇరవై ఐదు అంతస్థుల మేడలు, కోటీశ్వర్లు ఉత్తమ సంస్కృతులూ, ఉద్గ్రంథాలు, అన్నీ సమాధే!

నేనూ, రామారావు జనసమూహంలో విడిపోయ్యాం. నేను పరిగెత్తుతున్నాను. భార్య ఏమైందంటారా!.... ఏమో! నాకేం జ్ఞాపకంలేదు. నేనుమాత్రం జనసముద్రంలో పడి అక్కడికి పదిహేనుమైళ్ళ దూరంలో వున్న కొండకేసి పరిగెత్తుతున్నాను.

ఏదీ మిగలనప్పుడు స్మృతి మిగులుతుంది. అన్నీ పోయినా జ్ఞాపకాలు నశించవు. ఆ కొండగుహ చేరుకున్న నిమిషం వరకూ నాకు బాగా జ్ఞాపకం వున్నది... అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఉత్తరదిశ అంతా నల్లగా, మంచుగోడ ముద్దకట్టినట్లుంది.

## 5

నేను మెల్లిగా మేల్కొన్నాను. సంవత్సరాల తరబడి పేటికలో ఉంచి పాతేసిన శవం మేల్కొంటే ఎలా వుంటుంది? - అట్లావుంది నాకు, వెచ్చని సూర్యరశ్మికి చుట్టూ కొండల్లా పేరుకొనివున్న మంచు కరిగి కృష్ణలై, గోదావరులై ప్రవహిస్తోంది. గుహలోకి కొద్ది కొద్దిగా వేడీ, వెలుగూ వస్తున్నాయి. గుహద్వారం దగ్గిర మంచు కరిగిపోయి బయట ప్రపంచం కనిపిస్తోంది. చూపుమేరంతా ఒకటే తెల్లని మంచు మైదానం, ఎండకాంతికి వెండిలా మెరుస్తోంది. నే నిందులో ప్రవేశించేటప్పుడు ఎటువంటి సుందర ప్రకృతి వుండేది! మైళ్ళ తరబడి పంటపొలాలు, ఇల్లువాకిళ్ళు, పుష్టికరమైన మనుషులు, అందమైన ఆడవాళ్ళు ముద్దొచ్చే పిల్లలు, ప్రశాంతంగా జీవిస్తూ, తిండికోసం, ఒకరితో ఒకరు పోట్లాటపడుతూ, స్వార్థాలతో నశిస్తూ... అబ్బ.... ఎన్ని రకాలు!

అదంతా యిప్పుడు ఒక కలలా తోస్తుంది. నే నిక్కడికి వచ్చి ఎంతకాలమైంది! తిండి లేకుండా ఇంతకాలం ఎట్లా బతకగలిగాను! నా వందప్రశ్నలకు ఎవరు సమాధానం చెప్పగలరు? మెలుకువ వచ్చింది. ఆకలి తగుల్కొంది. మైకంలో వున్నంతసేపు ఆకలి లేదు. మనస్సు పనిచెయ్యడం మొదలుపెట్టగానే, జీర్ణకోశం కూడా మేల్కొంది కాబోలు - మెల్లగా రాతిగోడ నానుకుని లేచి నుల్చున్నాను. మొదట్లో కాళ్ళుచేతులు, నెత్తురు గడ్డ కట్టి నందువల్ల సరిగ్గా స్వాధీనంకాక అవస్థపడ్డాను.... నే నొక్కణ్ణేనా? ... ఇంక్వెవరూ లేరా? ఇంతకన్న మరణమే మేలు. ఎవ్వరైనా కనీసం ఒక్కరైనా తోడులేకుండా బతుకు భరించటం ఎలా? ఈ వంటరితనం ఎంత దుర్భరం!

నా మెనక సన్నగా మూలుగు, అడుగుల చప్పుడూ వినిపించాయి. చప్పున మెనక్కి తిరిగి చూశాను. అక్కడొక్కరు అక్కడొకరుగా ఐదుగురు వ్యక్తులు లేచి నాకు మల్లేనే తడువుకుంటూ గుహద్వారం దగ్గిర కొస్తున్నారు.

గుహద్వారం బయట రాతిబండలు శుభ్రంగా కడిగినట్టు పరుచుకుని వున్నాయి ఎండలో. కాస్త ఎండన కూర్చుంటేనోగాని రక్తప్రసారం బాగా నడవదని తోచింది నా మెనకాల వస్తున్న ఐదుగురూ మౌనంగా, బిత్తరచూపులు చూస్తూ, గుహ బైటికి వచ్చి బండల మీద కూర్చున్నారు. వాళ్ళల్లో నలుగురు పురుషులు, ఒకరు స్త్రీ.

వాళ్ళ ముఖవైఖరులు పరీక్షించి నా జ్ఞాపక శక్తినిబట్టి ఒక్కరూ భారతీయులు కాదని తెలుసుకోగలిగాను. వాళ్ళని పలకరించాలి.

ఇంతలో అందరిలోకీ ముసలివాడయిన ఒకాయన నన్ను సౌంజ్ఞచేసి పిలిచాడు. నేను మెల్లిగా వాళ్ళ దగ్గిరకెళ్ళి కూర్చున్నాను. మేము ఒకర్నొకరం చూసుకున్నాం చాలా సేపు. మా అందరి కళ్ళ వెంటా నీళ్ళుధారలు కట్టాయి. పది నిమిషాలదాకా ఎవరమూ మాట్లాడలేకపోయాం.

అదొక అపూర్వ సమావేశం!

వాళ్ళల్లో ముసలాయన జ్యూ సుప్రసిద్ధ ఖగోళశాస్త్రజ్ఞుడు. నడికారు వ్యక్తి ఒకాయన చైనీయుడు. ఇతను డాక్టర్; మూడో ఆయన రష్యను - ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అధ్యక్షుడు. నాలుగో ఆయన అమెరికన్ మెకానిక్; ఐదోవ్యక్తి; స్త్రీ మంచి రచయిత్రి, ఆంగ్ల దేశీయురాలు.

మేము ఒకర్నొకరం పరిచయం చేసుకున్నాం. ఇకపై జీవించటం ఎట్లాగ అనేది మా అందరికీ తట్టిన మొదటి సమస్య.

యూదీయ శాస్త్రవేత ఇంగ్లీషులో చెప్పసాగాడు: ''నా కాశ్చర్యం ఏమిటంటే... ఇదంతా జరిగి ఒక శతాబ్దం పైనే ఐవుంటుంది... కాని మనం ఇంకా బతికున్నాం...''

చైనీయ డాక్టర్ అందుకున్నాడు: ''బహుశా రెఫ్రిజిరేటర్‌లో, ఏర్‌కండిషన్డు గదిలో వుంటున్నట్టు మన మీ గుహలో భద్రంగా వున్నా మేమో!''

''ప్రపంచంలో చాలాచోట్ల ఇలాగే అక్కడక్కడ కొంతమంది యింకా బతికి వుండవచ్చుగదా!'' అని అన్నాను.

జ్యూ సైంటిస్టు తన జర్మన్‌యాసలో ఇలా అన్నాడు: ''లేదు, అసంభవం! మేము అయిదుగురం సాన్‌ఫ్రాంసిస్కో నుంచి ఆ హెలికాప్టర్‌లో బయల్దేరేసరికే - ఆకాశంలో విపరీతమైన మార్పులు వచ్చాయి. మేము పసిఫిక్ దాటిన రెండు గంటలకల్లా చంద్రగోళం భూమి మీదికి పడిపోయింది...మా విమానం బలవంతంగా ఇక్కడ దిగిపోయింది. ప్రస్తుతం ఆసియాఖండపు దక్షిణ ప్రాంతాలు మాత్రం అదీ చాలా కొద్దిపాటిగా మాత్రమే - సురక్షితంగా మిగిలాయి. మిగతావన్నీ చంద్రపాతంతో, పొంగిన పసిఫిక్ మహా సముద్రంలో మునిగిపోయాయి.''

రష్యన్ సమిష్టి వ్యవసాయక్షేత్ర అధ్యక్షుడు కొంచెం వుత్తేజితుడై లేచి నిలబడి ఇలా అన్నాడు: నిద్రలో గడిపింది వంద సంవత్సరాలుగాని... రెండు వందల సంవత్సరాలు గాని మనం ఇకముందు ఏంచెయ్యాలో ఆలోచించాలి!''

చైనీస్ డాక్టర్ దాన్ని బలపరుస్తూ, ''అవును... మానవుడి మొదటి అవసరం తిండి, అది ఇప్పుడు ఎట్లా లభిస్తుందో ఆలోచించాలి'' అన్నాడు.

ఇంగ్లీషు వనిత, ''మనం ప్రయాణం చేసిన హెలికాప్టర్‌గుహవెనక పడివుండాలి. మనం సురక్షితంగా ఉన్నాముా అంటే, అదీ వుండవచ్చని గదా అనుకోవాలి?.... వెళ్ళి చూద్దాం. అందులోకొన్ని...'' అని అంటోంది.

ఆమె చెప్పీ చెప్పకముందే మేమంతా గుహ వెనుక భాగానికి దారితీశాం. దాదాపు రెండుమైళ్లు నడిచాం. ఒక చోట మంచు కొండలా పేరుకుని అప్పుడే కరుగుతోంది...మేం చేతులతోనూ రాళ్ళతోనూ, నాల్గైదు గంటలు సేపు కష్టపడి హెలికాప్టర్ పక్కద్వారాన్ని తియ్యగలిగాం. అమెరికన్‌మెకానిక్ లోపలికి వెళ్ళి డబ్బాల్లో నిల్వవున్న పండ్లూ, మాంసం, ఆయుధాలు, ఇతర పనిముట్లు బయట పడేశాడు. మేం ఓ బండమీద కూర్చుని డబ్బాలు ఊడగొట్టి చూశాం. ఆహారపదార్థాలు ఏమీ చెడలేదు. అప్పుడు తయారు చేసినట్టే వున్నాయి.

రకరకాల జాతులకి - మేమే ఏకైక ప్రతినిధులుగా మిగిలాం- ప్రకృతి విలయం కారణంగా, ఏక కుటుంబమైనాము. విపరీతమైన ఆకలితో భోంచెయ్యసాగాం. అమెరికన్ విమానంలో దొరికిన సిగరెట్లు లైటరు, నిప్పుచేశాడు. ఇంగ్లీషువనిత కాఫీ పెట్టింది. ఘుమఘుమలాడే కాఫీ తాగే సరికి మాకు ఏనుగుబలం వచ్చింది.

సమస్యలు పర్వతాకారందాల్చి నుంచున్నాయి మా ఎదుట. నిర్జీవ ప్రకృతి మా ముందు విశాలమై భోరుమంటూ కన్పిస్తూవుండి. ఈ డబ్బాతిండి సామగ్రితో ఎన్ని రోజులు గడపగలం? ఈ మంచు కరిగేదెప్పుడు? సస్యాలు ఫలించే దెప్పుడు మేము అందాకా బతికేదెట్లాగు?....

నేను ప్రశ్నించాను. ఒక నిమిషం అందరూ ఒకరి మొహాలు ఒకరం చూసుకున్నాం.

రష్యను వ్యవసాయకుడు తన జ్ఞాపకాల్ని నెమరు వేసుకున్నాడు ఐదునిమిషాలసేపు. ఈ లోగా జర్మన్ - యూదీయ శాస్త్రజ్ఞుడు తన జేబులు తడిమి చిన్న దూర దర్శినిని పైకితీసి, దాని సాయంతో ఆకాశం వంక - సూర్యుని వంక చూసి, తన గడియారాన్ని సరిచేసుకుంటున్నాడు.

రష్యన్‌గొంతు సవరించుకొని ఇలా అన్నాడు: ''నేనొకటి మాత్రం నమ్మకంగా చెప్పగలను. రష్యాలో ఒకప్పుడు ఉత్తర ధృవప్రాంతం సస్యాలను పరిశీలించటానికి వెళ్లాను. అక్కడ అప్పుడే ఉధృతమైన చలికాలం గడిచి వసంతం వచ్చింది. బండరాళ్ళమీద మంచు కరిగి పోగానే కొన్నిరకాల కుక్కగొడుగులు - మొలిచాయి. చాలా పెద్దసైజువి! తింటానికి చాలా ఉపయుక్తమని అక్కడ నివసించే ఎస్కిమోలు అన్నారు. నేను స్వయంగా తిన్నాను. వండితే చిలగడదుంపలా వుంటాయి - ప్రస్తుతం మనం అదే స్థితిలో వున్నాం. కనుకకొండమీద మనకు వారంలోగా అలాంటి కుక్కగొడుగులు లభిస్తాయని నా ధృఢవిశ్వాసం, అంతేకాదు, ఎండాకాలం బాగా ముదిరినకొద్దీ ఆ ధృవప్రాంతంలో ఒక రకం తృణధాన్యం మూడు నెలలపంట దానంతటదే - గడ్డిమొలిచినట్టు మొలిచి ఫలిస్తుంది. గింజ రాగులు ఉన్నట్టు ఉంటుంది. అవి కూడా మనకు కొండ మీద కనిపించవచ్చు....

## 6

హెలికాప్టర్‌లోనుంచి బయటపడ్డ సామాన్లలో రెండు పిస్తళ్ళు బోలెడంత మందుగుండు సామగ్రి ఉంది. వాటిని ఏంచెయ్యటం అనే సమస్య వచ్చింది.

అమెరికన్‌మెకానిక్ అన్నాడు - ''వాటిని మనం జాగ్రత్తగా వుంచుదాం. ఆత్మరక్షణకు ఆయుధాలు చాలా అవసరం.''

యూదు శాస్త్రజ్ఞుడు నవ్వాడు, అర్థస్ఫూర్తిగా. '' ఇక్కడ ఉన్నవాళ్ళం ఆరుగురం. మనలో మనకు ఇంత వరకూ ఎట్టి భేదాభిప్రాయాలుగాని రాలేదు. అట్లాంటప్పుడు ఆత్మసంరక్షణ దేన్నించి, ఎందుకు? నా కర్థంకావటలేదు మిత్రమా!'' అన్నాడు.

చైనీస్ డ్యాక్టర్ అందుకున్నాడు. ''మందుగుండు సామగ్రికి, ఆయన నిఘంటువులో అర్థం అంతవరకే

పరిమితమై వుండేది; అందుకాయన ఏం జేస్తాడు? మనం అటువంటి నిఘంటువుల మీద ఆధారపడి- ఎప్పుడు ఎవరివల్ల ఏ ప్రమాదం వస్తుందోనని భయపడుతూ ఆయుధాలతో ఒక భయంకరమైన వాతావరణాన్ని సృష్టించుకుని, సదా ఇతరుల్ని అనుమానిస్తూ, అదే నాగరిక లక్షణ మనుకున్నాం! ఎంత భయానకంగా బ్రతికామో!''

అమెరికన్ తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ఈ మాత్రం సత్యం అతనికి యింతకాలానికి బోధపడుతున్న దేమో!

రష్యన్ మిత్రుడు అమెరికన్ యువకుడి భుజం మీద ప్రేమగాతట్టి, మనుషులు ప్రతిదాన్నీ తమ సౌఖ్యంకోసం, సౌభాగ్యంకోసమే సృష్టించారు ఆదిలో. కాని, రాను రాను స్వార్థం పెచ్చు మీరిపోయింది. కేవలం ఆత్మరక్షణ కోసమే ఏర్పడ్డ ఆయుధాలు. మానవజాతి వినాశానికి దారితీసేయి, మనుష్యులు ఒకరికొకరు - ఏ విషయంలో కానీండి - దేనికి వ్యతిరేకులు ఐనారో, ఔతారో నాకర్థంకాదు. మానవుడు ప్రతి ఇతరుడి సహకారంతో మాత్రమే జీవించగలగ డమనేది లక్షల సంవత్సరాల జీవకోటి పరిణామచరిత్ర నిరూపించింది. ప్రతిదీ కృషితోనాని లభించదుగదా? అటువంటప్పుడే వైరుధ్యం ప్రబలింది. చాకిరీ చెయ్యలేక చేయించుకునే వారు సుఖాల్ని గుత్తకొనటంతో, చాకిరిచేసేవార్ని బానిసల్ని చేయటం అవసరం అయింది. యజమానులు బానిసలకు లోలోపల భయపడుతూ, మానవశక్తికి సాధ్యంకాని ఆయుధాలతో జాతులకు జాతులను బానిసత్వంలోవుంచి, సుఖించసాగారు, మనం... తీవ్రంగా ఆలోచిస్తే నిరంతరం సాగుతూవచ్చిన ఈ సంఘర్షణవల్ల నిర్మింపబడిన యీ నాగరికతా, ఆ పేరుతో చలామణి అయ్యే చరిత్ర, యివి యావత్తూ నిరంతర యుద్ధాలతో, మానవత్వానికి కట్టిన సమాధులుగా మారిపోయింది. దాన్నించి ఇతరుడ్ని తనతోపాటేగౌరవించి, వారి కష్టాన్ని గౌరవించి; ప్రకృతి సర్వసమానంగా ఇచ్చేఫలాలను అందరం సమానంగానూ అనుభవించాలి అని! అన్నాడు సహజంగా.

అమెరికన్ నవ్వుతూ ''నిజమే'' అన్నాడు.

నేను జిజ్ఞాసతో వింటున్నాను. ఇంగ్లీషు రచయిత్రి ప్రశాంతంగా గమనిస్తున్నది.

'' ఇప్పుడేం చేయాలి ఆ మందుగుండు సామగ్రిని?'' అన్నాడు అమెరికన్ తుదకు.

రష్యన్ ప్రశాంతంగా నవ్వుతూ ''మనం ఈ గాలీ వెల్తురూ లేని గుహలో నివశించలేం. వేరేయిల్లు కట్టుకోవాలి, దానికి రాళ్ళు కావాలికదా? ఈ కొండని ఒకపక్క ఆ మందు పెట్టి పగలగొడదాం. ఆ రాళ్ళు, బంకమన్ను పెట్టి ఇళ్ళు కడదాం'' అన్నాడు తన నిర్మాణాత్మక ధోరణిని చక్కగా వ్యక్తపరచి, అంతా ఆమోదించాం.

# 7

వారం రోజులకల్లా రష్యన్ వ్యవసాయకుడు ఊహించినట్టే కొండమీద కుక్కగొడుగులు విపరీతంగా మొలిచినాయి. ఉపయోగించే ముందు చైనీస్ డాక్టరు వాటిని పరీక్షించి, తినటానికి పనికివస్తాయని తేల్చాడు. కాని వాటిని వుడకేసుకుని తినటానికి చాలా ముఖ్యమైన వస్తువు ఒకటిలేదు. ఉప్పు! ఉప్పు లేందే ఎలా!

కొండల దిగువన అనేక ధాతువులుంటాయని శాస్త్ర కారులు లోగడ చెప్పారు. అటువంటి ధాతువులలో ఉప్పు కూడా ఒకటి కదా?....

అంతా తలా ఒక మూలకెళ్ళి పరిశీలించసాగాం. భూమి ఈ ప్రళయంలో విపరీత వేగంతో పరిభ్రమిస్తుండగా రకరకాల ధాతువులు బయటపడినాయి. అట్లాంటి వాటిల్లో వుప్పు ఒకటి. అది బ్రహ్మాండమైన బండలుగా పడివున్నది. మేం కావలసినంత తెచ్చుకున్నాం.

భోజనాలయినాక ప్రతి రోజూ అనేక సమస్యలు గురించి చర్చించే వాళ్ళం.

రష్యన్ ఒకసారి అన్నాడు. ' ఈ భారతదేశం ఇతరులకి ఎన్నో వెలుగుబాటల్ని చూపించింది. మహామహులైన వారు ఎందరో ఇక్కడ జన్మించారు. మానవుడు అధోగతికి పోతూవుంటే వాళ్ళు నిజంగా మానవత్వం అంటే ఏమిటో ప్రపంచానికి విప్పి చెప్పారు...'

నేను అందుకున్నాను. ''కాని ఆ కాలంలో ఎవరు విన్నారు? భారతదేశంలో ఎవరూ ఆ మాట వినిపించుకోలేదు. ఆ మహనీయులు చెప్పిన ప్రతి శాశ్వత సత్యానికి కళ్ళు మూసుకున్నారు. గౌతముడు, గాంధి- వీళ్ళు ఫోటోలలో మాత్రం మిగిలిపోయారు. వాళ్ళ ఉపదేశాలు లైబ్రరీలలో భద్రపరచబడ్డాయి...''

చైనీయ డాక్టర్ అందుకని ఇలా అన్నాడు: ''అప్పటి పరిస్థితులు అట్లాంటివి. స్వార్థపరులు సృష్టించి విడిచిన వర్గ సంఘర్షణలు, రంగు సమస్యల బలం ఎక్కువయింది. ఇతర ఏ నీతికీ విలువలేని వాతావరణం అంతటా ఆవరించింది. ఇక మనం ఆ సూత్రాన్ని అమలుపరుస్తూ ఓ కొత్త లోకాన్ని సృష్టిద్దాం!''

ఇంగ్లీషు రచయిత్రి కొంచెం జాలిగా అన్నది; '' ఈ శుభ సమయంలో మనం, మన పూర్వుల్ని ఒక్కసారి తల్చుకుందాం. వాళ్ళు కష్టపడి నిర్మించిన సంస్కృతులకూ నాగరికతకూ చిహ్నాలుగా మిగిలిన మనం, వారు సంకుచిత స్వార్థాలతోను అర్థరహిత ఆవేశాలతోను కల్పించిన యుద్ధాల్నీ, మానవహత్యాకాండల్నీ విస్మరించుదాం? భావిసంతతులకూ, అలాంటి, ప్రేరణలను కలగనీయకుండా ఉన్నత మానవత్వాన్ని నేర్పుదాం; భవిష్యత్తు ఆశాజనకమై భూలోకాన్నొక స్వర్గధామం చేయగలమని

విశ్వసిద్దాం. మనుష్యులు తమ్ముతాము నమ్మలేని పరిస్థితులు ఏర్పడి, గంధకం పొటాషు, అణువు మొదలైన వాటిని వినాశకర శక్తులుగా ఉపయోగించే దౌర్భాగ్యస్థితినుండి తప్పించుదాం. మనముందు అనంత విశాలమైన ప్రకృతి పచ్చగా కనుల పండువుగా కనిపిస్తోంది. అపారమైన ఖనిజసంపద లభ్యమౌతున్నది. నదులు తియ్యని అమృతంలాంటి జలాలను అందిస్తున్నాయి. వాటిని మనం నిష్కల్మషమైన మనస్సుతో వినియోగించుకొందాం. జీవితం అంటే సంఘర్షణకాదని;.... జీవితం అంటే 'పొట్టతిప్పలు' మాత్రమే కాదని; జీవితం అంటే ప్రతి ఒకరి సహకారంతో అందరూ ఆనందంగా జీవించటం అనీ, మరణం తథ్యమైనా, దాన్ని బలవంతంగా తెచ్చుకోవటం కాదనీ, మనం మన భవిష్యత్ సంతతుల వారికి చెబుదాం'' అన్నది. ఆనంద పారవశ్యంవల్ల ఆమె నయనాలు అశ్రుపూరితాలైనాయి. నాటి నానాదేశసమితి ప్రతినిధులుగా మిగిలిన మా ఆరుగురికళ్ళూ చెమ్మగిల్లాయి.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# అదృష్టహీనుడు

రైలు నెమ్మదిగా నడుస్తోంది. హైద్రాబాద్ నుంచి, విజయవాడ వెళ్తోందా ఎక్స్‌ప్రెస్ బండి, వాతావరణం భీకరంగా వుండడంవల్ల రైలు నిదానంగా పోతోంది.

గాలి విసురుగా వీస్తోంది, వర్షం ఎడతెరిపిలేకుండా భయానకంగా కురుస్తూ ఉంది. చాలాచోట్ల పట్టాలమీదుగా ప్రవహిస్తోంది వర్షపు నీరు.

ఎక్స్‌ప్రెస్‌లో జనం కిటకిటలాడుతున్నారు. రాత్రి పదకొండు గంటలవుతుంది. అంతా కటిక చీకటి. సగానికి పైగా ప్రయాణీకులు అప్పటికే నిద్రలో పడ్డారు. పిల్లాజల్లా గప్‌చిప్‌గా సుషుప్తిలో ఉన్నారు.

కొందరు మొండిఘటాలు మాత్రం, చలినీ గాలినీ వర్షాన్నీ లెక్క చెయ్యకుండా, కిటికీల దగ్గిర కూర్చుని బైటి భీభత్సాన్ని చూస్తున్నారు. రైలుబండిలోని దీపాల వెలుగులో అద్దాల కిటికీమీద పడే చినుకుల ఉధృతాన్ని చూస్తూ కూర్చున్నాడు మూడవతరగతి ప్రయాణీకుడు సత్యనారాయణ. అతనూ కిటికీ దగ్గరగా కూర్చుని గాఢమైన ఆలోచనలో పడివున్నాడు.

అతని బాహ్యనేత్రాలు ప్రకృతి విలయాన్ని చూస్తున్నాయిగాని, మనస్సుమాత్రం అంతకంటే తీవ్రమైన సంక్షభంలో పడి అల్లాడుతోంది. సత్యనారాయణ వుద్యోగంకోసం హైద్రాబాద్ వచ్చాడు సంవత్సరంక్రితం భార్యా పిల్లలతో సహా. తాత్కాలికంగా ఓ ఉద్యోగం దొరికింది కూడానూ.

హైద్రాబాద్ నగరంలో అరవై రూపాయిల ఆదాయంతో, ఈ సంవత్సరం కాలం గడిపాడు. భార్య రోజూ ఏదో లేదనే పాట పాడుతూనే వుందిగాని, సత్యం, ఏమీ లేని నిరామయావస్థకంటే 60 రూపాయలన్నా వస్తున్నాయనే ఆశతో కులాసాగానే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

అతనికి ఎలాగో బతకాలనేది తప్ప మరో ఆశయం లేదంటే అది అసహజం కాదు. చాలామందికి మల్లెనే అతనికీ భార్యన్నా పిల్లలన్నా అపరిమితమైన ప్రేమ.

అతని భార్య సావిత్రి చామనచాయగా బక్కపీచుగా వుండి, అతనికి అనుకూలంగా వుంటుంది. వాళ్ళ ఇద్దరు మొగపిల్లలూ ఇంకా చిన్న వాళ్ళు; పెద్దాడికి ఐదేళ్ళు; చిన్నాడికి సంవత్సరం, పిల్లలు సత్యం పోలికగా, ఎర్రగా బొద్దుగా వుంటారు. ఇదొక ప్రత్యేక కారణం, సత్యం, వాళ్ళంటే పంచప్రాణాలుగా ఉండడానికి.

ఆ మూడవతరగతి పెట్టె జనసమర్దంతో నిండి కిటకిటలాడుతోంది. విజయవాడ వెళ్ళేవాళ్ళు 60 మందికి పైగా వున్నారందులో, కొంతసేపటిక్రితం వరకూ మెలుకువుగా వున్న పది పన్నెండుమంది కూడా ఇప్పుడు కూర్చున్న పాళంగా జోగుతున్నారు.

సత్యం కిటికీనుంచి దృష్టి మరల్చి లోపలికి చూశాడు. ఎదురుగా వున్న సీటులోనే సావిత్రి కూర్చుని నిద్రపోతోంది. ఆమె ఒడిలో పడి నిద్రపోతున్నారు పిల్లలిద్దరూ.

అదే వరసలో ఇంకా చాలామంది కూర్చునే నిద్ర పోతున్నారు. కారేజిలోని దీపాలు అట్టేప్రకాశంగా వెలగడం లేదు. పై చెక్కలమీదుగూడా ప్రయాణీకులు పడుకుని ముసుగు లెట్టుకుని నిద్రపోతున్నారు.

సత్యనారాయణకెదురుగా కూర్చుని వున్న లావాటాయన మాత్రమే మేల్కొనివుండి దూరంగా బైట జరుగుతున్న ప్రకృతి కోలాహలాన్ని అతి శ్రద్ధగా పరికిస్తున్నాడు. ఆయన దుస్తుల్ని బట్టి ఆయన నైజాం నివాసి అని తేలిగ్గా తెలుస్తోంది.

సత్యం, జేబులోనుంచి ఓ బీడీతీసి వెలిగించాడు. అతనికి మౌనం భరించడం రానురాను కష్టంగా ఉంది.

ఆ క్షణాన రైలు చేసే చప్పుడూ, ఉరుముల ధ్వనీ, వానగాలి విసురుతప్ప మిగతా రైలు అంతటా నిశ్శబ్దంగానే ఉంది.

సత్యం, తిరిగి ఆలోచనలో పడ్డాడు.

ఎలాగో తొమ్మిది పదినెలలపాటు నెమ్మదిగా కాలం గడుపుకొన్న అతనికి, వారంకిందట ఉద్యోగంనుంచి విరమించమని 'ఆర్డర్' జారీ అయింది. ఆ కంపెనీ మేనేజరు, తనకింద జీతగాళ్ళందరికి ఆర్డర్ జారీచేశాడు. తలా ఐదువందల రుపాయల డిపాజిట్లు కట్టాలని, కట్టలేని వాళ్ళని విరమించుకోమని. సత్యం నోరుమూసుకుని విరమించుకోవాల్సి వచ్చింది. అతని దగ్గర అంత మొత్తం ఎక్కడిదీ?

భార్య తరపువారుగూడా బీదవారే కావడంవల్ల అటునుంచి సానుభూతి ప్రకటనలు తప్ప మరో ప్రయోజనం ఆశించడానికి వీల్లేక పోయింది.

సత్యం తనకా నెల రావల్సిన జీతం బాకీ తీసుకుని విజయవాడ ప్రయాణమైనాడు... తిరిగి నిరుద్యోగం, పస్తులూ, అప్పులూ! సత్యానికి, రైలుబైట గాడాంధకారంలాగా తోచింది తన భవిష్యత్తు... అతని మనస్సు విరిగిపోయింది. ఏ ఆశా లేకుండా, నీరసంగా బతకడం ఎంత దుర్భరం!

సత్యం, ఈ ఆలోచనల్ని భరించలేకపోతున్నాడు.

# 2

సత్యం ఇలా ఆలోచనల్లో వుండగానే అతని కెదురుగా కూర్చునివున్న షావుకారు మెల్లగా ప్రారంభించాడు. ఇలాంటి సంభాషణలు 'వాతావరణం' గురించి ఆరంభించే మామూలు గనుక ఆయన, '' ఏమిటండీ ఈ వర్షాలు, నేనెరగను ఈ ముప్పై ఏళ్ళుగా!'' అన్నాడు, సత్యాన్నుద్దేశించి.

సత్యం, కొంచెం 'రిలీఫ్' దొరికినందుకు సంతోషిస్తూ, ''నిజమేనండీ''! ఏదో విలయం వచ్చినమాదిరి వుంది - ఈ వానా, ఈగాలి, ఏమిటో?'' అన్నాడు.

షావుకారు. ''మీ దేవూరు పంతులుగారూ?'' అన్నాడు చాలా సహజంగా, రైల్వే సంభాషణల్లో పరస్పర కుశల ప్రశ్నలు సహజం.

సత్యం ''విజయవాడ దగ్గర రామవరప్పాడు'' అని సమాధానం చెప్పి, ''మీరు ఎందాకా?'' అని తిరిగి ప్రశ్నించాడు.

షావుకారుగారు, తనపక్కనే అతి జాగ్రత్తగా వుంచుకుని కావలించుకునివున్న చిన్న తోలుపెట్టె మరీ దగ్గిరకి లాక్కుంటూ, ''బెజవాడదాకా వెళ్తున్నానండీ! వెధవరైలు నడవదేం? పేరేమో ఎక్సుప్రెస్సూ!'' అని విసుక్కున్నాడు.

సత్యం ఆయన పక్కనేవున్న తోలుపెట్టెవేపు చూశాడు. అంత ప్రేమగా దాన్ని కావలించుకుంటున్నాడంటే అది డబ్బున్న పెట్టె అయివుండాలి. డబ్బుకంటే ప్రేమాస్పదమైన వస్తువేం వుంది ఈనాడు మనిషికి? పెళ్ళాం బిడ్డలూ, అన్నదమ్ములూ అన్నీ డబ్బుతరువాతే... డబ్బు ప్రధానం. డబ్బును ఎంత జాగ్రత్తగానైనా కాపాడటం అవసరం. అతనీ ఆలోచనకు స్వస్తిచెప్పి ''ఎలా పోతుంది లెండి ఒక పక్క వానా, గాలీనూ? ఏదైనా ప్రమాదం సంభవిస్తే? అందుకని...'' అని ఆపేశాడు.

షావుకారు ఒకసారి ఆవులించి రెండు చిటికలేసి ''ప్రమాదం!'' అని అన్నాడు కొంచెం గట్టిగా వత్తి.

''నేను ఊరికే అన్నానులెండి? ప్రమాదాలు జరుగుతయ్యా! రైల్వేవారు ఎంతో జాగ్రత్తగా వుంటారుకదా...'' అన్నాడు సత్యం. తనవంటి దురదృష్టవంతుడు ప్రయాణం చేస్తున్న బండి సర్వజాగ్రత్తగా తన లక్ష్యాన్ని చేరుకుంటుంది. తనింకా ఎంతోకాలం బతికుండి ఎన్నో బాధలు అనుభవించాల్సి వుందాయెను, అని అతని ఊహ. అతనికే నవ్వొచ్చింది ఈ ఆలోచనకి.

షావుకారు తిరిగి మౌనంలో పడ్డాడు - ఆయనకేం ఆలోచనలో!

సత్యం, భార్యవంకా, పిల్లలవంకా చూశాడు వాత్సల్యంతో. పిల్లలు నిర్మలంగా ఏ ఆలోచనా లేకుండా సంతోషంగా నిద్రిస్తున్నారు. తూలుతూవున్న భార్య మొహంలో ఏమిటేమిటో ఆలోచనల రేఖలు అగుపిస్తున్నాయి. ఆమె తనను పెళ్ళాడాక ఇంతవరకు ఏనాడూ సుఖం అనుభవించ లేదు... ఎప్పుడూ ఏదో లోటుతో, సంసారజీవితం నరకంగా తయారయిందామెకి. తనకూ అంతే... కాని...

అప్పటికా ఆలోచన మానేసి సత్యం, సావిత్రి ఒడిల్లో మెదుల్తున్న చిన్న కుర్రాణ్ణి చూశాడు. సావిత్రికూడా కుర్రాడు లేచేసరికి మేల్కొంది. ఆమె భర్తవంక చూసి, ''మీరు ఒక్క కునుకైనా తియ్యలేదండీ?'' అని అడిగింది.

''లేదు, నిద్రపట్టలేదే... ఈ గోలకి'' అన్నాడు బైటికి చూస్తూ.

'' ఇంకా తగ్గలేదూ వాన?'' అంటూ, కుర్రాడికి పాలిస్తోంది సావిత్రి. కుర్రాడు పాలు త్రాగి, తండ్రివైపు తిరిగి, నవ్వాడు అమాయకంగా.

''వాణ్ణలాతే చూడు వాడు, ఎలా ఎగబడి పోతున్నాడో'' అన్నాడు సత్యం చిరునవ్వు నవ్వుతూ.

షావుకారు, దీన్నంతా గమనిస్తూ కూర్చున్నాడు.

సత్యం పిల్లాడ్ని అందుకుని ఆ బుగ్గా ఈ బుగ్గా ముద్దాడి, ''వెధవ వీడైనా పెద్ద ఉద్యోగం చెయ్యాలి... చేస్తావా నాన్నా?'' అని ప్రశ్నించాడు కుర్రాణ్ణి.

కుర్రాడు నిద్రమగతగావున్నా నవ్వాడు.

కుర్రాణ్ణి, తిరిగి భార్యచేతికిస్తూ, ''నిద్ర వస్తోంది వెధవకి, నిద్రపుచ్చు'' అన్నాడు. సావిత్రి తిరిగి, కుర్రాణ్ణి ఒడిలో హత్తుకుంది. రెండు నిమిషాలకల్లా ఆమెకూడా మగతనిద్రలో పడిపోయింది.

సత్యం, ప్రేమగా పిల్లవంక చూస్తూ కూర్చున్నాడు, ఏమీ ఆలోచించలేని స్థితిలో.

## 3

బండి, మెల్లగానే పోతూవుంది. దడదడ మోగే రైలుశబ్దమూ, ఇప్పుడు మరీ ఉధృతమైన వాన చప్పుడూ రైలునంతా ఆవరించి భయపెడుతున్నాయి.

ఇదివరదాకా కూర్చున్న షావుకారు జేబునించి ఓ చిన్న కాయితం మడతతీసి సత్యం చేతికిచ్చి ''ఇది కాస్త చదువుతారా పంతులుగారూ! ఏదో ఇంగ్లీషులో రాశాడు, నా కర్థమైచావలే'' అన్నాడు.

సత్యం, ఆ కాగితం అందుకుని, చదివాడు లోలోపల. దాని సారాంశము, తనకు రావాల్సిన రెండువేలూ వెంటనే తెచ్చి ఇవ్వాలనీ, లేనిచో తనకు చాలా ఇబ్బందనీ, ఇంకా ఏవో వ్యాపారపు గొడవలుగూడా వున్నాయి అందులో

ఇదంతా విప్పిచెప్పాడు సత్యం.

షావుకారు, తిరిగి తనకాగితం జేబులో పెట్టుకుని, '' ఏం వ్యాపారాలండీ పంతులుగారూ! యుద్ధం

అయిపోయినాక రోజురోజుకీ ధరలు తగ్గిపోతున్నాయి. డబ్బుకి మా కటకటగా వుంది. ఈ రెండు వేలూ ఇయ్యాల పోగుచేసుకొచ్చేవరకు ప్రాణం అల్లాడి పోయిందనుకోండి'' అన్నాడు. అనేశాక ఏదో తప్పుచేసినట్టు మొహంపెట్టి భయంగా, తన తోలుపెట్టె ఇంకా దగ్గిరికి లాక్కున్నాడు.

సత్యం ఇది గమనించాడు. షావుకారుగార్కి భయం గాబోలు... ఆ పెట్టె యెవడైనా కాజేస్తాడని ... నవ్వాడతను. తనకు కూడా అందులో డబ్బుందని అనుమానమేగాని, నిజం తెలియదుగదా?.... సత్యం... ఏమిటో ఆలోచిస్తున్నాడు. అనుకోవటం తడవుగా ఈ షావుకారు రెండువేలు ఏ బాధో పడి పోగు చెయ్యగలిగాడు. తను? ఐదొందలు దొరుకుతాయని కల్లోనైనా అనుకోడానికి వీల్లేకపోవడం వల్ల కాదూ, ఉద్యోగానికి తిలోదకాలిచ్చి ఇలా బైరాగల్లే తిరుగు ముఖం పట్టాడు

సత్యం ఒక్కసారి ఎగిరిపడ్డాడు. తలుపు దగ్గిరగా వుండటం వల్ల చప్పున తలుపు పట్టుకున్నాడు.

బండంతా కదిలిపోతున్నది. అదే క్షణాన ఆ రైలులో ప్రయాణిస్తున్న వందలాది జనం ఉలిక్కిపడి మేల్కొన్నారు. భీకరమైన దారుణమైన మోత వినిపించింది. చెట్లు విరిగి పడిపోతున్నట్లుగా, రైళ్ల ఢీకొన్నట్లుగా, సముద్రాల్లో వాయుగుండా లేర్పడ్డట్లుగా.... అంతా రెండు మూడు నిమిషాలే....

భీకరమైన మెరుపుల క్షణికమైన కాంతిలో సత్యం ఆ మూడవ తరగతి పెట్టెనుండి విసురుగావెళ్లి నదిలో పడ్డాడు.. అంతక్రితం క్షణమే. అతని మీదికి విరుచుకుబడ్డ షావుకారు కళేబరం అతనికి దిగ్భ్రాంతి కలిగించింది. అతని చేతికి దొరికిన కళేబరం అతనికి దిగ్భ్రాంతి కలిగించింది. అతనే చేతికి దొరికిన దేన్నో బలంగా పట్టుకున్నాడు. అయితే ఏం, అతను పట్టు తప్పిన వాడల్లే, ప్రళయ వేగంలో సుడులు తిరిగి ప్రవహిస్తున్న నదీ గర్భంలోకి పడిపోయాడు... అతనే కాదు !

విజయవాడ వెళ్తున్న ఆ మొత్తంబండి, వంతెన కూలిపోవటంతో, ఒక్కసారే భయంకరంగా మోతపెడుతూ పెట్టెలన్నీ ఒకదాన్తో ఒకటి ఢీకొని, నదిలోకి కూరుకుపోయినాయి.

మరునిమిషం, అక్కడ తుఫానుగాలి, ప్రళయ ఘోష, ఉధృతమయిన వాన, ఎడతెరిపి లేని చప్పుడూ, గుఁయ్‌మని, కొనవూపిరి వున్న వాళ్ళను సయితం చంపేగాఢాంధకారం మిగిలిపోయినాయి. నది కిరువైపులా చెట్లు విషాదంతో తల లూపుతూ, ఈ ప్రమాదానికి సాక్షీభూతాలై నిలిచాయి.

## 4

కోడి కూసేవేళ ఆ విరిగిపోయిన వంతెన దగ్గిరికి సహాయదళాలు వచ్చాయి. నది ఇంకా ఉధృతంగా ప్రళయంగా ప్రవహిస్తోంది కట్టల కెగబడి. వాన నీరు, నదీ ప్రవాహం ఏకమై అంతా సముద్రంలా వుంది.

చెట్ల చివరలు కనిపిస్తున్నాయి నదిమధ్యన.

ఇంకా దారుణమైన చీకటి ఆవరించేవుంది. తూర్పున ఎక్కడో సూర్యోదయపు తొలికాంతి కన్పిస్తోంది.

ఇంతవానలోనూ, నదీప్రవాహపు జలజల శబ్దంలోనూ, అక్కడక్కడ మానవ కంఠాల మూలుగులూ, పసిపిల్లల ఏడుపులూ విన్పిస్తున్నాయి.

సహాయకదళం వెంటనే పనికుపక్రమించారు.

శవాలు వొడ్డుకి చేరుతున్నాయి. అన్ని శవాల్ని వరసగా పేరుస్తున్నారు. నీళ్ళుతాగి ఉబ్బిపోయి, గుడ్డలు లేకుండా, రంగు మారిపోయి పచ్చగా, నీలంగా ఉన్నాయి శవాలు. ఆడ మొగ భేదంలేదు.

రైలు పెట్టెలు ఏమైనాయో అంతులేదు.

తెల్లవారుతోంది. సత్యం, పైనుంచి మెల్లగా దేకుతూ నడిచివస్తున్నాడు. అతనికి జరిగిందేమిటో ఇందాకటినుంచీ కొద్దికొద్దిగా అర్థమౌతోంది.

'రైలు అంతా పడిపోయిందా? తనొక్కడేనా, ఇంకా చాలమందా? - సావిత్రీ పిల్లలూ ఏమైనారు? ఆ షావుకారు ఏమైవుంటాడు? సత్యానికి చలితో ఒళ్ళు కొంకర్లుపోయినట్లే భయంతో మనస్సుకూడా గడ్డకట్టుకు పోయింది. సత్యం నీళ్ళల్లోపడి కొట్టుకుపోతూ, ఈత వచ్చి వుండడంవల్ల ఒడ్డుకు చేరుకుని మెల్లిగా కుంటుతూ కుంటుతూ ప్రమాదస్థలానికి చేరుకున్నాడు.

సహాయకదళం వారిలో ఇద్దరు పోలీసులు అతన్ని రెక్కపట్టుకుని తీసుకొచ్చారు, తాత్కాలికంగా వేయబడిన ఒకడేరాలోకి. కాని సత్యం నిలవడు...

అతని మనసు ఒక్కసారి భ్రమలోంచి మేల్కొంది. అతను పట్టుకొచ్చిన తోలుసంచిని విసిరిపుచ్చుకుని డేరాలోకి పారేసి బైటికి పరిగెత్తాడు.

తెల్లారిపోయింది బాగా. భీకరమైన, చీకట్లు వెలిసి పోయినాయి. అక్కడి భీభత్సం ఇప్పుడు బాగా దృగ్గోచర మౌతోంది. సత్యం ''సావిత్రీ! సావిత్రీ!'' అని పెద్దగా అరుస్తూ శవాల్ని పేర్చిన చోట, వాటిమట్టూ పరిగెత్తుతున్నాడు. సహాయకదళంవారూ, రైలు ప్రమాదంలో పడి బతికిన కొందరూ అతన్ని జాలిగాచూస్తూ వెంబడించారు.

అన్నీ పీనుగులు, రైలుపెట్టె లేమైనాయో అంతు లేదు. కొన్ని చెక్కలు మాత్రం ఒడ్డుకు వచ్చాయి, ఇంజనూ, ఒక కారేజి ఒంతెన ఈవల మిగిలి నిల్చున్నాయి మొగుడు పోయిన స్త్రీలాగా. సత్యం ఒక్క నిమిషం ఆగి ఆలోచించాడు. ఈ శవాల్లో తన భార్యా పిల్లలు లేరు. వాళ్లు బతికి వుండగూడదా? ఆశ!

తిరిగి చిగిర్చిన ఆశతో, ఆ స్మశాన వాటికలో అతను సహాయకులలో ఒకణ్ణే అడిగాడు.

''ఇంకెవరైనా ప్రమాదంనుంచి బతికారండీ?'' అని.

అతను సత్యాన్ని ఓదారుస్తూ ''మేము వచ్చి కూడా అంతా రెండుమూడు గంటలే - పదండి, వెతుకుతున్నాంగదా? అసలు మీ కథ ఏమిటో చెప్పండి!'' అని అడిగాడు.

సత్యం తన సంగతంతా చెప్పాడు. కాని. షావుకారు చేతిలోని తోలుపెట్టెను తనా చివరినిమిషంలో డబ్బుకోసం పట్టుకొని నదిలో పడిపోవడం మాత్రం చెప్పలేదు.

''పాపం! వెతుకుదాం పదండి - మీరు కూచున్న పెట్టెమొత్తం అలాగేనదిలో పడిపోయి వుండాలి.''

ఇప్పుడా పరిసరమంతా ప్రమాదంనుంచి బతికి బైట పడ్డవారు తమ తమ బంధువులకోసం ఏడుస్తున్న ఏడ్పులతో, గాయాలు తగిలిన వారి మూలుగులతో, నదీజలపు ఘోషతో, దారుణంగా వుంది.

సహాయకులిద్దరూ, సత్యం ఆ ప్రదేశాన్నంతా వెతుకుతున్నారు. కొందరు నీళ్ళల్లోంచి కొత్త కొత్త శవాలను లాగి బైట పడేస్తూనే ఉన్నారు.

సత్యం వొడ్డుమీద అటూ ఇటూ పరిగెత్తే వాడల్లా ఒక పెద్ద చెట్టు మొదట్లో సగం నీటిలోనూ సగం నేలమీద పడివున్న ఒక స్త్రీ శవాన్ని గుర్తించి అరిచాడు; ఒకటి రెండు నిమిషాలు స్తంభించి పోయాడు.

బాగా మరుగ్గా పొదల్లావుండే ప్రదేశంలో పడివుందా శవం. సత్యం బురదలోకి దిగి, శవాన్ని సమీపించాడు.

అతడొక వెర్రికేక వేశాడు. సావిత్రే ఆ శవం! ఆమె వొడిలో చిన్నపిల్లాడు సురక్షితంగా వున్నాడు. కదులుతున్నాడు గాని, చలితోటి వొణికిపోతున్నాడు. సత్యంతో పాటు వచ్చిన సహాయకులిద్దరూ సావిత్రి శవాన్ని బైటికి తీసుకొచ్చారు. కుర్రవాణ్ణి సత్యం ఒడ్డుకు తెచ్చాడు. అతను ఇప్పుడు తేటగా అగుపించడం లేదు. అతని మొహం వివర్ణంగా వుంది. గాలిలో తేల్తున్నట్లు నడుస్తున్నాడు.

అతని వికలమైన మనస్సులో తోలుసంచీ, అందులోని డబ్బూ సావిత్రి వికృతమైన శవం. కనుపడని పెద్ద కుర్రాడూ, అన్నీ ఒక్కసారే కనిపిస్తున్నాయి...

సత్యంలో ప్రతి నిమిషమూ, ఒక ఉద్వేగమూ, ఆవేదనా తుపానులా పెరిగిపోతున్నాయి. తనది కాని పెద్దమొత్తం డబ్బు ఈ నిమిషాన తనదే ఐపోయింది. కాని తన ప్రేమాస్పదమైన భార్యా పిల్లలు ... దూరమై ఛిన్నా భిన్నమైపోయారు. చిన్న పిల్లాడు కూడా ఈ చలిలో వానలో ఎంతసేపో బతకడు.. సత్యం, కురుస్తున్న జడివానమంచి, డేరాలోకి పరిగెత్తాడు. అతనిలో తీవ్రమైన ఏదో సంఘర్షణ పెరిగిపోతోంది....

అతన్ని సహాయక దళంవారు పట్టుకుని కూర్చోబెట్టారు. అందులో ఒకతను ఇంకో అతనితో, సత్యాన్ని చూపిస్తూ, ''ఈయన అదృష్టవంతుడేనోయ్! పిల్లవాడేనా దక్కాడు... అంటున్నాడు.

సత్యం, డేరా మూలన పడుకోబెట్టి కొనవూపిరితోటి మెదుల్తోన్న కుర్రాణ్ణి, ఆ పక్కనే వున్న తోలు సంచిని కేంద్రీకరించి ఒక్క చూపు చూస్తూ, నిమిషం పాటు నిలబడ్డాడు. సావిత్రీ - డబ్బూ, అతని మనస్సును రెండు వేపులా గుంజుతున్నాయి. నది ఒడ్డున దిక్కులేక పడివున్న శవాలూ, ముక్కలైన చేతులూ కాళ్ళూ, అన్నీ అతన్ని చుట్టూ తిరిగి చప్పట్లు చరుస్తున్నట్టుగా వుంది.

అతని మతి భ్రమించింది.

అతను పెద్దగా ''సావిత్రీ!'' అని అరుస్తూ, డేరాబైటికి పరిగెత్తాడు, సహాయకులు వెంటపడ్డా విదిలించుకుని.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# క్షణంలో సగం

ఒక దేశంలో పరపతి తిరపతి అని ఇద్దరు వేలువిడిచిన సోదరులుండేవారు. వాళ్ళిద్దరూ అఖండులే. తిరపతి గారు విద్యా విజ్ఞానాలలో ప్రవీణుడైతే పరపతిగారు సిరిసంపదలతో తుల తూగుతుండేవారు. తిరపతిగారికి ధనం మాన్యం, పరపతిగారు వేలిముద్రబాపతు. రాజకీయాలంటే వీశ ఎంత? అని అడిగే రకం.

వీళ్ళిద్దరూ ఒకరి పొత్తు ఒకరికి గిట్టకుండా చాలా కాలం అతికారు. అయితే పరపతిగారికి కొంతకాలానికి ఎట్లా ఎక్కిందో గాని కీర్తి వ్యామోహం అపారంగా ఎక్కిపోయింది. దాంతో అతనికి రాత్రుళ్ళు నిద్రపట్టలేదు. అన్నం సయించ లేదు. కీర్తి సంపాయించడానికి అడ్డమైన సలహాలు చెప్పే వాళ్లు ఆయన చుట్టూ మూగారు.

అయితే పరపతిగారికి తిరపతిగారు జ్ఞాపకం వొచ్చి ఒకనాడు ఉన్నట్టుండి, తిరపతిగారికి ఎక్కడలేని కీర్తి ఇట్టే వచ్చి ఒళ్ళో పడిపోతోందేమిటా అని ఒకటే ఆశ్చర్య పడ్డాడు తమ్ముడు తిరపతిగారు. ఆ రాత్రే తన సొంతకారెక్కి ఊరిచివర కప్పులేని కొంపలో కూటికి మాడుతూ కాపురం చేస్తున్న తిరపతి ఇంటికి వెళ్ళాడు ఆయన.

పోతూనే ''ఏం అన్నయ్యా? బొత్తిగా మన యింటికి రావటమే లేదేం?'' అని కుశలప్రశ్న వేసి, కొంత సంభాషణ అయినాక తన కాంక్షను చాలా డొంక తిరుగుడుగా బైటపెట్టాడు.

అన్నయ్య తిరపతిగారు ఆలోచనచేసి జుట్టు రెండు మూడుసార్లు పీక్కుని చివరికి ''తమ్ముడూ నువ్వు కొంత కాలం ''ప్రజాసేవ'' చెయ్యాలోయ్. తర్వాత కీర్తి దానంతట అదే వస్తుంది'' అన్నాడు నిదానంగా.

పరపతిగారు మొహం చిట్లించి, ''ప్రజాసేవ'' అంటే అన్నయ్యా! డబ్బుతోకూడిన మాటగదా ఎలాగ!'' అని దిగులు ప్రకటించాడు.

''నీ కా దిగులక్కర్లేదోయ్ తమ్ముడు! నువ్వు డబ్బెట్టి వ్యాపారం చెయ్యడంలేదు? రూపాయికి పావలా చూసుకుని లక్షలార్జించావు. అలాంటిదే ''ప్రజాసేవ'' కూడాను. కొంత పెట్టుబడి పెట్టి ఈ 'వ్యాపారం' మొదలెట్టిచేశావూ అంటే నీ రూపాయి రెండు రూపాయలై తిరిగి వస్తుంది. పైపెచ్చు ఎంతో కీర్తి కూడాను'' అన్నాడు.

ఈ సలహాతో తన్మయుడై పోయిన పరపతిగారు ''అలాగే చేద్దాం అన్నయ్యా' మీరు మా యింటికొచ్చి వుండిపోయి నాకు వెలుగు చూపించాలి!'' అన్నాడు బ్రతిమాలే గొంతుక పెట్టి.

విద్యా విజ్ఞానా లుండికూడా దరిద్రంలో కుమిలిపోయి ఏడుస్తున్న తిరపతిగారు వెంటనే ఒప్పుకొని బైలుదేరారు.

★ ★ ★

అన్నగారి సలహా తీసుకుని పరపతిగారు 'ప్రజాసేవ,' ప్రారంభించారు. కాఫీహోటళ్ళు లగాయతు మంగలి షాపుల వరకూ కొత్తగా వెలిసే ప్రతిదాన్ని ప్రారంభోత్సవమూ పరపతిగారే చేయిస్తూ వచ్చారు. ఇటువంటివాటిని 'వార్తలు'గా ఏ పత్రికా స్వీరించకపోవడం వల్ల వాటికి ''ప్రకటన'' రేట్లు స్వయంగా యిచ్చి ప్రకటింపచేసుకున్నారు. ప్రతి పెళ్ళి శుభలేఖలమీద ''అభినందనలతో'' లిష్టులో పరపతిగారి పేరు చేరడం ఇప్పుడు పరిపాటయింది.

ఊళ్ళో కలరా మశూచీ వ్యాపించినప్పుడల్లా శానిటరీ యిన్స్పెక్టర్లతో పరపతిగారుకూడా వుండి (వాళ్ళు పిలువనక్కర్లేకుండానే) ప్రతివాళ్ళకీ వాక్సినేషన్లు చేయిస్తూ నలుగురికీ పరిచయం అవుతూన్న పరపతిగారు రానురాను ''ఇంకా ఆ పేటలో కలరా రాలేదే! ఈ వూరికి ప్లేగు ఎప్పుడు వస్తుందీ!'' అనే చింతలో సైతం పడ్డారు. అన్నగారి ఆదేశం ఏమిటయ్యా అంటే ''ఎలాగో ముందు నలుగురికి నువ్వంటే ఎవరో బాగా తెలియాలిరా తమ్ముడూ'' అని.

వూళ్ళోవున్న ఒక ఆస్పత్రిలో పరపతిగారి పేర ఒక మంచం వేయించారు. స్కూల్లో ఐదుగురు పిల్లలకి రోజూ ఉదయం 'పిండి! పాలుపోసే ఏర్పాటు చేయించారు. ఒకవేదాంత గ్రంథానికి మహారాజ పోషకుడుగా జేరాడాయన. ఆ వూరు మాంసం మార్కెట్టును శివరాత్రినాడు 'బంద్' చేయించాడు గూడాను. ఒకరోజు జంతువధ మాన్పించారు.

ఇలాగా పరపతిగారి కీర్తి రానురాను రోజుకో నినాదంతో దిన దిన ప్రవర్థమానం కాసాగింది, చనిపోతూన్న ఒక స్థానిక మాసపత్రికకు ఆయన జీవిత చందాదారుగా చేరి ఇంకో సంచిక వచ్చే ఏర్పాటుచేసి ఆ సంచికనిండా తన ఫోటోలు, తన 'ప్రజాసేవా తత్పరత' మీద వ్యాసాలు వేయించుకున్నారు. ఆ పత్రిక మరి రాలేదు. ఆ సంచికతో సరి. అయితే నేం గాక? ఎంత కీర్తి!

అన్నగారి సలహా ప్రకారం జనరల్ఎన్నికలలో పాల్గొందామని పరపతిగారు ఆశించారు. ఎం.ఎల్.ఏ. గనక అయితే తన ''ప్రజాసేవ'' కొత్తపుంత తొక్కుతుందని ఆయనకి తిరపతిగారు నూరిపోశారు. ''ఎం.ఎల్.ఏ. అంటే చదువు వుండక్కర్లేదూ?'' అని ఎవరో ఆయన్నడిగితే, నాకు చదువు రాదనేగా మీరు అనటం? మా అన్నయ్యలేడు - ఆయన అఖండ మేధావిగదా! నా వెనక ఆయనంతటి వాడుండగా నాకేం లోటు?'' అని అన్నాడు పరపతిగారు.

తిరపతిగారు రాసిచ్చిన ఉపన్యాసాలు విని బట్టీ పెట్టి పరపతిగారు ప్లాట్ఫారా లెక్క ఉపన్యాసాలు దంచేస్తున్నారు. ఎక్కడైనా పట్టుబడితే ప్రాంప్టింగుకి తిరుపతి గారుండనే ఉన్నాడాయను.

ఎలాగో పరపతిగారు ఒకరూరల్ నియోజకవర్గం నుంచి ఎన్నికై ఎం.ఎల్. ఎ. అయి శాసనసభకు వెళ్ళారు. సగటున ఓటుకు పది రూపాయల వంతున డబ్బు మంచినీటి ప్రాయంగా ఖర్చయింది. అయితే ఏంగాక!

పరపతిగారు, ప్రస్తుతం శాసనసభలో ఏ నాడు ఏ విషయమూ ఎత్తక ప్రభుత్వ పార్టీని ప్రశ్నలతో వేధించకుండా ఏడాది పాటు కాలం గడిపేశాడు. అందకు ప్రతిఫలం మరుసటితడవ మంత్రివర్గం పునర్నిర్మించ బడ్డప్పుడు ఆయన్ని ఆర్థిక శాఖకు మంత్రిని చేశారు. ప్రభుత్వ పార్టీవారి పత్రికలు ఈ నియమకానికి హర్షం వెలిబుచ్చాయి. కారణం చదువు సంధ్యలు బాగా వుండి ఆర్థిక శాస్త్రం కంఠస్థమై కొందరు ఆర్థిక మంత్రులు ఖజానాలోని సొమ్ము దొడ్డిదోవన 'బడ్జెట్'కు అందకుండా ఓంఫట్ చేసివుండడం వల్లనూ పరపతిగారికి చదువు రాదుగనుక ఆయనకి కుయుక్తులూ, కుతంత్రాలూ, తెలీవు గనుకనూ!

కాని జరిగిందదది కాదు. ఈ చాతగాని మంత్రి వెనుక తిరపతిగా రుండనే వున్నారు. ఇన్నేళ్ళుగా ప్రజాసేవ వ్యాపారం పెట్టుబడికింద అయిపోయిన డబ్బు పదింతలుగా తిరిగి వచ్చే సమయం ఇదేనని గ్రహించాడాయన. అదీగాక తిరిగి 'మంత్రి' పదవి రావటం మాటలా! పైగా తుమ్మితే తప్పు, దగ్గితే అవిశ్వాస తీర్మానం అనే ఈ రోజుల్లో గాలి వాలుగా వున్నప్పుడే సరిజేసుకోవటం మంచిది అని ఆయన విశ్వాసం.

తిరుపతిగారు పరపతిగార్ని ఎంతయినా ప్రోత్సహించాడు. ఇతర శాఖల అమాత్యుల్ని చూసి గుండె దిటవు చేసుకోమన్నాడు. మంత్రివర్గ మంతటా విరివిగా కన్పిస్తూన్న స్వపార్టీ స్వజన ఆశ్రిత పక్షపాతం, ధనకాంక్ష న్యాయరాహిత్యం, తనొక్కడిలో లేకపోడం క్షమించరాని దన్నాడు.

తరవాత ఏమైందో చెప్పడమెందుకు? పరపతిగారి 'ప్రజాసేవ' పెట్టుబళ్ళు పదింతలుగా తిరిగివచ్చాయి. కీర్తి దేశవ్యాపితంగా మారు మోగిపోయింది.

ఈ రకంగా పరపతిగారి పని నిత్యకళ్యాణం పచ్చతోరణంగా సాగిపోతున్నది.

మంత్రివర్గాలు మారినా తిరపతిగారి అమేయ ప్రజ్ఞవల్ల పరపతిగారికి మంత్రిత్వము సిద్ధిస్తూనే వున్నది. ఒకసారి రక్షణశాఖా మంత్రిత్వం వచ్చినప్పుడు తిరపతిగారి సలహాతో పరపతిగారు శాసన సభ్యుల్ని మంత్రుల్ని - పత్రికలుగానీ, వ్యక్తులుగానీ విమర్శిస్తే ఆజన్మాంతం కారాగారశిక్ష విధించే శాసనం చేయించారు. శాసనసభ్యులందరూ ఏకగ్రీవంగా దీన్నామోదించారు.

ప్రచారశాఖ మంత్రిత్వం సిద్ధించినప్పుడు పరుపతిగారు ఇంకో తెలివైన శాసనం ప్రవేశపెట్టిగెలిపించారు. ప్రభుత్వ వ్యవహారాలన్నీ ప్రజల కంతుపట్టని ఒక పిశాచ భాషలో నడిపించాలని శాసనం ఉద్దేశం. ఆ శాసనం ముందుముందు పదిహేనేళ్ళలో అమలు జరుగుతుందని ప్రభుత్వ సంకల్పం. మొదటిమెట్టుగా రైల్వేస్టేషన్‌లలో పేర్లు పిశాచభాషలో రాయించారు.

ఇంతేగాక అదివరకున్న రాజధాని నగరాన్ని దేశం మరొకమూల ఆనాలుగుకొండల మధ్య నీళ్ళయినా దొరకని ''నిరపాయకరమైన'' ప్రదేశంలోకి మార్చారు.

ఇన్నీ బాగా సాగిన్నై. ఇందులో ఇంకొక విశేషం ఏమిటంటే అదివరకల్లా నిర్భాగ్యుడూ ఆగర్భదరిద్రుడూ అయిన తిరపతిగారు ఏలాగో లక్షాధికారి అయినాడు. నాలుగైదు పారిశ్రామిక గుత్తాధికార సంస్థలకు 'గౌరవ' డైరెక్టరు గూడా. 'ఇదంతా పరపతిగారి చలవలే' అని తెలియని వారన్నారు కాని నిజం పరపతిగారికే తెలుసు. తిరపతిగారు లేనిదే పరపతిగారి దేమీ లేదు.

ఒకనాడు విశ్రాంతి సమయంలో శాసనసభా విశాలమైన లాబీలలో పచార్లు చేస్తూ ఎన్నడూ ఏమీ అడగని పరపతిగారు తన పక్కనే వున్న తిరపతిగార్ని ప్రశ్నించారు అనుమానంగా. ''మనది ప్రజాస్వామిక దేశం. మన ప్రభుత్వం మన ప్రజాస్వామిక సిద్ధాంతాల్ని గురించి లక్షల కొద్ది టన్నుల పుస్తకాలు అచ్చేయించి ఇతర దేశాలకి ఎగుమతి చేస్తున్నారు గదా అన్నయ్యా! మరి మన ప్రభుత్వాలు యెన్నడైనా ప్రజల కోసం ఏమైనా చేసిన పాపాన పోయిన్నై? ఏమిటీ సిద్ధాంతాలు?'' అని ప్రశ్నించాడు.

అందుకు సమాధానంగా తిరపతిగారు పరపతిగార్ని ఒక మూలకు తీసికెళ్ళి ''అడగవల్సిన ప్రశ్న అడిగావోయ్ తమ్ముడూ! మనది ప్రజాస్వామికపరతంత్ర వ్యవస్థ. వోటర్లు ఎలక్షనప్పుడు స్వతంత్రులూ తర్వాత పరతంత్రులున్నూ!'' అన్నాడు.

పరపతిగారు ''అరె!'' అని నోరు తెరిచాడు.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# వింత ప్రేమ

సత్రంమూల వెలుగుతున్న ఆరిపోయే దీపం మరణ కాంతిలో, పడుకున్న పాంధులు మసక మసకగా కనిపిస్తున్నారు. సున్నం రాలిపోయిన గోడలకి చేరగిలబడి కొందరు అనాథలు నిద్రరాని అయోమయ స్థితిలో ఉన్నారు. రాత్రి పన్నెండు కావస్తోంది. చీకటి ఆవరించినగదుల్లోంచి గల్లంతుగా మూలుగు, రెండు మూడు దెబ్బలూ వినవచ్చి నిశ్శబ్దాన్ని భగ్నంచేసినై. బైట వరండాలో పరుపులకి శరీరాల్ని జేర వేసివున్న నలుగురు నాగరికులు అటూ ఇటూ పొర్లి ''దొంగలు పడలేదుకదా'' అనుకున్నారు దిగులుగా. వాళ్ళ చేతులు ఆటోమాటిక్‌గా జేబులు తడువుకున్నాయి. ఎడం పక్క రెండవ గదిలోంచి గోల సద్దుమణిగినట్లు నిశ్వాసలూ, నవ్వులూ వినపడ్డాయి.

నలుగురు నాగరికుల్లో చిట్టచివర పడుకున్న సుబ్బయ్య పక్కమీద లేచి కూర్చుని సిగరెట్ అంటించి నిప్పు వెలుగులో తనపక్కన పడుకున్న వెంకట్రావును ఉద్దేశించి ''సత్రంలో గోల ఉండవచ్చు - కాదనను. కాని అర్ధరాత్రి పూటా - దాంతగ లెయ్యా'' అన్నాడు విసుగ్గా.

వెంకట్రావు నిద్రమత్తులో ఒకసారి వొళ్ళు విరుచుకుని ''అసలా గోలేమిటి? బహుశా ఏ జంటలదో ప్రణయం కాదు గదా?'' అన్నాడు ఆశ్చర్యం, హాస్యం ధ్వనిస్తో.

సుబ్బయ్య ఉలిక్కి పడ్డాడు. ప్రణయమా? దెబ్బలూ మూలుగులూ ఏమిటి ప్రణయమేమిటి అని తర్కిస్తో, ''మీదంతా వేషం. ఓ పక్క ఏడుపు వినిపిస్తోవుంటే ప్రణయ మేమిటి?'' అన్నాడు.

'నేననుకున్నాను అంతే. కాకపోవచ్చు ఒకవేళ అయినా ఆశ్చర్యపడాల్సిన అగత్యం ఉండదు'' అన్నాడు వెంకట్రావు దృఢంగా, ఏ అనుభవాల్ని పురస్కరించుకుని చెబుతున్నాడో మరి!

సుబ్బయ్య మళ్ళీ పక్కమీద వాలుతూ ''ఏదైతే ఎవడిక్కావాలిగాని, దొంగలు కాకపోతే సరి!'' అన్నాడు.

''మరే'' అంటో వెంకట్రావు పడుకున్నాడు, శాంతంగా.

పది నిమిషాలు నిశ్శబ్దంగా గడిచినై. గాలి విసురుకి దీపం కాంతి చీకట్లో విశ్రమించింది. మళ్ళీ అదే గదిలోంచి ఇదివరకుకంటే దారుణంగా మూలుగు, అర్థం కాని తిట్లూ వినిపించినై.

ఈ తడవ బైట నలుగురూ తప్పనిసరిగా లేచి కూర్చున్నారు. వెంకట్రావు ''ఏమిటిది? ఖూనీగాని జరగటం లేదుగదా!'' అని భయపడ్డాడు.

''ఏదైనా కావచ్చు'' అన్నాడు మీసాలు తలా నెరిసిన ముసిలాయన ఒకడు. సుబ్బయ్య తలాపున వున్న బ్యాటరీ లైటు తీసి ఎడం వేపు గదుల వాకిళ్ళమీద ప్రసరిస్తో ''పోయి చూదాం పదండి. ఆడగొంతులావుంది'' అన్నాడు.

మిగతా ముగ్గురూ జంకేరు. కారణం వెనకటి మూలుగుకి బదులు అవ్యక్తంగా నవ్వులూ ముద్దులని గర్తు పట్టడానికి వీలయ్యే శబ్దాలూ వినపడ్డాయి.

''చచ్చాంరా! పరమాత్మా. ఇది ఖూనీకాదు గాడిద గుడ్డూగాదు. ఏదో ప్రణయమే. నిద్ర చెడగొట్టుకోడం దండుగ'' అన్నాడు సుబ్బయ్యకూడా. నలుగురూ యికపిడుగులుపడ్డా లేవకూడదని శపథం చేసుకొని నిద్ర పోయినారు.

అరగంట గడవకముందే నలుగురూ బూట్ల చప్పుడికి లేవక తప్పిందికాదు. వాళ్లి కళ్ళు తెరచి చూచేటప్పటికి కాంతివంతమయిన గ్యాస్లైటు చేతపట్టుకొని ఇద్దరు పోలీసులూ, ఓ సబిన్స్పెక్టరూ ఎడం వేపు గదుల ముందుగా నడుస్తున్నారు. సత్రం యిక అన్ని విధాల నిశ్శబ్దంగా వుంది. సత్రం గుమాస్తా పట్టవర్ధనాచార్యులు చిన్న బొర్రవణుకుతో వుంటే వాళ్ళ వెనకాల నడుస్తో గైడెన్సు ఇస్తున్నాడు. సుబ్బయ్య ఆత్రంగా లేచి వాళ్ళ వైపుగా పరుగెత్తుకు వెళ్ళాడు. రెండవ గది దగ్గరికి వెళ్ళి అందరూ ఆగిపోయినారు. సబ్ ఇన్స్పెక్టర్ నిశ్శబ్దముగా వుండమని సంజ్ఞచేసి తలుపుమీద చెవి పెట్టి వింటున్నాడు ఏమిటో. బయట నుంచున్న వాళ్ళకి ఆదుర్దా హెచ్చుతోంది. మళ్ళీ 'మూలుగు, అబ్బ - అబ్బ - అన్న విషాద స్త్రీ స్వరం నిశిరాత్రిని భయపెడుతున్నై. నలుగురు నాగరికులూ ఒకర్నొకరు సాభిప్రాయంగా చూసుకున్నారు. ''ఏం జరుగుతున్నది?'' అందరి ఆదుర్దా ఇదే.

లోపల్నుంచి స్పష్టమయిన మాటలు వినపడ్డయ్. ఒక అధికారస్వరం ''పడుకో ... లేకపోతే చంపుతాను'' అంటోంది. ఇది మగస్వరమని తెలుస్తోనేవుంది.

''అమ్మయ్యో... వొదులు ... చచ్చిపోతాను... నెత్తురొస్తోంది ... అమ్మో...'' అంటోంది స్త్రీ ధ్వని హృదయ విదారకంగా వినిపిస్తోంది బైటివాళ్ళకి.

సబ్ ఇన్స్పెక్టర్ ఒక్కసారిగా అటెన్షన్లో నిలబడి ''రేప్...'' అంటో ఒకడుగు వెనక్కి వేసి తలుపును ఒక్కతన్ను తన్నాడు.

గడియలు ఎప్పటివో పురాతనమైనవి గావున దభేలున ఊడిపోయి తలుపు బార్లా తెరుచుకుంది. గ్యాస్లైట్ వెలుగులో లోపల కుక్కిమంచం మీద పద్దెనిమిది పంధ్తొమ్మిదేళ్ళున్న ఓ అమ్మాయి, ఆమె పక్కన 26, 27 ఏళ్ళు ఉన్న యువకుడూ పడుకుని వున్నారు. ఈ గ్యాస్ లైటునీ మనుషుల్నీ చూసేటప్పటికి దాదాపు నగ్నంగా ఉన్న యిద్దరూ చప్పున కాళ్ళకట్టన ఉన్న దుప్పటి కప్పుకున్నారు సిగ్గుతో.

ఈ దృశ్యం ఇన్స్పెక్టరులో కోపాన్ని మరీ రెచ్చకొట్టింది. నాగరికులు నలుగురూ

స్తంభించిపోయినారు క్షణం. కారణం ఆ అమ్మాయి మొహం నిండా అక్కడక్కడ నెత్తురు మరకలు. దుప్పటి కప్పుకోక ముందు రొమ్ము మీద కూడా ఇట్లాంటి మరకలే కన్పించినాయి.

ఏమీ తోచకుండా ఉన్న ఈ ఐదు నిమిషాలలో కుక్కిమంచంమీద యువకుడు లుంగీ వొదులుగా బిగించుకొని మంచం దిగాడు. అ అమ్మాయి మాత్రం సిగ్గుతో, ఎవరివంకా చూడలేక దుప్పటి మొహానికి కప్పుకుంది.

పరిస్థితి గ్రహించుకున్న సుబ్బయ్య గ్యాస్‌లైట్ పట్టుకునుంచున్న పోలీసును ''ఒక్కరవ్వ బైటికి పో, ఆ అమ్మాయి.. '' అన్నాడు మెల్లగా. గ్యాస్ లైట్లతోటే అందరూ బైటికి వచ్చారు. యువకుడు వెనక్కి చూస్తూ ఇన్స్పెక్టరుని వెంబడించాడు.

దీపం కిందపెట్టి, గదిబైట ఆగాడు పోలీసు. ఇనస్పెక్టర్ అధికారపూర్వకంగా ఆ యువకుడి కాలర్ బలంగా చేత్తో పట్టుకుని ముందుకిలాగి '' ఏంచేస్తున్నావు ఆ అమ్మాయిని?'' అని అడిగాడు భయంకరంగా గర్జిస్తూ.

తెల్లబోయాడు యువకుడు. అతనికి ఏమీ అర్థంగావడం లేదు, ఆ పోలీసులు ఈ పెద్దమనుషులు.

''చెప్పవేం?...'' ఒకటిచ్చుకున్నాడు చెంపమీద ఇనస్పెక్టర్.

దెబ్బతో ఎర్రబడ్డ చెంప తడువుకుంటున్న యువకుడి నోరూ, పెదాలు చుట్టూ నుంచున్న వారికి చూపిస్తూ, ఇనస్పెక్టరు ''చూడండి, ఆనోటి నిండా రక్తం ఎట్లా ఉందో'' అన్నాడు. చూసేవాళ్ళకి వొళ్ళు ఝల్లు మంది. ఇందాక ఆ అమ్మాయి వొంటి మీద చూసిననెత్తురు మరకలు జ్ఞాపకం వచ్చినాయి సుబ్బయ్యకి, వెంకట్రావుకీ. ''రాక్షసుడు!'' అన్నాడు సుబ్బయ్య.

''ఆ అమ్మాయిఎంత గోల పెట్టిందీ! వీణ్ణి నరికెయ్య!'' అన్నాడు ముసలాయన.

''ఔనండి, ఆగోలకేనేను పోలీసు స్టేషన్‌కు పరిగెత్తాను'' అన్నాడు ఆ అమ్మాయికి సానుభూతిగా పట్టవర్ధనాచార్యులు.

ఇనస్పెక్టర్ యువకుణ్ణి, చొక్కా పట్టుకుని మళ్ళీ ఒకసారి గట్టిగా ఊపి ''నీ పేరేమిటి?'' అని అడిగాడు. పక్కనే నిలబడ్డ 364 పెన్సిల్, కాయితం తీశాడు వివరాలు రాయడానికి. యువకుడు భయవిహ్వలుడై, నత్తిగా మాట్లాడుతో ''సాంబశివరావు'' అన్నాడు.

''ఊఁ.... ఆ అమ్మాయి ఎవరు?'' ఇనస్పెక్టర్ కళ్ళు నిప్పులు కక్కుతున్నై. న్యాయరక్షకుడుగదా!

సాంబశివరావుకి బొత్తిగా నోట మాట రావటం లేదు.

ఇనస్పెక్టర్ విసుగ్గా పక్కనే నుంచున్న పెద్దమనిషి సుబ్బయ్యను ఉద్దేశించి ''ఆ అమ్మాయిని నేను పిలుస్తున్నానని పిలవండి, ఏం భయం లేదని చెప్పండి'' అన్నాడు.

సత్రంలో ఉన్న వాళ్ళు దాదాపుగా అక్కడికి చేరి వున్నారు. గంభీరమైన సందడి ఆవరించుకుంది సత్రాన్ని.

సుబ్బయ్య గదిలోకి వెళ్ళకుండా బైట నిలబడి కాస్త మాటలకోసం తడుములాడుకుని ''అమ్మాయిగారూ! ఒక్కసారి ఇలా రండి'' అన్నాడు.

చీకటి గదిలోంచి ఆ అమ్మాయి మెల్లిగా బైటికి వచ్చింది భయపడుతూ, ఐదారు అడుగుల దూరంలో నిలబడి వున్న జనసమూహం.... సబ్ ఇనస్పెక్టర్... ఆ అమ్మాయి బాగా సిగ్గుపడిపోయి అడుగు వెయ్యలేక నేల చూపులు చూస్తూ నిలబడిపోయింది.

ఇనస్పెక్టర్ ఆ అమ్మాయి స్థితిని ఊహించుకుని జనసమూహాన్ని తోసుకుని సాంబశివరావును లాక్కొచ్చి ఆ అమ్మాయిముందు నిలబెట్టి, ''వీడు ఎవడమ్మా? నిన్ను బలవంతం చేశాడుగదూ! అని అడిగాడు.

ఆ అమ్మాయి ఉలిక్కిపడి సాంబశివరావు కళ్ళల్లోకి చూసింది జాలిగా, కాని మాట్లాడలేక పోతోంది.

ఇనస్పెక్టర్ నిర్ధారణగా ''నేను చెప్పలేదండీ? వీడు రోగ్... ఈ అమ్మాయిని ఎక్కణ్ణించో లాక్కొచ్చాడు....'' అన్నాడు పెద్దమనుషులవంక చూస్తూ.

ఆ అమ్మాయి మరింతగా కంగారు పడ్డది. సాంబశివ రావు గాబరాగా, ''చెప్పు'' అన్నాడు మాట తెమలి.

జనసమూహం ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఇనస్పెక్టర్ ''చెప్పు, వీ డెవడూ?'' అన్నాడు కాస్త గట్టిగా.

''మా ఆయన'' అంది తలవంచి.

జనసమూహంలో పిడుగు పడ్డట్టయింది.

ఇనస్పెక్టర్ సాంబశివరావు చొక్కా వదిలాడు. ఆయన మొహంలో కత్తి వేటుకి నెత్తురు లేదు.

★ ★ ★ ★

సత్రంలో పోలీసులు నిష్క్రమించినందువల్ల నిశ్శబ్దం అయింది. సాంబశివరావు కోపంతో చేతులు రుద్దుకుంటూ వరండాలో స్థంభాన్నానుకొని నుంచున్న సుబ్బయ్యతో మాట్లాడుతున్నాడు. సత్రం గుమాస్తా, క్షమార్పణ వేడే చూపు పెట్టి ఐదారు అడుగుల దూరంలో నుంచున్నాడు.

''అదికాదండీ, నా పెళ్ళాంతో సరసాలాడితేనే పోలీసులకి కబురు చేస్తారండీ?'' అన్నాడు సాంబశివరావు కోపం గానే.

సుబ్బయ్య నవ్వుతూ ''అది సరసమని నేను అనుకోలేదులెండి'' అన్నాడు వ్యంగ్యంగా. సాంబశివరావు మొహం వివర్ణమైంది.

వెంకట్రావు ''సిగ్గుపడకండి. ఇట్లాంటి సరసాలుంటాయని ఏదో పుస్తకంలో చదివేను నేను'' అన్నాడు లౌక్యంగా.

సాంబశివరావు ఊతం దొరికినందుకు ఉషారుగా, ''నేనూరుకున్నా అది ఊరుకోదండి, కొరుకుతుంది. నేనూ అంతేలెండి - నా కప్పుడు మృగాలు ఆవేశిస్తాయో ఏమో తెలియదు గొడవ'' అన్నాడు.

'' ఇద్దరూ సరిపోయినారు'' అంటూ సుబ్బయ్య నవ్వాడు సన్నగా.

''మరేనండి!'' అంటూ సాంబశివరావు మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయినాడు. వెంకట్రావు ''నేను చెప్పలేదటోయ్, ఇదొక రకం ప్రణయమనీ!'' అంటూ మళ్ళీ హోల్డాల్‌కు శరీరాన్ని జారేశాడు.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# స్వార్థపరుడు

వకీలు విజయ రాఘవరావుగారి ఇంట్లోకి మధ్యాన్నం పది పదకొండు గంటల ప్రాంతంలో ఆ కుర్రాడు ప్రవేశించాడు. అతనికి దాదాపు పదిహేడేళ్ళుంటాయి. ఎర్రగా ముచ్చటగా ఉన్నా అతని చినిగిన చొక్కా, లాగూ, వైఖరీ, మొహంలో దైన్యమూ అతని లేనితనాన్ని నిరూపిస్తున్నాయి. బెరుకు బెరుకుగా ఆ కుర్రాడు, విజయరాఘవ రావుగారి ఆఫీసు రూంలోకి వెళ్ళి గడప దగ్గరగా నిలబడ్డాడు. ఆ వేళ ఆదివారం. ప్లీడరుగారు ఆఫీసు గదిలో భోంచేసి తాంబూలం నములుతూ కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. కాళ్ళ చప్పుడుకు తలెత్తి చూశారు ఆయన. కుర్రాడు బహు నమ్రతగా చేతులు నలుపుతూ నిలబడ్డాడు. ఏమడగాలని అనుకున్నాడోగాని మాట తెమలక తాత్సారం చేస్తూన్నాడు. ప్లీడరుగారు పేపరు ఈజీఛైర్ అవతలగా పడేసి సరిగ్గా కూచొని, ''ఏం పని నాయనా?'' అని చాలా నెమ్మదిగా కనుక్కున్నారు. కుర్రాడికి ఇంకా మాట తెమల్లేదు. కాని ఒక అడుగు ముందుకేసి, కాస్తంత ధైర్యం కూడగట్టుకుని, లా పుస్తకాల వేపు చూస్తూ ''మరండే, నేను ఇక్కడ చదువుకుంటున్నానండి...'' అని నీళ్ళు నమిలాడు. ప్లీడరు గారి వైఖరిలో ఏదో రకమైన ఇంట్రస్టు వొచ్చింది. ''చెప్పు ఫరవాలేదు'' అన్నారు, కూర్చో అందామనుకుంటూనే ఎంచేతో అనలేదు. కుర్రాడికి ఇప్పటికీ ప్లీడరుగారి మొహంలోకి చూసే ధైర్యం రాలేదు. మెల్లిగా మాట తెములుచ్చుకుని, ''అన్ని వారాలూ కుదిరినైయండి - ఆదివారం కుదరలేదు...'' అనగలిగాడు. ఆ పైమాట దేనికి అనటం? ప్లీడరు గారు కుర్రాణ్ని పైనించి కిందిదాకా బాగా పరకాయించి చూశారు. అతని అవస్థ గ్రహించుకుని ''భయపడకోయ్. ఏం చదువుతున్నా వేమిటి?'' అని దయగా అడిగారు. కుర్రాడి వైఖరిలో కూడా కొంచెం మార్పు స్ఫురించింది. ఎండలో వచ్చిన అలసటా, మరోవంక ఆకలీ అతనిలో నీరసాన్ని కల్పించినై కాబోలు, నుంచున్న వాడల్లా నేలమీద చతికిలబడి కూర్చుని ''మరేనండి ఫిఫ్తుఫారం చదువుతున్నాను'' అన్నాడు. విజయరాఘవరావుగారు ' ఆదివారం భోజనం కావాలంటున్నావా? దానికేం, అట్లాగే కాని, నీ పేరేమిటి నాయనా?' అని ఇంకా దయగా ప్రశ్నించారు.

కుర్రాడు నమ్రత ఉట్టిపడుతున్నట్టు ''ప్రకాశరావు అంటారండి'' అన్నాడు.

ప్లీడరు గారు ఏదో జ్ఞాపకం తెచ్చుకునే ప్రయత్నంలో రెండు నిమిషాలు పరాకుగా దిక్కులు చూసి ''ఇంతకీ ఈ పూట భోంచేశావా? లేకపోతే పద, స్నానం చేసి భోంచేద్దువు గాని'' అన్నారు. ఈ మాట అనేసి ''సుబ్రహ్మణ్యం'' అని కేకేశారు. అవతల గదిలో కేసు కట్టలు చూస్తున్న గుమాస్తా సుబ్రహ్మణ్యం గబగబ లేచి వచ్చి పిల్చారండీ?'' అని అడిగాడు. అవునన్నట్టు తలూపి ప్లీడరు గారు కుర్రాణ్ని గుమస్తాకి చూపి ''ఈ అబ్బాయికి అన్నం పెట్టమను'' అన్నారు. తన పది హేనేళ్ళ

సర్వీసులోనూ ప్లీడరుగారి వద్ద ఇట్టి ఔదార్యాన్ని ఎన్నడూ ఎరగని గుమాస్తా లోలోపల ఆశ్చర్యపడుతూ ''రా రా అబ్బాయి'' అని కుర్రాణ్ని తనవెంట తీసుకెళ్ళాడు.

## 2

విజయరాఘవరావు గారికి నెలకి ఇదారు వందల రూపాయల ప్రాక్టీసున్నది. పిత్రార్జితం ఇర్వై ఎకరాల పొలం. రెండిళ్ళూ ఉన్నాయి. కొడుకు మద్రాసులో 'లా' చదువుతున్నాడు. ఆయనకి ఇహలోకంలో సమస్య లంటూ లేవనే భావించవచ్చు. కాని కూతురు పద్మావతి ఆయనకి పెద్ద సమస్య. అందులోనూ, రెండుకాళ్ళూ పుటక నుంచి చచ్చుపడి సన్నగా, నడవలేక దేకుతూన్న కూతురు విజయ రాఘవరావుగారికి మానసికంగా ఆవేదననీ తీరని సమస్యల్నీ రేపటంలో ఆశ్చర్యం లేదు. ఆ అమ్మాయికి ఇంతకన్న వేరే ఏ లోపమూ లేదు. తండ్రి ఆమెకు చదువు ఇంటి దగ్గిరనే చెప్పిస్తున్నాడు. హార్మనీమీద సంగీతం కూడా చెప్పిస్తున్నాడు. గొంతు రమ్యంగా ఉంటుంది. ఆ కాళ్ళు తప్ప ఆమె సౌందర్యవతేనని చెప్పుకోవాలి. కాని, విజయ రాఘవరావు గారి మనసు ఎక్కడబాధపడ్డదీ అంటే ఆమె భవిష్యత్తు ఏమిటా అని. ఈ సమస్య తండ్రి కన్న తల్లికి ఎక్కువగా వుండటం సహజం గదా! ఆమె అనేక సందర్భాల్లో భర్తతో కూతురు విషయం చర్చిస్తూ వుండేది. వారాల అబ్బాయి వొచ్చిన రాత్రికూడా ఇదే చర్చసాగింది. వంటింట్లో ప్లీడరు గారు భోం చేస్తూన్న కూతురువైపు చూసి నిట్టూర్చి ''ఎంత డబ్బుంటే ఏం లాభం ఏమిటి?'' అనుకుంటూ అన్నం తినసాగారు. తల్లి వడ్డన ఆపి భర్త మొహంలోకి చూస్తూ ''ఏమండీ! నేను పోరటమేనా మీ రేమన్నా ఆలోచిస్తున్నారా?'' అన్నది.

''నేనేనా అంత ఖాళీగా కూర్చున్నది? ఆ దిగులు నీ కేనన్నట్టు మాట్లాడుతావేమే!'' అన్నాడు ప్లీడరు గారు.

భార్య కూతురికి మజ్జిగ వడ్డిస్తూ ''నా తల్లిని దేవుడు దయతలచలేదు గాని....'' అన్నది గద్గదంగా.

కూతురు - తల్లిని, తండ్రిని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఇది వరదాకా మౌనంగా వూరుకున్నదల్లా కాస్త ధైర్యం చేసి ''ఏమిటి నాన్నా?'' అన్నది ఇంకేదో అనబోయి అనలేక. తండ్రి కూతురు వీపు ప్రేమతో సవరించి, ''ఏముందమ్మా! నీకెందుకు ఆ గొడవ? అన్నం తిని పడుకోపో'' అన్నారు. తల్లి కూడా ఆ మాటే అన్నది. కాని పద్మకి కాస్తో కూస్తో జ్ఞానం వుండటం వల్ల అమ్మా నాన్నా పడే ఆవేదన అర్థం చేసుకుని వాళ్ళ కా బాధ ఎందుకా అని ప్రశ్నించుకున్నట్టున్నది. ఆమె తండ్రివైపు జిజ్ఞాసాపూర్వకంగా దృష్టిసారించి, ''నాన్నా! నా పెళ్లి సంగతేనా నువ్వు మాట్లాడుతున్నది?'' అని అడిగింది, కొంచెం సిగ్గుపడ్డప్పటికి ధైర్యం చేసి, విజయరాఘవరావు ''అవును తల్లీ!'' అన్నారు. పదిహేనేళ్ళ ప్రాయంలో ఉండి చదువుకుంటూ కాస్త ప్రపంచజ్ఞానం సంపాయించిన కూతురుకి ఇక ఈ విషయం చెప్పకపోవడం సమంజసం కాదని ఆయన ఊహించుకున్నారు.

'నాన్నా! నాకు పెళ్ళి కావల్సిందేనా?'' అన్నది కూతురు ఏదో ఉద్దేశాన్ని ధృఢపరచుకుంటూ.

తల్లి మందలింపు చూపు పెట్టి ''అవేం మాటలే అమ్మాయి. ఊరుకో, తెలిసీ తెలియని మాటలు మాట్లాడకు'' అన్నది.

తండ్రి మాత్రం ఇట్లా మందలించలేదు. ఆశ్చర్యంతో కూతురు వంక తిరిగి ''అదేమిటమ్మా అట్లా అంటావు. పెళ్లి వద్దంటున్నావేం?'' అన్నాడు.

కూతురు - తండ్రి తనను అర్థం చేసుకోగలడని గట్టిగా విశ్వసించి ''నాన్నా! నేను ఈ కుంటి బతుకు ఈ ఇంట్లోనే వెళ్ళబోస్తాను. ఎవరికో ఇచ్చి పెళ్ళి చేసి నా బతుకు ఇంకా ఎగతాళిపాలు చెయ్యడం ఎందుకు నాన్నా? అన్నయ్యకి మల్లేనేనూ వుంటాను. నీకు బరువా నాన్నా?'' అని అడిగింది. గొంతు కొంచెం బొంగురుబోతూ కళ్ళవెంట కాస్త తడి కనపడ్డది. తల్లి కూతురు మాటలకి గందరగోళ పడుతుంగానే వాచాలత్వానికి పేరుబడ్డ వకీలు గాబట్టి తండ్రి కూతుర్ని సముదాయించి ''అమ్మా? నువ్వనేమాట నిజమే గాని, నీకు ముందాలోచన తోచలేదమ్మా - మేము కళ్ళు మూసిం తర్వాత నీకీ యింటి పరిస్థితి ఎట్లా ఉండబోతుందో ఎవరు చెప్పగలరు? నీ వదిన మంచిదేనని నమ్మడం ఎట్లా గమ్మా? నీ వాడంటూ ఒక భర్త ఉంటే అతనికి తప్పదు. చూడు! డబ్బుందిగదా అంటావా? డబ్బుతోనే జీవితాన్ని సరిపెట్టుకోగలమా? మనిషి ఆసరా ఉండనక్కర్లేదా? చెప్పుతల్లీ!'' అన్నాడు. ఇన్నిమాటలూ చెబుతున్నాడేగాని ఆయనలో తన కూతురికి అసలు వరుడు దొరుకుతాడా అనే సంశయం ప్రబలంగా బాధిస్తోంది. తను సగం ఆస్తి రాసిస్తానన్నా సాటి వాళ్ళెవరూ ఈ వివాహానికి అంగీకరించరు. భోజనాలు ముగించి అందరూ లేచారు. వారాల కుర్రాడు వరండాలో దీపాల క్రీనీడలో నిలబడి వున్నాడు- భోజనానికి కాబోలు పద్మతల్లి రుక్మిణమ్మ ''ప్రకాశం! రా'' అని పిలిచింది. ప్లీడరు గారు అటునించిపోతూ, ప్రకాశాన్ని మరొక్కసారి పరీక్షగా చూస్తూ వెళ్ళిపోయినారు. పద్మ ఆ రాత్రల్లా ఇదే సంగతి ఆలోచిస్తూ నిద్రపోయింది.

★ ★ ★

ప్రకాశం ప్లీడరుగారింట్లో వారాలకి కుదిరి మూడో వారం జరుగుతోంది. ప్రకాశానికి ఈ భూమ్మీద నా అన్నవారెవరూ మిగలలేదు. ఒకవేళ దూరపు బంధువులున్నారేమోగాని వాళ్ళెవరూ ప్రకాశాన్ని మావాడు అనేస్థితిలోకి వచ్చేవాళ్ళుకాదు. స్నేహితుడు ఎంత దుర్మార్గుడైన ఒకణ్ణి 'మావాడు' అనుకోగల్లు గాని, బంధువు అట్లాగాదు. ప్రకాశం సంగతైనా అంతే. ఇట్టి పరిస్థితులవల్ల ప్రకాశం వారాలు చేసుకుని, జీతం చందాలు పోగుచేసుకుని చదువుకుంటున్నాడు. ఆ నెల జీతం సరిగా పోగుకాలేదు కాబోలు, ప్రకాశం తెగించి ప్లీడరుగార్ని అడగదల్చుకున్నాడు. సాయంత్రంపూట స్కూల్ నించి సరాసరి ప్లీడరుగారింటికి వెళ్దామనుకున్నాడు. కాని ఆయన ఆవేళప్పుడు ఇంట్లో ఉంటాడా, అనుకుని రాత్రి భోజనానికి పోయినప్పుడే అడుగుదామని నిర్ణయించుకున్నాడు. ఆ వేళ రాత్రి ఆఫీసు రూములో కూర్చుని దీర్ఘాలోచనా తత్పరుడై వుండిన ప్లీడరుగారిని ప్రకాశం ఆకలి గొంతు కదిలించింది

''పంతులుగారూ!'' అన్నాడు ప్రకాశం. పంతులు గారు పరాకుమాని, ''రా నాయనా! భోంచేశావా? ఇట్లా బల్ల మీద కూర్చో'' అని అనునయించారు. ప్రకాశం కార్యసిద్ధి అయ్యే శుభశకునంగా ఈ మాటల్ని తీసుకుని కూర్చోకుండానే, ''మరేనండి, ఈనెల స్కూలు జీతం...'' అని ఆగాడు గుక్కచాలక. ప్లీడరుగారు కుర్రాడి భావం బోధ పర్చుకుని ''ఎంత?'' అని అడుగుతూనే డ్రాయర్ లాగి పది రూపాయల కాయితం బైటికి తీశారు. ప్రకాశం అదే పదిరూపాయాల నోటు కళ్ళారా చూట్టం మొదలు. '' ఆరున్నరండీ!'' అంటూ డబ్బు అందుకోడానికి వెళ్ళాడు. ప్లీడరుగారు కుర్రాణ్ణి మళ్ళీ ఎందుకోగాని ఎగా దిగా రెండు సార్లు చూసి ''నాయనా! నువ్వెక్కడ ఉంటున్నా వేమిటి?'' అని అడిగారు. ''దీక్షితులుగారింట్లోనండీ!'' అన్నాడు ప్రకాశం ప్లీడరుగారిచ్చిన డబ్బు చినిగిన చొక్కా జేబులో పెట్టుకుంటూ. ప్లీడరుగారికి ఇప్పటికి ఏదో విషయం నిశ్చయానికి వచ్చినట్టుంది. ''ఇట్లా కూర్చో ప్రకాశం! నీకోమాట చెబుతాను వింటావు?'' అని అడిగారు బహుప్రేమ పురస్సర ధ్వనితో. ప్రకాశం నేలమీద పరిచివున్న తివాచీ మీద కూర్చున్నాడు. ప్లీడరుగారు చెయ్యవలసిన ఆలోచనంతా చెయ్యడం అయిపోయింది గాబోలు, తీర్మానమైన కంఠస్వరంతో ''రేపణ్ణించీ నువ్వు మా యింట్లోనే ఉండిపో అక్కడా అక్కడా వారాలతో అవస్థపడ్డ మెందుకు? జీతానికి ఈ బాధ ఎందుకు? నువ్వు ఎంత చదవదల్చుకున్నావో అంతవరకూ నేను చదువు చెప్పిస్తాను. సరేనా?'' అని కుర్రాడి మొహంలోకి చూశారు. ఎలక్ట్రిక్ లైటు కాంతిలో ప్రకాశం మొహం ఆశ్చర్య వివశత్వం చేత రక్తవర్ణం దేలింది. ఇది కలో ఇలో అతనికి బోధపళ్ళేదు. రెండు మూడు నిమిషాల తర్వాత ''సరేనండి!'' అనగల్గాడు. ప్లీడరుగారు కుర్చీనుండి లేచి, ప్రకాశాన్ని భుజంమీద చెయ్యేసి బయటకు తీసుకువస్తూ, ''ఓరిక్షా మాట్లాడుకుని సామానంతా తీసుకువచ్చెయి'' అన్నారు. ప్రకాశం చాలా సిగ్గో, మరేదో తెలీదు - నంగిగా ''జంపకనా, ఇంకో జత బట్టలేనండి అక్కడ ఉన్నది'' అంటూ గబగబా నడిచి వెళ్ళాడు.

ఐదు నెలలు దొర్లిపోయినాయి. ఎండలు, వెన్నెలలు మామూలుగానే ఉన్నాయి. అయితే ప్రకాశరావు జీవితం మాత్రం చాలా ఉన్నత పథాల్లోకి వెళ్ళిపోయింది. పాప్లీను షర్టులూ, గ్లాస్కో పంచలూ, సైకిలూ, ఈ ఔన్నత్యానికి ఉదాహరణలు కాదు. దరిద్రుడి ఆలోచనలుకూడా తక్కువ స్థాయిలో చాలా చిన్న స్కేలులోనే ఉంటాయి. అతని కలలు గూడా గొప్పవాటిని ఊహించవు. ప్రకాశరావుకి అసలు కలలే ఉండేవి కావు. ఐదు నెలల క్రితం 'చినిగిన చొక్కాకన్న కొంచెం మంచి చొక్కా ఉంటే బావుణ్ను - వాళ్ళ పుస్తకాలు వీళ్ళ పుస్తకాలు చదివేకన్న సొంతపుస్తకాలుంటే బావుణ్ణు' అన్న ఉద్దేశాలు పోయి ప్రకాశరావు కొంచెం గొప్ప కలలు కన నారంభించాడు. ప్లీడరు గారింట్లో అతనికి సర్వస్వతంత్రాలు లభించినై. ప్లీడరుగారి భార్య రుక్మిణమ్మ చాలా సౌమ్యంగా ఆదరాభిమానాలతో అతన్ని ట్రీట్ చేస్తున్నది. ప్రకాశరావుకి ఆ సంసారంలో సమస్త విషయాలు తెలిసినాయనటానికి వీల్లేదు కాని, కొన్ని సంగతులు బోధపడినై, అతనికి తెలిసిన విషయాలవల్ల అతనిలో కొన్ని ఆశలు ఏర్పడినై. వాటిని ఎక్కువ చేయటానికి అన్నట్టు, పద్మతో పరిచయంకూడా అభివృద్ధి అవుతూన్నది. పద్మ ప్రకాశరావును చాలా అభిమానించింది. అతని లేమికారణంగా. పద్మ, ప్రకాశరావు, అనేక సాయంత్రాలు కూర్చుని మాట్లాడుకుంటూ ఉండేవారు. ఆ యిద్దరూ మాట్లాడటం రుక్మిణమ్మకు చాలా ఇష్టంగా కనిపించింది.

ప్లీడరుగారుకూడా ఈ పద్ధతిని ప్రోత్సహించుతున్నా రేమో అన్నట్లు మౌనం వహించాడు. ప్రపంచ జ్ఞానం పెరుగుతున్నకొద్దీ ఏ వ్యక్తికైనా ఈ సమాజ వాతావరణం బోధ పడకపోదు. ఎవరికైన ఆర్థిక విలువలు పెరిగితేనే ఈ సంఘంలో మర్యాద. వారి వారి బుద్ధికుశలతకు గాని, మంచి చెడ్డలకు గాని, కళానైపుణ్యాలకు గాని, యదార్థంగా ఇవ్వబడే మర్యాదలూ విలువలూ కొద్దిపాటే. చాలాచోట్ల వుండవుగూడాను. ఈ సాంఘికనైజం ప్రకాశరావుకి అస్పష్టంగా బోధపడకపోలేదు. వెనక ఎవ్వరూ పలకరించి ఎరుగని తనను ఇప్పుడు అందరూ గౌరవిస్తున్నారు. అవి తను ధరించిన దుస్తుల్ని మాత్రమే గాదు; తనని గూడానూ. ఇదివరకెప్పుడూ గుర్తింపబడని తన అణకువా మంచితనమూ, ఇప్పుడు గౌరవించబడుతున్నై.

ఇట్లాంటప్పుడు తనస్థితి ఎల్లకాలమూ ఇట్లాగే ఉండాలని అతను భావించడంలో ఆశ్చర్యం లేదు. అయితే ఈ గౌరవస్థిరత్వం తనకెట్లా లభిస్తుంది? ఈ ఆదరణలూ, అభిమానాలు ప్లీడరుగారిలో స్థిరంగా వుంటాయా? ఏమిటో... ఇలా ఆలోచిస్తూ ప్రసాదరావు దృష్టి ప్లీడరుగారి అవిటి కూతురి మీద నిలిచింది. ఆమెకి అందం ఉన్నది, చదువూ వున్నది, అయితే కాళ్ళు లేవు... ఆ అమ్మాయికి పెళ్ళి ఎట్లాగూ కాదు. ఆమెని తనకి.. ఆపైన ప్రకాశరావు ఆలోచించడానికి కూడా సాహసించలేక పోయినాడు. కుంటి దైనా తనబోటి అనాధ కిస్తారా? అని నిరాశపడి తనను తానే తిట్టుకుని ఊరుకున్నాడు. ఎటువంటిస్థితిలో ఉన్నా కొంత కాలం హీనావస్థలో ఉన్నవాడు తప్పక 'ఇన్‌ఫీరియారిటీఫీల్' అవుతాడుకాబోలు! ప్లీడరుగారు - ప్రకాశరావు యస్. యస్. యల్.సి. ప్యాస్ అయ్యేవరకూ ఏమీ మాట్లాడలేదు. అతని దర్జాకి లోటు రానివ్వలేదు. యస్.యస్. యల్.సి. ప్యాస్ అయి, ఇంటర్‌లో ప్రవేశించేముందు ప్రకాశరావు మామూలుగా విజయరాఘవరావుగారి అనుమతి పొందడానికి వచ్చాడు ఒక చల్లని సాయంత్రం వేళ. ఆ వేళ ప్లీడరుగారు ఎటూ పోకుండా పై అంతస్తులో కూర్చుని రేడియో సంగీతం వింటున్నారు. ప్రకాశరావు రావడం చూసి ఆయన తన పక్క కుర్చీ చూపి కూర్చోబెట్టారు. ప్రకాశరావు ఏదో అడగాలని వచ్చాడని ఊహించుకున్నారు కాబోలు రేడియో వాల్యూం బాగా తగ్గించి, '' ఏం నాయనా! ఏం కావాలి?'' అని మామూలు ఆదర స్వరంలోనే అడిగారు. ప్రకాశరావు కాస్త, ఉపోద్ఘాతం ఇవ్వాలనుకున్నాడు గాని ఎట్లా ఇవ్వాలో తెలీక, '' ఇంటర్ చదువుదామని ఉందండీ!'' అన్నాడు బహు నమ్రతగా

''దానికేం, కానీ!'' అన్నారు ప్లీడరుగారు. ఆయనగొంతులో ఏదో ఒక విషయాన్ని నూతనంగా చెప్పవలసి వచ్చినప్పటి ఆదుర్దా, పెనుగులాట ధ్వనిస్తోంది. ప్రకాశరావు ఆయన మాటకోసం ఎదురు చూస్తున్నాడు. విజయ రాఘవరావుగారు రేడియో పూర్తిగా ఆపివేసి, ''ప్రకాశం! నీతో ఎన్నాళ్ళనుంచో ఓ విషయం చెబుదామనుకుంటున్నాను'' అని అన్నారు కుర్రాడి మనస్తత్వాన్ని పరిశీలిస్తున్న వారిలా.

ఏం పిడుగు పడనున్నదో ! అన్నట్లు మౌనంగా వింటున్నాడు ప్రకాశరావు.

ప్లీడరుగారు ఇదివరకే ఆలోచించుకుని ఉన్నారు. తను ప్రకాశరావుకి కలిగించిన సౌకర్యాల ప్రతిఫలం తను చెప్పబోయ్యేదానికి అతను అంగీకరించి తీర్తాడని అంచనా వేసుకున్నారు. ''నాయనా!

నీకైనా ఎవ్వరూ లేరంటున్నావు. నీబోటివాణ్ణి బాగుచేస్తే కలకాలం జ్ఞాపకం ఉంచుకుంటావు. నన్ను ఒక్క దిగులుమాత్రం రాత్రి, పగలూ వేధిస్తోంది. అమ్మాయి భవిష్యత్తు ఏమిటా అని'' ఆ పైన చెప్పదల్చుకున్న మాటలు గొంతు బొంగురుపోవడం చేత ఆగిపోయినై.

ప్రకాశరావు గుండె దడదడలాడు తున్నది. ఏమిటా చెప్పబొయ్యేమాట? ''చెప్పండి...'' అన్నాడు అది ఏదైనా వినటానికి సిద్ధపడి.

''అమ్మాయికి పెళ్ళి చేస్తేనేగాని, దాని దిగులు నాకు పోదు. ఇటుచూడు, నీకు జీవితాంతం ఏ కష్టాలు లేకుండా చేస్తాను...''

ఆ ధోరణి ప్రకాశరావుకి అర్థమైనట్టు తోచింది. ''సరేనండీ! మీ రింతగా చెప్పాలా... మీరు చేసిన ఉపకారానికి ఇంకా ఎట్లా కృతజ్ఞత తీర్చుకోను?'' అనేశాడు.

ప్లీడరుగారు ''మంచిది నాయనా!'' అని మాత్రం అన్నారు.

## 3

ప్రకాశరావుకీ, పద్మకీ వివాహం ఏ ఆడంబరాలు లేకుండా శాంతంగా జరిగిపోయింది. ప్లీడరుగారు పద్మ పేర ఒక యిల్లు, పదెకరాల పొలమూ రాశారు. తన పేర రాయమని అడుగుదామని ప్రకాశరావు అనుకొన్నాడు. కాని ఒకరకమైన తక్కువదనం 'ఫీల్' అయ్యేవాడికి అవసరానికి మాటలు పెగలవు. ప్రకాశరావుకి పెళ్ళి తర్వాత ఏదో చింత పట్టుకొని మనస్థిమితం లేకుండా ఉంటున్నది. చదువు మానేశాడనే చెప్పాలి. జరగనున్నాళ్ళూ ఉన్న ఆసక్తి, జరుగుబాటురాగానే పోయింది. అతని చింతకి కారణం భార్య పెళ్ళినాడు వచ్చిన కొద్దిమంది మిత్రులూ, తనవంక జాలిగా చూస్తూ ''అదృష్టవంతుడివిరా!'' అన్నారు. ఈ జాలికి కారణం వాళ్ళకు మల్లె తన భార్యతో తను షికార్లు వెళ్లలేక పోవటమేనా? ... ఇంకా ఆలోచించేవాడేగాని మనస్కరించక వూరుకున్నాడు. ప్లీడరుగారి సలహాతో, పద్మ పేర రాసిన ఇంట్లోనే కాపరం పెట్టాడు. వంటమనిషిని కుదుర్చుకున్నాడు. సాఫీగా జరిగిపోతుంది జీవితం. కాని ప్రకాశరావు ఊహించిన పథాల్లోకి పద్మదగ్గిర అతనికి సుఖాలు లభించలేదు. ప్రకాశరావు దుర్మార్గుడుకాడు. అతను భార్యావ్రతుడు మాత్రం కాలేకపోయినాడు. అతను నెలలో ఇరవైరోజులు ఇంట్లో పడుకోడంలేదు. ఈ సంగతులు స్పష్టంగా తెలిసినా, పద్మ అతన్ని ఏమీ అనలేదు. తనకున్న బలహీనతే వీనికి కారణం కాదు. అసలామెకు పెళ్ళంటేమొదట్నించీ సరిపడలేదు. ప్రకాశరావు మీద ప్రత్యేకించి ఆమె ఏమీ అభిమానం చూపలేకపోయింది కూడాను. ఎవరైనా తనకు భర్త అవుతాడూ అంటే, అతను చాలా స్వార్థంతోనే అట్టిపనికి పూనుకుంటాడు అనేది ఆమె ధృఢనిశ్చయం. నిజంకూడా అంతేనేమో! ప్రకాశరావైనా, ఏమీ లేనివాడు గాబట్టే ఈ వివాహానికి అంగీకరించాడు గాని అతని దయార్ద్రహృదయం కరిగి కాదు. ఇంత స్పష్టంగా భర్త స్వార్థపరత్వం ద్యోతకమౌతున్నప్పుడు ఆమె - భర్త ఇంట్లో పడుకోకపోయినా బాధ పడలేదంటే అసహజం ఏమీ

లేదు. ప్రకాశరావు ఆమెని ఎప్పుడూ హేళన చెయ్యలేదు. తన ప్రవర్తనే అన్నిటికీ సమాధానం అన్నట్టు ఊరుకున్నాడతను. అయితే ప్రకాశరావుని ఇప్పుడూ ఒక సమస్య వేధిస్తూనే ఉంది. అది అనాదినుంచీ వేధిస్తున్న సమస్యే. పరస్త్రీ సాంగత్యానికి డబ్బుండాలి. తన పరిజ్ఞానం పెరుగుతున్న కొద్దీ వ్యక్తికి అవసరాలు పెరుగుతాయికదా? ఈ ఆర్థిక చిక్కులో, ప్రతిసారీ భార్యని డబ్బు అడగడం ప్రకాశరావుకి చికాకుగా వుంది. కాని ఏం చేయ్యడం? ఆస్తి కాస్తోకూస్తో వుంటే అది పద్మ పేరుతోనే వుంది. ప్రకాశరావు ఇట్లా అవుతాడని ప్లీడరుగారు అనుకోకపోయినా, ' ఎట్లా ఉండబోతుందో' అనే కూతురుపేర రాశాడు ఆస్తి. ప్రకాశరావుకి పరువుగా దొరకగలిగినన్ని ఋణాలు దొరికినై. కాని ఎన్నాళ్ళు? మొత్తం ఏడెనిమిది వందలయ్యేప్పటికి ప్రకాశరావు భార్యని అడగాల్సి వచ్చింది.

''పద్మా! నా.కొక ఎనిమిది వందలు కావాలి'' అన్నాడు చాలా ప్రేమ పురస్సరధ్వనిలో.

పద్మ అతనికళ్ళల్లోకి క్షణం చూసి, ''ఎనిమిదివందలా! ఎక్కడ తెమ్మన్నావు నన్ను?'' అంది.

''నేనెట్లా చెప్పను? మీ నాన్ననో, అమ్మనో అడిగి...'' అని మాట ఆపి, భార్య ముఖ వర్చస్సులోని మార్పుకి విభ్రాంతుడైనాడు ప్రకాశరావు. అసహ్యం వ్యక్త పడే ముఖ కవళికలు పెట్టి, పద్మ ''వాళ్ళను అడగను, నా దగ్గర లేదు'' అని ఖచ్చితంగా చెప్పేసింది.

ఎన్నడూ కోపం ఎరుగని ప్రకాశరావుకు కోపంతో వొళ్లు కంపరమెత్తింది. ''నాన్‌సెన్సు! దీనిదగ్గర కూటికి పడి వున్నందువల్లేగా ఇది ఇంత నిక్కచ్చి వెధవ మొహం వేసుకు చెప్పేసింది డబ్బులేదని?

దీనికి ఒక్కటే ప్రతీకారం, ఈ కుంటి ముండను వొదిలెయ్యటమే' కాని తన భవిష్యత్తును గురించిన ఆలోచన తన కనుసరం ఇప్పుడు. ప్రకాశరావు మంచం దిగి ''కుంటిముండా! నీతో కాపురం చేసినందుకు నన్ను బాగా గౌరవించావు, చాలు! నేను ఎక్కడయినా బతగ్గలను. నీకూ, నాకూ ఇంతటితో వొదిలిపోయింది'' అంటూ గడపదాటి నడిచాడు. పద్మ ఏమీ మాట్లాడకుండా ఊరుకుంది. ప్రకాశరావు అనుకున్నట్టు ఆమె అతని పాదాలపై బడలేదు. అప్పుడేకాదు ఆమెజీవితాంతంవరకూ అతనికోసం ఏవిధమయిన బాధా పడనూ లేదు.

( ఈ కథ ఏమిటి ఇట్లా ముగిసీ ముగియన్నట్టున్నది అని ఎవరూ ఆశ్చర్యపడ నక్కర్లేదు. పద్మ ఏమాత్రం తను కుంటిది అని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సుఫీల్ ఐవున్నా, కథ సుఖాంతమై వుండేది. పద్మని ప్రకాశరావు పాదాలమీద పడెయ్యటం సంభవిస్తే ఈ కథ వ్రాయటం అనవసరం. ఒక్క పద్మ సుఖం కోసం మాత్రమే ప్రకాశరావు ఆమెని పెళ్ళి చేసుకోలేదుకద? - రచయిత)

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# ఆకర్షణ

అటు అదివరకు చాలా తడవలు వెళ్ళాడు - పని వుండిగాని, లేకగాని. ఆ వేళ మాత్రం కాస్త భయం వేసింది. కారణం లేకపోలేదు. కాస్త పొద్దు పోయింది. సన్నగా తుప్పర రాలుతోంది. బజారంతా నిర్మానుష్యంగా ఉంది. వీధి దీపాల కాంతికి అడ్డంగా చెట్లనీడలు దెయ్యాలల్లే కదులుతున్నాయి. చంద్రశేఖరం భయ నివృత్తికోసం అనవసరంగా క్రాపు సర్దుకొని సిగరెట్ వెలిగించి ఒకసారి గట్టిగా నవ్వి ధైర్యాన్ని కూడదీసుకున్నాడు. అతనికింకా వివాహం కాలేదు. తండ్రి వొదిలి పెట్టిన ఆస్తీ, వ్యాపారమూ చల్లగా వున్నాయి. జేబునిండా డబ్బు, పొంగే యవ్వనమూ.

అతడు ఆ బజారులోని 22వ నెంబరు యింటి ముందు ఆగి సరిగ్గా మూడుసార్లు తలుపుమీద తట్టాడు. ఐదు నిమిషాల తర్వాత ఓ ముసలమ్మవచ్చి తలుపు తీసింది. చంద్రశేఖరం ఆమె ననుసరించి వెళ్ళాడు లోపలికి. యిప్పటికి అతని గుండె కుదుటపడింది. అతడు లోపలివైపంతా ఓసారి కలియజూచి ''అది వొచ్చిందా?'' అని అడిగాడు.

ముసలమ్మ సమాధానం చెప్పకముందే ఎడంవేపు గదినుంచి ఓ పదిహేడేళ్ళ యువతి బయటి కొచ్చింది. శోభాయమానంగా వెలుగుతూ ఉన్న ఎలక్ట్రిక్ లైటు కాంతిలో ఆ అమ్మాయి శోభమరింతగా కనిపిస్తోంది. ఆమె చిరునవ్వు నవ్వి ''రారేమో అనుకున్నాను. ఇంత పొద్దు పోయిందేం యివ్వాళ?'' అంటూ యెదురు వచ్చింది అతనికి.

''కాస్త పనివుండి ఆగిపోయినాను శశీ!'' అంటూ చంద్రశేఖరం ఆమె భుజంమీద చెయ్యివేసి గదిలోకి తీసుకెళ్ళాడు.

ఆ గది అదివరకే అతనికి పరిచయమైనా ఆ వేళ ఎందుకో చాలా అందంగా కనిపించింది. కొత్త కొత్త పరిమళాన్ని మోసుకు వస్తున్న చల్లగాలి అతన్ని ఉత్తేజ పరిచింది. లెవండర్ సువాసనలు వెదజల్లుతున్న ఆమె జుట్టు చేత్తో సవరిస్తూ అతను పేము కుర్చీలో కూర్చుని ఆమెని వొళ్ళో కూర్చోబెట్టుకున్నాడు. ''శశీ, శశీ!'' అని పిల్చాడు మెల్లిగా ఆమె మొహం దగ్గిర తన మొహం పెట్టి.

ఆమె వెన్నెల కాసినట్టు నవ్వింది. ''నే నిక్కడే వున్నా' నంది అతని నొక్కుల క్రాపుసర్దుతూ.

''నువ్వింత దగ్గిరలో ఉన్నా, ఇంకా ఈబాధ పోదేమిటి శశీ!'' అంటూ చంద్రశేఖరం ఆమె రక్తవర్ణపు పెదాల మీద వెచ్చగా ముద్దెట్టుకున్నాడు.

''అదంతా నీ పిచ్చి'' అంది కిలకిల నవ్వుతూ ఆమె. పచ్చకర్పూరం వాసన వేసింది ఆమె నవ్వు. గాలి కిటికీ గుండా స్వర్గంనించి ఆనందాన్ని మోసుకువస్తోంది. ఆ యవ్వనులకోసం.

''శశీ!''

'' ఏమిటో చెప్పు.''

''వెన్నెల, వాన, చీకటి అన్నీ అందంగానే వుంటాయి పక్కన నువ్వుంటే.''

''నీదంతా కవిత్వం.''

''కాదు - నిజం.''

ఆమె మెల్లిగా లేచి మంచంమీద పడుకుంది ఒయ్యారంగా వొళ్ళు మెనక్కి విరుచుకుంటూ. చంద్ర శేఖరం అక్కడేకూర్చుని ఆమెని కళ్ళతో ఫోటో తీసుకుని దాచుకుంటున్నాడు మనసులో

''అబ్బ! అట్లా చూడకండి- నాకెట్లాగో ఉంటుంది'' అంది శశి.

చంద్రశేఖరం, ఆమె దగ్గిరకి వచ్చినుంచుని ''ఇవ్వాళ తెల్లారేదాకా ఉంటావా, వెళ్ళిపోతావా?'' అంటూ ఆమె పక్కనే మంచంమీద వాలాడు.

''తెల్లారేదాకానే! ఇంకో గంటన్నరకల్లా వెళ్ళి పోవాలి. నేనేమన్నా... అనుకున్నా రేం కొంపతీసి ....?'' అంది శశి అతన్ని వెచ్చని కౌగిట్లో బిగిస్తో. ఆ స్పర్శానందంలో తన్మయుడవుతూ అతడు, ''ఈ సుఖం, అనంతమూ, శాశ్వతమూ కాగూడదూ?'' అన్నాడు.

''పాపం.... ఎంతాశే!'' అంది శశి.

ఈ ప్రణయం అప్పటికి నాలుగునెలల క్రితం నించీ సాగుతున్నా, చంద్రశేఖరానికి తన ప్రియురాలెవరో పూర్తిగా తెలియదు. ఆమె ఎవరో, మంచి స్థితిగల కుటుంబ స్త్రీ అని మాత్రం వూహించుకున్నాడు. ఆమె పేరు శశి అని ఆమె చెప్పటము ఋజువు. ఇంకొకటి, ఆమె అతని దగ్గిర ఎన్నడూ దమ్మిడీ పుచ్చుకోలేదు. ఆ యింటావిడకు మాత్రం అతను అప్పుడో పది, అప్పుడో పదిహేనూ ఇచ్చాడు. శశి రాత్రి పన్నెండున్నరకి అతనితో కలిసి, ఊళ్లోకి కొంతదూరం వచ్చి తర్వాత విడిపోయింది పోలేక పోలేక.

వరసగా నాలుగురోజులు, చంద్రశేఖరం అటు వేపు వెళ్ళలేకపోయినాడు తన పెళ్ళి హడావుడితో. పెళ్ళి కాకముందే అంతా హడావుడీను. ఐదో రోజున శశి దగ్గరకు వెళ్ళాడు.

''నాలుగు రోజుల్నించీ తీరనేలేదా?'' అంది శశి నిష్ఠూరంగా, ఆమె ఆవేళ చాలా అందంగా అలంకరించుకు వొచ్చింది. ఆకాశ నీలపు రంగు సిల్కు చీరె, ఆకుపచ్చని రవిక, మల్లెపూలు, గదంతా మల్లెపూల సువాసనతో ఘుమ ఘుమ లాడుతోంది.

''చెబితే కోప్పడతావు మరి'' అన్నాడు ఆమె గడ్డం కింద చెయ్యి పెట్టి బుజ్జగిస్తూ.

''నా కోపం ఏం చేస్తుంది మిమ్మల్ని? చెప్పండి...'' అంది మంచంమీద కొంచెం జరిగి అతనికి స్థలం ఇస్తూ.

''ఆ పక్కన ఏదో పల్లెటూర్లో నాకు పిల్లని మాట్లాడారు మా వాళ్ళు. వంశక్షేమం కోసం నేను పెళ్లి చేసుకోవాలి.'' అన్నాడు నవ్వుతూ అతను.

''పిల్లని చూశారా?'' అని అడిగిందామె కొంచెం జలసీతో బుంగమూతి పెట్టి.

''అదిగో, ఆలా మూతి పెడితే నాకు కొరక బుద్ధవుతుంది. పిల్లని చూడలేదులే. అది ఎలా వున్నా బాధలేదు. సుబ్బలక్ష్మి అట పేరు. ఎవరో ఒకతె పెళ్ళామంటూ ఉంటే, వంటకీ దానికి ఇబ్బంది ఉండదు. చూడు, ఏ వేళకి పోయినా తలుపు తీస్తూ ఉంటుంది'' అని పెద్దగా నవ్వాడు చంద్రశేఖరం.

శశికూడా నవ్వి ''మీకు భార్య అంటేఎంత విలువండీ! అది సరేగానండీ - నేనూ పెళ్లి చేసుకుంటా నను కోండి మీ కిష్టమేనా?'' అని అడిగింది అతని ఒళ్ళో పడుకుని.

చంద్రశేఖరం నవ్వలేదుగాని, ''ఒద్దంటానికి నేనెవణ్ణిగాని, అందులో నీకు కొంత సుఖంవుంది, ఇబ్బందీ ఉంది. నీకు పుట్టే పిల్లలకి సాంఘికరక్షణ ఉంటుంది...'' అని ఆపేశాడు నవ్వి.

శశి అతన్ని ఆపైన మాట్లాడనివ్వకుండా ముద్దులతో నింపేసింది.

చంద్రశేఖరం శుభలేక ఒకటి శశి కిద్దామని పది రోజుల్నించీ ప్రయత్నించికూడా, ఆమె అక్కడికి రాక పోవడంవల్ల కుదరలేదు. తల్లీ, చెల్లెలూ పెళ్ళికూతుర్ని చూసి వచ్చారు కాని, అతను పోలేదు. కారణం ఎవరైతే ఏమనే నిర్లక్ష్యమే. పిల్లబాగానే ఉందిట. ఈడూ, జోడూ అని వాళ్ళు అభిప్రాయపడ్డారు.

పెళ్ళికి ముందురోజు అంతా పల్లెటూరు వెళ్ళారు. చంద్రశేఖరం, తన మామగారి ఐశ్వర్యానికి ముగ్ధుడయినాడు. అదీగాక తనభార్య చెల్లిల్ని చూసి తన భార్య మంచి అందకత్తే అని ఊహించుకొని కొంచెం తృప్తిగూడా పడ్డాడు.

పెళ్ళిరోజు తెల్లారకట్ట ముహూర్తం. నిద్రకళ్ళతో చంద్రశేఖరం. పెళ్ళిపీటల మీద మొదటిసారిగా తన కాబోయ్యే అర్థాంగిని చూశాడు. కళ్ళు నులుముకుని తేలు కుట్టిన వాడిలా మళ్ళీ చూశాడు. ఆ అమ్మాయి కూడా అల్లాగే చూసింది. తనకేమీ తోచడంలేదు. పురోహితులు మంత్రోచ్చారణ చేస్తూ, ''ముహూర్తం సమీపిస్తోంది'' అని మంగళసూత్రం అతని చేతికిచ్చారు.

అతని మనస్సులో బాధతో కూడిన తుఫాను వీస్తోంది. తనతోటి రహస్యంగా వ్యభిచరించిన దాన్నే తను చూస్తూ ఎలా పెళ్ళాడటం? అయినా తనని అద్వితీయానందంలో ముంచెత్తిన శశిని తనకి శాశ్వతంగా అర్పిస్తున్న వివాహాన్ని తనెందుకు నిరాకరించాలి? అయితే తనుమాత్రం పవిత్రుడా? ఆ... ఆ ఆ గదిలో తనకి శశి ఎంతో - శశికి తనూ అంతేగద? ఆమె ప్రవర్తన - తను ఇప్పుడు ఆమెని

తిరస్కరిస్తే నేరవౌతుంది. లేకపోతే తామిద్దరవమూ ఆరోజు నుండీ దంపతులే. ఇలా అలోచించుకున్నాడు అతను.

చంద్రశేఖరం మంగళసూత్రం చేతపట్టుకుని వొంగి పెళ్ళికూతురు మెడలో కట్టబోతూ 'శశీ' అన్నాడు చాలా మెల్లిగా అనుభూతితో.

శశి తలెత్తిచాలా భయంగా అతని కళ్ళల్లోకి చూసింది.

ఆరాత్రి వూరేగింపు జరుగుతోంది. చంద్రశేఖరం దృఢమైన మనస్సుతో మంగళవాయిద్యాల గోలలో ఇంకెవ్వరికీ వినపడకుండా మంత్రం చదువుతున్నట్టు ''నీ అసలు పేరు అప్పుడే చెబితే, ఈ గడబిడగూడా ఉండేదిగాదు'' అన్నాడు.

''మిమ్మల్ని ముఖాముఖీ పెళ్ళి చేసుకోమని అడిగినా ఈ విచిత్రం ఉండేదిగాదు. మా పెద్దలచే మాట్లాడించి పెండ్లి చేయించబట్టే ఇంత బావుంది. అయితే ఇక మీరు నా వంట గదిలో నన్నొదిలి చెడ తిరిగొచ్చి తెల్లవారు ఝామున తలుపు తియ్యమని అరవొచ్చు.'' అంది. శశి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

''సుబ్బలక్ష్మిని వంటింటిలోనూ, శశిని పడక మంచం మీదా బంధిస్తాను'' అంటూ చంద్రశేఖరం తన చేతిని ఆమె నడుముకి చుట్టాడు చిరునవ్వు నవ్వి.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# క్రిస్ట్ మస్ బహుమతి

క్రిస్ట్ మస్ ఇంకా వారం రోజులుంది. తూర్పు సర్కిల్ ప్రాథమిక బాల బాలికా పాఠశాల మొదటి తరగతి విద్యార్థులందరు తమ మేస్టరమ్మకు ఏవైనా బహుమతులు ఇవ్వాలి ఈ క్రిస్మమస్‌కి అని ఉబలాట పడ్డారు. కాని పంతులమ్మ దీన్ని గురించేమీ ఆలోచించనేలేదు అసలు. ఎందుకంటే, హాజరుపట్టీ తిరగేస్తే కనపడే చాలామంది వాకబ్‌లు, రకేల్సు, ఇసివోర్లు మొదలైన వాళ్ళకి క్రిస్టమస్ రోజుకి - మామూలు రోజుకి ఏమీ భేదం లేదని తెలిపోయింది. కనక ఆమె వీటి నేమీ పట్టించుకోకుండా ఉండిపోయింది.

అయితే, మిగతా పిల్లలందరు కలిసి పంతులమ్మ యెడ కనపర్చే ప్రేమనంతా తను ఒక్కడే ఒలకపోస్తున్న మారిస్ మాఖిలోవస్కీ దగ్గిర పంతులమ్మ కివ్వడానికి - బహుమతిగా ఏమీ లేదు. తనకన్న తక్కువగా - నిజమే - పంతులమ్మగారి యెడ వాత్సల్యలేశం వున్న ఇస్టారో విష్‌లెస్కీ, సాడికానో రావస్కీ, ఫిండర్ బెర్తా, వీళ్ళందరి ప్రేమలూ ఏదో ఒక వస్తురూపంగా మారి తన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేస్తున్నై. నిజంగా తనూ, తన ప్రేమని క్రియా రూపంలో చూపించలేక పోవటాన్ని ఆ లేత మనస్సు భరించలేకుండా వుంది. ఇదే జాసలో అతను నిజంగా దిగులు పడ్డాడు. అతని మనోవ్యధని ఒక రకంగా గుర్తించి పంతులమ్మ అతన్ని ఉషారుపర్చటానికి, సంతోషంగా వుండడానికి చేసిన ప్రయత్నాలన్ని, తన నిజమైన వ్యధని పంతులమ్మతో తెలియజెయ్యక పోవటం వల్ల ఆ పసివాడికి పిచ్చెత్తించినాయి.

అతను పంతులమ్మని ఎట్లా ప్రేమించాడు? ఆమెను మొదట చూసినప్పుడు ఆ పసివాడు ఎంతో భయపడ్డాడు. ఆ తర్వాత ఇప్పుడో? ఆమె వాడి హృదయంలో ఒక దేవతగా మాతృస్థానాన్ని ఆక్రమించుకున్నది. మూడేళ్ళ క్రితం - ఆ రోజు అతని కెంతో జ్ఞాపకం వుంది.

ఆ వేళ వాళ్ళమ్మ వాడి ప్రాణం తీసి నీళ్ళు పోసింది. తర్వాత ఆ ఎర్రటి బడికి తీసికెళ్ళింది. బయటనుంచి చూసిన ఆ భవనం వాడికి ఇదివరలో పరిచయమే. కాని, దాని లోపలి భయంకరాలు వాడికి తెలియవు.

వాడు దుమ్ము నిండిన బూట్సుకాళ్ళతో ఆ బళ్ళోకి ప్రవేశించి అన్ని గదులూ దాటి భీతితో తన క్లాస్ రూములోకి ప్రవేశించాడు. తన తల్లి వెళ్ళిపోయింది. ఒక పెద్ద కుర్రాడు వాణ్ణి చెయ్యి పుచ్చుకుని లాక్కుపోయి, మెల్లిగా కూచోటం ఎట్లా, బూట్లు విప్పడం ఎట్లా అని చెప్పి ఒక చోట కూర్చోబెట్టాడు. తనను, 'కేరినీ' అని పిల్చాడతను.

తనని చూచి తన భయం చూచి క్లాసులో పిల్లలు గొల్లుమని నవ్వారు. ఆ చిన్ని హృదయం గాయపడింది. క్రూర మృగాలున్న అడవిలో ఉన్నట్టు 'ఫీల్' అయి గొల్లున ఏడ్చాడు. కాళ్ళు - చేతులూ తన్నుకున్నాడు.

అప్పుడే మొట్టమొదటిసారిగా - తను ఇప్పుడు చాలా ఇష్టపడే, ఆ గొంతును పరిచయం చేసుకున్నాడు. ''ఏం అబ్బాయి? అట్లా ఏడవచ్చా? తప్పుకదా?'' అంటూ నేలమీద కూర్చొనివున్న తన్ను లేవదీసింది ఆమె.

ఆ చెయ్యి ఏంతో మృదువుగా వున్నది. గొంతు కూడా ఎంతో ఆప్యాయంగా వినిపించింది. వీటితో కూడా సన్నని సువాసనకూడా కలిసి తన మొహాన్ని కప్పుకున్న చేతిని తీసేసుకునేట్టు చేసింది. ఏడ్చి ఏడ్చి ఎర్రబడ్డ కళ్ళతో తన పక్కనే కూర్చుని వున్న ఆ 'పెద్ద' అమ్మాయిని చూశాడు. ఆ పెద్ద ఆకారాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు ఆ అబ్బాయి - మొదట బూట్సులవంక తర్వాత పూలగౌను వంక, ఆ తరవాత మొహంవంక, ఇంకా నమ్మకం కుదరని చూపుతోనే. కాని ఆ పంతులమ్మ కళ్ళల్లో ఆ పసివాడి భయకంపిత నేత్రాలకి ఆదరణ లభించింది. అవి అక్కడే నిలిచి పోయ్యాయి.

ఆమె, మారిస్‌ని రెండు చేతుల్తో ఎత్తుకుని గుండెల్లో హత్తుకుంది. వాడి ఏడ్పు, ఎక్కిళ్ళు తగ్గాక మెల్లిగా అడిగాడు - ''నేను ... చిన్నవాణ్ణే కాదూ? మా అమ్మ ఏదీ?'' అని.

ఆ తరవాత తన కష్టాలు ఏకరువు పెట్టి ఎలాగో ఓ లాగున ఆ రోజున తన జీవితంలో మొదటి బడి రోజును గడిపాడు.

అక్కణ్ణించీ బడికి అందరికంటె ముందుగా హాజరయ్యేదే అతను, చివరికి పొయ్యేదీ అతనే. పంతులమ్మగారి ప్రేమాదరాలతో అతని విద్యే కాక, ఆనందం, వాత్సల్యం క్రమంగా అభివృద్ధి కాసాగాయి. పంతులమ్మపట్ల వాత్సల్యమే అన్నిటికన్న పై అంతస్తులో వుంది ఇప్పుడు. మిగతా పిల్లలందరూ పంతులమ్మకు ఆశ్చర్యం కలిగించే విధంగా బహుమతు లివ్వడానికి ప్లానులు వేస్తూవుంటే, అతని హృదయం నిండుగా వాత్సల్యపూరితం ఐనా, చేతులు మాత్రం ఖాళీగా ఉండి బాధపడవల్సి వచ్చింది. అమ్మతో చెప్పి చూశాడు సమాధానం ''అలాంటిదేమీ పనికిరాదు'' అని తేలింది.

''నీకెందుకురా ఈ గొడవ? నాన్నకి తెలిస్తే కోప్పడతారు'' అంది అమ్మ.

మారిస్ మొండిగా ''మిగతా పిల్లలందరూ పంతులమ్మగారికి బహుమతులు ఇస్తూన్నారే...'' అని సణిగాడు. తనకి పంతులమ్మంటే ఎంత ప్రేమో వివరించడం ఆ కుర్రాడికి మాటల్లో సాధ్యంకాకుండా వుంది.

''సరె, సరే... ఏం కొనటానికీ మన దగ్గర డబ్బు లేదు. నాన్నకి డబ్బు ఎక్కువ దొరుకుతుందేమో ననే భయం ... నాన్న యజమాని'' .. ఆ పైన ఆమె మాట్లాడలేక కొడుకుని కావలించుకుని

భోరునఏడ్చింది. కనక మారిస్‌కు వేరే దారిలేదు. అమ్మా నాన్నా బీదవాళ్ళు. ఇవి పంతులమ్మకి తెలుస్తాయా!

ఇవ్వాళ ఆ క్రిస్టమస్‌కి ముందురోజు శుక్రవారం ఉదయం బడి అంతా అల్లరిగా, ఆనందంగా ఉంది. ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉండే ఆ 18వ నంబర్ క్లాస్ రూమ్ గూడా, ఒకళ్ళతో ఒకళ్లు గుసగుసలాడే శబ్దాలతోనూ, కొత్త గుడ్డలు నలిగే ధ్వనితోనూ నిండివుంది. అంతా గందరగోళం, రంగురంగులు దుస్తులు ధరించి బంతులల్లేగెంతే పసివాళ్ల ఆనందం కోలాహలంతో అంతా శోభాయమానంగా ఉంది. వాళ్ళ చేతుల్లో ఏవేవో పొట్లాలుగూడా వున్నై. కొత్తవాళ్ళు రాగానే పాత వారంతా వాళ్ళ మీదికి ఎగబడి వాళ్లు ఏం బహుమానం తెచ్చారో చూసేదాకా రగడ.

పంతులమ్మ తన శిష్యులవైపు ఆశ్చర్యంగా చూస్తూ వుంది. పిల్లలు ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారు? ఇంత కొత్తగా విచిత్రంగా కనుపడుతున్నారేమిటి; ఒక్క రాత్రిలోగా ఎంతో పెద్దవాళ్ళుగా మారిపోయినట్టు కన్పిస్తున్నారేమిటి? ఇదంతా చూస్తూంటే పంతులమ్మకి నవ్వొచ్చింది. ఇంతలో, ఈ గోల అంతటికన్న పెద్దగా కీచుగా ఓ ఆర్తనాదం వినిపించింది. రెండు డస్కుల మధ్య రెండు తన్నుకుంటున్న కాళ్ళు కన్పించినాయి. పంతులమ్మ పరిగెత్తింది విడిపించటానికి. ఆకాళ్ళ బ్రౌను రంగు మేజోళ్ళవల్ల, పచ్చపూల గౌనుతోను ఆపిల్ల 'బెర్తా' అని ఊహించింది ఆమె. కాని తీరా చూస్తే ఇంకో లావాటి అమ్మాయి అని తేలింది. బెర్తా సన్నగా వుంటుంది. తర్వాత విచారిస్తే, బెర్తా తొడిగే 'డ్రస్సు' ఓ ఫాష నయిందట!

పంతులమ్మ గూడా రోజుకన్న అందంగా కనపడుతోంది. మొట్టమొదటగా పంతులమ్మ గారికి 'కానుక' సమర్పింటానికి వచ్చింది ' ఇస్టార్' అనే అబ్బాయి. నవ్వుతూ కొవ్వొత్తి అమర్చే పింగాణీ స్టాండుతో అతను టేబిల్ దగ్గిర నుంచి లేచి వచ్చాడు. ఈ నీలం కలిసిన తెలుపు పింగాణీ స్టాండు తన కేనని పంతులమ్మ మొదట ఊహించలేక పోయింది అసలు?

ఇస్టార్ తన చేతిలో బహుమతిని టేబిల్ మీద పెట్టి ''రేపు సెలవుగదండీ! మీ మీద మాకు చాలా ప్రేమ గదండీ!... అందుకని ఈ బహుమతి తెచ్చాం ఈ స్టాండు ఇరవై సెంట్లు ఖరీదుటండీ!''

''అబద్ధం అండి మేష్టారు! పది సెంట్లకి మూడుదొరుకుతై'' అని ఇంకో కీచుగొంతు అరిచింది. కాని పంతులమ్మ గారు ఇస్టార్‌ని సమర్థించి '' అవును, కొనవచ్చు - కాని, ఈ స్టాండు నలభైసెంట్లు ఖరీదు కూడా ఉండవచ్చు. ఇదే నాకు కావాలి. నువ్వు మంచి బహుమతి తెచ్చావు ఇస్టార్!'' అన్నది.

ఇస్టార్ తనబల్ల దగ్గిరికి తిరిగి వెడుతూ, ''అంతా రావొచ్చు'' అన్నాడు. అంతే - మొదటి తరగతి పిల్ల లందరూ ఒక్కసారి గల్లంతుగా వొచ్చి పంతులమ్మగారి టేబిల్ ముందు నెట్టుకుంటున్నారు. ఎవరు తెచ్చిన బహుమతులు వారు తాము ఇవ్వాలంటే తాము ఇవ్వాలని తోసుకు రాసాగారు. అంతేగాదు. పంతులమ్మ గారిని కావులించుకుని ఊపిరాడకుండా చేస్తున్నారు.

నాదన్ ఓ కప్పు - సాసర్ సెట్ తెచ్చాడు. ఇంకో అబ్బాయి మూడేళ్ళనాటి పెద్దబొమ్మల కేలండర్‌ని బహుమతిగా తెచ్చాడు. ఒక బాటిల్ సెంటు, ఓ సిల్క్ రుమాలు పెట్టిన అందమైన చిన్న బుట్టని అందించాడు 'సారా'. ఇంకో అబ్బాయి ఫౌంటెన్ పెన్నుపెట్టె, పసుపుపచ్చ గుండీ తెచ్చాడు.

మళ్ళీ ఓ ఏడుపుగొంతు వినిపించింది. పంతులమ్మ పరిగెత్తుకువెళ్ళి క్లాస్‌రూమ్ తలుపు తీసింది. అక్కడ ఓ అమ్మాయి విచారంతో నిలబడివుంది. ఆమె జుట్టు రేగివుంది. ఆమె చేతిలోవున్న బంగారు గిల్టుపూసిన సాసర్‌ని గుండెలకు అదుముకుని ఏడుస్తోంది.

''ఎందుకమ్మా ఏడుస్తున్నావ్ యివాళ?'' అని పంతులమ్మ చాలా దయగా అడుగుతూ ఆ చిన్నమ్మాయిని క్లాస్ రూమ్‌లోకి తీసుకొచ్చింది. ఈవా ఏడుస్తూ తను తెచ్చిన కప్పు సాసర్‌లలో కప్పుని ఓ పెద్దకుర్రాడు లాక్కుపోయి నాడు అని చెప్పింది. ఈవా ఏడుపు పంతులమ్మ ఓదార్పు మాటలతో కొంచెం తగ్గింది. జాకబ్ అనే అబ్బాయి పంతులమ్మగారికి తాబేటి బుర్రతో చేసిన దువ్వెన బహుమతిగా పట్టుకొచ్చి దాన్ని పంతులమ్మ జుట్టులో అందంగా పొదిగి ''ఇది ఇరవై సెంట్లు అయిందండీ!'' అని చెప్పి వెళ్ళాడు.

ఇంతలో ఇంకో పెద్దకుర్రాడు తొందరగా లోపలికి వచ్చాడు. వాడు పద్దెనిమిదివ నెంబరు రూము కుర్రాడు కాదు. అయినా వాడికి పంతులమ్మగారు చాలా రోజుల్నించీ పరిచయం. అందుకని వాడూ ఓ బహుమతి తెచ్చాడు. క్రిష్టమస్ అభివందనాలు చెప్పాక తను తెచ్చిన అందమైన బంగారు కప్పును బల్లమీద పెట్టాడు. ఇంతలో ఈవా, ''వీడేనండి - నా కప్పు లాక్కు పోయాడండి! అదే నా కప్పు'' అని క్లాస్ రూమ్ అదిరిపోయ్యేటట్టు కేక పెట్టింది. పంతులమ్మ గారిపని ఇరుకున పడింది. కాని ఆ కుర్రాడి వ్యవహారం తేలిక. '' అబద్ధం'' అని మొండివాదన వాడిది. కప్పూ సాసరూ ఒకేజత అని నిరూపించబడినా గాని వాడివాదన మానలేదు.

ఈ మధ్యలో బహుమతులిచ్చే వాళ్లు యిస్తూనే ఉన్నారు.సాసర్లూ, కప్పులూ, రిబ్బన్లూ, సబ్బులూ బల్లనిండా సందులేకుండా ఉన్నాయి. వాటిని చుట్టి తెచ్చి కాయితాల్ని ఓ పక్కగా పొయ్యటానికే ఓ కుర్రాడికి సరిపోతుంది. నిజానికి ఇంకే పంతులమ్మకి ఆ రోజు ఇన్ని బహుమతులు వచ్చి వుండవు. వాళ్ళు పిల్లలపట్ల యింత వాత్సల్యంగా ఉండలేదు గూడాను.

పంతులమ్మగారికి ఇదొక గొప్ప విజయమే ననాలి. గందరగోళం ఒక్కరవ్వ తగ్గింది. ఇంతలో పంతులమ్మగారు మోకాలిమీద ఓ చిన్న చేయి వాలింది. ''మేష్టారూ! నేనూ ఓ బహుమతి తెచ్చానండి మీకు!'' అని సన్నని సుపరిచిత స్వరం వినిపించింది. పంతులమ్మ తిరిగి చూసింది. మారిస్ బటనులు లేని చొక్కాతో కనిపించాడు. అదే వాడి మామూలు దుస్తులు.

''నాకు నువ్వెందుకు బహుమతి తెచ్చావ్ మారిస్!... మనిద్దరం స్నేహితులమేగా!...'' అని ప్రారంభించింది పంతులమ్మ.

'' అవును మేష్టారు! మీరు నన్నెంతో ప్రేమిస్తున్నారు. నేను మిమ్మల్ని ఎంతో.. దాన్ని ఎట్లాగండి చెప్పడం? అందుకోసం బహుమతి తెచ్చా!'' అన్నాడు మారిస్... ఇంకా చెప్పుకు పోతున్నాడు. '' నా దగ్గిర సబ్బు లేదు. సెంటు దొరకలేదు. స్టోర్‌నించి మా అమ్మ ఏమీ తేలేదు. కాని మేష్టారు! మీకు ఓ మాంచి బహుమతి తెచ్చానండీ! '' అని ముగించాడు.

'' అదేమిటి బాబూ! ఇలాతే..'' అని చాలా వాత్సల్యంతో అడిగింది పంతులమ్మ.

''మేష్టారు! ఇదిగోనండి... ఇదేమిటోనాకు తెలీదు. యిదేమిటో తెలుసుకోవాల్సినంత పెద్దవాణ్ణి కానుకదండీ! కాని యిది అబ్బాయిలకి కాదుటండి! ఆడ వాళ్ళకేనట. నిన్నరాత్రి నాన్న అమ్మకి ఈ బహుమతిని - యిచ్చాడు. అమ్మ దీన్ని తీసుకుని సంతోషపడింది. కళ్ళ నీళ్ళు కూడా పెట్టుకుంది మేష్టారు! నాన్న గూడా సంతోషించాడు. అమ్మ అన్నదిగదా, 'చాలా సంతోషం' అని దీన్ని చూసినప్పుడల్లా చాలా సంతోష పడిందండి! నాకు సబ్బు దొరకలేదండి!'' అన్నాడు.

''అది సరేబాబు! మీ అమ్మ నాకివ్వమని చెప్పిందా?'' అని కనుక్కుంది పంతులమ్మ.

''లేదండి మేష్టారు! అమ్మకి తెలీదు. కాని ఇది ఆడవాళ్ళకేటండి - నా దగ్గిర సబ్బులేదు మీరే చూడండి దాన్ని! అది ఆడవాళ్ళకేనట?''

మారిస్ తనలాగు జేబునించి ఓ రోజారంగు కాయితాన్ని పంతులమ్మ కందించాడు. పంతులమ్మ దాన్ని చదివేటప్పుడు ఆమె కళ్ళల్లో సంతృప్తికోసం ఆశగా మారిస్ ఆమె వేపే చూస్తూ నుంచున్నాడు. ఆమె చదవటం పూర్తిచేశాక వాడివంక చూసినప్పుడు, మళ్లీ వాడు, ''అది ఆడవాళ్ళకేటండి! నాకు సబ్బు దొరకనే లేదండి'' అన్నాడు-అమాయకమైన స్వరంలో

''కాని మారిస్!'' అని పంతులమ్మ విషాదంగా, కళ్ళ నీళ్ళ పర్యంతమైన చిరునవ్వు నవ్వుతూ పిలిచింది. ''ఇది సబ్బుకంటే గొప్ప బహుమతి! సెంటుకన్న చాలా గొప్పది మారిస్ ! మంచిది గూడా ! ఇది ఆడవాళ్ళకేలే - నాకు ఇంకెవ్వరూ ఇలాంటి బహుమతి ఇవ్వనేలేదు!'' అన్నది ఆమె ఉద్రేక పూరితంగా.

మారిస్ గర్వంగా ''మా నాన్నగూడా ఇట్లాగే అంటాడు'' అనేసి కుర్రాళ్ళతో కలిసి కోరస్ పాట పాడ సాగాడు.

మిగతా కాలాన్ని చాలా ఉత్సాహంగా ఆవేళ ఏమీ జరగనట్టే గడిపాడు. సాయంత్రం మూడుగంటలకు పంతులమ్మగారి దగ్గిర సెలవు తీసుకుంటూ ''ఏమండీ! మీరు ఈవాని మాత్రం ముద్దెట్టుకుంటారు గదా! నన్నెప్పుడూ ముద్దు పెట్టుకోరేమండీ?'' అని అడిగాడు సహజంగా.

''అది మగపిల్లలకు దొరకదు మారిస్!'' అంది పంతులమ్మ నవ్వుతూ

''ఈ బహుమతి ఇచ్చినందుకైనా నన్ను ముద్దెట్టుకోవాలండి మేష్టారు!'' అని మారిస్ మారాం చేశాడు.

★ ★ ★

ఆవేళ రాత్రి పంతులమ్మ తన ఇంటిలో కూర్చుని తన కొచ్చిన బహుమతుల్ని లెక్క వేస్తూంది. అవి ప్రేమాస్పదమైనవి. ఆశపడదగ్గవి, కాని వాటి అన్నిట్లోకి మారిస్ ఇచ్చిన బహుమతిని పంతులమ్మ చాలా ఆశతో మళ్ళీ ఓసారి చూసింది, అది ఒక కుటుంబంలోని భార్య, భర్త, పిల్లాడు ముగ్గురి సంతోషానికి హేతువైన బహుమతి. దాన్నే '' ఇది ఆడవాళ్ళకు మాత్రమేటండి'' అని మారిస్ క్రిస్టమస్ బహుమతిగా ఆమెకిచ్చాడు. అదేమిటో తెలుసా? అది ఒకరసీదు. మనోవీధిలోని ఒక ఇంటిలోని బైటగదికి అద్దె ముట్టినట్లు ఇవ్వబడిన రశీదు!

*('మైరాకెల్లి' రచన ఆధారంతో)*

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# హరిశ్చంద్రుడు

విశాలమైన పొలాల మీదగా చంద్రోదయ మవుతోంది. సినిమాహాలు గేటుదగ్గిర నిలబడి గ్లాస్కో లాల్చీ మీద పడే చక్కని పసుపురంగు వెన్నెలకాంతికి వొళ్ళు జలదరించిందేమో, నాగభూషణం సినిమాకెళ్ళాలనే విషయమే మరిచిపోయి, స్త్రీలగేటువైపు చూస్తూ ఉండిపోయినాడు. సినిమాహాలు జనంతో కిక్కిరిసి పోతోంది. రికార్డుల మోత ఆగింది. వెన్నెలకాంతి తెలుపు రంగులోకి తిరుగుతోంది. తనకి పదిగజాల్లో నుంచుని ఉన్న అమ్మాయి, బుగ్గ మీదగాలికి ఊగేజుట్టు ఉంగరాలని చూడకుండా ఉండలేక పోతున్నాడు నాగభూషణం. 'చామనచాయ అయితే మాత్రమే? అందంగానే ఉంది... హాలులోకి వెళ్ళలేదెందు చేత? టిక్కెట్టు దొరకలేదు కాబోలు!' ఇల్లా అనుకుంటూ నాగభూషణం ఆమె తనవైపు అకస్మాత్తుగా చూసేటప్పటికి చిరునవ్వు నవ్వేశాడు. ఆ అమ్మాయి తల పక్కకు తిప్పుకుని వెళ్ళటానికి ముందుకు ఒకడుగు వేసింది రోడ్డువైపు.

ఇది మంచి సూచనే ఏమనుకుంటుందో అనుకున్నాడు భావనలో తన్నుతాను ధైర్యపరుచుకుంటూ నాగభూషణం. ఆమె కేసి రెండడుగులు వేస్తూ, తనవైపు చూడగానే కన్ను గీటాడు సరదాగా ఏదైతే అదౌతుందని. ఆమె ముఖంలో ఆమోదసూచకమైన సిగ్గు తెరలాగా ద్యోతకమై మాయమైంది.

ఇద్దరు అపరిచితులూ, సినిమాహాలు ఆవరణ దాటి బుర్రిపాలెం వైపు పొయ్యేరోడ్డుమీద నడవసాగారు.

''మీ వాళ్ళెవరన్నా సినిమాకొచ్చారా?'' అని కనుక్కున్నాడు తను.

''మీ కెందు కా విషయం?'' ఆమె గొంతులో తిరస్కారం లేదని నాగభూషణానికి తెలుస్తూనే ఉంది.

'సాహసేలక్ష్మీః అన్నారు పెద్దలు!' అని తనను తాను బలపర్చుకుంటూ. నాగభూషణం ఆమె అడగకుండానే పెద్ద ఉపకారికి మల్లే పోజుపెట్టి ''మీకు టిక్కెట్టు కావాలంటే ఇప్పిస్తాను. వెళ్ళి పోతున్నారేం? ఉండండి, ఇప్పటికీ మించి పోలేదు. ఆట మొదలెట్టలేదు లెండి!'' అన్నాడు.

''అక్కర్లేదులెండి!'' విసురుగా అంటూ ఆ యవ్వనవతి ఈ తద్దినం మనవెంట బడ్డదేమో అన్నట్టు ఒక నిమిషం ఆగింది. అయితే యువకత్వమూ, డిసెంబర్ నెల చలీ, మత్తు గొల్పే వెన్నెల, ఇవన్నీ కలిసి నాగభూషణాన్ని కదలనివ్వ లేదు.

''రండి, సిగ్గు పడకండి! మిమ్మల్నెక్కడో చూసిన గుర్తు. లేకపోతే అందర్నీ పలకరిస్తూ కూచుంటానా?'' సాత్వీకంగా మర్యాదతో ఒకరకమైన మగతతో మాట్లాడాడు.

''మాది ఈవూరు కాదండి! మా ఆయన సినిమా దగ్గిరకి వస్తానంటే వచ్చానండి - మీరు మంచి వార్లల్లే కనబడుతున్నారు. మావారు హాస్పిటల్ లోనే ఉండిపోయినారు కాబోలు ...'' అని ఇంకేదో చెప్పబోతూ నాగభూషణం కేసి ఒక చూపు చూసి ఆగిపోయింది.

''అయితే మీవారు ఏ హాస్పిటల్‌లో ఉన్నారేమిటి?'' అన్నాడు నాగభూషణం.

''జానకి రామయ్యగారి హాస్పిటల్‌లోనండి! దగ్గుకి మందు తింటున్నారు... అక్కడదాకా వచ్చి వదిలి పెట్టండి... మీకు పుణ్యం ఉంటుంది'' బతిమాలుతున్నట్టు అడిగిందామె.

ఇద్దరి అడుగులు సాగుతూనే ఉన్నాయి... ''అభ్యంతరమా? మా ఇల్లుకూడా అటే లెండి... అయితే ఇటు పోతున్నా వేమిటి? పడమటకి తిరగాలి'' అంటూ నాగభూషణం వెనకకు మరలాడు. ఆమెకూడా అతని వెనకే మదించిన యేనుగుకిమల్లే తలొంచుకుని నడుస్తోంది.

## 2

''మా యింట్లోకి వొచ్చిపొండి వోసారి'' అంటూ తడికల కొంపదగ్గిర ఆగాడు నాగభూషణం.

''మీ యిల్లు ఇదా?'' అంటూ ఆమె అతన్ని ఆశ్చర్యంగా చూస్తోంది. ఈ సిల్కులాల్చీ, ఉంగరం... ఈ పూరిల్లు... ఆమెకి అనుమానంగా ఉంది.

''ఆ పక్క మేడకూడా మాదేనండి - అది అద్దెకిచ్చి యిందులో ఉంటున్నా'' అంటూ తడిక కట్లు విప్పి లోపల అడుగుపెట్టాడు.. ఆమె కూడా లోపలకొచ్చింది. ఒక చిరిచాప, రెండు పాత పత్రికలు బెడ్‌రూములైటు వెలుగులో మసక మసకగా కన్పించినై.

''ఇట్లా కూర్చోండి!'' అంటూ నాగభూషణం ఏదో చటుక్కున జ్ఞాపకం వచ్చిన వాడల్లే ''వెధవ చలి...'' అని తెరిచిన తడిక బాగా దగ్గిరకేశాడు.

''నేను వెళ్తానండీ!'' అంటూ నిజంగా లేచే ఉద్దేశం ఏకోశానా కన్పించని వైఖరితో తీక్షణంగా నాగభూషణం కళ్ళల్లోకి చూస్తూ ఆమె చిరిచాపమీద కూలబడ్డది.

''వెళ్దురుగాని - మీ పేరేమన్నారు....'' తనూ ఆమెకి ఒక్క అడుగు దూరంలో కూర్చుని నాగభూషణం జేబులోంచి బీడీ తీశాడు. ''నా పేరు చంద్రమతి'' ఆమె గొంతు సన్నగా అద్భుతంగా

వినిపించింది నాగభూషణానికి. ఆ నిమిషంలో ఆమె పేరుతో ఏమీ అవసరం లేక పోయినా ఏదన్నా మాట్లాడాలని అతని ఆదుర్దా. ఆమె వంక తీవ్రమయిన దృష్టితో చూస్తూ బెడ్‌రూమ్ లైట్‌తో బీడీ వెలిగించే ప్రయత్నంలో దీపం కాస్తా ఆర్పి ''అరెరే!'' అన్నాడు.

''ఎట్లా ఇప్పుడు?'' అన్నదామె ఆ విషయమై ఏమీ విచారపడని గొంతుపెట్టి.

''పరవాలేదు, వెన్నెల చారలున్నాయిగా'' అన్నాడు నాగభూషణం తడికల సందుల్లోంచి చిరిచాపమీద పడుతున్న వెన్నెల చారల్ని చూపుతూ.

చంద్రమతి ఒక్కసారి వొళ్ళు విరుచుకుని ''అబ్బ వొళ్ళంతా నొప్పిగావుంది'' అంటూ చిరిచాపమీద వెళ్లి కలా పడుకుంది, ఎడం చెయ్యి తలకింద పెట్టుకుని. రెండు మూడు వెన్నెల చారలు ఆమె కళ్ళమీదా ఎర్రటి పెదాలమీదా పడి మెరుస్తున్నాయి. ఆమె వయస్సు యెంతో నిర్ణయించడం నాగభూషణం వశంకాలేదు. ఆ సమయంలో ఏ విషయం మీదయినా ఒక ఖచ్చితమయిన నిర్ణయానికి రావటం అతనికి చేతకాదేమో కూడాను.

''చంద్రా!'' అంటూ అతను ఆమె వక్షంమీదికి వొరిగాడు. అతనిలో కవిత్వం పొర్లింది. కాని మాటలు మాత్రం గొంతులోనే ఉండిపోయినై.

  

'' ఒకటీ, రెండు'' అని దూరంగా తాలూకాలో కొడుతున్న గంటల్ని లెక్క పెట్టింది చంద్రమతి.

''అబ్బ, పడకుందూ! వెళ్లవుగాని'' అంటూ నాగభూషణం ఆమెని తిరిగి ఆక్రమించుకున్నాడు.

'' ఉస్! ఎవరన్నా వింటారయ్యా, మెల్లిగా...'' అన్నది చంద్రమతి వెచ్చటి పెదాలతో అతని నోరు మూస్తూ. ఆమె కుడి చెయ్యి మెల్లిగా నాగభూషణం జేబులు తడవ నారంభించింది. ఈ దెబ్బతో నాగభూషణం చప్పున స్మృతిలోకి వచ్చి ''మెల్లిగా, బీడీలు విరిగిపోగలవు'' అన్నాడు మెల్లిగా - కాని, గాఢంగా నవ్వి.

''అబద్ధం!'' ఆమె తన ప్రయత్నం మానకుండా ఐదు నిమిషాలు వెతికి. విసుగెత్తింది కాబోలు ''ఛీ ! దూరంగా పో!'' అని అతని బలమైన పట్టునుంచి విడివడి దూరంగా జరిగి పడుకుంది.

''నీకేం కావాలి! జేబులు తడువుతున్నావు?''

''నీకు తెలీదు, నాకేం కావాలో?''

'' ఎట్లా తెలుస్తుంది?''

'' ఇంతదూరం తీసుకొచ్చిన వాడివి...''

''ఓ! డబ్బులా? భలే... హ... హ్హ్హా....'' నాగభూషణానికి చచ్చేట్టు నవ్వొచ్చింది.

''ఎందుకట్టా నవ్వుతావు?'' ఆమె తీవ్రమైన గొంతు పెట్టి అడిగేటప్పటికి నాగభూషణం నవ్వాపేశాడు. ''డబ్బులా? వాటికోసం ఆరురోజులనుంచీ అడగరాని వాణ్ణల్లా అడిగాను. తిరగరాని చోటల్లా తిరిగాను, దొరక లేదు. నువ్వు తేలికగా జేబులో చెయ్యి పెట్టి డబ్బులంటే నవ్వురాక ఏం వస్తుంది? ఇంకా నయం! ఏడవనందుకు సంతోషించు'' అతని హృదయాంతరాళంనుంచి ఉద్రేకం పొంగి ఈ మాటలు వచ్చినై. ఇంకా సాగేదే కాని ఆమె చప్పునలేచి నిల్చుని బైటకి పోతూ, ఏడ్పు, నిస్పృహ కలిసిన స్వరంతో ఇలా అన్నది. ''నీ సిల్కు లాల్చీ, మెరిసే ఉంగరం, తెల్లనిపంచా చూసి నీ వెంట వస్తే రెండు మూడు రోజుల తిండికి భయం లేదనుకున్నాను. కాని నువ్వు నాకన్న దరిద్రుడివన్న సంగతి తెలిసేప్పటికి నాకూ నవ్వొస్తున్నది. అయితే ఆ మేడ నీదన్నావు!''

''అంటాను. తెనాలే నాదంటే మాత్రం నష్టమేమిటి? అందులో నీబోటి దానిముందు...'' నాగభూషణం చటుక్కున ఏదో జ్ఞాపకమొచ్చి ''అయితే నువ్వు మామూలు సంసార స్త్రీ అని నేను అనుకున్నది భ్రమ అంటావా ఏమిటి?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''నువ్వు జమీందారువో, ల్యాండులార్డువో అని నే ననుకున్నది ఎంత నిజమో, నువ్వు నన్ను సంసార స్త్రీ అనుకున్నదీ అంతే నిజం!''

''సరిపోయింది, ఇద్దరం దొరికినందుకు చెప్పాలి'' అంటూ నాగభూషణం నీరసంగా తడిక వాకిలి బిగించి ఆమె వెనకాలే రోడ్డుమీదికి వచ్చి నిలబడ్డాడు. ఆమె పోతూ పోతూ ''నీ పేరేమిటి?'' అని అడిగింది.

''హరిశ్చంద్రుడు.''

అతని స్వరంలో ఎగతాళిని గ్రహించుకున్నదల్లే ఉంది ఆమె. ''మళ్ళీ అబద్ధమా? నీ బతుకు చెడా!'' అన్నది శాపం పెడుతున్నట్టు.

''అబద్ధమా! పొరపాటు - నీ పేరు చంద్రమతి ఐనంత వరకు నా పేరు హరిశ్చంద్రుడై ఉండటం న్యాయం అని చెప్పాను'' నాగభూషణం చిలిపినవ్వు నవ్వుతూ మారీసు పేట కేసినడిచాడు. ఆమె చీకట్లో ఎటు పోయిందో పోయింది.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# మరలోచక్రం

నేను ఆడుకోవాలని పరికిణీ, గౌను వేసుకుంటున్నాను. నాన్న ఇంకా ఇంటికిరాలేదు. నాన్న రాకముందే వెళ్ళి పోవాలి. లేకపోతే ఆడుకోడానికి వీల్లేదు - కోప్పడతాడు. నాకు ఊహ తెలిసింతర్వాత, నీటికి నిప్పుకు భయపడక పోయినా ముందుగా నాన్నకి భయపడసాగాను. ఆయనకి ఆదాయం తక్కువైనా ఆచారాలు జాస్తి. అన్నం కొరవడ్డా ఆదర్శాలు మెండు. ఆయన పరిధుల్లో లోకంలో ఎవరికీ ఆడ పిల్లల్ని పెంచడం రాదు. తను అట్లా కాదు. తనకి ఉన్న ఆదర్శాలతో తన కూతుర్ని పెంచి లోకపూజ్యత సంపాయించ దలచాడాయన. అయితే ఆయన తన ఆదర్శాన్ని నాకు బోధించడంలో, నాకు ఏదో విజ్ఞానం కల్గించి తద్వారా స్వాతంత్ర్యం ఇవ్వాలనే చెప్పేవాడు. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అని ఆయన ఎప్పుడూ అనలేదు.

నేను గడపలో అడుగు పెడ్తాంటే నాన్న ఎదురైనాడు. నా గుండెలు వేగంగా స్పందించినై. బిళ్ళగోచీ పైపంచె, జుట్టుముడి విభూతి రేఖలు - నాకు ఎన్నటికీ ఊహించినా భయం కల్పించేట్టు తయారైనాయి. నాన్న కళ్ళు - '' ఎక్కడికీ బయల్దేరావు?'' అన్నాయి... '' ఆడుకో ...డా ...'' అన్నాను నంగిగా. తతిమ్మా మాటలు పెగల్లేదు. ''లోపలికి పో'' అన్నాడు నాన్న.

చెరసాలలో ఖైదీలాగ గొణుక్కుంటూ లోపలికి వెళ్ళాను. సాయంత్రం నీడల్లో వరండాలో వెలుగుతున్న బెడ్‌రూము లైట్ ముందు కూర్చున్నా. మనసంతా గుళ్ళో ఆటమీద ఉంది.

నాన్న ఏమిటో చెబుతున్నాడు. బహుశా, రుక్మిణి, సీత, సావిత్రి మొదలైనవారి కథలనుకుంటా. నా కవేమీ బుర్రకెక్కలేదు.

అట్లాపన్నెండు ఏళ్ళవరకూ - నాన్న నాకు తన్ని, తిట్టి ఏవేవో ఆదర్శాలు నేర్పాడు. అమ్మ వంటా, పెట్టూ నేర్పింది. నాన్న నాకు విజ్ఞానం ఒంటబట్టిందని నమ్మేట్టు ఆయన చెప్పిన కథలన్నిటినీ ఒప్పచెప్పాను. ఆయన నమ్మాడు. నాకు స్వాతంత్ర్యం కలిగిందన్నాడు. నే నిప్పుడిప్పుడు గడపలో నుంచుంటున్నాను. వాకిట్లోకి తొంగి చూస్తున్నాను. విశాలమైన ప్రపంచం. దానిలో సరదాగా, సంతోషంగా ఆడుకునే పిల్లలూ, నా మనసుని ఏరోజూ వదలిపోలేదు. నాన్న నేర్పిన కథలు అర్థాలూ, ఆదర్శాలూ నాకేం జ్ఞాపకం లేవు. నా మనస్సులో విషయాలు చీకటి కొట్లో తొక్కిసలాడినట్లు తొక్కిసలాడినై. నేను ఏదో పొగొట్టుకున్న దానిలా నిశ్వాసలు తీస్తూ, అసమగ్రమైన జ్ఞానంతో ఉండిపోయినాను. నేను స్వతంత్రురాలి నని ఎన్నడూ భావించలేదు.

## 2

నాన్న ముసలివాడయినాడు. ఆయన మాట వినే వాళ్లు ఇంట్లో నేను తప్ప ఇంకెవ్వరూ లేకుండా పోయినారు. అన్నయ్య సంపాదనపరుడైనాడు. నాకు పెళ్ళి చేయాల్సిన ఈడు వచ్చిందని అందరూ అనుకుంటున్నారు. నాకు పెళ్ళంటే ఏమిటో అప్పట్లో అర్థం అయిందికాదు. ఆ సందర్భంలో అన్న నాకు ఏవో కొన్ని సంగతులు చెప్పాడు. అవి పెళ్ళికంటె కూడా ఇంకేమో వున్నాయని నాకు తెలియ జేసినై. నాకైతే పెళ్లి ఎందుకు కావాలో, అసలు అక్కర్లేకపోతే ప్రమాద మేమిటో రెండూ తెలియలేదు గాబట్టి, అన్నయ్య చెప్పిందానికి తలూపటంతప్ప ఇంకేమీ చెయ్యలేదు.

నాకు పరికిణీలూ, వోణీలు వచ్చినై, నాన్న నాకు కొద్దీగొప్ప ఇచ్చిన స్వేచ్ఛలాంటిదాన్ని చుట్టుపక్కల వాళ్ళ చూపులూ, మూతి విరుపులూ, అమ్మ తిట్లూ రద్దుచేసినై. ఇవేగాక పొరుగింటబ్బాయి, ఎదురింటి కుర్రాడు నాకేసి చూసే చూపులూ, బహుశా, బంగినపల్లి మామిడిపండు వంక చూసినట్లు చూడ్డం.... నాలో నాకే ఏదో ఓ భయాన్ని రేకెత్తించి, ఇంట్లోనించి బైటికి రానివ్వడంలేదు. నేను ఎరిగిన లోకం, నేను చూసిన పరిసరం, దొడ్లో బాదం చెట్టూ, ఇంట్లో దూలాలూ, మాకు సంబంధించిన చుట్టాలున్ను.

ఇందుకు వ్యతిరేకంగా, ఏవో లోకాలుంటాయని, నాలో ఆసక్తిలేనట్టి ఊహల్ని కలిగించాడు అన్నయ్య. పెళ్ళిని ఎందుకు వ్యతిరేకించాలో తెలియకుండానే వ్యతిరేకించేట్టు చేశాడు. ఇంట్లో దుమారం రేగింది. నేను చూస్తూ ఊరుకున్నాను. నా అన్ని ఇబ్బందుల్నీ అన్నయ్య ఆదుకున్నాడు ప్రేమతో. అయితే, నేను అన్నయ్యని అనుసరించటంలో మనస్ఫూర్తి ఏనాడు కనపరచలేక పోయినాను. హరిజనులకు సేవనీ, నూలు ఒడకడాలనీ, ప్రజాసేవ అనీ, అన్నయ్య ఊర్లమీద తిప్పాడు నన్ను. నన్ను పొగడారు. నాకు కొద్దిపాటిలోకం పరిచయమైంది. ఈ లోకంలో కొన్ని మాటలూ, కొన్ని చేష్టలూ, అదే పనిగా వినపడసాగినై, వాటిని వల్లవేశాను. కనపడ్డ ఇతర సేవికులకూ, సేవకులకు వాటిని నచ్చచెప్పడం వచ్చింది. అన్నయ్య నాకు స్వేచ్ఛ ఇచ్చానని సంతోషించాడు. అయితే ఓ ఇబ్బంది వచ్చింది. ఏవో కొన్ని గిరులు గీసి వాటినిదాటి పైకి పోవడానికి నాకు ఏమీ అవకాశం ఇవ్వలేదు అన్నయ్య. అయినా ఒకటి ఉన్నది. నాకూ, గిరి అవతల ఏమున్నదో తెలీలేదు. తెలుసుకోవాలన్న కోర్కె కలిగి నప్పటికిన్నీ - కాంగ్రెసుకీ జై అనీ, యింకా వల్లమాలిన జైలూ, కొట్టాను. ఎందుకో తెలీదు. అన్నయ్య వెంట తిరగడంలోనే ఈ జైలన్నీనూ. లేకపోతే ఇట్లా తిరగడం గూడా ఉండదేమో - అనుకోసాగాను. నాకో భవిష్యత్తున్నదనిగాని, ఒక భర్తకి నేను అవసరం అని గాని, తెలీకుండానే కొన్నేళ్ళు వెళ్ళిపోయినాయి. స్త్రీత్వం ఎంత తెలీని తనమైనా, పురుషుణ్ణి ఏదో ఒక స్థితిలో కోరుతుంది కాబోలు. నాతో తిరుగుతూ నన్ను సదా గౌరవిస్తున్నట్టు కనబడ్డ ఓ యువకుడు తటస్థపడ్డాడు కొద్ది కాలానికి. అన్నయ్య నేర్పక పోయినా, నాన్న బోధనలు నన్ను కొంత కాలానికి భయపెట్టినయి. ఒక రోజు ఆ యువకుడు - అతని పేరు చక్రపాణి - ఎవరూ లేకుండా ముందే జాగ్రత్త పడి నా చెయ్యి పట్టుకున్నాడు. నేను కేకవెయ్యడానికి నోరు తెరవాలనుకున్నాను. కాని నోరు రాలేదు. అతను నన్నేంచేస్తాడో అని తెలికుండానే అతనికి

శరీరాన్ని వప్పజెప్పాను. భయపడ్డంతగా ఏమీ జరక్కపోయినా, కొద్ది పాటి సుఖంవంటిది దక్కింది. చక్రపాణి, నాతో అప్పుడు ఇంకోరకం మాటలు మాట్లాడాడు. అవి ఇదివరకు విననివిగాబట్టి జాగ్రత్తగా విన్నాను.

చక్రపాణి నా భుజం పట్టుకుని ''సుగుణా! నిన్ను ఎంత ప్రేమిస్తున్నానో చెప్పలేను. నువ్వూ, నేనూ పెళ్ళి చేసుకుందామంటే పాడు సంఘం ఒప్పుకోదు. మనం ఎటన్నా వెళ్ళిపోయి పెళ్లి చేసుకుందాము'' అన్నాడు. అతడు, నామీద కొంతయినా ఆసక్తి చూపిస్తున్నాడని అనుకో గలిగాను.

''అన్నయ్యకు చెబుతాను'' అన్నాను. అన్నయ్య తనని సంస్కర్త అని పిలుచుకుంటున్నాడు. నే నెరుగున్నప్పట్నించి. వర్ణాంతర వివాహానికే అంగీకరించడా అనుకున్నాను.

''నీది అజ్ఞానం'' అంటూ దిగులుపడ్డాడు చక్రపాణి. ఉలిక్కిపడ్డాను. అన్నయ నన్ను ఎంతో పొగుడుతాడు - నాలో చాలా జ్ఞానం వృద్ధయిందని. చక్రపాణి యిలా అంటున్నాడేమిటి?

''అజ్ఞానం ఏమిటి?'' అని అడిగాను ఆదుర్దాగా.

''మీ అన్నయ్యని అడగటమే! ఆయన ఎంత హరిజనోద్ధరణ అన్నా, గాంధీకీ జై అన్నా మన పెళ్ళికి ఒప్పుకోడు. తెలుసు. ఆయనకి తెలిస్తే ఈ కాస్త మనం మాట్లాడుకోటం కూడా సున్నా అవుతుంది'' అన్నాడు; ఒప్పించాడు నన్ను.

''నీకు ఏమీ తెలీదు. విశాలమయిన ప్రపంచం ఉంది - నువ్వు చూడంది. అదంతా చూపిస్తాను. నిజంగా స్త్రీకి స్వాతంత్ర్యం ఇప్పుడులేదు. నేను స్త్రీ - స్వాంతంత్ర్య వాదిని'' అన్నాడు చక్రపాణి ధీమాగా.

నేను, మైకం కమ్మిందానిలా అతనితో లేచిపోయినాను. 'లేచిపోయినా'నని అన్నయ్యే ప్రచారం చేశాట్ట. తర్వాత తెలిసింది: 'లేచిపోవడం' తప్పనిగూడా నాకు తెలీకుండానే చక్రపాణితో వెళ్ళాను ఇంతకి.

## 3

చక్రపాణి నన్ను యధావిధిగా నేనెరుగున్న పూర్వీక పద్ధతిలో వివాహం చేసుకోలేదుగాని, అతని స్వగ్రామంలో అతని మాటల్ని వినే పదిమందిలో పూల మాలలు, ఉంగరాలు మార్పించి ఆ తతంగం పూర్తిజేశాడు.

ఇతని దగ్గిర కొన్ని ఆదర్శాలుండేవై అన్నసంగతి కొద్ది రోజుల్లోనే బయటపడింది. నేను చదువగలిగి ఉండటంవల్ల ఏదో పుస్తకాన్ని చదువుతూ ఉండేదాన్ని. అట్లాంటి వాటిల్లో కొన్ని ఆనా భర్తదగ్గిర దొరికినై. అవి కథల సంపుటాలు. చలంవీ, కొవ్వలివీ అనుకుంటాను. నా భర్త నాతో చాలా దయగా ''చలంవీ, కొవ్వలివీ పుస్తకాలు చదవకు. అవి అభివృద్ధి నిరోధకమైనవి. నేను మంచి పుస్తకాలు ఇస్తాను'' అన్నాడు.

''సరే'' అన్నాను. కాని అసలు అభివృద్ధి ఏమిటో, దానికి ఈ పుస్తకాలు నిరోధకమెట్లానో ఎంత తన్నుకుని చచ్చినా అర్థమయేదికాదు. ఆయన ఇంటిలో లేనప్పుడు వాటిని చదవ బుద్ధయ్యేది. పైగా ఆ పుస్తకాలు నాకు బావుండేవి.

రెండోసారి చక్రపాణి కొన్ని పుస్తకాలు పట్టుకొచ్చాడు నా కివ్వటానికి. నేను చదువుతున్న పుస్తకాల్ని లాగి అవతలపారేశాడు. కొద్దిగా మందలించాడు.

నేను సుఖపడుతున్నాననీ, కనీసం నా యిష్టం వొచ్చినవి చదివే స్వేచ్ఛున్నా నా కుందనీ అనుకున్న నేను, ఆ భావానికి దూరమయినాను. నా భర్త నా కిచ్చిన పుస్తకాలు కార్మికుల గురించి, నాకేనాటికీ తెలియని ఆర్థిక శాస్త్రం గురించి చెప్పినై. వాటిని కనీసం వల్లెవేయలేక పోతే నా కీపాటి సుఖమన్నాదక్కదేమో అని చదవసాగాను.

నా భర్త, నాకు చీరకట్టడం దగ్గరనుంచి, నడవడంవరకూ, క్రొత్త పద్ధతులు నేర్పాడు. బొట్టు వొద్దన్నాడు. అలంకారాలుండటం బూర్జువా లక్షణమట! బూర్జువా అంటే పురాణాల్లో రాక్షసులేమో అనుకున్నాను. పూలు మానేశాను.

మా యింటికి కొంతమంది వొచ్చేవారు. వాళ్ళకి నేను వల్లెవేసిన పదాలు వొప్పజెప్పేదాన్ని. వాటి అర్థాలు తెలీకపోయినా, ఆ వొచ్చిన వాళ్ళకి నన్ను చూపి ఆత్మ సంతృప్తిపొందేవాడు నా భర్త.

ఇక్కడ కులాలూ, మతాలు లేవు. అంతా ఒక్క చోటనే భోంచేసేవాళ్ళు. నాకు మల్లేనే కొంతమంది స్త్రీలు కూడా ఇక్కడికి వచ్చేవాళ్ళు. వాళ్లమొహాల్లో యధార్థంగా మనుషుల కుండాల్సిన కళాకాంతులు గాక ఇంకేదో వివర్ణత గోచరించేది. వాళ్ళ మాటలు మామూలుగా ఉండక డొంక తిరుగుడుగా, అపసవ్యంగా ఉండేవి. ఒకరీ నొకరు అభినందించకునేవారు. స్త్రీకి స్వాతంత్ర్యం లేదనీ, తాము ఇవ్వాలనీ చెప్పుకునే వాళ్లు. నా కప్పు డప్పుడు నవ్వొచ్చేది.

రాను రాను నా స్థితి దుర్భరం కాసాగింది. లోకం అంతా ఆకలితో, దోపిడితో నిండివుంది అంటూ, మా ఆయన లోకం మరమ్మత్తులో కొంపనే మరిచిపోయినాడు. నన్ను ఆయన అసలే గమనించలేదు. ఇంట్లో ఏమీ ఉండేవీ గాదు. నా గాజులూ, గొలుసూ అమ్మాను. అవీ అయిపోయినై. ఆకలితో నేను తెల్లవార్లు అల్లాడి చస్తూవుంటే మా ఆయన ఏ వూర్లోనో కరువులో చచ్చేవాళ్ళ కోసం సానుభూతి సభలు పెడుతూండేవాడు. పైగా ఆ సభల్లో నేను గూడా కరువుపాటలు పాడాల్సి వచ్చేది. నేను ఆదర్శ భార్యనని పొగడబడ్డాను అనేకుల చేత. అనేక మంది మా యింట్లో పోగై ఎప్పుడూ, వాస్తవిక జీవితానికి సంబంధించని ఆదర్శపు ఊకదంపుడు సాగిస్తూండే వారు. దీనికి మా ఆయన అధ్యక్షుడు.

వాళ్ళు మాట్లాడే వేమిటో వింటూ ఉండేదాన్ని. నన్ను ఆ 'చర్చ'లలో పాల్గొనమనే వాళ్ళు. 'కళ, కళకోసం గాదు! అని రాత్రులకి రాత్రులు తన్నుకు చచ్చేవాళ్ళు. బ్లాక్ మార్కెట్ నశించాలనీ, ప్రభుత్వాలు మారాలనీ అరిచే వాళ్ళు. నేనూ, ఆకలి మాడుస్తున్నా, వాళ్ళతో అరిచేదాన్ని. అరవలేక ఊరుకున్న రోజుల్లో, చక్రపాణి నన్ను వాళ్ళంతా పోయిం తర్వాత, 'నిస్పృహ పనికి రాద'ని, స్పృహ ఉంచి

బాదేవాడు. నాలో పాతుకొని వున్న మూఢనమ్మకల్ని, పురాతన భావాల్ని ఆయన ఒదలకొడుతున్నట్టు! చెప్పుకుని సంతోషించే వాడు.

చక్రపాణివల్ల నిజంగా ఎవరికీ ఏ ప్రమాదమూ లేదు, ఊరికే అరవగలడు గాని. అయితే, పోలీసులు ఏదో ప్రమాదం వుందని ఆయన్ని రెండేళ్ళు జైల్లో వేశారు. నన్ను ఏమీ చెయ్యలేదు. ఇన్‌స్పెక్టర్ నన్ను ఏదో అడిగితే నాకేమీ తెలియదని చెప్పాను. ఊరుకున్నాడు.

ఆ రోజు మొదలు మళ్ళీ అనాథ నయినాను. నాతో పాటే ఏవో ఆదర్శాలని అరుస్తూ వచ్చిన ఒకాయన్ని సాయం చెయ్యమని కోరాను. ఆయన ఎప్పుడూ కాప్‌స్టన్ సిగరెట్లు కాల్చేవాడు. మంచి పాప్లిన్ చొక్కాలు. ట్వీడ్ లాగులు తొడిగేవాడు. కాస్త ఆస్తిపరుడే, ఆయన నిర్మొహమాటంగా లేదంటూ, ''మీ ఇబ్బందికి చాలా సానుభూతి చూపిస్తున్నాను. కాని ఏం చెయ్యను? నా ఆర్థికస్థితి చాలా శోచనీయావస్థలో ఉంది'' అంటూ వెళ్ళి పోయినాడు. నేను ఆ వూరు వదిలి ఏమీ న్నిర్ణయం లేకుండా ఎటో వెళ్ళి పోయినాను.

## 4

పర్యవసానం చెప్పేస్తున్నాను. చక్రపాణి ఈ రోజు వరకూ నన్ను కలుసుకోలేదు. ఇప్పుడు నేనూ హాయిగానే వుంటున్నా ననాలి. ఒకళ్ల ఇంట్లో ఈ ఊరిలో వంట చేస్తున్నాను. నన్నొక హోటలతను ఉంచుకున్నాడు. అతను నన్ను ఉంచుకున్నాడని నేను వంటచేస్తున్న ఇంట్లో వాళ్ళు ఎరుగుదురు. కాని నన్నేమీ అనరు. ఆ హోటలతను గూడా నన్ను సాధ్యమైనంత గౌరవంగానే చూస్తున్నాడు. అతనికి నేను అవసరం. అతనికేమీ ఆదర్శాలులేవు. వాటి వెనకాల నేను తిరగక్కర్లేదు. నన్నేమన్నా అంటే ఇంకెక్కడికన్నా పోతానేమో అనే భయంతో నన్నేమీ అనకుండా ఊరుకుంటున్నాడతను. ప్రస్తుతం నేను పూర్వం ఏ రోజు కన్నా కూడా స్వేచ్ఛగా, కులాసాగా ఉన్నానని చెప్పగలను.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# వింత ప్రకృతి

పొద్దుణ్ణుంచీ వానా, గాలీ విపరీతంగా కమ్ముకుని సూర్యగమనం కనిపించటం లేదు. వాన తుంపరలు పంచలోకి కూడా విసిరివిసిరి కొడుతున్నాయి. బైట పంచవాకిలి ఓరగిల వేసి యానాది సుబ్బి చాప మీద కూచ్చుని స్వర్ణతో మాట్లాడుతోంది. రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు క్యాంపుకు పోయాడు. స్వర్ణ ఒక్కతే ఇంట్లో కూచుని టేబిల్‌లైట్ ముందు ఏదో పుస్తకం చదువుతూ సుబ్బికి పరధ్యానంగా జవాబు లిస్తోంది.

సుబ్బి ''అమ్మగారూ! ఊర్లో ఏంటో అనుకుంటున్నారండీ, నిజమేనా?'' అని అడిగింది. చలి గాలికి ముసుగు నెత్తి మీదికి లాక్కుంటూ.

''ఏమనుకుంటున్నారేమిటి?'' అని అడిగింది స్వర్ణ. ఆమెలో ఆదుర్దాగాని, భయంగాని ఏ మాత్రం వ్యక్తం కావటం లేదు. సుబ్బి, సాయంత్రపు సూర్యకాంతిలో నీడలో నీడగా కలిసి కూచుని అమ్మగారి కేసి చూస్తూ చెపుదామా, వొద్దా అని ఆలోచిస్తోంది. వాన నిమిష నిముషానికీ ఎక్కువవుతోంది. స్వర్ణ మళ్ళీ అడిగింది తన వెనకటి ప్రశ్నని. దీపం గాలికి ఊగుతోంది. పుస్తకం రెపరెప లాడుతోంది. ఏం రాత్రి... ఈ రాత్రి ఒంటరిగా వుండటం తనదురదృష్టం అనుకుంటోంది ఆమె లోపల. సుబ్బి మర్యాదగా, ''అయ్యగారిని మీరు రెండో పెళ్ళి....'' అని ఇంకేదో అనబోతుంటే స్వర్ణ ఆపి ''ఇదా!'' అంటూ, ''ఓస్! మీ ఏనాది వాళ్ళల్లో మారు మనువు లేదుటే? అంతే ఇదీను'' అంది చాలా నిర్లక్ష్యంగా.

సుబ్బి ఆశ్చర్యంగా, ''అయితే బ్రామ్మల్లో గూడా మారుమనువు వుందా యెట్టా?'' అంది గడ్డం కింద చెయ్యి పెట్టుకుని.

''అంతగా లేదు కాని, అవసరమైతే మొగుణ్ణీ వొది లెయ్యొచ్చు.''

''అస లెందుకు వొదిలేరండీ? వొదలటం అవినీతి అని కాదు. ఆ కారణం ఎంత బలవత్తరమో అని''

''అదా! లక్ష! అతను వారాలకి వారాలు ఇంట్లో ఉండేవాడు కాదు. ఉన్న రెండు రోజుల్లో కూడా, ఒక పూట కాళ్ళువాపులూ, ఒక పూట తలనొప్పి, ఇవన్నిటినీ మించి నిద్రమత్తు.

''సరే.''

''అయ్యగారు ఆ వూర్లో కొన్నాళ్ళున్నాడు, మా యింటిపక్కనే, అప్పుడే...''

ఇక పై కథంతా సుబ్బి విన్నదే. సుబ్బి ''అమ్మ గారూ! పెందరాళే వణ్ణంతిని పడుకోరాదండి! ఈ వానలో ఇంకేం వస్తారండీ అయ్యగారు?'' అంది.

''ఈ పూటకి వొట్టిదేనంటావా?'' అని అడిగింది నిరాశగా స్వర్ణ.

'' ఆ!'' అంది నిక్కచ్చిగా సుబ్బి.

## 2

భోంచేసి తమలపాకులు నవులుతూ పడకకుర్చీల్లో పడుకుని స్వర్ణ అదే పుస్తకాన్ని ఏమీ యిష్టంలేక పోయినా చదువుతోంది. బయట వానతగ్గే సూచనలేమీ లేవు. గాలి కూడా జోరుగానే వీస్తోంది లోకాన్ని మింగుతా నన్నట్టు. వాకిలిదగ్గిరగా పడుకుంది. గోడ గడియారం పది కొట్టింది. బయట బూట్ల చప్పుడు వినపడ్డది ఆదుర్దాగా. కాని, ఎవరూ తలుపుతట్టలేదు. స్వర్ణ ఉలిక్కిపడి ''ఏవరో చూడవే సుబ్బీ!'' అన్నది.

సుబ్బి తలుపుతీసి చూసింది. ఎవరో ఒకాయన వానకి దడిసి పంచలో నుంచున్నాడు. సూటూబూటూ వేసుకున్నాడు. రూపం కనబడేంత వెల్తురులేదు. సుబ్బి లోపలికి వచ్చి ''ఎవరోనమ్మా వానకి నుంచున్నారు'' అంది.

స్వర్ణ పరధ్యానంగా, ''పాపం, పంచలో జల్లుకి తడుస్తారేమో - లోపలి వేపు నుంచోమను'' అంది.

సుబ్బి తలుపు తెరిచి, ''ఇట్లా లోపలికొచ్చి నుంచోండి'' అంది మర్యాదగా. అవతలి వ్యక్తి ఒక నిమిషం ఆలోచించి లోపలికి వచ్చాడు. లోపలివైపు నుంచి కనపడుతున్న స్వర్ణవైపు చూసి, అతను ఏదో జ్ఞాపకం తెచ్చుకునే ప్రయత్నంలో ఉంటూ, హాండ్ కర్చిఫ్‌తో తల తుడుచుకుంటున్నాడు. దీపపు మందమైన వెల్తుర్లో అతని మొహంలో సంవత్సరాల అనుభవం సినిమాలాగా దొర్లిపోతున్నది. స్వర్ణ ఇక పడుకుందామా, అనుకొని ఈ అతిథిని ఏం చెయ్యాలా అన్నట్లు, మళ్ళీ కూలబడింది. ఆమె నూతనుడి వైపు చూడలేదు సరిగ్గా.

నూతనుడు నీడలోంచి వెలుగులోకి వచ్చి,

''ఈ వానలో ఎటూ పోలేకుండా వున్నాను. అవసరమైనప్పుడు వానంటూ కురవదు'' అన్నాడు. అవతలి వ్యక్తికి తన గొంతులో ఏదో స్ఫురించాలన్న ప్రయత్నంతో గాఢంగా వొత్తిపలుకుతూ.

స్వర్ణ ఉలిక్కిపడి, గడపలోనుంచున్న నూతనుణ్ణి తలెత్తి చూసింది. దీపపు కాంతిలో - సుబ్బి, గడప దిగువన నుంచుని యజమానురాలి మొహంలోకి చూస్తోంది అయోమయంగా.

''ఇక్కడే పడుకోనిస్తే మిమ్మల్ని జీవితంలో మర్చిపోలేను'' అన్నాడు కొత్తమనిషి.

''భోంచేశారా?'' అంది స్వర్ణ ఏదో ఆలోచిస్తూ.

''దానికేం లెండి!'' అని తేల్చేయాలని చూశాడు నూతనుడు.

స్వర్ణ సుబ్బివంకకు తిరిగి, ''సుబ్బీ! ఫ్లాస్కు పట్టుకెళ్ళి కాఫీ, ఏదన్నా టిఫిన్ పట్రా - గొడుగు ఆ మూల ఉంది, వేసుకువెళ్ళు'' అంది.

''ఎందుకూ? అక్కర్లేదు'' అంటున్నాడు సూట్ ఆయన.

''ఫర్వాలేదు, వెళ్ళవే సుబ్బీ!'' అంది స్వర్ణ నూతనుణ్ణి, మంచంమీద కూర్చోమని చేత్తో సౌంజ్ఞచేస్తూ.

అపరిచితుడైన ఒకడికి యజమానురాలు చేసే ఈ మర్యాద సుబ్బికి చాలా ఆశ్చర్యం కలిగించినా, 'ఇది ఒకరకం ఉపకారం గామాలు!'' అనుకుంటూ ఫ్లాస్కూ, గొడుగూ పుచ్చుకుని గడప దిగింది.

## 3

''అయితే స్వర్ణా! నువ్వేనా? ఇంకెవరో అనుకుని, ఈ మర్యాదకి అదిరిపోయినాను'' అన్నాడు రాఘవరావు.

''నేనూ నన్ను ఒదిలేసి నువ్వెక్కడున్నావో అని చాలా దిగులుపడ్డాను సుమా!'' అన్నాడు రాఘవరావు, సహజంగా పురుషులు రాత్రి అవసరాలు కావాల్సినప్పుడు స్త్రీలతో మాట్లాడే ఔదార్యత ప్రదర్శిస్తూ.

''ఓహో హో! ఎంత ప్రేమో!'' అంది స్వర్ణ ఎగతాళిగా.

''నేను చెబితే నమ్మలేవులే!'''' అంటూనే స్వర్ణ దగ్గరికి నడిచాడు. స్వర్ణ అతన్ని కాస్త తగ్గమని చేత్తో సౌంజ్ఞ చేసి, ''నీతో కాపరం చేసిన రోజుల్లో నా అందం నీకు కనిపించ లేదు కాబోలేం!'' అంది వెటకారంగా.

''ఇటీవల నాలుగురోజులు కాఫీ, సిగరెట్టూ మానాను. ఇవాళ ఉండ బట్టలేక కాఫీ, సిగరెట్టూ కూడా తాగాను. ఎంత బావుందనుకున్నావు!''

''అంతే నంటావా నేనూనూ?'' అని అడిగింది పూర్వపు భార్య.

''కాదూ మరి? ఏదైనా, ఎప్పుడూ ఎదురుగావుంటే దానివిలువ తెలీదు.''

''నాకూ అంతే - పొరుగింటి కూరకి ఎగబడ్డం మానవ లక్షణం.''

''వేదాంతాలు చెప్పకు ఇప్పుడు - ఏం చేస్తున్నావు? ఎక్కడ వుంటున్నావు?'' అంటూ కనుక్కుంది స్వర్ణ.

''ఇదివరకేం చేసేవాణ్ణో. అంతే ఇప్పుడూనూ! ఈ గుమాస్తాగాడికి ఎవ్వడూ మళ్ళీ పిల్ల నివ్వ నన్నాడు. కలలు కంటూ హోటల్లో భోంచేస్తూ బతుకుని ఈడుస్తున్నాను.''

''పాపం!'' అంది స్త్రీ, అనాది నుంచీ ఎంత పోగొట్టు కుందామన్నా సంఘం నేర్పువల్ల వొదలని దయతో.

''కాఫీ తెస్తే తాగి పడివుంటా ఈ పూటకి. రేపట్నుంచీ మళ్ళీ మొదలు ఒంటరి బతుకు. నిన్ను సుఖపెట్టనందుకు ఇదినాకు శిక్షకాబోలు!'' అవసరం కొద్దీ పశ్చాత్తాప పడుతున్నాడు పురుషుడు.

''మీకేం, మగాళ్ళు, జేబులో చెయ్యిపెట్టే వొంటరి తనమేం ఖర్మ!'' అంది ఎంత అణచినా లోపల రగులు తున్న జలసీతో.

''అట్లా అనకు, నేనల్లాంటి వాణ్ణయితే నిన్ను ఇంకోడితో లేచిపోనిచ్చి వుండేవాణ్ణేకాదు!'' అన్నాడు రాఘవరావు.

సుబ్బి కాళ్ళచప్పుడుతో సంభాషణకి పుల్‌స్టాప్ పడ్డది. కాఫీ గ్లాసులోపోసి పూరీల పొట్లం విప్పి, పరిచిత అభ్యాగతుడి ముందు పెట్టి స్వర్ణ లోపలికి పోయింది మంచి నీళ్లు తేవడానికి. సుబ్బికి అయోమయం వదలక పోయినా, గొప్పోళ్ళ సంగతి తనకెందుకని ఆలోచిసగా నడవాలో చాప మీద పడుకుంది.

## 4

దీపం తగ్గించి స్వర్ణ మంచం మీద వాలింది. రాఘవరావు సుబ్బి వంక సందేహ నివారణకోసం ఒకసారి చూచి నిద్రపోతోందని తేల్చుకుని మెల్లగా స్వర్ణ దగ్గిరికి నడిచాడు. స్వర్ణ అతన్ని ఏమీ అడ్డు పెట్టలేదు. మంచంమీద కూర్చుని ఆమె వైపుగా వొంగి రాఘవరావు ఆమె పెదాలతో మాట్లాడుతూ, ''నాతో వచ్చేస్తావా, నిన్ను పూజిస్తాను'' అన్నాడు లాలనగా.

స్వర్ణ అర్థస్ఫూర్తిగా మెరిసే కనుపాపల్ని అటూ ఇటూ తిప్పుతో, '' ఒక్కసారికన్న ఎక్కువసార్లు విషం పుచ్చుకోనక్కర్లేదు చూడు!'' అంది అతన్ని బాహువుల్లో బంధిస్తూ.

''మరినన్ను ఇంకే..'' అని ఏదో బూతుమాట అన్నాడు రాఘవరావు.

''ఇది అవసరం. ఈ వానరాత్రి వొంటరితనం నాకు చాలా కష్టంగా వుంది'' అంది గర్వంగా స్వర్ణ.

రాఘవరావు నోరు పెగలక ఆమె వక్షాలమీద వెచ్చగా నిద్రపోయినాడు.

*('రక్తస్పర్శ' కథల సంపుటి, 1963)*

# చిరంజీవి కథ

రామచంద్రరావు బీదవాడు అనటానికేమీ సందేహం లేదు. కాని చినిగిన చొక్కానైనా ఉతికి ఇస్త్రీకి రుద్దించి గాని వెయ్యకపోవటం చేతనూ, తిన్నా తినకపోయినా తిన్నట్టే నటించటంలో నేర్పు చూపించటంలోనూ అతనికి డబ్బున్న వాడల్లె బతకాలని ఉన్న వాంఛ నిస్సందేహంగా ఋజువైంది. రామచంద్రరావు ముప్పైరూపాయల సంపాదన పరుడైనా పెళ్ళాం ఏదో ఒకటి 'లేదు' అనని రోజు క్యాలెండర్లో లేకపోయినా ఆ లేమిని బైటికి కనపర్చకపోవడం చేత ఉన్నవాళ్ళల్లో జతకావాలని చూశాడు; లేనివాళ్లల్లో కలవనూ లేకపోయినాడు.

ఇటువంటి ప్రవృత్తివలన అతడి జీవితం స్వర్గాన్నూహిస్తూన్న నరకంలో బతుకుతున్న వాడల్లే ఉంటూ వచ్చింది. డబ్బుతో సాధించే సౌఖ్యాలు, డబ్బుతోటే సాధ్యమౌతాయి గాని, మరొక రకంగా అందవని రామచంద్రరావుకి స్పష్టంగా తెలుసు. కాని వాటిని ఊహిస్తూ పొందినట్టే నటించడంలో ఆతడి ఆత్మ పడే బాధ, అతని ప్రతి వెకిలి నవ్వులోనూ, అస్పష్టంగా వ్యక్తమౌతూ వచ్చింది.

రామచంద్రరావు భార్యా ఇందుకు సరిపోయిన ఘటమే. కాని, ఆ పద్ధతి వేరు ఆమెకి దాదాపుగా డబ్బు ఎలా వస్తోందో ఆలోచించే సంస్కారం లేదు. ఎప్పుడూ గొప్ప చీరెలు కట్టాలనీ, డబ్బున్న తన చుట్టాలతోటి తుల తూగాలనీ, భర్తతో నిత్యం పోరాడేది. రామచంద్రరావు ఈ పోరును అణిచి ఉంచాడు అనేక రకాల. అయితే తన భార్య కోర్కెలు తీరాలని అతనికీ వుంది. ప్రయోజనమే లేదుగాని!

★ ★ ★

రామచంద్రరావులో అకస్మాత్తుగా ఒక పరివర్తన వచ్చింది. ఎలాగైనా డబ్బు సంపాయించి తన ఊహల్ని నిజం చేసుకోవాలని అతడు పట్టుపట్టాడు. అందుకోసం తనేం జెయ్యాలో అతడికి తెలీలేదు. అందుకోసం అతడు ఇంకెవరినన్నా అడిగివుంటే ఎలా వుండేదో; అందుకు అతని పౌరుషం అడ్డం వచ్చింది. భార్యని అడగడమైనా పౌరుషహీనమే. అతని కాలోచన లేదు. వెనకటి ఆలోచనలకితోడు ఇదొకయావతోడైంది. మనిషికి సామాన్యంగా ఏ నలభై ఏళ్లకో గాని తల నెరవదు. రామచంద్రరావుకి ఆలోచనలతో తల సగం నెరిసింది పాతికేళ్ళకే. అసలుమనిషి కొంచెం చామన చాయగా వున్నప్పటికీ ఇదివరకు ( చిన్నప్పుడు) నిగనిగ లాడతూ వుండేవాడు. ఇప్పుడు మాడి మసిబొగ్గు అయినాడు.

రామచంద్రరావుకి కొంచెం భాషాజ్ఞానం వున్నది. అతను బడిపంతులు అయినప్పటికీ ఇంకా అతనిలో యాంత్రిక దృక్పథం రాలేదు. కొద్దిగా కల్పనాశక్తికూడా అతనితో మిగిలివుంది. కారణం అతనెప్పుడూ వాస్తవిక జీవితంనించి వేరుపడి ఊహాప్రపంచంలో బయట పడడమే నేమో!

రామచంద్రరావు ఓ చిన్న కథరాసి పత్రికకు పంపించాడు. అ కథకి బహుమతిగా ఓ పత్రిక పంపించారు. రామచంద్రరావుకి డబ్బు మీద మోజు రోజు రోజుకూ ఎక్కువ కాసాగింది. అతను విరివిగా కథలు రాయటం సాగించాడు. ఓ పత్రిక అతనికి రెండు - మూడు - ఐదు ఇలా డబ్బు పంపసాగింది.

రామచంద్రరావుకి డబ్బు మీద మోజు, పత్రికలకి కథలు రాయటం వల్ల తీరకపోయినా, డబ్బు సంపాయించటానికి ఇదీ ఒక మార్గమేమో నని అతను భ్రమపడిన మాట మాత్రం వాస్తవం. అయితే డబ్బు ఎంతో కొంత వస్తున్నది కనుక కథలు రాయటాన్ని అతను ఓ ఉపవృత్తి క్రింద జమచేసి కథలు వ్రాయసాగాడు.

★ ★ ★

ఒక్కొక్క మనిషియొక్క కొన్ని కొన్ని ప్రత్యేక ప్రవృత్తులు ఆ వ్యక్తే గనక కథారచయిత అయితే ఆ రచనల్లో ప్రతిఫలించి తీర్తాయి. రామచంద్రరావు రాసిన కథలు పాఠకులను ఏవో అనూహ్యమైన లోకాలకు తీసుకెళ్ళేవి. రామచంద్రరావు స్వతహాగా ఏనాడూ అనుభవించని సుఖాల్ని, తన పాత్రచేత అనుభవింపచేసి, పాఠకుల్ని భ్రమింపజేసి, వాళ్ల ఆదరణని చూరగొన్నాడు. రామచంద్రరావు పక్కింటి అమ్మాయి వంక చూడ్డానైనా సాహసించలేక పోయినప్పటికి; అతని కథానాయకులు పొరుగింటి అమ్మాయిల్ని, రైళ్ళల్లో, సినిమాల్లో తటస్థ పడ్డవాళ్ళనీ, చాలా ధైర్యంతో, లేవదీసుకుపోయేవాళ్ళు.

రామచంద్రరావు వ్రాసే కథలు ఎల్లప్పుడూ జీవితం నుంచి దూరంగా వుంటూ, పాఠకులకు తియ్యటి కలలొచ్చే టట్టు చేసినై. అతని కథలకి మార్కెట్టు వాల్యూ ఏర్పడ్డది. ఇటువంటి కథలు రాయటంలో అతనికున్న నైపుణ్యాన్ని ప్రతి పత్రికా మెచ్చుకుంది. అతని 'ఫాంటాస్టిక్' కథలకీ, 'రొమాంటిక్' కథలకీ ఎక్కడలేని ఆదరణా ఏర్పడినై.

ఇటువంటి కథలు రాయటానికి అతనికున్న శక్తి ఏమిటా అని ఇతర రాయలేని రచయితలు ఆ దుర్దాపడ్డారు. అతన్నే అడిగారు కూడాను. రామచంద్రరావు మామూలుగా వెకిలినవ్వు నవ్వటంకన్న ఇంకేమీ చెప్పలేక పోయినాడు.

అట్లాంటి కథలు రాయటానికి అతని ఊహలన్నీ స్వర్గంలో ఉండటమే కారణం. ఇంకో కారణం అతని జీవితం నరకప్రాయంగా నిత్య దారిద్ర్యంలో వుండటం - అందుచేతనే ఆచరణలోనూ, స్వానుభవంలోనూ సాధ్యం కానివాటిని తియ్యగా, అద్భుతంగా ఊహిస్తూ అతనుతననీ, తన జీవితాన్నీ, మరచిపోయి 'ఫాంటాస్టిక్' 'రొమాంటిక్' కథలు రాయగలడేమో! ఈసంగతి రామచంద్రరావుకి తెలీదు.

★ ★ ★

అతని ఆదాయంలో చెప్పుకోతగినంత మార్పేమీ రాలేదు. బీడీలు పోయి సిగరెట్లు వచ్చినై; ఎవరికీ తెలియని రామచంద్రరావు అందరికీ తెలిసి అభినందనాలందుకోవడం వొచ్చింది. కీర్తి లభించింది.

కీర్తి పెరిగినకొద్దీ ఇంకా ఏ దేశంలోనైనా అయితే రామచంద్రరావు ఆర్థికంగానైనా బాగుపడి, వేళకి తప్పకుండా అన్నమన్నాతిని ఉండును. తిండిలేని జర్నలిజానికి పేరొందిన ఆంధ్రదేశంలో పుట్టి రామచంద్రరావు కీర్తి మాత్రమే ఆర్జించాడు. ఇందుకోసం వెట్టిచాకిరీ చెయ్యటమే కాని ఆదాయం కోసం నడుస్తున్నవి కాదు. కథకులకు ఈ పాటైనా డబ్బిస్తున్నారంటే అందులో ఏదో రహస్యం ఉండి వుండాలి.

రామచంద్రరావు డబ్బుకావాలని ఎప్పుడూ పత్రికలకు ఉత్తరాలు రాస్తూ వుండేవాడు. రెండు నెలలకీ, మూడు నెలలకీ వాళ్ళూ పంపించేవాళ్ళు; ఆగిపోయిన పత్రికలు తప్ప.

★ ★ ★

రామచంద్రరావు వ్రాసిన ఓ కథ చాలా బావుందని సంపాదకుడు వ్రాశాడు. దానికిపది హేను రూపాయలు పంపిస్తామని కూడా తెలియజేశాడు. రామచంద్రరావుకి అదేరోజున టైఫాయిడ్ ఉధృతంగా వొచ్చింది. అతను జ్వరంలోనూ తన కథలనుగురించే కలవరించాడు. కథల్లో 'కళ' గురించి ఉపన్యాస ధోరణిలో వాగుతున్నాడు. అతడి భార్యకేగనక ఆస్తి యావ ఉండుంటే - దస్తావేజు రాయించేందుకు ఆదుర్దా పడివుండేది. అంత ప్రమాదంలో పడింది జ్వరం.

రామచంద్రరావుని చూడ్డానికి కొందరు రచయితలు వొచ్చారు. అతనికివైద్యంచేసే డ్యాక్టరుకూడా అతని పాఠకుడే, ఉచితంగానే చేస్తున్నాడు వైద్యం.

రామచంద్రరావు కథ - గొప్పగా ప్రచురింపబడింది. ఆ పత్రిక కాపీ అతనికి అందినరోజున రామచంద్రరావుకి వొంటిమీద స్మారకంకూడాలేదు.

స్నేహితులు తలాకాస్త డబ్బిచ్చి వెళ్ళారు ఖర్చులకి. అతని కథల్లో పాత్రలు వాస్తవమైనవి కావని, ఆ స్నేహితులు అతనికి వినపడేట్టు అని వెళ్ళారు. ఆ మాటలు రామచంద్రరావుకి వినపడ్డాయోలేదో చెప్పలేం. అతనికి టైఫాయిడ్ బహుశా నయంకాక పోవచ్చు. అతనికి డబ్బు అవసరమని అందరూ గుర్తించినా ''ఎప్పుడూ డబ్బు డబ్బంటాడు'' అని అన్నారు వాళ్ళు. చుట్ట పక్కలవాళ్ళే కాదు; పత్రికల వాళ్ళు కూడాను. రామచంద్రరావుకు పంపిన కథ తాలూకు డబ్బు అతని ఉత్తరక్రియలకు అందితీరుతుందని అతని భార్య ఎదురు చూస్తున్నది. రామచంద్రరావు జీవితంలో ఇంకేడబ్బున్న వాడు అనుభవించని ఆనందాల్ని ఊహించాడు. అతనికి మరణం గూడా 'మరణిస్తున్నాం' అని స్పృహ తెలిసిన స్థితిలో రాక పోవటం కూడా ఒక అదృష్టమనే అతడు భావిస్తాడు. తెలిస్తే.

*('రక్తస్మర్శ' కథల సంపుటి, 1963)*

# గొప్పవాడి భార్య

గొప్పవాడికే సుగుణాలూ లేకపోయినా, వాటిని అలవాటు చేసుకోవటం యాతనైనా, ఆ గొప్ప గుణాల్ని డాబుగా ప్రదర్శిస్తే గొప్ప వాడైనాడు. గొప్పవాడి అసలు పేరు, అందరూ మరచి గొప్ప వాడనే పిలుస్తున్నారు. గొప్పవాడు అందరూ అన్నం తినటం మామూలు పనిగనక, తను, నువ్వుల నూనే, నారింజకాయల తొక్కల రసమూ, బహిరంగంగా తాగటం అలవాటు చేసుకున్నాడు. కాని లోపాయికారీగా అన్నం తింటూనే ఉన్నాడనీ, ఎవరో తెలియనివారో, తెలిసినవారో అన్నా, పత్రికలు ఇట్లాంటి వాటిని ప్రజలు నమ్మరని, ప్రచారం చేసి గొప్పవాడి గొప్పతనం నిలబెట్టినై. గొప్పవాడిది వరకే, పెళ్ళి చేసుకొని, ఇద్దరు కొడుకుల్నీ, ఓ కూతుర్నీ కన్నాడు. గొప్పవాడి భార్య గొప్పవాడి గొప్ప తనం కోసం, గొప్ప పనులు చేయలేక, గొప్పవాడి చాత నానా చివాట్లూ తింటోంది. కాని, భార్యా భర్తలు, చాలా అన్యోన్యంగా ఉండటం గొప్ప వాడి గొప్పతనం గనక, పైకి గొప్పవాడు, భార్యని చాలా గొప్పగా, నలుగుర్లో గౌరవిస్తున్నాడు.

గొప్పవాడిలో కూడా సామాన్య కామం ఉన్నది. అది అప్పుడప్పుడు అతన్ని మామూలు మనిషిని చేసినా, గొప్పవాడు తన గొప్పతనానికి, విరుద్ధమని, భార్యని ఏభైయ్యో వడి వొచ్చి, తనకీ ఇంద్రియాల శక్తి అడుగంటిం తర్వాత, నిష్కామకర్మ, ఇంద్రియాల్ని జయించినట్టు ప్రకటించి, భార్యచేత గూడా ఇంద్రియ నిగ్రహం చేయిస్తూ, పదహారేళ్ళ మనుమడికి ఇంద్రియ నిగ్రహం బోధ పరుస్తున్నాడు.

గొప్పవాడు లేని సుగుణాల్ని ప్రకటించటంలో గొప్పతనం బాగా గ్రహించాడు. ఇప్పుడు చాలా గొప్ప గొప్ప సుగుణాల్ని ప్రదర్శిస్తున్నాడు. కాని గొప్పవాడి భార్య సాధారణ మనిషి కావటం ఆవిడకి గట్టి చిక్కే వొచ్చింది. ఆవిడ గొప్పవాడి అనుమతి లేకుండా ఎక్కడికీ వెళ్ళరాదు. కాని గొప్పవాడి కోసం, గొప్పగా నలుగురిలో గొప్పమాటలు మాట్లాడాలి. ఇవన్నీ పాపం గొప్పవాడికి చాతవు కానీ, ఆవిడకి తెలీదాయెను! గొప్పవాడ్నీ గొప్పవాడి భార్యనీ, పత్రికా విలేఖరులు ఏదన్నా అడిగితే, గొప్పవాడి భార్య నవ్వాలి గాని, ఏమీ మాట్లాడగూడదు. ఆమె పతి ''అనుసరణీయ''గాక పోవటం ఆవిడ గొప్పతనానికేగాక, గొప్పవాడి ప్రతిష్టకీ భంగమాయెను మరి!

## 2

గొప్పవాడి భార్య చదువుకోలేదు. కాని, గొప్పవాడికి ఇది నామర్దాకాదు? తనే గొప్ప సూత్రాలు కొన్ని ఆవిడ పేర పత్రికలకి పంపిస్తున్నాడు. గొప్పవాడి భార్యపేర, కొన్ని పత్రికలలో, అనేక వ్యాసాలు, ఫోటోలు ప్రచురిస్తున్నారు. ఆవిడంత సుగుణవతి ఎక్కడన్నా ఉందా అనిపించేట్టు. కాని గొప్పవాడి భార్యకి మాత్రం ఇదంతా ప్రాణానికి వొస్తోంది. ఆవిడ గొప్పవాణ్ణే ఒకనాడు, పత్రికా విలేఖరులు,

ఫోటో(గ్రాఫర్లు, పెద్దమనుషులూ, లేనప్పుడు చూసి మెల్లిగా, '' ఏమండీ! మీరు తినకపోతే మానె న్నన్నా కాసిని వండుకు తిననివ్వండి, మీ గొప్పతనం మీకు ఉంటుంది'' అని అడిగింది, జిహ్వచచ్చి. కానీ గొప్పవాడు వప్పుకోలేదు. గొప్పవాడి భార్య పకోడీలు తిన్నదంటే, అందులో ఉల్లిపాయ పకోడీలు, ఇంకేమన్నా ఉందా? ఎంత లోటు గొప్పతనానికి? అందుకని, మెల్లిగా భార్యని మందలించాడు.

3

జీవితం, ఆనందాన్ని, అభిరుచుల్ని, గొప్పవాడి గొప్పతనం కోసం ధారపోసి, గొప్పవాడి భార్య, బతకటం దుర్భరమని భావించి, ఒకనాడు గొప్పవాడు, రహస్యంగా ధ్యానం వంకతో, వేసే నల్లమందు, గొప్ప కోసం తాగే మంచి నూనే, తాగి, డాక్టర్లకి గూడా అలిమిగాకుండా, గొప్పగా చచ్చింది. ఆవిడ చావడం గూడా గొప్పవాడి గొప్పతనం నిలబెట్టే విషయమే! గొప్పవాడు, న్యాయంగా ఆవిడ్ని దహనం చేయవలసి ఉన్నా, గొప్పవాళ్ళెవరూ, అట్లా చేయలేదు గనుక, గొప్పగా మంచి ముహూర్తంలో భగవన్నామం జపిస్తో ఆవిడని సమాధి చేసేడు. ఆవిడ ఆత్మని బతికున్నప్పుడు పెట్టిన గొప్ప క్షోభలు చాలక, చచ్చింతర్వాత గూడా, ప్రార్థనలు చేసి, ఆవిడ ఆత్మ ఏ లోకానికి చేరాల్సిందీ, తనే నిర్ణయిస్తున్నాడు! గొప్పవాడు, తన భార్యకి గొప్పగా సమాధి చేయటం, వగైరా, అన్ని ఫోటోలు, పత్రికల్లో, గొప్పగా ప్రకటించారు.

గొప్పవాడి జీవితమే గొప్పమరి! గొప్పవాడు, తన 60వ జన్మదినోత్సవానికి, భార్య ప్రథమ సాంవత్సరీకానికి, డబ్బు వసూలు చేసి, భార్య పేరగొప్ప తోట వేయించి, దాంట్లో, ఎల్లకాలాల్లోనూ చల్లగా, వెచ్చగా ఉండే కుటీరం నిర్మించుకుని గొప్పగా నివసిస్తున్నాడు. తోటలో, తన గొప్పతనం కోసం అన్నీ ధారపోసి, ఉసూరుమని చచ్చిన వెనకటి, ఇద్దరు శిష్యుల పేరా, రెండు రాతి స్థూపాలు నాటించాడు, తన కొత్త, లేత శిష్యురాలి చేత.

*(జ్యోతి సచిత్ర పక్షపత్రిక మార్చి 1, 1948)*

# పరిశోధన

స్త్రీ హృదయం లోతులు తీసేందుకూ, ఆ మూలాగ్ర పరిశోధన చేసేందుకూ, పురుషుడు ఒక లేబొరేటరీ ఓపెన్ చేశాడు. లేబరేటరీ నిండా ప్రణయకావ్యాలూ, జగన్మోహనుల వర్ణ చిత్రాలు నింపి, పరిశోధన ప్రారంభించాడు. ఒక శోధన నాళిక కూడా తెచ్చాడు. స్త్రీ పురుషుణ్ణి, అందం కోసమా, అనురాగం కోసమా, శరీరం గురించా, దేని కోసం ప్రేమిస్తోంది? ఈ విషయం తెలీక పురుషుడు 'స్త్రీ' హృదయాన్ని శోధన నాళికలో వేసి, ప్రశ్నించాడు కాస్త వేడిచేసి. 'స్త్రీ' హృదయం టింగ్, టింగ్ అని ఎగతాళిగా స్పందించిందే కాని ఏమీ జవాబివ్వలేదు. పురుషుడు విసుక్కుని ఇంకా కాస్త వేడి చేసి అడిగాడు 'స్త్రీ' హృదయాన్ని. సమాధానం లేదు. పురుషుడు, శోధన నాళికని ఎగాదిగా చూచి, ఏదో కనుక్కున్న వాడల్లే, ''స్త్రీ పురుషుడి సౌందర్యం చూసి ప్రేమిస్తోంద''న్నాడు.

కాని శోధన నాళికలోని స్త్రీ హృదయం ఫక్కున నవ్వింది. విషాదం సూచిస్తూ పురుషుడు ఉలిక్కిపడి శోధన నాళికలోకి చూశాడు. శోధన నాళిక రంగు మారుతోంది. పురుషుడు, ఇలా అనుకున్నాడు ''స్త్రీ పురుషుణ్ణి, గతి లేకా, రక్షణ లేకా, ప్రేమిస్తోంది, స్త్రీ అబల'' అని జాలిగా.

కాని ఈ సిద్ధాంతం మీద పురుషుడు ఎక్కువసేపు నిలవలేదు.

ఒకరోజు పురుషుణ్ణి 'స్త్రీ' చెంపచెళ్ళుమనేట్టు బాదింది. ఖడ్గంతో యుద్ధానికి దిగింది. పురుషుడి మీద రాజ్యం చేసింది. ఇహ ఎట్లాగతి? అని పురుషుడు దిగులు పడ్డాడు.

పురుషుడు ''స్త్రీ'' హృదయాన్ని మళ్ళీ శోధన నాళికలో వేసి, వేడి చేశాడు. భయంకరమైన రంగులోకి మారింది, స్త్రీ హృదయం. పురుషుడు భయపడి శోధన నాళిక దూరంగా పెట్టి కళ్ళుమూసుకుని ఆలోచించాడు.

''స్త్రీ.... శక్తి, అది యేమన్నా చేయగలదు'' అన్నాడు పురుషుడు.

పరిశోధన, ఇంతటితో ఆపలేదు పురుషుడు. ఇంకా చేస్తున్నాడు ... స్త్రీ కోసం రాజ్యాలూ, మేడలు, ఉద్యోగాలూ, స్కూలు పరీక్షలు, అన్నీ వొదులుకుంటున్నాడు పురుషుడు. మరి పరిశోధన తేలడం ఎట్లా? ఇంకా రాత్రనక, పగలనక, వాననక, యెండనక స్త్రీ వెంట తిరుగుతున్నాడు పెంపుడు కుక్కలాగ.

శోధననాళికలోని 'స్త్రీ' హృదయాన్ని పురుషుడు గాఢంగా ముద్దుపెట్టుకుని 'స్త్రీ' హృదయం,

ఒక అయస్కాంతపురాయి. దానికి పురుషుణ్ణి ఆకర్షించడం తప్ప వేరే, ఉద్యోగం లేదు.'' అని తీర్మానించాడు, తన బరువైన హృదయానికి కాస్త విరామం కల్పించటానికి.

కాని అప్పటికీ విరామం చిక్కలేదు పురుషుడికి. '' ఎబ్బే, స్త్రీ పురుషుడికి ఆస్తి. చరాస్తి అంతే!'' అనుకున్నాడు గట్టిగా శ్వాస పీల్చి.

పోని ఈ అభిప్రాయం ఎక్కువ సేపు నిల్చిందా? స్త్రీ కన్నీళ్ళు పెడితే చూసి, ''పాపం స్త్రీ, భోగ్యవస్తువు, కాని, ఆమె పరాయత్త'' అని విలపించాడు. పురుషుడు తన విలాపం మానుకుని, కళ్ళుతుడుచుకుని టెస్టుట్యూబ్‌లోకి చూశాడు. 'స్త్రీ' హృదయం అందులో లేదు! పురుషుడికి పూర్వాభిప్రాయం సడలి, వొళ్ళు మండింది: ఇలా పెద్దగా అరిచాడు, ''అరెరే! స్త్రీ లేచిపోయిందే? దీన్ని నమ్మరాదు. స్త్రీ వంచకురాలు'' అని కోపంగా అన్నాడు.

చివరికి పురుషుడు విసిగెత్తి, ''స్త్రీకి హృదయమే లేదసలు. ఇన్నాళ్ళ బట్టి పరిశోధించింది, దేన్నో అంతు తేలటంలేదు'' అన్నాడు. పైగా, అసలు ''స్త్రీ లేకపోతేనే పురుషుడికి ఏ మంచి జరిగినా 'స్త్రీ'తో పురుషుడి సంబంధం నీచం'' అని తేల్చివేశాడు.

''ముక్కు మూసుకుని, అడవులకి పోయి, బ్రహ్మచర్యం అవలంబించి ఇంద్రియనిగ్రహం, చేయడం మంచిది'' అని నిబ్బరంగా ఆలోచిస్తూ పురుషుడు, తన చేతిలో శోధన నాళిక చిదగ్గొట్టి, లేబొరేటరి తగలెట్టాడు.

''పిచ్చి పురుషుడా, నువ్వేం కనుక్కున్నావ్ నన్ను గురించి ఇంత కాలం ఊహాగానం చేశావు అంతే'' అంది. 'స్త్రీ' తగలడిపోతున్న లేబరేటరీ మంటల్లోంచి పక పక నవ్వుతో పురుషుడు విస్తుపోయి, ''నిజం''? అని అడిగాడు స్త్రీ స్వరాన్ని.

'స్త్రీ' స్వరం ''నిజమే'' అంది.

అయితే, పురుషుడు, ''స్త్రీ''కి ఓడిపోతల్చుకోలేదు గావును, గంభీరంగా స్టేజీ ఎక్కి, మీసం మెలేసి, ''పాపం, 'స్త్రీ'' అణగారిపోతోంది. అస్వాతంత్ర్యంలో; ఆమెకి స్వతంత్రం కావాలిప్పుడు అని పెద్దగా, 'మైక్'లు దద్దరిల్లేట్టు అరిచాడు.

'స్త్రీ' స్వరం వికటాట్టహాసం చేసింది ప్రతిధ్వనిగా! పైగా ఛాలెంజి చేసింది. ''నువ్వు నన్ను గురించి యేమీ శ్రమ పడక్కర లేదు'' అని.

***(జ్యోతి సచిత్ర పక్ష పత్రిక 15 మార్చి 1948)***

# సంస్కరణ

సంస్కర్త, సామాన్యుడూ ఎదురు పడ్డారు పెద్ద బజారులో. సంస్కర్త సామాన్యుడి భుజం మీద చేయివేసి, '' ఏమోయ్, ఇంత పాడైపోయావేం?'' అని అడిగాడు

సామాన్యుడు అనుమానం వేసి తన వంక తనే చూసుకున్నాడు కాసేపు. జేబు దగ్గిర చిరిగినషర్టు బిళ్ళగోచీ పంచె, పైని తుండుగుడ్డ, కొంచెం చెరిగినక్రాపూ జేబులో పావలా డబ్బులూ, తనేమీ మారలేదే? సామాన్యుడు తలెత్తి సంస్కర్తలోకి చూసి, ''నేనేం పాడైపోయానండి? మామూలుగానే ఉన్నాను'' అన్నాడు.

సంస్కర్త మోకాళ్ళ వరకూ వేళ్ళాడే ఖద్దరులాల్చీ, జీరాడే గ్లాస్కో పంచె, పైకి దువ్విన అమెరికన్ క్రాప్, గోవాడ పై పంచె, కొల్హాపూర్ స్లిప్పర్లు తొడుక్కొని, సామాన్యుణ్ణి చలవ సులోచనాల్లో గుండా తీవ్రంగా చూసి. ''నువ్వంటే నువ్వేకాదోయ్, అసలు సంఘమే పాడైపోయింది.'' అన్నాడు ఆదుర్దాగా.

సామాన్యుడు తలగోక్కొని, ''గావును, ఎవ్వరితోనూ చెప్పకుండా అట్లా చెడిపోడం ఏమిటండి,'' అన్నాడు సీరియస్‌గా.

సంస్కర్త సులోచనాలు పై పంచెతో తుడుస్తో, ''సంఘం అనేక విధాల పాడైపోతోంది. తెలుసా?'' అన్నాడు మరీ ఆదుర్దాగా.

సామాన్యుడు తాపీగా ఒక తాజ్‌మహల్ బీడి వెలిగించి, ''పోతే పోనీండి, మనకెందుకూ మధ్య'' అన్నాడు పరాకుగా.

సంస్కర్త కోపంగా చూశాడు సామాన్యుణ్ణి. తర్వాత సులోచనాలు తగిలించుకొని, ''మనకి కాకపోతే, ఇంకెవ్వరికి పడ్తుందోయ్, చూడు. సంఘంలో హరిజనులు అణగారిపోతున్నారు.''

''నిజమే మరి'' అన్నాడు సామాన్యుడు.

''వాళ్ళకి దేవాలయ ప్రవేశం ఇప్పించాలి మనం'' అన్నాడు సంస్కర్త.

సామాన్యుడికి అనుమానం వేసింది. మాలవాళ్ళు అణగారిపోతుంటే చదువు చెప్పించాలి, అన్నం పెట్టించాలిగాని, దేవాలయ ప్రవేశం ఏమిటి వాళ్ళని మోసం చెయ్యటం కాకపోతే? సామాన్యుడు సంస్కర్తని ఎగాదిగా చూసి ''వాళ్ళకి దేవాలయ ప్రవేశం ఎందుకండీ? ఉన్న మతిపోవడానికా?'' అని అడిగాడు.

దాంతో సంస్కర్త సామాన్యుణ్ణి రోడ్డుపక్క అరుగుమీద కూర్చోబెట్టి, ''వాళ్ళకి దేవుణ్ణి దర్శించే హక్కు ఇప్పించాలయ్యా'' అన్నాడుకోపంగా.

సామాన్యుడికి ఇంకా అనుమానం వేసి, ''దేవుణ్ణి ప్రార్థిస్తే సరిపోతుందంటారా? ఇప్పటికి పాతికేళ్ళ బట్టి నేను దేవుడిని ప్రార్థిస్తూనే వున్నాను. ఏమీ ఊడిపడలేదు నాకు. వాళ్ళకే మాత్రం...'' అని ఇంకేదో చెప్పబోతో ఉంటే, సంస్కర్త సామాన్యుడిని ఆపి, ఆ సమస్య తప్పించేసి, ''అది పోనీవయ్యా, నీ కన్నీ సందేహాలే. ఇటు చూడు, సంఘంలో స్త్రీ స్వాతంత్ర్యం లేక అల్లాడి పోతోంది'' అన్నాడు.

సామాన్యుడు ఆలోచించాడు, ''నిజమేననుకోండి. మా ఆవిడ 'చదువుకోవే' అని మొత్తుకున్నా చదవడం లేదండి. ఏం చేయ్యను?'' అని అడిగాడు సంస్కర్తని .

సంస్కర్తసామాన్యుడిని కొంచెం చురచురచూసి, ''మీ ఆవిడ సంగతీ, మా ఆవిడ సంగతీటోయ్ మనం మాట్లాడేదీ'' అన్నాడు.

సామాన్యుడు కాస్త తగ్గి ''మా ఆవిణ్ణి, మీ ఆవిణ్ణి మినహాయించా మీరు మాట్లాడుతోంది? క్షమించండి.'' అన్నాడు.

సంస్కర్తమళ్ళీ మాట తప్పించి, ''నీకు బొత్తిగా సంస్కరణ అంటే ఏమిటో తెలియడంలేదోయ్'' అన్నాడు విగ్గుగా.

''నా కెట్టా తెలుస్తుందండి. సామాన్యుడిని'' అన్నాడు సామాన్యుడు నమ్రతగా.

సంస్కర్త ఎందుకో జేబులు తడవుకొని, '' ఒక బీడీ ఉంటే ఇవ్వవోయ్,'' అని అడిగాడు సామాన్యుడిని.

సామాన్యుడు బీడీ, నిప్పెట్టా రెండూ ఇచ్చి, ''అయితే మహాశయా, సంఘం అంతా పాడైపోయిందంటారా?'' అని అడిగాడు భయం భయంగా.

''మెల్లగా అంటావేమిటి'' అన్నాడు సంస్కర్త బీడీ వెలిగిస్తో.

''అయితే ఎట్లా?''

''సంస్కరణ చెయ్యాలి.''

''అంటే?''

''మళ్ళీ మొదటికొచ్చేవోయ్. మొదట హరిజనసమస్య, ఆ తర్వాత స్త్రీ జనోద్ధరణ, ఆ తర్వాత....

'' ఇంతకీ సామాన్యులు బతికే ఉపాయం, దరిద్రం ఒదిలే మార్గం ..... అవేమీ మన సంస్కరణ ప్రణాళికలో ఉండవా యేమండి?'' అన్నాడు సామాన్యుడు మామూలుగా.

''అవన్నీ పాశ్చాత్యవాసన వల్ల వొచ్చిన పాడు మనస్తత్వమోయ్, ఒకడి దరిద్రం ఒదిలించేందుకు మన మెవరిమోయ్, అదంతా సృష్టి విలాసం. భగవదేచ్ఛ!'' అన్నాడు సంస్కర్తగుడ్లు తేలేసి.

సామాన్యుడు ఈ వివరం నిజమని నమ్మలేకా, కాని పెద్దమనిషిని వ్యతిరేకించలేకా, ''పోనీ హరిజనోద్ధరణ, భగవదేచ్ఛకి ఒదిలి, స్త్రీ స్వాతంత్ర్యం విధికి వొదిలితే చిక్కు వొదులుతుంది కదండి?'' అన్నాడు.

సంస్కర్త సామాన్యుడిని ఎందుకోగాని మింగేద్దామా అన్నట్టుచూసి ''నీవు ఇట్టా అడ్డదిడ్డంగా మాట్లాడ కూడదోయ్, తెలిసీ, తెలియకా'' అన్నాడు.

సామాన్యుడికి ఈ మందలింపు అర్థం కాలేదు. ''తను మాట్లాడే గూడదా?''

''యామండి. నేనసలు మాట్లాడే గూడదంటారేమిటి? అందుకన్నా నాకు స్వేచ్ఛలేదూ?'' అని అడిగాడు కాస్త చికాకుగా.

సంస్కర్త జేబులోంచి ఓ కాయితం తీసి నువ్వు పెద్దల్ని ఇట్లా ప్రశ్నించకూడదు. ఇదిగో నువ్వుకూడా మా సంఘసంస్కరణోద్యమ సంఘంలో చేరు. చందా పావలా మాత్రమే'' అన్నాడు.

సామాన్యుడు, ఏడ్చినట్టుంది వ్యాపారం అని మనసులో అనుకొని, పావలా బిళ్ళ జేబులోంచి తీసి సంస్కర్త చేతిలోపెట్టి. ''చేర్చుకోండి నన్నూ ఓ సభ్యుడిగా-'' అన్నాడు గత్యంతరం లేక.

సంస్కర్త సంతోషంగా పావలా జేబులోకి నెట్టి, సామాన్యుడికి ఓ రశీదు పుస్తకం చూపించి, ''నువ్వూ ఇక సంస్కర్తవోయ్. ఈ పుస్తం తీసుకొని ఇంకా మెంబర్లని చేర్పించు. మన ఆశయాలు చెప్పి.'' అన్నాడు వెళ్లటానికి సిద్ధపడి.

కాని సామాన్యుడు పుస్తకం తీస్కుకోకుండా, '' ఎబ్బే! నాకు చాలా వేరే పన్లున్నయిలెండి.'' అని మర్యాదగా నిరాకరించి వెళ్లిపోయాడు. అక్కడి నుండి సంస్కర్త ''వీళ్లకేం తెలుసు సంస్కరణ అంటే'' అనుకుంటూ, కాళికాంబ కఫేలోకి పోయినాడు.

***(జ్యోతి సచిత్ర పక్ష పత్రిక ఏప్రియల్ 1948)***

# పిలికి ప్రియుడు

ఉదయం 8 గంటలు. రాత్రల్లా కొట్టిన గాలివాన నుండి తూర్పుదిక్కు ఇప్పుడిప్పుడే బయటపడుతోందా అన్నట్టు, సూర్యకిరణాలు వొస్తున్నై ఎర్రగా. మబ్బులు పొగకి మల్లే తేలిపోతున్నై. అప్పటిదాకా ఏడ్చి, తల్లి పప్పులు పెట్టగానే నవ్వేకుర్రాడి వర్చస్సుగా వుంది ప్రకృతి. మబ్బులు వీడలేదు. గంభీర్యమైన చిక్కని నీలాకాశం అక్కడక్కడ కన్పిస్తోంది. వాన నీళ్ళు రోడ్డు పక్కన కాలవలా ప్రవహిస్తున్నై. పిల్లలు కాయితం పడవలు చేసి ఆ నీళ్ళలో వేసి ఆనందంగా ఆడుకుంటున్నారు. రామారావు వెచ్చని స్వెట్టర్ తొడిగి, సిజరు దమ్ములు లాగుతో, కాఫీ హోటల్‌కే గావును వెడుతో, మా యింటి ముందు ఆగి, '' ఒరేయ్ రాజా! ఒరేయ్ రాజా! అని పెద్దగా కేకేసాడు. కిటికీ గుండా వాణ్ణి చూసాను. కాని, ఈజీ చైర్‌లో ' ఎడ్గార్‌వాలేస్' నవలలో మునిగి కూచుని లేవబుద్ధెయ్యక పలకలేదు. మళ్ళీవాడు కొంపమునిగిపోయినట్టు, అరవడంతో, నవలపేజీ గుర్తుగా మడిచి, కుర్చీలో పడేసి, వొళ్ళు విరుచుకుంటూ, 'వొస్తున్నా వుండవోయ్' అని అరిచి, చలి యింకా బాధిస్తుండడం వల్ల స్వెట్టర్ తొడుక్కుని బయటికి వచ్చాను. నన్ను చూడగానే రామారావు రిస్టువాచీ వంక చూసి '' ఏరోయ్, రోజు రోజుకీ ఓ గంట ఆలస్యంగా తెల్లవారుతోందే నీకు మరీ!'' అన్నాడు, వాడి మామూలు ధోరణిలో. వాడి యెదట ఎట్టి పరాభవాన్ని ఎప్పుడూ, భరించడం ఇష్టం లేని నేను, '' ఏడిశావులేగాని ఊరుకో, నేనులేచి రెండు ట్రిప్పులు కాఫీతాగి ఎడ్గార్ వాలేస్, 30 పేజీలు చదివి అరపేకెట్టు సిగరెట్లు తగలేసిన తర్వాత, వొచ్చావు. పైగా, ఇప్పుడే తెల్లవారుతోందిట. నీ మొహమేమిరా నాయనా?'' అనేప్పటికి నా మిత్రుడు కాస్త తగ్గాడు. తగ్గక తప్పలేదు గూడానూ! ఇక విషయం మార్చే ధోరణిలో, ''పదరా, అయ్యరు హోటల్‌కి ఆకలేస్తోంది!'' అన్నాడు. ఇంకో రెండు మాట్లు కాఫీ తాగినా ఫర్వాలేని, యువకుణ్ణే గనక వెంటనే బయల్దేరాను. ఇద్దరం మాట పలుకూ లేకుండా 'కాళికాంబకేఫ్' లో జొరబడ్డాం తొరతొరగా. కాఫీఅనే అమరపానీయం పడితేగాని ఏ పనీ చెయ్యలేని ఇరువయ్యో శతాబ్దం మాడల్‌యువకుడు రామారావు (నేనూ అంతే...) లావాటి ఇడ్డెన్లు 4 తిని, వేడి కాఫీ చప్పరించి, సంభాషణకి క్రమంగా దిగాడు. నిజానికి ఇలాంటి సంభాషణలే లేకపోతే ఊళ్ళో వార్తలు చిటికెలో ఎలా పాకిపోతాయ్? రాష్ట్రంలోవీ, లోకంలోవీ ఐతే, పత్రికల్లో పడతయ్ గాని, వూళ్ళో ' ఇంట్రెస్టు' గల వ్యక్తిగత సమాచారాలు, రామారావు బోటి వార్తావాహకుడే లేక పోతే మనకెలా తెలియడం? రామారావు, సిగరెట్‌మొదటిగుక్క వొయ్యారంగా వొదిలి, ''విన్నావురా, మన పిచ్చయ్య లవ్ ఎఫైర్?'' అన్నాడు నెమ్మదిగా. నాకు ఆనందాశ్చర్యాలు ఒక్క మాటు కలిగి, '' ఆ! ఏమిటి? మన పిచ్చయ్య లవ్ ఎఫైరా? బావుంది! చెప్పు సాంతం'', అన్నాను అతి కుతూహలంతో, సిగరెట్ ముట్టిస్తో. రామారావు విషయంలోకి వెంటనే దిగాడు.

''పిచ్చయ్య ఊళ్ళోంచి ఉడాయించాడురా!''

''ఏమిటీ? ఊళ్ళో నించే! ఏం?''

''ఆ! అంతులేకుండా!''

''ఎక్కడికి?''

''అది తెలీకనే ప్లీడరుగారు అల్లాడుతున్నాడు''

''ఏ ప్లీడరు?''

''గోవిందరావు బి. ఏ. బి. యల్...''

''3వ అడ్డరోడ్డు ఎనిమిదో నెంబర్ ఇంటి పెద్దమనిషేనా?''

''నీకెట్లా తెలుసురా ఆయన్ని?''

ఆరేణ్ణెల్ల కింద పిచ్చయ్య చెప్పాడులే. ఆయన దగ్గర వీడు గుమస్తాగిరి వెలిగిస్తున్నాట్టగా?''

''అదే! అదే!''

''అంటే?''

''చెబుతావిను''

''చెప్పు''

''పిచ్చయ్యనాతో చెప్పిందంతా, వాడు చెబుతున్నట్టే చెబుతా మధ్య మన కవిత్వం కొంత ఉంటుంది.''

'' ఎట్టాగోట్టా చప్పున ఏడవరా!''

''వినవోయ్, వూరికే!... ఇవాల్టికి వారం క్రితం. పిచ్చయ్య రాత్రి 7 గం॥ ప్రాంతాల క్లబ్‌లో చీట్లపేక దగ్గర ఎత్తాడు ఈ వ్యవహారం. మేమిద్దరం మాత్రం, ఓ మూల బల్లదగ్గర, 'సెట్లు' ఆడుతున్నాం. పిచ్చయ్య ఏమంత ఉషారుగా లేకపొయ్యేటప్పటికి నాకు విసుగు పుట్టి, '' ఏమిట్రా పిచ్చాయ్యా, అట్లా ఆముదం తాగిన వాడికిమల్లె వున్నావు'' అని అడిగాను. పిచ్చయ్య ఏదో గొణిగాడు. వాడి విషయమై క్లబ్‌లోనూ, బైటా, ఏవో ''స్కాండల్సు'' వ్యాపించిన సంగతి మనకు తెలుసునాయె. వాడికి ప్లీడరు గారిచ్చేది 15 రూపాయలు. వీడేమన్నా వందకి తక్కువ లేకుండా జల్సాచేస్తున్నాడాయె. ఎప్పుడూ, సిల్కుచొక్కాలు ... లావెండర్ సెంట్లూ....''

'' ఈ సోది ఏమిటిరా? అసలు విషయం చెప్పక!'' అన్నాను కోపంగా

''చెబుతున్నా గదోయ్! పిచ్చయ్య ఏదో ఈ 'స్కాండల్స్'కి నొచ్చుకుని ఇట్లా ఐనాడు గాబోలు. అనుకున్నాను నేనూ! కాని పిచ్చయ్యే కదిలించాడు నన్ను.

''రామూ! నా కొకసలహా చెబుతావురా?'' అన్నాడు నెమ్మదిగా, దిగాలుగా. '' ఓ యెస్! దానికేమిటి? ప్రాణస్నేహితుడిని నీకు వెధవది సలహా చెప్పలేనూ?'' అన్నాను ధీమాగా.

''అయితే నే చెప్పే కథ ఎవరికీ చెప్పనని ప్రమాణం చెయ్యిముందు'' అన్నాడు.

ఏదో రహస్యం బయటపడపోతుంది గదా, అని వుషారుగా, ''నీ తోడు ఎవరికీ చెప్పనురా'' అని చేతిలో చెయ్యేసి ప్రమాణం చేసాను. పిచ్చయ్య ప్రారంభించాడు. నేను, కొత్త సిగరెట్ వెలిగించి ఉత్సాహంగా ఊ కొట్టున్నాను.

2

నేను గోవిందరావుగారి దగ్గరగుమాస్తాగా చేరి దాదాపు ఐదు నెలలేమో అవుతోంది. గోవిందరావుకి భార్య తప్ప చుట్టాలెవరూ లేనట్టే. పిల్లలూ లేరు. ఆయనికి నలభై ఏళ్ళు వుంటాయి. ఆయన భార్య ఇరవై రెండేళ్ళ యువతి పేరు, అనూరాధ. ఆమె సౌందర్యం ప్లీడరుగారి ముందు, కొవ్వొత్తి ముందు, మెర్క్యూరీ లాంప్‌లా వుంటుంది. రెండో పెళ్ళి! ప్లీడరుగార్కి మొదటి భార్య ఎవడితోనో లేచిపోయింది. కారణం... ప్లీడరు గారి అసమర్థత అని నాకు తర్వాత తెలిసింది. ఆమె తెల్లని శరీర ఛ్ఛాయా, గులాబీ రంగు బుగ్గలు, వెడల్పాటి కళ్ళూ, పురుషుడన్న వాణ్ణల్లా ఆకర్షిస్తాయి. నాదో లెఖ్ఖా? నేనూ, కాస్త షోకుగా, నీటుగా, తిరగటం, 'అఖియమిలాకే' అని కూనిరాగాలు తీయడం ప్రారంభించాను. నిజానికి ఆమెకోసం ఇంకేమన్నా చేయగలననుకున్నాను. ఆ వుద్దేశంలో, ఇంతకీ పేచీ ఏమొచ్చిందంటే, ప్లీడరు లేనప్పుడు, ఆమెని కలుసుకునే అవకాశం ఎంతకీ దొరకదు. ప్లీడరుతో పాటు నేను కోర్టుకు పోవాలాయెను; ఆయనతోపాటే ఇంటికి రావాలాయె. నాకూ అనురాధకీ ఎలాంటి సంబంధం కాని ఉండటానికి అవకాశం లేకపోయింది. అయితే నాలో ఆమె సౌందర్యం హత్తుకుపోయి నాకు నిద్ర పట్టనీయక, వేరే ఆలోచనా చేయనీక..., పిచ్చెత్తిస్తోంది....''

''అబ్బా - అంత సౌందర్యవతా?'' అడిగాను ఆశ్చర్యంగా.

పిచ్చయ్య మొహం దీప్తించింది. మైమరచి నట్టు క్షణం ఉండి, 'మెల్లిగా అడుగుతున్నావా? పోతపోసిన బంగారు విగ్రహం,..... ఆమె మాటల్లో, ఆమె గొంతులోనే ఉంది ఏదో ఆకర్షణ... ప్రత్యేకం .... ఏం చెప్పను? ఆమెకి నా ప్రేమని తెలియజెయ్యాలి.... ఎట్లా? అని రోజూ అవస్థపడసాగాను.

ఆ రోజు ఆదివారం. ఆవేళ ప్లీడరు, మ్యాటినీ షోకి వెళ్తానని చెప్పాడు. ఇదే సమయం అనుకున్నాను. సరిగ్గా 3 1/2 గంటల కల్లా టాయిలెట్ ఐ, ప్లీడరు సినిమాకి వెళ్ళేవరకూ, రోడ్డుమూల కాఫీ హోటల్లో కూచుని, వెళ్ళాడని స్థిరపరచుకున్న తర్వాత ప్లీడరుగారిల్లు చేరుకున్నాను. నిజంగా నా అంత ధైర్యవంతుడు లేడని నా నమ్మకం. అర్థరాత్రి అయినా, ఎంత చీకట్లోనైనా నిర్భయంగా తిరిగేవాణ్ణి నా ధైర్యానికి నేను విలువ కట్టుకుంటో, ఆమెని ఎట్లాగన్నా కలుసుకుని మాట్లాడగల ధైర్యాన్ని కూడ దీసుకుంటూ, నా శక్తిని నేనే అంచనా వేస్తూ, ఆఫీసు రూంలోకి పోయినా. నా ధైర్యం నన్ను గడపలోనే వొదిలేసింది. ఆఫీస్ రూంలో పుస్తకాల బీరువా ముందు మీనమేషాలు లెక్కబెడుతోనుంచున్నాను. ఇట్లాంటి సమయం మళ్ళీ లభిస్తుందా? కాని... ఒక్కటి, నేను బొత్తిగా ఆలోచించని విషయం చటుక్కున అప్పుడే జ్ఞాపకం వొచ్చింది, దీం తగలెయ్య... ఆమె నన్ను ప్రేమిస్తోందా అసలు? ఆమెను నేను ధైర్యం చేసి అడుగుతాను... ఆమె వెంటనే ఎదురు తిరిగి ఏ బడితన్నా తీసుకుంటే నా గతేమిటి? ...ప్లీడరుకు చెప్తే... ఇంకేమన్నా ఉందా?... ఈ వూళ్ళోంచి వుడాయించాల్సి వొస్తుంది...

ప్లీడరిల్లు ఏమంత పెద్దది కాదు. ఆఫీసు రూం లోపలివైపు తలుపుతీస్తే అనూరాధ కనుపడుతుంది... తియ్యొద్దూ?... ఆ తలుపు వైపు చూడన్నా చూడలేకపోతున్నాను. నా పిరికి తనానికి నన్నే తిట్టుకున్నాను... ఆమె నన్ను చూసే చూపులు జ్ఞాపకానికి వొచ్చినై. ఆమెలో నా మీద ప్రేమ తప్పకవుంది. ఆవేళ తలుపుదగ్గర నిలబడి, ''పిచ్చయ్యా కూరలు తీసుకొస్తావా?'' అని అడిగినప్పుడు, ఆమెనన్ను

చూసినచూపు, సాయంత్రం ఎండలా, వానముందుగాలిలా, ఎంత మార్దవంగా వుంది! ... ఎంత ప్రేమ తొణికిసలాడింది ఆమె కళ్ళలో. నేను పిరికి వాణ్ణే ... ఇట్లా ఆలోచిస్తో అనవసరంగా క్రాపు సర్దుతో, బీరువాదగ్గిరే నిలబడి 'లా' పుస్తకాల్ని లెక్కబెడుతున్నాను.

లోపలి వైపు తలుపు కిర్రుశబ్దంతోటి తెరుచుకుంది. అనూరాధ!

'' ఏం పిచ్చయ్యా! నువ్వు మేటినీకి వెళ్ళలేదా?'' అని అడిగింది.

ఆమెకి కళ్ళతో నవ్వేశక్తి ఉంది. నా వొళ్ళు జలదరించింది... మళ్ళీ మొగాణ్ణని జ్ఞప్తికి తెచ్చుకుని తమాయించుకున్నాను.

''వెళ్ళలేదండీ! కాస్త రాతపని మిగిలిపోతే వచ్చాను'' అన్నాను. లోపల ఆలోచనలతో చొక్కా తడుస్తోంది...

''కాఫీ తాగావా? ఇవ్వాళ కాఫీ నేనిస్తాను. తాగు'' అంది. ఆమె మాటల్లో ఎక్కడో ఏ అగాధాలనించో, ప్రేమ ధ్వనిస్తోందని, నా నరాలకి స్ఫురిస్తోంది.

''ఊఁ...'' అని మూలిగాను. మాట్లాడలేక పోతున్నాను. ఇంత చవటనని ఇది వరకల్లా అనుకోలేదు... నా మీద నాకే విలువ తగ్గుతోంది.

ఆమె కాఫీగ్లాసు నా చేతికిచ్చినప్పుడు ఆమె వేళ్ళకొనలు నా చేతికి తగిల్నై. నా రక్తం చిందులు తొక్కింది.... కాని, ప్రాణభీతో, మరేదో చెప్పలేను... నన్ను వెనక్కి లాగుతోంది.

''పిచ్చయ్యా, ఒక మాదిరిగా ఉన్నావేం?'' అని నవ్వింది మెల్లిగా. వెన్నెల కాసినట్టయింది. బీరువాలోని లా పుస్తకాలు ప్రేమతో వికసించినై.

''ఏమీ లేదండీ... కాస్త తలనొప్పివుంది లెండి. కాఫీతో సర్దుకుంది.'' అన్నాను. అబద్ధం ఆడాను. మరేం జెయ్యను? సౌందర్యోపాసన వుంటే సరా? తెగింపు ఎక్కడ తెద్దాం?

''కూచో. పంతులుగారు ఆరింటికి గాని రారులే'' అన్నదామె. ఆ మాటతో నా పిరికితనం కొద్దిగా జారింది - జ్వరం తర్వాత చెమట పోసినట్టు...

''ఇప్పుడు నాలుగున్నర అవుతుందండి'' అన్నాను. ఇంకా సాంతంగా పోలేదు భయం.

''పిచ్చయ్యా, నీకు ఇంకా పెళ్ళికాలేదటగా'' అని అడిగిందామె. ఆమె భావం నాలో పనిచేస్తోంది. ఆమె పాటి ధైర్యం లేక... మగవాణ్ణిట!

''పిచ్చయ్యా! రాత్రికి పంతులుగారు బెజవాడ వెడుతున్నారు... వంటరిగా నాకు భయమేస్తో వుంటుంది. రాత్రికి ఇక్కడ వచ్చిపడుకో'' అంది, మార్దవంగా... అధికారయుతంగా, ఓరగా నాలోకి చూస్తోంది. ఆ చూపులకి అర్థం.... నాకు తెలిసింది గాని... మాటల్లో చెప్పలేను.

సంతోషంగా తల ఊగించాను. నా అదృష్టానికి నన్ను నేనే మెచ్చుకొంటో, కాఫీహోటలుకి పోయి, నాకు నేనే ప్రజంటేషన్‌గా, టీ పార్టీ చేసుకున్నాను ఆ సాయంత్రం.

3

ఆ వేళ రాత్రి ప్లీడరు బెజవాడ వెళ్ళాడు, నౌఖరుతో జాగ్రత్తలు చెప్పి. రాత్రి 9 గంటలకి మామూలు కన్న ఎక్కువ ఉత్సాహంతో, అలంకరణ చేసుకున్నాను... ప్లీడరిల్లు చేరుకున్నాను. నా కోసమే గావును, ఇంకా దీపం వెలుగుతోంది. గడప ఎక్కాను. నౌకరు వెంకడు ఎదురై, నవ్వి, ''ఆఫీసు రూంలో పడుకోండి బాబూ'' అన్నాడు. తలొంచుకుని ఆఫీసురూంలో నవారు మంచం మీదికి చేరాను. చిన్న నీలం బల్బు వెలుగుతోంది. కిటికీ నుంచి దక్షిణపుగాలి వీస్తోంది. వెన్నెల రోజులు కాదు కిటికీ నుంచి బైటికి చూసాను. అంతా చీకటి... నాకు ఇంకా ఎందుకో, భయం... సందేహం, పీడిస్తున్నై. ఆమె, మామూలుగా, తోడుకోసం... రమ్మన్నదేమో... నేను పొరపడ్డానేమో.... ఆడవాళ్ళని నమ్మడమెట్లా?... ఈ వెధవ ఆలోచనలు మాని మంచం మీద వెల్లకిల పడుకుని సిగరెట్ తగలేస్తూ, నిమిషానికోసారి, లోపల తలుపువొంక చూస్తో.... దెయ్యంమల్లే మేలుకుని కూచున్నాను - పదింటిదాకా. నిద్రాదేవిని ఎక్కువ సేపు ఆపలేకపోయినా. నిద్ర తరంగాలుగా ఆవహిస్తోంది అప్పుడే... మల్లెపూల వాసనగాలికి తేలివొచ్చింది. సన్నగా అడుగుల చప్పుడైంది... గదిలోని నీల కాంతుల్తో కలసి, చక్కని ఆకాశనీలం సిల్కు చీరె కట్టుకుని ఎర్రముఖమల్ రవికె తొడుక్కుని... తమలపాకులతో ఎర్రనైన చిన్న నోరు... జీరాడే పొడుగైన పాములాంటి జడ... నా అప్సరస... నా కలల రాణి... నన్ను నిద్రలో కలుసుకుంది...

''పిచ్చయ్యా! నీవు ఇంత భయస్తుడివా?'' అంది నవ్వుతో, పచ్చ కర్పూరం వాసనలు వేసాయి ఆమె మాటలు. మల్లెపూలు నవ్వాయి, నా భయానికి. ఆమె మెత్తని బాహువుల్లో ఎత్తయిన వక్షాల మధ్య... చిన్న పిల్లడిలా ...ముగ్ధుణ్ణై మైమరిచాను.

''నీవు ... ఇది నిజమా ... కలా...?'' అన్నాను. నాకే నమ్మకం కలగలేదు అది కలో నిజమో అని.

నన్ను గిల్లింది... నవ్వుతోంది... నిజమే! కిటికీ గుండా గాలిలో నైట్‌క్వీన్ వాసనలు వేశాయి.

శుక్రుడు తూర్పున ఎర్రగా, కెంపులా మెరిసాడు.

ఉదయ వాయువులు తట్టిలేపే వరకూ, ఇద్దరం పడుకునే ఉన్నాం.

''ఒక రోజు ఆలస్యంగా తెల్లారగూడదేమిటీ?'' అంది చిన్న పిల్లలా... నిద్రమత్తుగా అర్ధనిమీలిత నేత్రాలను, వికసించే కొత్త రోజా పువ్వులా విప్పుతో. నాకూ అట్లానే అనిపించింది.

ఆ సమాగమం మొదలు మా ప్రణయం నిరాఘాటంగా సాగింది. మేము రెండు రోజులకీ మూడు రోజులకీ కలుసుకునేవాళ్ళం. ప్లీడరు అనుమానించటానికే ఆస్కారమూ కలగలేదు. ప్లీడరుగారు లోపల వరండాలో పడుకునేవాడు. మేము నైట్‌క్వీన్ పొదకింద, కలుసుకునే వాళ్ళం. ప్లీడరు నల్లమందు మైకం పుణ్యమా అని, నా ఆర్థిక పరిస్థితి మారింది.

నిన్న పగలు, ప్లీడరు నాతో ఏదో వాయిదా ఉందని గుంటూరు పోతానని చెప్పాడు. రాత్రికి రానన్నాడు పైగా. నాకు ఎక్కడలేని ఆనందమూ వొచ్చింది. ఇవ్వాళ ధైర్యంగా, హాయిగా... ఆమెని కలుసుకోవచ్చు.

రాత్రి ఎనిమిది గంటల రైలుకి ప్లీడరు స్టేషన్‌కి వెళ్ళాడు. నేను తొరతొరగా, ఆఫీసురూంలోకి

వెళ్ళాను మామూలుగా. నౌకరు కొంచెం బెదురుగా కన్పించాడు. అవన్నీ నేను లెఖ్ఖ చెయ్యలేదు నా మైకంలో.

అనూరాధ అప్సరసలా మెల్లగా నడిచి వొచ్చింది. నాభావాలన్నీ ఆకాశంలో స్వర్గంలో విహరిస్తున్నై. నా క్రాపులోకి తనమెత్తని సన్నని వేళ్ళుపోనిస్తో, ''నువ్వు ఎంత అందంగా వున్నావ్'' అంది. నా మొహానికి తన మొహం ఆనిచ్చి.

''నీ కన్ననా!'' అన్నాను. నా మాటలు ఆమె హృదయ స్పందనంలో కలిసి పోయినై. నవ్వింది మెల్లిగా.

''పిచ్చయ్యా!... మనం ఎక్కడి కన్నా వెళ్ళిపోదాం'' అని ప్రశ్నించింది.

''ఇక్కడ హాయిగా ఉండగా ఎక్కడికో వెళ్ళడం ఎందుకూ?'' అన్నాను. అంత రాళాల్లో వేధిస్తున్న భయాన్ని లవండర్ వాసనల్తో కప్పి.

''నువ్వు వొట్టి పిరికివాడివి!'' అని నవ్వింది అనూరాధ.

గోడ గడియారం 9 గంటలు కొట్టింది. గంటల మోతలో కలసి బైట బరువైన బూట్ల చప్పుడు వినపడ్డది. నా గుండెలు జల్లు మన్నాయ్... అనూరాధ వులిక్కి పడింది.

తలుపు దభాలున నెట్టుకుని ప్లీడరు లోపలికి వచ్చాడు. రైలుకు వెళ్ళలేదుగావును... నేనూ... అనూ... మంచం మీదే వున్నాం. ప్లీడరు పెద్దలైట్ స్విచ్ నొక్కాడు. గదంతా గుప్‌మని వెలిగింది. నాకు నిప్పు అంటుకున్నట్టు వుంది. చెమటలు పోశాయి... వొణుకుతున్నాను... ఇంకేముంది? ఇవ్వాళ్టితో ఆఖరు..

కాని అట్లాంటి దేమీ జరగలేదు. ప్లీడరు నన్ను బాదినా, నాకు అంత బాధ అనిపించేది కాదు... కాని... చిరునవ్వు నవ్వుతో, తీక్షణంగా బైటికి పొమ్మని ఆజ్ఞాపించాడు.

నేను వెంటనే గది నుండి బైటికి వొచ్చేసాను.

మెట్లు దిగుతో వుంటే, కర్రతో బాదే దెబ్బలు వినిపించాయి. సన్నగా ఏడ్పు కూడా. నాకు ఆవేశం వొచ్చింది... లోపలికెళ్ళి... ఆమెదేమీ లేదు... నేనే అపరాధినని చెప్పేద్దాం... లేకపోతే ఆ ప్లీడరు పీక నొక్కుదాం... అనిపించింది.

కాని ఇవేమీ చెయ్యలేకపోయినాను. శూన్యమైన వీధుల గుండా నడిచి ఇంటికి చేరాను. రోడ్డు మీదనే మంచం వేసుకుని పడుకున్నాను. నిద్ర ఏ మాత్రమూ రావటం లేదు... నీచుడు... ఆమెని అనుభవించలేడు... ఆమెకి మాత్రం ఆత్మ వుండదా? ఆశలు వుండవా? ఆమెకి ఆనందం అఖ్ఖర్లేదా?... అసలు తనకి భార్య ఎందుకు? ''ప్రిస్టేజి'' కోసం.... ఆమెని ఎన్ని బాధలు పెడుతున్నాడో...

నౌకరు వెంకడు మెల్లిగా, నా దగ్గర కొచ్చి నిలబడ్డాడు; గాబరాగా వొణుకుతున్నాడు.

''ఏమైందిరా? చెప్పు తొరగా''... అన్నాను హృదయోద్వేగంతో.

వెంకడు మెల్లిగా... ''అమ్మగారు మిమ్మల్ని అర్జంటుగా రమ్మంది. మాట్లాడాలిట పంతులుగారు బాగా నిద్రపోతున్నాడు. అన్నాడు.

వెంటనే బయల్దేరాను.

4

ఆమె కళ్ళ నీళ్ళ చారలు ఇంకా కన్పిస్తోనే వున్నై బుగ్గల మీద. నైట్‌క్వీన్ పాద కింద శోక దేవతలా నుంచుని వుంది. దుఃఖ భారంతో కళ్ళు ఎర్రబారినాయి.

''అనూ...! ఇట్లా జరుగుతుందనుకోలేదు'' అన్నాను. ఇంకేమనాలో తోచక.

''పిచ్చీ.... ఈ దెబ్బలు చూడు'' అని జబ్బలు చూపించి వెక్కివెక్కి ఏడుస్తో. ఎట్లా కొట్టాడామెను?... వాడు మనిషేనా?... నా కళ్ళలోనూ నీళ్ళు తిరిగినై.

''అనూ... ఎట్లా ఇక?''... అన్నాను ఏమీ తోచక.

''పిచ్చయ్యా మనం వెళ్ళిపోదాం నా నగలు... నా దగ్గిర క్యాషూ మొత్తం ఐదారు వేలకి వుంటాయి. మనం ఎక్కడైనా సుఖంగా జీవితం గడపవచ్చు'' అంది గద్గదంగా.

నాలో సంశయాలు బయల్దేరినాయి. ప్లీడరాయెను. ఏంతంటా వొస్తుందో?... కాని పైకిగంభీరంగా, ''వెళ్ళిపోదాం'' అన్నాను ధీమాగా, ఆమె జబ్బలమీద దెబ్బల్ని చేత్తో సవరిస్తో. కిటికీ నుంచి పడుతున్న నీలిదీపం కాంతిలో ఆమె వదనం వికసించింది.

''రేపు రాత్రికే వెళ్ళిపోదాం. నేనిక్కడ బతకలేను పిచ్చీ!'' అంది, జాలిగా దిగులుగా.

''నీకేమీ ఫరవాలేదు... నేనున్నాను... రేపురాత్రి ఇటు గుంటకల్లు పొయ్యే బండికి పోదాం. రాత్రి ఒంటిగంటకేమో బండి. నువ్వు రెడీగా వుండు...'' అన్నాను.

'సరే' అని ఆమె ఇంట్లోకి వెళ్ళి పోతోంది. పోతో పోతో ఆమె చెయ్యి ముద్దెట్టుకున్నాను.

ఇంటికి వచ్చి మంచం మీద పడుకున్నాను. మళ్ళీ ఆలోచనలు మనసుని హింసించినై. వెళ్ళిపోతాం... యెట్లా? ప్లీడరు వూరుకుంటాడా? స్టేషన్ యామన్నా, దగ్గిరా, దాపా? కనీసం మైలు ఉంది. బండిమీద పోదామనుకుంటే, బండివాడు రేపు ప్లీడరుకు చెప్పితే? ... రోడ్డు మీద జనం ఉండరూ?.... స్టేషన్‌లో జనం ఉంటారు గద!... ప్లీడరుకు కావాల్సినంత రౌడీగాంగు ఉందిట... నలుగుర్ని పంపాడా ... ప్రాణం వుంచుతారా? ... నాకు అనూ ... కన్నా ప్రాణం మీద తీపి ఎక్కువని అప్పుడు తెలిసింది. తెల్లవార్లూ ఇవే ఆలోచనలు. రామారావు! నువ్వేం చెయ్యమంటావు? ఆమెతో వెళ్ళనా? వెళితే అపాయం గద? ఎట్లా?'' అని అడిగాడు పిచ్చయ్య కథ పూర్తి చేసి, ఆదుర్దాగా.

నేనూ ఆలోచించాను. ''పిచ్చయ్యా! వెళ్ళు... నా మాట విని ఆమెతో వెళ్ళిపో. ఆమె లాంటి భార్య నీకు దొరకటం అదృష్టం... ఆమె ఆ పుస్తకాల బొద్దంకితో ఎన్ని బాధలు పడుతుందో!'' అన్నాను.

పిచ్చయ్య నా సలహా అంగీకరించాడో లేదో నాకు తెలీదు. తలొంచుకుని క్లబ్ నించి వెళ్ళిపోయినాడు.

5

'' ఇంతేనా కథ? వాళ్ళిద్దరూ ఆ రాత్రే వుడాయించారా?'' అన్నాను సహజంగా. రామారావు కాఫీ తెప్పించి, చప్పరిస్తో గుటక మింగి, ''చెప్పేది వినవోయ్. తెల్లారి ఏం జరిగిందో చూదామని మధ్యాన్నం ప్లీడరింటికి వెళ్ళాను. 2 గంటలవుతుంది. ప్లీడరు నా క్లబ్ స్నేహితుడు, ఇల్లంతా గల్లంతుగా ఉంది. ఆఫీస్ గదంతా పొగకమ్మి ఉంది. మనుషులు హడావిడిగా తిరుగుతున్నారు బైటికీ లోపలకీ. గదిలోకి వెళ్ళాను... మంచం మీద ప్లీడరు భార్య వొళ్ళంతా కాలి, పెద్ద పెద్ద బొబ్బలతో మరణావస్థ పడుతోంది. ఆరి పిచ్చయ్యా! అనుకున్నాను లోపల. పిచ్చయ్య ఆమెని మోసం చేశాడు. ఆమె ప్లీడరు ఎత్తిపొడుపులు పడలేక, పగలు ప్లీడరు బైటికి వెళ్ళినప్పుడు, వొళ్ళంతా కిరసనాయిలు పోసుకుని గది తలుపులు వేసుకుని నిప్పంటించుకుంది....''

''ఇంత బాధ ఎందుకూ?'' బావిలో దూకకపోయిందీ'' అన్నాను వెటకారంగా.

రామారావు నన్ను ఉరిమి చూసి పోరా కసాయి వెధవా! ఆమెని చూస్తే అట్లా మాట్లాడలేవు. వొళ్ళంతా పెద్ద పెద్ద బొబ్బలు... కాని మొహం మాత్రం చిన్న పిల్లలా, అమాయకంగా, శాంతంగా, మరణిస్తున్నాం... మనకిక బాధలు లేవు!'' అన్నట్టు వుంది... ఒరే! నేను... ఆమెకీ నాకు పరిచయమూ లేదు గదా! నేను ఏడ్చాను...''

''ఇంతకీ ఆమె చచ్చిపోయిందా?''

''ఆ! కాస్త శ్రద్ధగా వైద్యం చేస్తే బతికేదేమో... కాని ప్లీడరు 'ప్రిస్టేజి' కోసం ఆమె బతికితే, ఒకవేళ ఏమన్నా నామర్దా పనులు చేస్తుందేమో అనుకుని - వెధవ దౌర్భాగ్యుడు.... వెధవ 'ప్రిస్టేజీ', కోసం, ఆమెకి ఇంకా ప్రాణం ఉండగానే 'మార్ఫైన్' ఇంజక్షన్ ఇచ్చి చంపాడు. నేను కళ్ళారా చూశాను. వొద్దన్నాను... కాని ''అది బతికి ఆ బాధ భరించలేదోయ్, ఎట్టాగూ పొయ్యే ప్రాణమేనాయె'' అన్నాడు వెధవ. నేను బైటికి చెబుతాననుకో! ఎవడు నమ్ముతాడు.

''మరి ప్లీడరు పిచ్చయ్య కోసం అల్లాడుతున్నాడన్నావుగదా, ఎందుకూ?''

''అది ప్రిస్టేజీ'' కోసమే. పిచ్చయ్య పారిపోవటం, భార్య ఆత్మహత్యా రెండింటినీ ఇరుగుపొరుగు వారు పోల్చుకుని... అసలు సంగతి బయట పడుతుందేమో అని వెధవ చస్తున్నాడు. మళ్ళీ పిచ్చయ్యనే గుమాస్తాగా వుంచుకుంటే, వీడి వెధవ 'ప్రిస్టేజి' నిలుస్తుందని ఏడుప్పు''.

'' ఇంతకీ పిచ్చయ్య ఏమైనట్టు?''

'' ఏట్లో కలిసాడు. ఎక్కడ చస్తే మనకేం?''

***(జ్యోతి సచిత్ర పక్ష పత్రిక 15 మే 1948)***

# రహస్యం

మూర్తీ, రావూ బల్ల దగ్గర కూచుని గోలగా తర్కించుకుంటున్నారు, క్లబ్‌లో మిగతా వాళ్లకి అర్థం కాని రీతిని. వాళ్ళిద్దరూ 'కొట్టుకోరు' అన్న నమ్మకం ఏముంది గనక. మిగతావాళ్ళు బల్ల చుట్టూ నుంచున్నారు, ఏ ప్రమాదమూ రాకుండా కాపాడేందుకు సిద్ధమై.

మూర్తి బల్లమీద బలంగా గుద్ది ''నే నొప్పుకోనోయ్, ఆవిణ్ణి 'వ్యభిచారిణి' అంటే!'' అన్నాడు.

రాము మోహం కోపంతో జేవురించింది. జేబు రుమాలుతో నుదిటిమీద చెమట తుడుచుకుని తనూ బల్లమీద చేత్తో బాది, ''నా అనుభవాల్ని ఊరికే తుడిచేస్తే సరిపోతుందా? ఆమెని గురించి నీకేం తెలుసు నీ మొహం!'' అన్నాడు.

మూర్తి చుట్టూ ఉన్నవార్ని సపోర్టు నిమిత్తం ఒకసారి కలయజూసి '' ఒరే! నీ అనుభవం ఆమె ముందు దమ్మిడీ చేయదు. ఆమె నీ వనుకున్నట్టు అంత తేలిక మనిషికాదు ఊరికేగొంతు చించుకుంటే లాభమేమిటి?'' అన్నాడు.

రావు ఇంత చులకనగా తగ్గ తల్చలేదు. ''పోరా! నీకేం తెల్సు ఆడవాళ్ళ సంగతి! అందులోనూ ప్రత్యేకం ఈమెని గురించి నీకు ఏ. బి. సి. లు తెలీవని ఛాలెంజి చేసి చెప్పగలను. నేను పందెం వేస్తాను. ఆమె వ్యభిచారిణి అని ఏమంటావ్?'' అని అడిగాడు మూర్తి ఇక మాట్లాడ్డం అనవసరం అన్నట్టుచూస్తో.

చుట్టూ నుంచున్న వాళ్ళకి ఈ తర్కం రానురాను రసవత్తరంగా కనపడి, కొంతమంది రావు తరఫునా, కొంతమంది మూర్తి తరఫునా చీలి, కోడిపందేల వాళ్ళలా తయారై, తమ పార్టీని ఉత్సాహ పర్చనారంభించారు సంజ్ఞలతో, ఈలలతో.

మూర్తి రావుగాడి ఛాలెంజి అందుకుని, ''రైట్, ఎంత పందెం కడతావు?'' అని అడిగాడు జేబులో పర్సు బైటికి తీస్తూ.

రావు తనూ మనీ పర్సు బైటికి లాగి దాన్లో నుంచి ఐదు పది రూపాయల కాయితాలు బైటికి తీసి బల్లమీద పడేసి '' ఊ.... నువ్వూ పడెయ్యి. మధ్యవర్తిగా శర్మగారుంటారు!'' అన్నాడు.

తగాదా విషయం మధ్యవర్తికి చెప్పడం అవసరమైంది.

మూర్తి తనూ పందెం డబ్బు బల్లమీద పెట్టి, ''శర్మగారూ, మీరే మధ్యవర్తిగా ఉండండి. మేమిద్దరం ఒక గౌరవనీయమైన స్త్రీ విషయమై వివాద పడ్డాం. ఆమెని వీడు వ్యభిచారిణి అంటాడు. నేను

కాదంటున్నాను. ఆమె వ్యభిచారాణే అయితే నేను ఓడిపోయినట్టు. లేదా వీడు ఓడిపోయినట్టు. వీడు ఓడి పొయ్యేమాట నిజం!'' అన్నాడు ఘట్టిగా నొక్కి వక్కాణించి.

రావు సిగరెట్ అంటించి ''శర్మగారూ! ఆమె వీడన్నట్టు గౌరవనీయమైన స్త్రీ కావచ్చుగాని, వ్యభిచారిణి గాదంటే నేవొప్పుకోను. ఆ విషయం రుజువు పర్చే బాధ్యత నాది. గెలిచేది గూడా నేనే'' అన్నాడు నమ్మకంగా.

శర్మగారు ఇద్దరు చెప్పిందీ చెవుల కెక్కించుకుని, ''అంతా సరే, ఆమె పేరూ, వూరూ చెబితే మేమూ ఏదన్నా భోగట్టా ఇవ్వగలమెమో ఆలోచిస్తాం'' అన్నాడు తన లాయర్ తెలివి వుపయోగించి.

మూర్తి, రావూ, యిద్దరూ ఐదునిమిషాలు నిశ్శబ్దంగా చూసుకున్నారు, చెబుదామా వద్దా అన్నట్టు. చివరికి మూర్తి '' ఆమెని గూర్చి మేమిక్కడ ఏమాటా చెప్పడం ఆమె గౌరవానికే భంగం. మా యిద్దరిలో ఈ వివాదం విషయంలో ఎవరం ఓడిపోయినా, మీ యెదట ఆమాటని నిర్మొగమాటంగా అంగీకరిస్తాం సరేనా?'' అన్నాడు చిక్కు విడగొట్టి.

రావూ, శర్మ, మిగతావాళ్ళూ మూర్తి నిర్ణయాన్ని అంగీకరించారు.

## 2

పది రోజుల వరకూ, రోజూ క్లబ్‌లో ఇదే విషయమై చర్చలు సాగుతున్నై. క్లబ్‌లోని మిగతా మెంబర్లు ఎరగని ఒక విషయం రావుకీ, మూర్తికీ తెలిసి, అది పందాలదాకా వెళ్ళడం, క్లబ్ మెంబర్లకి నామర్దా అనిపించింది. ఈ అసంతృప్తిని శాస్త్రి ఒకనాడు వెళ్ళగక్కాడు.

'' ఒకే చూడండి ఇటు. ఆమె ఎవరో మనకు అసలు తెలియకుండా వుండడం, మనకెంత పరాభవం మీరే బాగా ఆలోచించండి. పరాభవం మాట అట్లా వుంచండి. రావుకీ, మూర్తికీ ఆమె విషయమై ఈ పట్టుదలలు ఏమిటి? మనం దీన్ని అంతు తేల్చుకోవాలి'' అన్నాడు.

శాస్త్రి పక్కన కూచున్న నాయుడు మూర్తీభవించిన పరాభవంలా పోజువేసి, '' ఎగ్జాక్ట్‌లీ మనం ఆమె ఎవరో అంతు తేల్చుకోవల్సిందే అందుకోసం మనం ఏ సాహసానికైనా దిగాలి!'' అన్నాడు వుద్రేకంగా మాట్లాడుతూ...

శాస్త్రి నాయుడికి షేక్‌హేండ్‌చేసి, '' ఔను ఈ విషయం అశ్రద్ధ చేయదగిందిగా కనపడ్డం లేదు. మననాయుడు, రాత్రింబవళ్ళు తిరిగి దీని అంతు తేల్చుకుంటాడు. మనక్లబ్‌లో మూర్తీ, రావేగాకుండా, మిగతావాళ్ళు తెలివికలవాళ్ళేనని రుజువు కావాలి ఈ దెబ్బతో'' అన్నాడు.

ఇంకో వారం గడిచింది. మూర్తీ, రావూ, మామూలుగా క్లబ్‌కే వస్తున్నారు పోతున్నారు - ఇద్దరి మొహాల్నీ శాస్త్రీ, నాయుడూ వాళ్ళ మిత్రులూ, పరీక్షించి చూస్తూనే ఉన్నారు. వాళ్ళకేం అంతుపట్టలేదు. ఇద్దరి మొహాలూ, విజయ సూచకంగానే కన్పిస్తున్నాయి. పట్టుదలగానే ఉన్నారిద్దరూ. ఇంతకు మించిన కొత్త సంగతులేమీ బయటకు రాలేదు. బయటపెట్టే సద్గుణం రావుకీ లేనట్టుంది! మూర్తికీ లేదు!! ఆవేళ మూర్తీ, రావూ, క్లబ్ నించి వెళ్ళింతర్వాత, శాస్త్రి నాయుణ్ణి పట్టుకుని '' నీ పరిశోధన ఏమైందిరా'' అని అడిగాడు కనీస ఫలితమన్నా ఉండదా అన్న ఆశ వెలువరించి.

నాయుడు గొంతు బాగా తగ్గించి, ''శాస్త్రీ, ఈ వెధవ వ్యవహారంలో నన్ను ఇరికించడం బాగాలేదోయ్. నేను తప్పుకుంటాను'' అన్నాడు దిగులుగా.

'' ఏం? నీ సాహసం ఏమైందిరా?'' అన్నాడు శాస్త్రి ఆదుర్దాగా.

''సాహసమా? నాబొందానా! ఈ గుప్త నాటికలో స్త్రీ పాత్ర సామాన్యం కానట్లే ఉంది. ఆమె ఎవరో హఠాత్తుగా తెలిసింది మొన్న. మూర్ఛపడే పనైంది. శాస్త్రీ, ఈ గోడవేదో వాళ్ళిద్దర్నే పడనియ్యి, అసలు ఈ గొడవ ప్రమాదమనే, మూర్తి కథేమీ చెప్పకుండా కమ్మేశాడు.''

శాస్త్రికి కాస్త చెమటపోసింది. సాయంత్రమైనా గాని '' ఇంతకీ ఆమె ఎవరో చెప్పేస్తే, మనం ఈ ఉద్యమం నుండి విరమించవొచ్చు'' అన్నాడు.

నాయుడికి చెమట పోసిందేమో, జేబు రుమాలుతో విసురుకుంటో, '' అఘనే చేయకూడదని రాత్రి బ్రహ్మాండమైన ఒట్లు వేసుకున్నాను'' అన్నాడు దడతో ఊపిరి గట్టిగా పీలుస్తో.

శాస్త్రిగారికి విసుగూ, ఆదుర్దా హెచ్చవుతోంది. '' ఇంత పిరికి వాడివని తెలిస్తే నేనే ఈ కార్యక్రమంలో దిగి ఉండేవాణ్ణి'' అన్నాడు కోపం నటించి.

'' ఇప్పుడు మాత్రం మునిగిపోయిందేముంది?'' మీరు గూడా పరిశోధన చేయడానికి కావాల్సిన అవకాశం ఉండనే ఉందాయె'' అన్నాడు నాయుడు. ఈ బెడద తనకి వొదిలి, ఇంకోడికి పోతే చాలని.

శాస్త్రి ఉత్సాహంగా, ''నేను ఎక్కణ్ణించి ఎట్లా ప్రారంభించను పరిశోధన?'' అని అడిగాడు.

'' ఈ పూటే మూర్తినిగాని, రావునిగాని, మీరు వెంబడించగలిగితే మీ పరిశోధన ప్రారంభమైనట్టే' అన్నాడు నాయుడు.

''అంతేనా?'' అన్నాడు శాస్త్రి క్లబ్‌మెట్లు దిగుతో.

'' ఇంకేమీ లేదు. కాని మీరు తగినంత జాగ్రత్తగా ఉండటం అవసరం'' అని హెచ్చరించాడు నాయుడు గృహోన్ముఖుడై.

## 3

అమావాస్య చీకట్లు, బజారంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ బంగ్లా ముందు గూర్ఖా కునికి పాట్లు పడుతున్నాడు. రెండోవైపు కట్టేసిన వేటకుక్క నిశ్శబ్దంగా పడుకుని ఉంది మధ్య మధ్య చెవులు టపటపలాడిస్తూ. బంగ్లాలోని దీపాల మందమైనవెలుతురు డాబా కిటికీల గుండా తోటలో చెట్లమీదికి ప్రసరిస్తోంది. బంగ్లాక్రింది అంతస్తులో చీకటి. ఆవరించి ఉంది. ఆ అంధకారంలో ఎవరో గుసగుస లాడుతున్నారు. మొదటిది స్త్రీ స్వరం, రెండోది పురుషధ్వని.

స్త్రీ స్వరం ఉలిక్కి పడ్డట్టు మధ్య మధ్య నత్తిగా, ''వెళ్ళు... ఇక్కడికి రావొద్దని చెప్పలేదూ? నన్ను వేధించకు...'' అంటోంది వొణుకుతో.

పురుష స్వరం దృఢంగా ''అల్లా తేలికగా వెళ్ళను... వెళ్ళడానికైతే ఇంత శ్రమపడి నిన్ను కలుసుకోటం ఎందుకు?... నాకు కావాల్సింది...'' అంటున్నాడు.

''అమ్మయ్యో! అట్లా గట్టిగా మాట్లాడకు.. ఆయన వస్తే...'' స్త్రీ స్వరం విపరీతంగా ఒణుకుతోంది.

'' ఏం వొస్తే? రానియ్యి''...

ఇంతలో మేడ మెట్ల మీద నించి ఎవరో కిందికి దిగిన బలమైన బూట్లధ్వని వినపడ్డది. స్త్రీ స్వరం మెల్లిగా, విషాదంగా కేకేసింది. ఆ చీకట్లో, ఎవరో ఎవర్నో బలమైన దెబ్బలు కొడ్తున్నట్టూ, తర్వాత పెద్ద మూలుగూ వినిపించాయి. ఐదు నిమిషాల తర్వాత, అంతా నిరామయమైపోయింది.

దీన్నంతా చెట్ల సందున కూచుని చూస్తున్న శాస్త్రికి వళ్ళు గగుర్పొడిచింది. ఐదు నిమిషాలు భయంతో అతను కొయ్యబారిపోయినాడు. తర్వాత తెప్పరిల్లుకుని కాంపౌండు గోడ మెల్లిగా దూకి, ఎట్లా ఇల్లు జేరుకున్నాడో అతనికే తెలియదు. మర్నాడు తెల్లారీ తెల్లారక ముందే అతను క్లబ్‌కి వొచ్చాడు. నాయుడు అరగంటకి వచ్చాడు. ఇద్దరూ క్లబ్‌లో ఉన్న హోటల్‌లో మూలగా కూచున్నారు. శాస్త్రి కాఫీ తాగుతున్నాడన్న మాటేగాని, ఇంకా గుండె దడగానీ, మానసికాందోళన గానీ తగ్గలేదు. రాత్రి జరిగిందేమిటి? నేరం అన్నంతవరకు శాస్త్రికి స్పష్టమే.

నాయుడు శాస్త్రి వంక అదే పనిగా పదినిమిషాలు చూసి చిరునవ్వునవ్వి, ''మొన్నటి తర్వాత నీ వర్ఛస్సులో ఇంత భయానకం వ్యాపించటానికి ఏం జరిగిందేమిటి?'' అని అడిగాడు. ఏదో జరిగి ఉంటుందని నమ్మిన గొంతుతో.

శాస్త్రి కాఫీ కప్పు ఖాళీచేసి, చాలా చాలా మెల్లిగా ఒకసారి చుట్టూచూసి, గొంతు సవరించుకుని ''రాత్రి మన మూర్తి సాఫయినాడని నా నమ్మకం... నా కళ్ళారా చూశాను...'' అన్నాడు.

''ఏమిటీ?.... మూర్తీ....?'' నాయుడు తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయింది ఐదునిమిషాలు. ''ఇట్లాంటిదేదో జరుగుతుందని నేనెప్పుడో అనుకున్నానులే!'' అన్నాడు. తర్వాత శాస్త్రి ఆమోద సూచకంగా తలూపి, ''కాదు మరీ? పాముతో చెలగాటం ఏమిటి?...'' అని చప్పరించి, వూపిరి తీసుకుంటూ, ''మరి మన మూర్తిని గూర్చి అయినా మనం ఏదన్నా చర్య తీసుకోనక్కర లేదా?'' అని అడిగాడు నాయుణ్ణి. నాయుడు దిక్కులు చూస్తో ''మనకెందుకూ మధ్య ఏదైనా నేరమే జరిగి ఉంటే దాన్ని బైట పెట్టడానికి లా అండ్ ఆర్డర్ ఉండనే ఉంది. కావలిస్తే మనం సాక్ష్యం చెబుదాం'' అన్నాడు. శాస్త్రి తల వూపడం తప్ప ఇంకేం చెయ్యలేకపోయినాడు.

## 4

రెండు రోజుల్లో శాస్త్రి నాయుడికి మాత్రం తెలియజేసిన రహస్యం, మెల్లిగా ప్రతి క్లబ్ మెంబర్‌కీ రహస్యంగానే తెలిసిపోయింది. క్లబ్‌లో విపరీతమైన అలజడి పైకగుపించకుండా లోలోపల వ్యాపించింది. ప్రతివారూ, ఈ విషయమై ఏదో చెయ్యాలని ఉబలాటపడుతూ ఏమీ చెయ్యలేకపోతున్నారు. వాళ్ళ అనుమానం దృఢం కావడానికా అన్నట్టు, రావుగాని, మూర్తిగాని, క్లబ్ దగ్గరికే రాలేదు! ఇక తీర్మానంగా, మూర్తి సాఫ యినాడనే వుద్దేశానికి క్లబ్‌లో వాళ్ళు వొచ్చిన రోజు మధ్యాహ్నమే, మూర్తీ, రావూ చెట్టపట్టాలు

పట్టుకుని సరాసరి కేరమ్సు ఆడుతూన్న శర్మగారి దగ్గరికి వచ్చి నిలబడ్డారు. మిగతావాళ్ళ సంగతి ఏమైనా, శాస్త్రి కొయ్యబారిపోయినాడు. అతను తన ఆశ్చర్యం నించి తేరుకునే ముందే రావు, శర్మతో ఇలా అంటున్నాడు. ''శర్మగారూ! నేను ఓడిపోయినాను పందెంలో, ఆమె గౌరవనీయమైన స్త్రీయే గాక, వ్యభిచారిణి కాదు కూడా!''

శర్మ, తన మిత్రుడివంక తదేక ధ్యానంగా చూసి, ''రుజువు చేసుకున్నారా'' అని మాత్రం అడిగాడు. రావు తలూపాడు. శాస్త్రి ఇంతలో తెప్పరిల్లుకుని,'' అయితే రావూ! ఆవేళ రాత్రి నేను చూసిందేమిటి? ఆ ప్రకారం నువ్వు గెలిచినట్టే ఔతుందిగా? పైగా ఈ మూర్తి ఇక్కడ ఎట్లా ఆరోగ్యంగా ఉన్నాడని నాకు తగని ఆలోచనగా ఉంది!'' అన్నాడు.

రావూ, మూర్తీలు పకపక నవ్వారు. నవ్వాగిన తరువాత, రావు గొంతు సవరించుకుని, ''శాస్త్రీ! నువ్వు చూసిందేమో నిజమే. ఆమె ఎవరో నీకు తెలుసు. ఆమె ఎవరో ఇక్కడ అందరికీ ఈ పాటికి తెలిసే వుంటుంది గూడాను... ఆమె... ప్రస్తుతపు అంతస్తు ఎటువంటిదో నీకు తెలిసే ఉన్నప్పుడు, నేను చెప్పబొయ్యే విషయం నీకు సులభంగా బోధపడుతుంది గూడానూ!'' అన్నాడు.

శర్మ ఈ సంభాషణకి అడ్డుపడి, '' ఈ గూడుపుఠాణీ ఏమిటి రావూ? ఆమె ఎవరో, ఈ గందరగోళం ఏమిటో విశదంగా చెప్పరాదూ?'' అని అడిగాడు.

రావు క్లబ్‌లో అందర్నీ ఒకసారి చూసి, ''పోలీసు సూపర్నెంటు గారి భార్య! ఆయన మాకు వ్యక్తిగత స్నేహితుడు. ఆయనతో అప్పుడప్పుడు చదరంగం ఆడడానికి వెళ్తుండేవాళ్ళం మేం. ఈ పరిచయాన్ని పురస్కరించుకునే, ఆయన భార్య కూడా మాకు పరిచయమైంది. ఆమె అందమైనదే గాకుండా, చాలా కలుపుగోలుతనంగా గూడా ఉంటుండేది. అందువల్ల ఆమెను గూర్చి మేము కాస్త కనిపెట్టి చూడడం సంభవించింది. మానవ మర్యాదలు పైకి ఎలా ఉన్నా లోపల పనిచేసే సామాన్య శక్తుల స్త్రీ భావం మమ్మల్ని వొదిలింది కాదు.

ఒక స్త్రీ అందంగా ఉండి కలుపుగోలు తనంగా, సహజంగా ప్రవర్తిస్తో ఉంటే, ఛాన్సు కావాలని, ఎగబడకుండా ఉండటం నా వరకూ అసంభవమైంది. ఆమెని పరీక్షించసాగాను. నా దృష్టికోణంలో ఆమె సద్గుణ వతిగా నటించే దుర్గుణవతిగా కన్పించింది. కాని, నా అనుమానాన్ని దృఢం చేసుకునేందుకు అవకాశం దొరక్క బాధపడసాగాను. మూర్తి మొదట్నించీ నా అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ వచ్చాడు. కనీసం స్త్రీని గౌరవించమని నన్ను మందలించాడు. నేను అతన్ని హేళనచేసి, నవ్వాను. ఆమెలో నేనుకున్న గుణాలున్నాయని నిరూపిస్తానన్నాను. మూర్తి పెదాలు చప్పరించి 'అసంభవం' అన్నాడు.

తర్వాత ఒకరోజు రాత్రి 10 గంటల ప్రాంతాన సినిమా నించి వొస్తో సూపర్నెంట్ బంగ్లా మీదగా నడుస్తున్నాను. బంగ్లా వరండాలో చీకటిలో ఆమె ఎవరో పురుషుడుతో గుసగుసలాడడం నా కంట పడింది. నా అనుమానం రూఢి అయింది. ఆ దృశ్యం నాలో జెలసీని వృద్ధి చేసింది. మర్నాడు విషయం మూర్తికి చెప్పాను. అతను నమ్మలేదు. ఆ రోజే ఆయనతో చదరంగం ఆడుతూ, గదిలోకొచ్చిన ఆమెని పరీక్షించాను. ఆమెలో ఏవికారమూ పొడగట్టలేదు. అవ్యక్తంగా ఏదన్నా విచారం ఉందేమో ఆమె లోపల... ఆ వేళే మేముక్లబ్‌లో పందెం వేసుకున్నాం.

పదిహేను రోజులు, ప్రతిరాత్రీ సూపర్నెంట్ బంగ్లా దగ్గర గాలికి కూడా తెలీకుండా నేనూ, మూర్తీ కాపలా కాశాం. మళ్ళీ వాళ్ళిద్దరూ కలుసుకోనేలేదు. ఇందువల్ల నాకూ, మూర్తికీ పట్టుదలలు హెచ్చాయేగాని తగ్గలేదు. ఆఖరుకి, శాస్త్రి మమ్మల్ని వెంటాడిన రోజు నన్నమాట - పగలు సూపర్నెంట్ ఇంట్లోనే మామూలుగా చదరంగం ఆడుతున్నాం. మాకు 'టీ' ఇవ్వడానికి ఒచ్చిందామె. ఆమె వర్చస్సులో ఎన్నడూ లేనంత గాభరా కన్పిస్తోంది. ఈ విషయాన్ని నేను కనిపెట్టడానికి ఎక్కువ సేపు పట్టలేదు. ఇవ్వాళ వాడు(?) వొస్తాడు గావును! అనుకున్నాను. ఇంకేం? రాత్రికి నేనూ, మూర్తీ తయారైనాం బంగ్లా దగ్గరికి తర్వాత సంగతి మీకు తెలిసే ఉంది. తెల్లారి, ఉండబట్టలేక పగలు పది గంటలకే సూపర్నెంటు గారింటికి వెళ్ళాం. ఆయన మామూలుగా లేడు. కోపం, అసహ్యం, చీదర స్పష్టంగా అతని మొహంలో వేళ్ళాడుతున్నై. ఏది ఎట్లా ఉన్నా, మమ్మల్ని మటుకు ఆహ్వానించి చదరంగం దగ్గర కూల పడ్డాడు. నాకా రాత్రి జరిగిందేమిటో తెలుసుకోవాలని చాలా ఆదుర్దాగా ఉంది. మెల్లిగా మాట్లాడుతూ మాట్లాడుతూ ''రాత్రి బంగ్లాలో ఏదో గంద్రగోళం జరిగిందనుకుంటాను'' అన్నాను తెగించి. ''మీకెట్లా తెలుసు?'' అన్నట్టు చూశాడు పెద్దగా గుడ్లు ఉరిమి.

మూర్తి అందుకుని, అవునండీ, మేము సినిమానించి ఇటు పోతో, విన్నాం లెండి'' అన్నాడు సూపర్నెంటు మొహం ఎర్రబారింది. కత్తి వేటుకి నెత్తురు చుక్కలేదు. పదినిమిషాలు పాదాలకింద భూమి కుంగిపోయినట్టు అయిందతనికి. తర్వాత తమాయించుకుని ఇలా చెప్పనారంభించాడు.

5

''మీరు అపార్థాలు తీయకుండా ఉండాలని చెబుతున్నాను. నా భార్యకి ఒక్కగాను ఒక్క అన్న ఉన్నాడు. అతని స్థితి ఎటువంటిదో చెప్పక తప్పదు. అతనికి చదువు తక్కువ. భార్యా పిల్లలూ ఉన్నారు. మొత్తం మీద పెద్ద సంసారం. అతను ఉద్యోగం చేసి సంపాయించే అర్వై రూపాయలూ ధూపానికి చాలవు. అతను తన సంసారం కూటికీ గుడ్డకీ పడే బాధ చూసి, ఉద్యోగరీత్యా రాగల లంచాలు పుచ్చుకోడం ప్రారంభించాడు. ఈ కారణం వల్ల అతని ఉద్యోగం ఊడిపోయింది. అభిమానం లంచాలు పట్టేవాడిలోనూ ఉంటుదేమో! అసలు లంచం పట్టకుండా నీతిగా బతికి అతను తన సంసారాన్ని పోషించుకోలేకపోయినాడు, కాని తన చెల్లెల్ని అడిగి పది రూపాయలన్నా తీసుకెళ్ళలేదు ఎప్పుడూ... నన్ను అతను కలుసుకుని దాదాపు పదేళ్ళవుతుంది. కాని సంవత్సరం క్రితం అతను, దేనికన్నా గాని, పెద్దదొంగతనమే చేశాడనీ, సంవత్సరం శిక్ష పడిందనీ తెలిసింది మాకు. ఇక, అతని భార్యా పిల్లలకి దిక్కెవరు? నేనే వాళ్ళ అడ్రసు కనుక్కొని, కొద్దిగా సహాయం చేసాను. అయితే, వాళ్ళనిగాని, దొంగతనం చేసి జైలుకి వెళ్ళిన తన అన్నను గాని కలుసుకోరాదని నా భార్యకి గట్టిగా చెప్పాను. ఔను, నేనేం చెయ్యను? నాలో మానవత్వం లేక కాదు నేనా పనిచేసింది. నాహోదాకి, ఉద్యోగానికీ వెరిచి సూపర్నెంటు గారి బావమరిది ఒక పక్కా దొంగ అనిపించుకుంటూ, నా యింట్లో తిరగటం నేను సహించరాని విషయమైంది.

''చివరికి అతను నెల రోజుల క్రితం విడుదలైనాడని తెలిసినప్పుడు, నా భార్య అతన్ని చూడాలని చాలా పట్టుపట్టింది. నేను వల్లగాదన్నాను. దీనికి తోడు, అతను నా భార్యకి ఒక ఉత్తరం రాశాడు. అందులో ఏముందో, నేను చూడలేదు.

''అతనికి నా భార్యరమ్మని వ్రాసింది గావును. పదిహేను రోజుల క్రితం ఒకరోజున రాత్రిపూట అతను నా యింటికి రహస్యంగా వచ్చి చెల్లెల్ని కలుసుకున్నాడు. డబ్బుకోసమే ననుకుంటా. నా భార్య నాకు ఈ సంగతి తెలీకుండానే ఉంచింది. కానిగేట్‌కాపలా ఉన్న గుర్ఖా నాకు జరిగిన సంగతి చెప్పేశాడు. ఆ వేళ నా భార్యని దెబ్బలు గూడా కొట్టానని నాకు జ్ఞాపకం. ఆమె ఇక ముందు ఏ పరిస్థితుల్లోనూ, తన అన్నని కలుసుకోనని ప్రమాణం చేసింది''.

''ఐతే రాత్రి అతను మళ్ళీ వచ్చాడు. నా భార్యకి అతను ముందుగానే తెలియజేసి ఉండటం వల్ల, ఇద్దరూ, కలుసుకున్నారు. నాకు ఎందుకో మెలుకువ వచ్చి గదిలో చూస్తే ఆమె లేదు. వెంటనే కిందికి వచ్చి చూశాను. అతనూ ఆమె మాట్లాడుకుంటున్నారు. నా ముక్కోపం కొద్దీ ఆమెనీ, అతన్నీ బాదాను. అతను ఏ మాత్రం నాకెదురు తిరగలేదు. తర్వాత ఇద్దర్నీ లోపలికి లాక్కొచ్చాను. నా నోటికొచ్చినట్లు నా బావమరిదిని తిట్టాను. అన్ని తిట్లూ అయినతర్వాత అతను మాట్లాడాడు. ''బావా! నేనిప్పుడు ఎందుకొచ్చానో, ఏ పరిస్థితుల్లో వచ్చానో, కాస్త విను'' అన్నాడు.

'' ఏమిటి వినేది? ఒక దొంగ నా చుట్టం అనుకుంటూ, నా యింటికి రావటం నా కిష్టం లేదు'' అన్నాను నేను.

''కాని బావా! మనిషిగా, మనిషిచెప్పేది విను. నా భార్య భయంకరమైన వ్యాధితో, ఇప్పుడో ఇంకా కాసెపటికో అన్న స్థితిలో ఉంది. నా పిల్లలు ఆకలితో నరకద్వారంలో మూలుగుతున్నారు. నా దగ్గర చిల్లిగవ్వలేదు నాకు... ఒక దొంగకి అప్పేరిస్తారు? మీరు... నాకు బావ అయిగూడా ... నన్ను దగ్గరికి రానీయడమే అవమానంగా భావించారు. ఇక పరాయి వారెవరికి జాలి ఉంటుంది?... నేను వెళ్తున్నాను బావా! ఇక తిరిగి రాను గూడా... వొచ్చేందుకు నేను ఉండను'' అంటూ, తన చెల్లెలు బతిమాలినా వినకుండా, నేను ఇవ్వబోయిన పైకం తీసుకోకుండానే ఆ అర్ధరాత్రి వేళనే ఎటో వెళ్ళిపోయినాడు. అప్పణ్ణించీ నా భార్య ఓ మాదిరిగా ఉంది.... ఆమెకి పిచ్చెత్తినా ఆశ్చర్యపడాల్సిన పనేమీ లేదని నా ఉద్దేశం. నా గౌరవం, నాప్రతిష్ఠ, నా ఉద్యోగం, ఇవన్నీ కలిసి, నా మానవత్వాన్ని చంపేస్తున్నాయేమో అని కుళ్ళి కుళ్ళి చస్తున్నాను. ఇంత కంటే ఏమీ లేదు'' అని సూపర్నెంటు తన కథ పూర్తి చేశాడు. మేమిద్దరం, ఆయన్ని సాధ్యమైనంతగా ఓదార్చి, ఆయన బావమర్ది అడ్రస్ తీసుకున్నాం కనపడితే పట్టుకొస్తామని వాగ్దానం చేసి. ఇప్పుడు నేను ఓడిపోయినట్టేగదా?'' అన్నాడు రావు.

క్లబ్ మెంబర్ల మొహాలన్నీ జేవురించినై. ఏదో విషాదం గాలిలో కలిసి వాళ్ళందర్నీ ఆవరించినట్లుంది. ఇంతలో నాయుడు రావును భుజంమీద తట్టి, ''మరి శాస్త్రి, ఆ రాత్రే మూర్తి సాఫయి నాడని మమ్మల్ని గాభరా పెట్టాడు గదా? ఎందుకట్లా?'' అని అడిగాడు.

రావు నవ్వుతూ, '' ఏముందీ? సూపర్నెంటు బావమరిదీ, మూర్తి, ఒడ్డూ పొడుగూ ఒక్కటే అందుకని శాస్త్రి చీకట్లో కాస్త పొరపడి ఉంటాడు'' అన్నాడు.

*(జ్యోతి సచిత్ర పక్ష పత్రిక 15 జూలై 1948)*

# స్వాతంత్ర్య స్వరూపం

ఒకప్పుడు, ఒక పిల్లదేశం ఇంకో పెద్దదేశం నించి నానా అవస్థలు పడి స్వతంత్రం సంపాయించింది. ఆ పిల్లదేశంలో ప్రజలు స్వతంత్రం వొచ్చినందుకు గుర్తుగా ఓ స్వతంత్ర విగ్రహం చేయించి రాజధాని నగరంలో ప్రతిష్ఠించుదామని తమ స్వతంత్ర ప్రభుత్వానికి విజ్ఞప్తిచేసారు. ప్రభుత్వంకూడా తమ ప్రజల ఆలోచన బాగానేవుందని వప్పుకుని, ఒక శిల్పిని పిలిపించింది. ఆశిల్పి అఖండమైన కళోపాసకుడు. అదివరకు చాలా విగ్రహాలు చేశాడు, అతను చేసిన విగ్రహాలు జీవకళ వుట్టిపడుతూ ఉండేవి. ప్రభుత్వం ఆదేశించిన ప్రకారం ఆ శిల్పి ఒక సుముహూర్తంలో, మంచి చలువరాయితో విగ్రహం చేసేందుకు వుపక్రమించాడు.

స్వతంత్రాన్ని ప్రజలు పోరాడి తెచ్చుకున్నారు గనుక, స్వతంత్ర విగ్రహం, తమ పోరాటాల చరిత్రని ఎల్లప్పుడూ జ్ఞప్తిచేస్తో, తమ సుఖవంతమైన స్వతంత్ర భవిష్యత్తును చూపుతూవుండే ఒక మహావీరుని విగ్రహంగా చెక్కమని వాళ్ళు శిల్పికి తీర్మానాలు చేసి పంపారు. శిల్పి అలాగే నని ఒక మహావీరుని విగ్రహం చెక్కడం ప్రారంభించాడు.

కాని మొదట్నుంచీ, సామాన్య ప్రజలు పోరాటాలు చేసి స్వతంత్రం సంపాయిస్తే, తమ ప్రాబల్యం ఎట్టాగు మంటగలుస్తుందని భయపడుతూ వచ్చిన డబ్బు స్వాములు, తమ మీద అధికారం చెలాయిస్తున్న పరాయి దేశం డబ్బుస్వాములతో గుసగుసలూ, వికవికలూచేసి అధికారం తమ హస్తగతం చేసుకున్నారు. ఈ డబ్బుస్వాములు, ''స్వతంత్ర విగ్రహం, ప్రజలకి నూతనంగా వచ్చిన స్వతంత్ర ప్రభుత్వం యెడ నమ్రత, విధేయతా నేర్పే చిహ్నంగానూ, అల్లరీ ఆగం చేయకూడదని బోధించేగురువులాగూ ఉండాలి. అందుకని ఆ విగ్రహం ఓ ప్రశాంత తపస్విలాగానో లేక సన్యాసిలాగో వుండాలి'' అని శిల్పికి అజ్ఞాపించారు. శిల్పి ''చిత్తం'' అని మహావీరుడి విగ్రహం చెక్కినంతవరకు ఆపి, దాన్నే ఓ సన్యాసి రూపంలోకి చెక్కుతున్నాడు.

ఆ దేశంలోని డబ్బుస్వాముల్లోనే ఇంకా కొందరు మహాత్ములు, దేశాన్ని, దాని ఆర్థికపరిస్థితినీ తమ జేబుల్లోనూ, భోషాణాల్లోనూ ఇరికించుకొని వున్నారు. వాళ్ళకి ఈ సలహాలేవీ నచ్చలేదు. వాళ్ళందరూ కలిపి, ఆ విగ్రహం, మన విశాలమైన దేశం యొక్క స్వతంత్ర వ్యాపార ప్రతిపత్తిని విస్తరింపజేసేదిగా ఒక గొప్ప ఓడల వర్తకుని రూపంలోవుండాలి'' అని ఆ శిల్పికి ఆదేశం పంపారు. శిల్పి ఆ ఆదేశం వెనుక వుండే ఆర్థిక బలాన్ని వూహించుకొని ''అలాగే బాబు'' అని తను తయారుచేస్తోన్న సన్యాసి విగ్రహాన్నే ఓ గొప్ప వ్యాపారస్థుడి విగ్రహంగా మారుస్తున్నాడు.

కాని అసలు ప్రభుత్వంలో వుండే ప్రముఖులు ఇవన్నీ పనికిరావని రెండు మూడు సబ్‌కమిటీలూ,

నాలుగైదు సంఘాలువేసి, వాటి రిపోర్టులన్నీ కలేసి చదివి, వాటినన్నిట్నీ తీసేసింతర్వాత ''స్వతంత్రవిగ్రహం ప్రభుత్వం ఎడ భక్తినీ, నమ్రతనీ నేర్పేట్టు వుండవలసిందేకాని అది సన్యాసిలాగు ప్రజలకి ప్రభుత్వం యెడల భయమూ, భక్తినీ, శ్రద్ధా, గౌరవాల్నీ నేర్పే సాయుధ సైనికుడి విగ్రహంగా వుండాలని ప్రభుత్వం భావిస్తోంది. నిజమైన ప్రజాశాంతినీ, ప్రజాస్వామికాన్ని కాపాడేది ప్రభుత్వసైన్యమే. అదీకాకుండా ప్రజలలో కొందరు ఎల్లప్పుడూ ఆకలనీ, గుడ్డలనీ అల్లర్లుచేస్తో ఆర్థిక సమానత్వం అని లేనిపోని ప్రచారంచేస్తో, ప్రజల ప్రశాంత జీవితాలని భగ్నంచేస్తున్నారు. అటువంటి వాళ్ళకి స్వతంత్ర ప్రభుత్వంలోనైనా వాళ్ళ ఆటలు సాగవని హెచ్చరికలు తెల్పుతూ స్వతంత్ర విగ్రహం ప్రభుత్వసాయుధ సైనికుడి రూపంలో వుండాలి'' అని బహిరంగ ప్రకటన ఒకటిచేసి, శిల్పికి హుకుం ఇచ్చారు, సైనికుడి విగ్రహం చెక్కమని ''అట్లానే'' అని శిల్పి తను ఇదివరిలో చెక్కుతున్న వర్తకుడి రూపాన్నే సాయుధ సైనికుని రూపంలోకి మార్చుతున్నాడు. ప్రభుత్వం సలహాని డబ్బుస్వాములు హర్షించారు, వ్యాపారస్తులు ఆహ్వానించారు. అటూ ఇటూ మాట్లాడే పెద్దమనుషులు ఆమోదించారు, ప్రజలు మాత్రం ప్రభుత్వధోరణికి ముక్కుమీద వేలేసుకున్నారు.

అయితే శిల్పి మాత్రం ఎడతెరిపి లేకుండా శ్రమించి స్వాతంత్ర విగ్రహాన్ని తయారుచేశాడు. ఒక సుదినమున స్వాతంత్ర విగ్రహాన్ని రాజధానినగరంలో ప్రతిష్ఠించడానికి తీసుకువచ్చారు. అదివరకే తయారైన శిలావేదికపై స్వతంత్ర విగ్రహాన్ని వుంచారు. ప్రభుత్వ అధ్యక్షుడు స్వతంతాన్ని గూర్చి ఒక మహోపన్యాసం జేసింతర్వాత స్వతంత్ర విగ్రహానికి వున్న మొఖమల్‌గుడ్డని తొలగించాడు. స్వాతంత్ర విగ్రహం ఆధునిక ఆయుధాలతో సాక్షాత్కరించింది. భయంకరమైన దయ్యం రూపంలో

*(జులై 1948, విశాలాంధ్ర)*

# కొత్తవార్త

కొత్తగూడ గ్రామంలో కోటయ్యగారికి ప్రజల్లో మంచి పలుకుబడి వుంది. ఆయన సత్ప్రవర్తనుడు. తెలంగాణా పోరాటం ప్రారంభమైం తరవాత, ఆయన ఇల్లూ, గ్రామంలో చాలామంది ఇళ్ళూ నిజాం సైన్యంచేత, ఇత్తేహాదుల్ గూండాలచేత దోచుకోబడ్డాయి. కోటయ్యగారు, శిస్తులు చెల్లించేసి, శాంతంగా వుండిపోదామని ప్రజలకి చెప్పాడు. చెల్లించకపోతే గ్రామాన్ని మొత్తం నాశనం చేస్తారేమో వాళ్లు! అని వాదించాడాయన. గ్రామ పటేల్ జబర్దస్తీగా వసూళ్లు ప్రారంభించాడు గూడాను. కోటయ్య కొడుకు నాగప్ప శిస్తు చెల్లించటానికి వప్పుకోలేదు. చెల్లించిన శిస్తు ఎన్నిసార్లు చెల్లించాలి?.... అన్నాడతను. అతని అభిప్రాయం గ్రామములో చాలామందికి వుంది. వాళ్ళంతా కలిసి ఒకనాడు మాట్లాడుకున్నారు. రశీదు లివ్వకుండా ముసిలాళ్ళని బెదిరించి మళ్ళీ శిస్తు వసూలు చేస్తాడా ఈ పటేల్? ఎబ్బే .... నైజాం కావలికుక్క .... అని గట్టిగా వాదించాడు నాగప్ప అవును .... నిజాం రాక్షసుడిపొట్టా .... ఆ మిలటరీ రాక్షసుల పొట్టలూ, సారాతోటీ, కోడి గుడ్లతోటీ నింపటానికేగా ఈ వసూళ్లు?... నాగప్పవాదనని యువకులంతా అంగీకరించారు. అందరూ ఆంధ్రమహాసభ మెంబర్లేనాయె...

గ్రామపటేల్.... శిస్తు వసూలు చేయలేకపోయినాడు. ఎవరిస్తారు? అతనికి వళ్లుమండింది: మండి ఎవర్నేంచేస్తావు పో!... అన్నారు ప్రజలు. వసూలైన శిస్తులు మళ్లీ వసూలు చేయడానికి యెన్ని గుండెల్తో వొచ్చావు? ఎక్కువగా మాట్లాడితే తంతామన్నారు యువకులు.

రెండో రోజుకి గ్రామం మంచి నిద్రలో వుంది. రాత్రి 11 గంటలవుతోంది. అష్టమి చంద్రుని గుడ్డివెన్నెట్లో, చడీచప్పుడు లేకుండా నిజాం దొంగసైన్యం గ్రామంలో ప్రవేశించింది. గ్రామ పొలిమేరల్లోనే సైన్యాన్ని ఒక పన్నెండేళ్ల కుర్రాడు హఠాత్తుగా చూసాడు. ఆకుర్రాడు, సైన్యానికి అగుపడకుండా మెల్లిగా చీకట్లో మాయమైనాడు గ్రామంలోకి. సైన్యం బొంయ్... బొంయ్‌మని మొరిగే కుక్కల్ని తుపాకీ మడమలతో చంపి గ్రామంలోకి జొరపడ్డారు.

## 2

నైజాం దొంగ సైన్యానికి దాదాపు కష్టకాలం ప్రాప్తించింది. 1930 కీ, 1948 కీ వున్న తేడావాళ్ళకేమీ గోచరించక పొరపడ్డారు. దోపిడీదార్లకి కాలంలోని మార్పుగోచరించదేమో బహుశా. గ్రామ పటేల్ సైన్యానికి ప్రతి ఇల్లూ ప్రత్యేకంగా వర్ణించి చెబుతో చేతిలాంతర్‌తో ముందికి వస్తున్నాడు.

సైన్యం గ్రామంలో ప్రవేశించిన 10 నిమిషాలకే ప్రజల్లో అపూర్వమైన చైతన్యం సంచలనం తుఫానులా

వ్యాపించింది. ఈ సంగతి గ్రామస్థులకి తప్ప సైన్యానికేమీ తెలియక పోవడం, వాళ్ళ మౌఢ్యమని అంటానికేమీ ఆస్కారంలేదు. గెరిల్లా దళంయొక్క నైపుణ్యమే కారణం.

గ్రామపటేల్, సైన్యంలో పెద్దవాడూ ఇత్తే హోదుల్ గూండా, ఏ ఘోరాలకీ వెనుదీయని పిచ్చికుక్క మొహిద్దీన్ని సాభిప్రాయంగా పలకరించి,

''మొహిద్దీన్, మన ఘనత వహించిన ప్రభుత్వానికి శిస్తులు ఎగ్గొట్టే అంత ధైర్యానికి కారణం ఎవరో నేను చూపుతాను, వాణ్ణి...'' అని ఇంకేదో అనబోతున్నాడు.

మొహిద్దీన్ అర్రాత్రి గుడ్డి వెలుగులో, నిశబ్దమైన బజారు అదిరేట్టు పెద్దగానవ్వి ''వాడ్కీ.....నడి బజారుమే హిజ్ఎక్సలెన్సీ కేలియే.... ముక్కలుచేస్తాం'' అన్నాడు బొంగురు గొంతుతో.

గ్రామపటేల్ ముసి ముసి నవ్వులు నవ్వాడు. ''మంచిమాట అన్నావు. కాని వాడితో చాలామంది వున్నారు సుమా!'' అని హృదాంతరాళంలోని భయాన్ని గంభీరమైన మాటల్లో వెలిబుచ్చాడు.

మొహిద్దీన్ క్రూరమైన కళ్లు అష్టమి చంద్రకాంతిలో ఎర్రగా మెరిసాయి. భయంకరంగా తుపాకీ మడమ నేలకేసి బాది, ''కుఛ్ ఫరవానహి! హం, భీ వంద మందే వున్నాం!'' అన్నాడు తన వెనకాల నడుస్తూ, లోగడ గ్రామాల్లో ఇలాంటి పన్లుచేసి, గెరిల్లాల చేత నానా తిప్పలూపడి చచ్చిన సైన్యం దుర్గతి జ్ఞాపకం వొచ్చి, భయంతో వొణుకుతూ హంసనడకలు నడుస్తున్న సైనికుల్ని గంభీరంగా చూపుతో.

పటేల్ నడక మందగించింది సైన్యం అగింది. లాంతర్ పైకెత్తి ''ఈ ఇల్లే వాడిది...'' అన్నాడు గ్రామపటేల్ ఒక పెద్దయింటిని చూపి. మాట పైకిరాకముందే తెరిచిన ఇంట్లోదూరే వూరకుక్కల్లాగు, సైన్యం కోటయ్యగారింట్లో జొరబడ్డది.

ఇంట్లో ఎవరూ లేరన్నట్లు బావురుమంటోంది. ఇంటిమధ్య లాంతరు మాత్రం సన్నగా వెలుగుతోంది. నైజాం గుండెల్లో కుంపటిలా మొహిద్దీన్ హుంకరించాడు పెద్దలొట్టి పిట్టలాగు.

సైన్యం కదలిక మామూలుగాలేదు... వాళ్ళు బయలు దేరేటప్పుడు వున్న టీక్ టాక్ నడక మారి, దానిస్థానే కిరకిర శబ్దం, గుసగుసమాటలూ వినిపిస్తున్నాయి.

మొహిద్దీన్ ఇంకా పెద్దగా అరిచాడు. లాంతర్ అదిరి టపటపమని ఎగిరింది. సైన్యంలో మొత్తం ఎనభైమంది వున్నారు. ఆ పెద్ద ఇంట్లో ఎనభైమందీ ఇరుక్కుని ఒకర్నొకరు తోసుకుంటో, సోదా ప్రారంభించారు. పెద్ద భోషాణపెట్టిని ఒకడు చెయ్యి పెట్టి దాన్లోంచి పాతగుడ్డలూ, కాయితాలూ, విరజిమ్ముతున్నాడు. ఒకడు గాదెలు పడగొట్టాడు. అన్నీ దాదాపు ఖాళీగా వున్నాయి. మనిషి స్పర్శే వాళ్ళకెక్కడా తగల్లేదు.

మొహిద్దీన్ మరీ వుగ్రుడై ఎగురుతున్నాడు, ఆరిపోతున్న లాంతర్లా, తుపాకీలున్నాయి కాని ఎవర్ని కాల్చేట్టు?... దోపిడి చేయటానికి ఏమున్నాయి?... కోపం హెచ్చి, సైనికుల్ని తన్నాడు, మనుషుల్ని వెతకమని.

3

అర్ధరాత్రి సమీపిస్తోంది. కోటయ్యగారి ఊరికిపదిగజాల దూరంలో వున్న కోటయ్యగారి చావిడిలో గ్రామ యువకుల సమావేశం అతి నిశ్శబ్దంగా కటికి చీకట్లో సాగుతోంది. అక్కడేం నిర్ణయం జరిగిందో, అక్కడ సన్నగా వీస్తున్న గాలికే తెలియడం లేదు. పదినిమిషాలు అయినాయి. చావిడినించి ఒక్కొక్క నిర్దిష్టమైన నీడ మృత్యువులా కదిలి కోటయ్యగారింటివేపుకి చీకట్లో మాయమౌతోంది. ప్రజాసేవకుల నిశ్వాసాలు వినిపించకుండా గాలి 'రివ్' మని వీస్తూ శబ్దం చేస్తోంది.

దోపిడి దొంగల సోదా ఇంకా సాగుతోంది. ఇంటిలోపల మొహిద్దీన్ అరుపులూ అట్టహాసాలూ, సైనికుల భయంకరమైన అస్పష్ట కోలాహలం... తుపాకీలు ఒకదాన్నొకటి రాసుకుంటున్న శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది.

ఇంటిబైట రెండొందల నీడలు చేతుల్లో తుపాకీలూ, పెద్ద బడితెలూ, పట్టుకుని కదులుతున్నాయి. ఒక బలిష్టమైన నీడ మెల్లగా, ఇంటి పెద్దవాకిలి తలుపు గొళ్లెం బిగించింది. దొడ్డి తలుపులు గొళ్లేలుకూడా బిగించిన శబ్దం లోపల సోదా జరుపుతున్న హంతకులకి వినిపించింది. సైనికుల్లో అది వరకల్లా అజ్ఞాతంగా వున్న భయోత్పాతం గప్పున అంటుకున్నది. ఆ క్షణాన వాళ్లకేం తోచటంలేదు... గ్రామ పటేల్ భయకంపితుడై' ''మొహిద్దీన్... మొహిద్దీన్.. తలుపు ... తలుపు...'' అంటున్నాడు నత్తిగా. అతని చేతిలో ఆరిపోయిన లాంతర్ గడగడ వొణికి ప్రాణభీతితో ... కిందపడి ముక్కలయింది.

సైనికుల గుండెల్లో నైజాం స్పెషల్సు పరుగెత్తుతున్నాయ్. తాము అనుకున్న దేమిటి? జరిగిందేమిటి?... తమకి సంఘ మరణం తప్పదల్లేవుంది...

బైటనీడలు ఒక్కసారి కాగడాల వెలుగులో గప్పునకన్పించారు గ్రామం దాదాపు అక్కడేవుంది! నిశబ్దం బద్దలై ఒక్కసారి నినాదాలుగా మారింది. ఆ నినాదాలు ఇంట్లో నిజాం నీచులకి అనేక పూర్వసంఘటనలన్ని జ్ఞప్తికి తెచ్చిపెట్టి వాళ్ళ జీవితాశని వమ్ముచేస్తోన్నాయి. వాళ్ళు దిగ్భ్రమ చెందారు...

''కిటికీల్లోంచి కాల్చండి ఆ పురుగుల్ని'' అన్నారు ప్రజల్లో ఒకరు.

''వద్దు - ఈ దుష్టమృగాలకోసం, నీచ కీటకాలకోసం విలువైన తుపాకిమందును ఖర్చుపెట్టడం అనవసరం... ఇల్లు నాల్గుపక్కలా అంటించండి. లోపలే కుమిలినశిస్తాయి... ఇంకెవ్వరికీ అపకారం చేయకండా'' అన్నాడు నాగప్ప.

ఇంట్లో సైనికపిశాచాలు తలుపు వుతకలెత్తే ప్రయత్నానికి పూనుకున్నారు బలవంతంగా, మొహిద్దీన్ చివాట్లతో. ఆ తలుపు సామాన్యమైయిందికాదు. అది తెలంగాణా ప్రజల వీరోచిత పోరాటానికి కోటతలుపు. తెలుగు ప్రజల గర్భశత్రువులకి అంతతొందరగా, తేలికగా అలమెయ్యేట్టు కన్పించలేదు. దాని వెనక తెలంగాణా విముక్తి ప్రజాసైన్యం జయజయధ్వానాలతో నుంచుని వుంటే అది అలమికావటమేమిటి?

''కిరసనాయిలుపొయ్యండి... అంటించండి. విషసర్పాల్ని వొదలకూడదు'' అర్ధరాత్రి వణికింది.

దిక్కులు ప్రతిధ్వనించాయి. నైజాం సింహాసనం అంగుళం మేర కదిలి గజగజలాడింది.

''నిజమే. కానీండి. ఆంధ్రమహాసభా జిందాబాద్.... తెలంగాణా జిందాబాద్'' వందలగొంతుకల్లోంచి మారుమ్రోగిందా ఒక్కమాట.

ఆ ఒక్కమాట, ఇంట్లో దొంగగుంపు అంతాన్ని ... ఆసన్న సంఘమరణాన్ని... సూచిస్తో నైజాం క్రూరపరిపాలనాయంత్రాన్ని ఒక్కసారి తుపానులో అరటిచెట్టులా గజగజలాడించింది... హడలెత్తించింది.

మొహిద్దీన్ గంతులేస్తున్నాడు... ఎగురుతున్నాడు ... సైనికుల్ని తంతున్నాడు... గ్రామపటేల్ని తిడ్తున్నాడు. దొడ్డి తలుపు ఒక్కరవ్వ కదుల్తోంది సైనికుల ప్రయత్నంతో.

4

ఇల్లునాల్గువైపులా అంటుకున్నది. క్షణంలో అగ్ని నాలుకసాచి, ఆకాశాన్ని అంటుతోంది. బయటనినాదాలు లోపల హాహాకారాలు.

1930 కీ, 1948కీగల కాలవ్యత్యాసం, నైజాం నరహంతకులకి అరచేతిలో అరటిపండులా తేటతెల్లమౌతోంది. వాళ్ళు వాకిలితలుపు ఆశవదులుకొని, దొడ్డితలుపు తీసే ప్రయత్నంలో సతమతమౌతున్నారు. గ్రామపటేల్ సైనికుల వత్తిడికీ, మొహిద్దీన్ తన్నులకీ ప్రజలకోపాగ్నికీ మాడిమసైనాడు.

గంట గడిచింది. దొడ్డితలుపు వూడివచ్చింది. 80 మంది నరహంతకుల్లో 20 మంది సగం చచ్చిన మొహిద్దీన్ని, దొడ్లోకి ఈడ్చిపారేసి, రోడ్డుమీదికి వచ్చి కాలికి బుద్ధిచెప్పారు. పొలిమేరలు దాటి చాలాదూరం పొయ్యేవరకూ, ప్రజాసైన్య విప్లవనినాదం వాళ్ళని తరుముతునేవుంది. కిందా, మీదా పడుతూ నైజాం దొర సైన్యం అదేపోత పోయింది చీకట్లో కలిసి రాలిపోయిన వాళ్ళను తలవనైనా తలవకుండా.

తెలతెలవారింది. గ్రామ ప్రజలు శాంతముగా, తమ నిత్యకృత్యంలా, కోటయ్యగారి తగలడ్డ ఇల్లు శుభ్రంగా ఆర్పి విషసర్పాల స్వార్థానికి అస్తి సంచయనం చేసారు.

5

మరుసటిరోజు సైనిక శిబిరంలో... చావుతప్పి కన్నులొట్టపోయి కాలిన శరీరాలకి కట్టు కట్టుకుని పడుకుని వున్న సైనిక పిశాచాలు మూలుగుతూ మాట్లాడుకుంటున్నారు.

'' ఒరేభాయ్! మళ్ళీ ఇవ్వాళరాత్రికి కొత్తగూడా పోవాలంట! హుకుం జారీ మీద!'' అన్నాడొకడు జీవితంమీద ఆశ తొణికిసలాడే స్వరంలో.

ఇంకోడు చార్మినార్ సిగరెట్ పీక ఎలిగించి, '' ఎందుకో తెలుసా? పోయిన వాళ్ళకి తోడులేదని మన్నీ పంపటానికి'' అన్నాడు విసుగ్గా.

అందరిలో తెలివిగల మూడోవాడు నెమ్మదిగా మాట్లాడాడు. ''భాయి! భయందేనికీ? పోదాం. అక్కడ తప్పించుకునే మార్గం వుంది!'' అన్నాడు.

సైనిక పిశాచాలు ఆశగా చూసాయి అతన్ని ''అదేమిటో చెప్పు ... తొందరగా!'' అన్నారందరు.

'' ఇక్కడ చెబితే మనని ఈ యెలుగు బంటి సర్దార్ కాల్చి చంపుతాడు దారిలో చెబుతా!''

పదినిమిషాలకి ఎవడో సర్దార్, వెధవ నోరుపెట్టి రంకెలు వేస్తూ శిబిరంలోకి వచ్చాడు. వాడిదేం పోయింది? ప్రజల దెబ్బ చవిచూడలేదింకా...

నాన్సెన్సు! వెధవది, ఒక్కరైతు వెధవలు ఐదువందల మందిన్నా ఉండరు... ఇంతమంది సాయుధ సైనికులు వుండి ఏం చెయ్యలేక పోయినారా? హిజ్ ఎక్స్‌లెన్సీకి ఎంత నామర్దా? ... ఛీ... పోండి.... కొట్టండి.... దోచుకురండి.

మిగతా పిశాచాలకి వళ్ళు జలదరించింది. ''అమ్మయ్యో!... మళ్లీ అక్కడికే?'' ... అన్నారు.

''మీరు పిరికిపందలు నేనొస్తాను పదండి ఈతడవ రెండొందలమందిని తీసుకెళ్దాం...''

ఎంతమంది వొస్తేయేం? ఆగెరిల్లాలు వాళ్ళు మామూలు మనుషులని నమ్మకం కుదరలేదు సైనికులకి. సైన్యంలో మామూలు కదలికేం రాలేదు. టిక్... టాక్ నశించి మూలుగు బయల్దేరింది, తళ తళలాడే బాయ్‌నెట్‌లు వెలవెలబోతున్నై.

''వుం.... ఇవ్వాళే... అదిగో మిలటరీ లారీలు... పదండి''

వీడిదేంపోయింది సైనికుల్లో గుసగుస బయిల్దేరింది. పదమంటాడు ... తనెక్కడో దూరంగాకూచుని... రంకెలువేస్తాడు... అయినా రోకట్లో తల దూర్చాకా----

సైన్యం మళ్ళీ హంసనడక నడుస్తో బయిల్దేరింది కొత్త ఎలుగు బంటు ఆధ్వర్యాన. గ్రామం దగ్గిర పడుతున్న కొద్దీ మిలిటరీ కార్ల మోతతో పాటు సైనికుల గుండె దడగూడా కలసి మందర స్థాయికి వెడుతోంది.

ఎలుగుబంటు గ్రామానికి మైలు దూరంలో సురక్షితస్థానంలో డేరావేసి సైనికుల్ని కార్లలోంచి దింపి ''పొండి'' గ్రామాన్ని దోచుకోండి... తగ లెయ్యండి అడ్డువచ్చిన వాణ్ణల్లా నరకండి'' ... అని హుకుం జారీచేశాడు.

సైన్యం తాబేలులా మందగమనంతో గ్రామంకేసి నడుస్తోంది. తెలివిగల మూడోవాడు, ఎలుగుబంటును దాటి అర్మైలు పోయింతర్వాత ''నేను ఒక ఆలోచన చెబుతాను'' అన్నాడు. ఇంకోడు దిగులుగా, ''పోదూ... ఏ ఆలోచన చెప్పినా మనం అల్లాని చేరే ఆలోచనేగా?'' అన్నాడు.

మిగతావాళ్ళు '' ఆ!'' అన్నారు నిస్పృహతో సమాధానంగా.

ఇంకోడు తుపాకి జారుతోవుంటే పైకి సర్దుకుంటో, ''ఛీ వెదవది నాకన్న యీ తుపాకికి ఎక్కువ భయంగావుంది'' అని విసుక్కున్నాడు.

మరొకడు నవ్వి ''మనం ఈ గ్రామం యెందుకూ తగలెయ్యటం? అన్నాడు అనుమానంగా. ఈ అనుమానం సైనికుడికి రావటం ఆశ్చర్యమే. కాని అది గెరిల్లా లంటే వుండే భయంకొద్దీ వచ్చివుంటుంది.

మొదటివాడు ''హిజ్ఎక్సలెన్సీ హుకుంప్రకారం!'' అన్నాడు.

రెండోవాడు ''ముస్లీం నాగరికత నిలపటానికిట, యీ జనాన్ని చంపటం!'' అన్నాడు అసహ్యంగా. అతను ముస్లిమే అయినా, పై వాళ్ల చీవాట్లతో ముస్లిం అభిమానం నశించింది అతనికి.

తెలివిగల మూడోవాడు ''యిదిగో నేను చెప్పినట్టుచేయండి. అందరం ఆ గెరిల్లాలకి, ఈ పాడుతుపాకులూ, ఈ కాకీ డ్రెస్సులూ యిచ్చి వాళ్ళతో కలుద్దాం. మనకి తర్వాత ఏభయమూ వుండదు.''

మొదటివాడు తుపాకీ నిక్కచ్చిగా కిందికి జారవిడిచి ''అమ్మయ్యో! ఆ ఎలుగు బంటి సర్దారు మన్ని చంపితే?'' అన్నాడు గడగడ వొణికి.

సైన్యంఅంతా ఒక క్షణం ఆలోచించారు.

''మనం అంతాకలసి వాణ్ణి చంపుదాం. వాడొక్కడేగా!'' అన్నాడు మూడోవాడు.

సైన్యం గ్రామంచేరువకి చేరుకుని తుపాకులు కిందబెట్టి, డ్రెస్సు వూడదీయడం చెట్ల సందున కూచుని చూస్తున్న ప్రజాసైన్యం కనిపెట్టింది. సైన్యం తరహాబోధపడక, తమలో ఒక్కణ్ణిపంపింది, అతను బతికినా చచ్చినా సరే అని తీర్మానించుకుని.

సైన్యం గెరిల్లావీరునికి స్వాగతం ఇచ్చింది. తెలివిగలమూడోవాడే పలకరించాడు అతన్ని. ''భాయీ! మాకిచ్చే 30 హాలీలకోసం మేం చావదల్చుకోలేదు. ఎవర్నీ చంపదల్చుకోలేదు. ఆ తుపాకులన్నీ తీసుకోండి. ఆడ్రెస్సులు కూడాను. మేమంతా మీతో కలుస్తాం.

గెరిల్లా వీరుడు సంతోషంగా, ఈలవేసి ''జిందాబాద్ ఆంధ్రమహాసభా'' అని నినాదం ఇచ్చాడు. ప్రజాసైన్యం అంతా వచ్చి నినాదాన్ని అందుకున్నది... దోపిడి సైన్యంకూడా...

''జిందాబాద్... తెలంగాణా!''

''నైజం నిరంకుశత్వం ... నశించాలి!''

కొత్తగుడా గ్రామ పంచాయితీ ప్రభుత్వానికి అదనంగా రెండొందల తుపాకీలు రెండొందలమంది తర్ఫీదైన సైనికులూ లభించారు. నైజాం నవాబు సైన్యంలో గూడా ప్రజా చైతన్యం పాకుతోంది!

***(జూలై 1948, అభ్యుదయ)***

# గెరిల్లా గోవిందు

అవాళ 22 మార్చి 48 తారీకుని సూచిస్తూ కాలెండర్, గోడమీద వూగులాడుతోంది. నిజాం సరిహద్దు దగ్గిర కొత్తగా మకాం వేసిన రజాకార్లు సిగరెట్లు తగలేస్తో, మధ్య మధ్య సారా సేవిస్తూ, గది మధ్య బల్లచుట్టూ కూర్చున్నారు. గది నాల్గుగోడలకీ, బ్రెన్ గన్నులూ, తుపాకులూ వేళ్లాడుతూ వాతావరణాన్ని భయపెడ్తున్నై! అప్పుడే చీకటిపడుతూంది. గది వాకిలిగుండా బావురుమనే విశాలమైదానమూ, దూరంగా నల్లగుట్టల్లాగు కన్పించే పూరిళ్ళూ మసక మసకగా అవుపిస్తున్నై. ఆ ప్రాంతమంతా, రజాకార్లదుష్కృత్యాల భయంతో వెగశ్వాస పీల్చి వొదులుతున్నట్లు గాలి వెచ్చగా విసుగుగా వీస్తోంది. బల్లచుట్టూ కూర్చున్న ఎనిమిది మందిలోనూ భయానకమైన మొరటు గొంతుతో, ఎర్రబడ్డ కళ్ళు మిటకరిస్తో ఒకడు ప్రారంభించాడు సంభాషణ. వాడి విగ్రహమే చెబుతోంది. వాడు నరమాంసాహారి అని. అతను బల్లమీది సారాగ్లాసు చేతిలోకితీసుకుంటూ '' ఆ కాఫిర్ బేవకూఫ్ దొరికితేనా: నిలువునా చంపేస్తాను...'' అన్నాడు గోండ్రించి.

పొట్టిగా, కుదేసిన బస్తాలా, మంచి రక్తవర్ణం తేలిన మరొకడు, ''నేనే వాణ్ణిచూస్తే!'' అని సిగిరెట్ అంటించడంలో లీనమైనాడు.

మొదట గోండ్రించిన వాడిపేరు రహిమాన్, అతను తనలోపలే ఏదో ఆలోచిస్తోపైకి చిరునవ్వు నవ్వి మిగతా వాళ్ళవంక ధీరంగాచూస్తూ ''వాడు ఈ చుట్టుపక్కలే తిరుగుతున్నాడుభాయీ, దొరికిపోతాడులే, రెండు రోజులకిందట నారాయ్‌పాలెంలో కన్పించాడని ఎవడో కాఫిర్ అన్నాడు. అంటూ ఒకగుక్క సారాయి తాగాడు తాపీగా.

మిగతా ఏడుగురు హంతకులూ, రహిమాన్‌వంక భయంతోనూ' సందేహంగానూ చూసారు. వాళ్ళకి ఎంత సారాతాగినా, భయం వదలడం లేదు నిషా ఎక్కడం లేదు.

పొట్టివాడి పేరు అబ్దుల్, అతను రహిమాన్‌ని కళ్ళార్పకుండా ఒక నిముషం చూసి, ''అయితే వాడు ఇక్కడే వున్నాడని అర్థం? ఏం భాయి చెప్పు! వాడి పేరేమిటి? మరిచిపోయినానులే....'' అని అడిగాడు, అతడు భయపడుతున్నాడో, లేక ఆసక్తే కనపరుస్తున్నాడో, అతని స్వరం వల్ల బోధపడటం లేదు.

రహిమాన్ భీకరంగా నవ్వాడు. గదిలో కాలెండర్ వూగులాడింది. చీకటి వొణికింది. మీరు భయపడుతున్నారా? అన్నట్టు చూసాడు అందర్నీ. తర్వాత బల్లమీద మోచెయ్యి ఆన్చి, అరచేతిలో

గడ్డం పెట్టుకుని, మెల్లగా రహస్యం చెప్పేవాడిలా, ఇలా అన్నాడు, ''వాడి పేరు గోవిందు చాలా అల్లరిరకం అంట, వాణ్ణి పట్టుకోకపోతే భలే నామర్దా మనకి!'' అతని ముఖంలో నిశ్చితాభిప్రాయాన్ని వెలిబుచ్చే ముడతలు కలిగినయి.

అతని సహచరుల మొహాలు ఎందుకోగాని ఎర్రబారినై, వాళ్ళిది వరకే ఆ పేరు విన్నట్టు కనిపించారు. ఒకరి మొహాలు ఒకరు తీవ్రంగా పదినిముషాలు చూసుకున్నారు, మౌనంగా! గాలికూడా వాళ్ళ మౌనాన్ని భంగం చేయడమెందుకా అన్నట్లు ఒక నిముషం ఆగింది. రహిమాన్ చేతిలో సారాగ్లాసు జారి బల్లమీదపడి మౌనం భంగమైంది.

ఆ మసక చీకటి ఉలిక్కిపడ్డది. అబ్దుల్ గూడా ఉలిక్కి పడ్డట్టే అగుపించాడు ''అరేభాయీ, దీపం వెలిగించనా?'' అని మిగతా వాళ్ళని ప్రశ్నించి, వాళ్ళ జవాబు రాకముందే అతను ఆ పనిలో నిమగ్నమైనాడు.

రహిమాన్ అబ్దుల్ వైపు తూలేకళ్ళతో వురిమిచూస్తూ, ''అరే మన కొత్త సర్దార్ ఈ పాటికే వస్తూవుండాలిగా'' అని అడిగాడు. అక్కడి వాతావరణాన్ని ఆవరించిన భయాన్ని పోగొట్టాలనే ప్రయత్నం అతని గొంతులో స్ఫురిస్తున్నది. అబ్దుల్ వెలిగించిన లాంతర్ కొంత భయాన్ని చీకటిని పారద్రోల గలిగింది. అబ్దుల్ లాంతరును బల్లమధ్య పెట్టి తన కుర్చీలో కూలబడుతూ ''నిజమే, ఈ పాటికి రావల్సింది'' అని సమాధానమిచ్చాడు. అబ్దుల్‌కి ఎడంవైపున కూర్చున్న ముప్పై ఏళ్ళ మరొకడు తన ముఖంమీద ముడతల్ని ఎక్కువచేస్తూ అబ్దుల్‌వైపు అప్రయత్నంగా తిరిగి, ''సర్దార్ రావటంతో మనం గోవిందుకోసం పోవాలా?'' అని ప్రశ్నించినట్టు ఆశ్చర్యపడ్డాడు. అబ్దుల్ సారా గ్లాసులోనికి కూజాలోంచి సారాని పోసుకుంటూ ''అవును హుస్సేన్ భాయీ! అదే మనప్లాను!'' అని రహిమాన్‌వైపు తిరిగి ''క్యాజీ! అంతేనా?'' అని ప్రశ్నించాడు. రహిమాన్ మాట్లాడకుండా ఆమోద సూచకంగా తలూపాడు.

హుస్సేన్ ఒక్క గుక్కన తనచేతిలో సారాగ్లాసు సగంపై చిల్లర ఖాళీచేసి, ''వాడెట్టా వుంటాడు? మనం గుర్తుపట్టక్కరలేదూ?'' అని రహిమాన్‌వైపు చూస్తూ ప్రశ్నించాడు. మిగతా హంతకులు గూడా, ఈ ప్రశ్నకు రాబొయ్యే సమాధానాన్ని ఆకాంక్షిస్తున్నట్టు, రహిమాన్ వైపు హుషారుగా చూడసాగారు.

రహమాన్ వాకిలివైపు, రాబొయ్యే కొత్తసర్దారు కోసం గావును ఆదుర్దాగా చూస్తున్నాడు. హుస్సేను ప్రశ్నతో చూపును గదిలోకి మరల్చి '' ఎట్లా ఉంటాడో? నాకూ బాగా తెలవదు, అయితే కొద్దిగా తెలుసు. నిన్ననే వాటి 'ఐడెంటీ ఫై' నోటీసు వచ్చిందన్నారు'' అంటూ తన జేబులోంచి ఓ కాగితాన్ని బైటికిలాగి, లాంతర్ దగ్గరగా బల్లమీద పరచాడు. దానిమీద తలవైపున నైజం మొహరు వేసి వుంది. దాన్ని రహమాన్ ఇట్లా చదవసాగాడు.

పేరు : గోవిందు గ్రామం నల్గొండజిల్లాలో ఒక గ్రామం : సామాన్య రైతు. వయసు 22సం॥లు ఎర్రగా 6 అడుగుల యెత్తు వుంటాడు. ఎడం వైపుగా, గడ్డం మీద ఇటీవలనే తగిలిన తుపాకీ గాయం

ఉంటుంది. మీసాలు కొసలు తిరిగి వుంటాయి. ఉంగరాలక్రాపు. కోలముఖం ఇతని మూలంగా, హిజ్ఎక్జాల్టెడ్ హైనెస్ సైన్యానికి చాలాసార్లు గొప్ప నష్టాలు కలిగినాయి అని తెలుస్తున్నది. ఇతను కాఫిర్ల పరమైన మన రాజ్యంలోని గెరిల్లా దొంగలగుంపు నాయకుడు. ఇతన్ని పట్టుకున్న వారికి ఐదువేల హాలీలు బహుమతి ఇవ్వడమేకాకుండా, దొరతనంలో పెద్ద ఉద్యోగంకూడా యివ్వబడుతుంది.''

చదవటం పూర్తిచేసి రహమాన్ తన సహచరుల ముఖాలవైపు చూసాడు. వాళ్ళందరికీ, గోవిందు విగ్రహం కళ్ళక్కట్టినట్టు కన్పిస్తున్నది. అబ్దుల్ ఈ పరిస్థితి నుంచి ఐదునిముషాలకి తేరుకుని బల్లమీదకి ఆవేశంతో వంగి, ''వాణ్ణినేను గుర్తుపట్టగలను, ఐదు వేల హాలీలు! పెద్ద ఉద్యోగం బాబూ! మనం ఆ పైసానీ పంచుకుందాం!'' అని ఆనందంగా అరిచాడు.

అతని అరుపు గోడలకి వేళ్ళాడే తుపాకీలకితగిలి ప్రతిధ్వనించింది. ఆశబ్దం గదినుండి నిర్గమించకముందే, చప్పునలేచి నుంచున్నారు. నిమిషం గడిచి తర్వాత, టక టక బూట్లు చప్పుడుచేసుకుంటా ఒక నూతన వ్యక్తి మిలటరీ యూనిఫారంలో వున్నవాడు లోపలికి వచ్చాడు. అతని వెనక ఇంకో హిందూ సేవకుడూ డ్రైవరూ వొచ్చారు.

రహమాన్ సర్దార్వైపు వొంగి ''సలాంజీ, సర్దార్''! అన్నాడు. మిగతా అందరూ ''సలాం'' అన్నారు. సర్దార్ గదిలోకి ఒకసారి కలియజూసి, వాళ్ళ సలాము లందుకొని మళ్ళీ సలాం! అన్నాడు.

సర్దార్తో ఇంకెవ్వరూ రాకపోవడం రహమాన్కి తగని ఆశ్చర్యం కలుగజేసింది. దాదాపు ఏభైమంది రజ్వీ అనుచరులన్నా రావల్సిందని అతని అంచనా. సర్దార్ని కూర్చోమనాలన్న తలంపు అతన్ని ఆశ్చర్యం నుంచి మేల్కొల్పింది. ''సర్దార్జీ! ఇక్కడ కూర్చోండి!'' అన్నాడుతను మర్యాదగా తన కుర్చీ చూపుతూ....

సర్దార్, బల్లముందు కుర్చీలో కూర్చుంటూ, తన చేతిలోని రివాల్వర్ సంచి బల్లమీద పడేసి ముంజేతిమీద చొక్కా కప్పు వెనక్కిలాగి టైంచూసుకున్నాడు. 7.30 గంటలవుతున్నది. సర్దార్ మొహంమీద ఆదుర్దా కనిపించింది. అతను రహమాన్వైపు తీక్షణంగాచూసి '' ఇక్కడ ఎంత మంది వున్నారు? అని అడిగాడు ఆజ్ఞాపూర్వకంగా. రహమాన్ నమ్రతగా ''ఇరవై మంది ఉన్నాం'' అని ఒక నిముషం ఆగి, ''అయితే సర్దార్జీ, మీతో ఎవరూ, రాలేదే?'' అని అన్నాడు.

సర్దార్గంభీరాకృతిలో ఇంకా గంభీరం వచ్చింది. 'వీళ్ళుచాలు ... టైం అవుతోంది. మనం ఈపూటే గోవిందుని పట్టెయ్యాలి. జరూర్హుకుం వచ్చింది. వాడు దగ్గిరలో నారాయ్పాలెంలోనే వున్నట్టు'' అన్నాడు.

ఈ జవాబు రహమాన్కి సబబుగా తోచకపోయినా, గతిలేక వొప్పుకున్నట్టు చిరునవ్వు నవ్వాడు. నవ్వాగిన తర్వాత అతను అబ్దుల్వైపు తిరిగి ''భాయీ? మిగతావాళ్ళు ఆగెడ్డ దగ్గర వుంటారేమో, పిల్చుకురా!'' అని అజ్ఞాపించాడు.

అబ్దుల్ వెంటనే గదినుండి నిష్క్రమించాడు. అబ్దుల్ వెళ్ళగానే రహమాన్ మిగిలిన వాళ్ళవైపు తిరిగి, ''లేవండి, తుఫాకులూ, బ్రెన్గన్స్ రెడీ చేసుకోండి. అన్నీ లారీలోవేసి అందరూ లారీలోనే

ఎక్కండి'' అన్నాడు. మిగతా వాళ్ళందరూ, వెంటనే గబగబాలేచి తమ పనులలో నిమగ్నమైనారు.

సర్దార్‌జీ తన నిడుపాటిగడ్డాన్ని నిలువుగా కుడిచేత్తో దూస్తూ, రహమాన్‌వైపు తిరిగి ఇలా అన్నాడు. ''మీరు చాలా చురుగ్గా పనిచేయాలి!'' రహమాన్ ఆమోద సూచకంగా తలవొంచి తనూ తన తుపాకీ సర్దుకో ప్రారంభించాడు.

ఎనిమిదింటికి పది నిమిషాలుండగా, రజాకార్ల లారీ, నారాయ్ పాలెంవైపు బయల్దేరింది. ముందు ఇరవై మందిని మోసుకుని లారీ, దాని వెనక జీప్ కారులో సర్దార్, రహీమాన్‌తో వచ్చిన సేవకుడూ, ప్రయాణం చేస్తున్నారు. రోడ్డు ఎన్నో ఏండ్లనుండి రిపేరు లేకపోవడం వల్ల చాలా గతుకులుగా వుంది. నక్షత్రాల కాంతి తప్ప ఇంకెల్లాంటి వెల్తురూలేదు. కార్ల తాలుకు దీపాలు సర్దార్ వెలిగించవద్దని ఆజ్ఞాపించి వుండటంవల్ల అవీలేవు. గాడాంధకారం సంయిమంటోంది. జీప్ ముందుసీట్‌లో కూర్చుని వున్న రహమాన్ రోడ్డువంక నిరాశగాచూస్తూ సర్దార్‌ని ఉద్దేశించి ఇలా అన్నాడు ''సర్దార్‌జీ! వాడి కోసం ఇంత పట్టుదల ఏమిటి? హుకుంలో చాలా గందరగోళంగా వ్రాసివుంది. నిజంగా అంత అపాయకరమైన మనిషా వాడు...''

సర్దార్‌జీ, సిగిరెట్ వెలిగించుతూ, రహమాన్ చెప్పింది అలక్ష్యంగా అలకించి, ''వాడు... అంటే? ... ఓ! గోవిందు సంగతా, నువ్వడిగింది? వాడొక అపాయకరమైన మనిషే; సందేహం లేకుండా వాడొక బందిపోటు దొంగ!... వాడు ఇప్పటివరకూ, కనీసం వందమంది మన 'భాయీ' ల్ని చంపివుంటాడు'' అని సిగిరెట్ తాగడంలో నిమగ్నమైనాడు.

రహమాన్ కారు కుదుపులకి తూలుతూ, '' ఇన్నాళ్ళు బట్టి వాణ్ణెందుకు పట్టుకోలేక పోయినారో మనవాళ్ళు? ఆ కాఫిర్ వెధవే నా చేతుల్లోపడితే వాడిక పోయేది అల్లా దగ్గరకే!'' అన్నాడు ఖరారుగా.

సర్దార్‌జీ కళ్ళు ఆకారు చీకట్లో నక్షత్రాల కాంతికి తళ తళ మెరిశాయి. అతను చేతిలో సిగరెట్టు అసహ్యంగానూ, కసితోనూ రోడ్డుమీదికి విసిరికొట్టి ''వాడంత తేలికగా దొరకడనుకుంటాను - కానీ దొరికితేనా?'' అన్నాడు.

రహమాన్ వెంటనే సంభాషణ అందుకొని ''వీడెంత! నా చేతిలో మహా మహా వాళ్లు ఐపోయినారు'' అన్నాడు తనలోంచి తలనూపుతున్న భయాన్ని వెనకటి తన క్రౌర్యంలో దాచిపెట్టి.

సర్దార్ నవ్వాడు. రహమాన్‌కూడా నవ్వాడు పెద్దగా, డ్రైవరుకూడా నవ్వాలని ప్రయత్నించాడు గానీ, ఆకస్మాత్తుగా అతని చెయ్యి బ్రేక్‌మీద పడ్డది. కారు కీచుమని ఆగిపోయింది. ఈ శబ్దంతోపాటే రహమాన్ వెనక్కి తూలాడు సర్దార్ అప్రయత్నంగా రోడ్డుమీదికి చూసేడు. ముందుపోతున్న లారీ కన్పించలేదు. ఎక్కణ్ణుంచో మనుషులు అవసానదశలో మూలుగుతున్న ధ్వని మాత్రం గాఢంగానూ, విషాదంగానూ వినిపించసాగింది.

రహమాన్ చప్పున కారులోంచి దూకాడు. వాడి వెనకాలే సర్దారూ, అతని బంటూ, డ్రైవరూ దిగారు, కంగారుగా! జీపు కారుముందు లైట్ వెలిగింది. ఆ వెలుగులో రోడ్డుమీద, గెరిల్లాలు తవ్విన

గొయ్యిలో రజాకార్ల లారీ తలకిందులుగా పడిపోయిందని వాళ్ళూహించుకున్నారు. ఈ సంగతి తెలిసిన ఐదునిమిషాలకల్లా, వాళ్ళేదో చెయ్యాలనే ఆలోచనలో వుండగానే; నలుగురినీ గెరిల్లా సైనికులు వందమంది, సాయుధులు - చుట్టుకున్నారు వాళ్ళెవరూ తొందరపడలేదు. వాళ్ళలో ముఖ్యుడూ వున్నాడు. బాగా కండలు తిరిగిన శరీరంపై పట్టి బనీనూ, తువ్వాలూ వేసుకున్నాడు. చేతిలో రివాల్వర్ పుచ్చుకొని, రహమాన్ దగ్గరికి వచ్చాడు, రహమాన్‌కి అప్పటికి అర్థమైంది అక్కడ ఏం జరుగుతున్నదో, అతను తన పరిస్థితిని అర్థం చేసుకొని ఏ నిశ్చయానికి రాకముందే, అతన్ని గెరిల్లా వీరుడు లాక్కుపోయి రోడ్డు ప్రక్కన చెట్టుకి కట్టేశాడు.

డ్రైవరూ, సర్దార్‌తో వచ్చిన సేవకుడూ, గెరిల్లాల వైపు చూస్తూ నిలుచున్నారు.

సర్దారు మాత్రం ఏమీ ఆశ్చర్యపడకుండా ఇట్లాంటిదేదో జరుగుతుందని నమ్మినవాడల్లే రహమాన్‌వైపు చూస్తున్నాడు. గెరిల్లా వీరుడు సర్దార్ చెయ్యి గట్టిగా పుచ్చుకుని రహమాన్ దగ్గరికి తీసుకెళ్ళాడు.

కాగడాల వెలుగులో, రహమాన్ పిచ్చివాడిలా, సర్దార్ వెపు చూసాడు. సర్దార్‌కింకా తనగతి పట్టలేదేమో అన్నట్టుంది: అతని చూపు.

సర్దార్‌జీ రహమాన్‌వైపు హేళనగాచూసి, ''రహమాన్: నిన్నేమీ చెయ్యం. నీ క్రౌర్యాలకి నీకు ఈ రోజున శిక్షలేదు ఎందుకనంటావా? నువ్వెళ్ళి నిజాంకి తెలియ జెయ్యాలి, గోవిందంటేఎట్లాంటివాడో: గోవిందు రజాకార్లకి రజాకార్, నైజాంకినైజాం: అని మీ రాజుని హెచ్చరించాలి నువ్వు. నీ కొత్త సర్దార్ ఆ గొయ్యిలో, అల్లాని చేరబోతున్నాడు. కావాలంటేవెళ్ళి పరామర్శించు?'' అంటూ తన పొడుగాటి దొంగగడ్డాన్ని ఊడదీసి రోడ్డుమీద పారేసాడు.

రహమాన్ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయినాడు. తన ఎదుటవున్నది ఎవరు? గెరిల్లా గోవిందు.

*( ఆగస్ట్ 1948 విశాలాంధ్ర (మాసపత్రిక) నుండి)*

# అసలు సమస్య

''సార్, సార్''.....

కందసామి, ఒక్సలోంచే కేకేసేటప్పటికి, వెంకటేశ్వర్లు, చప్పున ఇనపచువ్వ పట్టుకుని బస్స్టెప్ బోర్డుమీద నుంచున్నాడు, కండక్టర్ కసురుకుంటున్నా వినకుండా. బస్ రాయ పేట హైరోడ్డు దగ్గిర ఆగినప్పుడు, ఇద్దరు దిగటం వల్ల వెంకటేశ్వర్లు లోపలికి వెళ్ళి, కందసామిదగ్గిర కూచున్నాడు. కందసామి బస్లో ఇతరులున్నా రనన్నా లెక్కజెయ్యకుండా, వొచ్చీరాని తెలుగులో, వెంకటేశ్వర్లని పలకరించసాగాడు. కందసామికి, అనేక అలవాట్లున్నయ్. అన్నిట్లోకి ముఖ్యమైంది ప్రతి వాక్యాంతంలోనూ 'సార్' అనటం. ఆఫీస్లో మేనేజర్నీ, పెద్ద గుమాస్తాల్నీ పది పదకొండేళ్ళనించీ అట్లా సంబోధించి సంబోధించి వాడికి ఎవరితో మాట్లాడుతున్నా 'సార్' రాకమానదు. అలవాటు కొద్దీ, వెంకటేశ్వర్లు కూడా ఏదో గుమాస్తాపనే చేస్తున్నప్పటికి, ఆఫీస్లోనే తన పనితో పాటు అక్కడి అలవాట్లని గూడా వొదిలి వొచ్చేవాడు కందసామి. కండక్టర్ దగ్గిర టికెట్లు కొంటూ చిల్లర డబ్బులు కోసం జేబులు తడుముకొని, '' ఏదన్నా చిల్లరవుందా సార్! నోటుదా వుంది.... ఇంటిదగ్గిర ఇస్తును'' అని అడిగాడు స్నేహితుణ్ణి. వెంకటేశ్వర్లు మారు మాట్లాడకుండా, చిల్లర డబ్బులుతీసి కండక్టర్ చేతిలో పెట్టాడు. కందసామి, ''తాంక్సు సార్, తాంక్సు... చాల లేటుగా వొచ్చినారేమ్ సార్? ఆఫీస్లో పని కాలేదా?'' అని సానుభూతితో కనుక్కున్నాడు. వెంకటేశ్వర్లు బస్లో, ఇతరులున్నారని బిడియపడుతూ గొంతు తగ్గించి ''అవును!....'' అని మాత్రం అనేసి, కిటికీగుండా బైటికి చూడసాగాడు.

ఇద్దరూ రాయపేట హాస్పిటల్ దగ్గిర దిగి, ఆ పక్కనే వున్న కన్నియప్ప మొదలి వీధిలోకి ప్రవేశించారు మౌనంగా. ఆ వీధిలో నాల్గవ ఇల్లేవాళ్ళిదరికీ చిన్న పెంకుటికొంప. మొత్తం అద్దెకి కందస్వామి దాన్ని యజమానిదగ్గిర పుచ్చుకుని, రెండోవాటా వెంకటేశ్వర్లు కిచ్చాడు. ఇద్దరూ చెరో పదిహేనూ ఇచ్చుకుంటూ ఇరుకైనా అంతకన్న వేరేగతేమీ లేకపోవటంవల్ల కాలక్షేపం జరుపుతున్నారు ఎట్లాగోట్లా.

ఆ ఇంటికి నాల్గుగజాల దూరంలో, ఓ కాఫీ హోటల్వుంది. ఇద్దరు మిత్రులూ, యథాప్రకారం కాఫీ హోటల్లోకి పోయి, కుర్చీల్లో కూర్చున్నారు. పదినిమిషాల బట్టి ఏమీ మాట్లాడక పోవటంవల్ల కడుపు వుబ్బిపోయినవాడిలా కందసామి, తొందర తొందరగా,

'' ఏమిసార్, పేపర్ చూస్తిరా ఇవాళ?'' అని అడిగాడు ఉత్సాహంగా.

''రోజూ చూస్తాను'' అని ముక్త సరిగా సమాధానమిచ్చి వెంకటేశ్వర్లు, సప్లయర్ తెచ్చిన కాఫీ చప్పరించ సాగాడు.

కందసామి, కాఫీ ఓ గుక్క తాగి, ''న్యాయమేనా సార్ ఇది? అని'' హఠాత్తుగా ప్రశ్నించాడు కొంపంటుకున్నట్టు పోజ్ చేసి.

''ఏమిటి న్యాయం కాదంటావు?'' వెంకటేశ్వర్లు ఆదుర్దాగా కనుక్కున్నాడు తన మిత్రుణ్ణి.

''అదేసార్ అదే, పట్నందా. ఆంధ్రులదేనని పేపర్లో చెప్తారు సార్. అది న్యాయమా సార్?'' అన్నాడు కందసామి చాలా సీరియస్‌గా. అతని గొంతులో తమిళులకు ప్రాతినిధ్యం వహిస్తున్న ధీమా, బాధ్యతా గోచరిస్తున్నై.

వెంకటేశ్వర్లు కాఫీ సాంతం తాగి, సిగరెట్ వెలిగించబోతూ, ''అన్యాయమంటావేమిటి? మద్రాసు తప్పనిసరిగా మాదే. అందులో నీకు అనుమానంగూడానా?'' అన్నాడు, అతి శాంతంగా. అతని స్వరంలో వందల యేండ్లకిందట రాజ్యాలేలిన ఆంధ్రరాజుల గర్వం, హక్కూ ధ్వనించాయి.

కాఫీకప్పు దభెలున బల్లమీద పెట్టి కందసామి ''అదేమి సార్ నువ్వా అట్లా చెప్తారు? దినం మద్రాసు చూస్తిరిగదా. మేముదా ఎక్కువవుండే సంగతి మీకు తెలీదా సార్?''

వెంకటేశ్వర్లు పకపక నవ్వి, '' ఇదిగో కందసామి, మీవాళ్ళెంత బూకరించినా మద్రాసు మాత్రం మాదే. మేము చెంగల్పట్టువరకూ నివాసంగా వుంటుంటే, మద్రాసు మీదెట్లా అవుతుందంటావు? పోని ఇటు హిస్టారికల్‌గా చూసినా తెల్లవాళ్ళకి ఈ పట్నాన్ని ఇచ్చిన చెన్నప్ప మా వాడు!'' అన్నాడు.

కందసామి వక్కపొడి కటకట నవులుతో, ''చెంగల్పట్టుదా మీది అంటారు. రేపు, తంజావూరువరకుదా మాది అంటారు సార్. న్యాయం వుండాలి సార్. తిరుపతివరకు మావాళ్లె వుండారని నేను వాదిస్తుమసార్?'' అని ఇంకేమంటావు అన్నట్టు వెంకటేశ్వర్లుని ప్రశ్నార్థకంగా చూశాడు.

వెంకటేశ్వర్లు కక్షగా కందసామివంక చూస్తూ, '' ఆ మాటకొస్తే, మీ వాళ్లు లేనిదెక్కడ? హిమవత్పర్వతం మీదగూడా మీ వాళ్ళ కాఫీహోటల్ వుంది! అంతమాత్రంచేత అదంతా మాదేనంటే ఎవడొప్పుకుంటాడోయ్?'' అంటూ కుర్చీనుండి లేచాడు. కందసామికి వెంకటేశ్వర్లు ఎత్తిపొడుపుమాటలకి వొళ్ళు మండి, చెన్నపట్నం మీకుదా ఎట్లావస్తాదో, చూస్తును సార్! మేముదా, పైత్యం అనుకుంటావా సార్. చూడు మీ రత్తం వీధిలో ఓడాలి ( ప్రవహించాలి) సార్!'' అన్నాడు కోపంగా వెంకటేశ్వర్లువైపు చూస్తూ.

''చూదాంగా'' అని, వెంకటేశ్వర్లు కందసామిని తమిళ రెప్రజెంటేటివ్‌గా భావిస్తూ గడపదిగి, బిల్లు చెల్లించడం మరిచిపోవటంవల్ల మళ్లీ మెక్కి వెళ్లి చిల్లరడబ్బులు అయ్యరుకు ఇచ్చి, ఇంటి ముఖం పట్టాడు. కందసామి కూడా కోపంగానే అతడి వెనకాలే తమిలో తను ఏదో గొణుక్కుంటూ నడుసాగాడు.

## 2

వెంకటేశ్వర్లు తన భార్య కాంతంతో ఆరాత్రి భోంచేస్తున్నప్పుడు ఇలా హెచ్చరించాడు: ''కాంతం, ఆ కందసామిగాడి పెళ్ళాంతో నువ్వేమీ మాట్లాడబోకు ఈక్షణంనించి.''

కాంతం ఆశ్చర్యపడ్డది, ఈ అకస్మాత్తు హెచ్చరికకి. '' ఏమండి? ఏమన్నా పోట్లాడేరా ఆయనతో? పొద్దుటిదాకా బాగానే వుంటిరి గదండి?'' అని అడిగింది ఆశ్చర్యంగా.

''వాడా? వాడు ఒట్టిరోగ్ అనుకో! మద్రాసు అరవవాళ్ళదే అని పోట్లాటకొచ్చాడు నా మీదికి! రక్తం వీధుల్లో ప్రవహించాలిట! - అదంతా నీకెందుకుగాని, నువ్వు దానితో మాట్లాడబోకు.''

''అయ్యో రామా! దీనికేనండి పోట్లాటా? బాగానేవుంది విడ్డూరం!''

''నీకేం తెలుసునే, చదువూ సంధ్యా లేని దానివి? మద్రాసు ఏరకంగా చూసినా ఆంధ్రులదే. నేను బల్లగుద్ది చెప్పగలను. రూపాయికి పదహారణాలపాళ్ళూ, మద్రాస్ తెలుగే. అరవవాళ్లు చచ్చిగీపెట్టినా, మద్రాసు వాళ్ళకి పోదనుకో! ఒక్క ఆంధ్రుడు ప్రాణంతో వున్నా పోట్లాట సాగాల్సిందే!''

''అబ్బ పోనిద్దురూ, మద్రాసు ఎవరిదైతే మనకేం ఒరిగిందండి? ఓ గుడ్డముక్క చవకగా వొచ్చునా, సన్నగా బియ్యపుగింజ దొరుకునా? ఎందుకొచ్చిందండి పొరుగువాళ్ళతో పోరూ?''

''నీ బుద్ధి పోనిచ్చావుగాదు. ఆవిడతో ఇక ఎప్పుడన్నా నువ్వు మాట్లాడ్డం చూశానా, వీపు చెడుతుంది'' అని వెంకటేశ్వర్లు, విస్తరి దగ్గిరనించి లేస్తూ, కోపంతో అన్నాడు.

''నాకేం లెండి, మానేస్తాను'' - కాంతం, ఏడుపు గొంతు పెట్టూ ఈ మాట అనేసి,వంటింటోంచి బయిటికి పోయింది.

వెంకటేశ్వర్లు వసారాలో పక్కపరిచి పడుకుని ఆంధ్రులకి మద్రాసు రావటానికి గల ఆస్కారాన్ని గురించి ఆలోచించ సాగాడు.

## 3

ఆ రోజు మొదలు కందసామి, వెంకటేశ్వర్లు ఒకళ్ళకొకళ్ళు ఎదురుపడ్డా కొరకొరా చూస్తూ, తప్పుకొని తిరగసాగారు. ఇద్దరిలోనూ, ద్వేషం కూడుకట్టుకొని బలపడుతోంది అనుక్షణమూ. దీనికి తోడు అగ్నిలో ఆజ్యం పోసినట్లు కాంతమూ, కందస్వామి భార్య వళ్ళియమ్మా మధ్యమధ్య కీచులాడుకుని, ద్వేషాన్ని పెంచసాగారు. అయితే, వెంకటేశ్వర్లుకు ఒక భయంమాత్రం వుంటూ వొచ్చింది. కందసామి తనను ఇల్లు ఖాళీచెయ్యమంటాడేమోనని. అయితే, కందసామి అలా చెయ్యలేదు. చెయ్యకపోవడానికి ఓ కారణం వుంది. వెంకటేశ్వర్లు అద్దె సరిగ్గానే ఇస్తూ వొచ్చాడు, అప్పటి వరకూ. అట్లాంటప్పుడు అకారణంగా ఇల్లు ఖాళీ చెయ్యి అంటే, తన్నటానికి సిద్ధపడతాడేమో అని కందసామి భయపడ్డాడు. పైకి కందసామి గంభీరంగా మాట్లాడినా, రక్తం ప్రవహించాలని ప్రగల్భాలన్నా క్రియకు సాధువూ, పిరికీని. నెల గడిచిపోయింది ఇట్లాగే. గుమాస్తాల జీవితం ప్రతి నెలా సాఫీగా జరగదు. ఏదో అనవసరపు ఖర్చులో అత్యవసర ఖర్చులో తగుల్తాయి ఒక్కొక్కప్పుడు. వెంకటేశ్వర్లు ఎంత సర్ది వాడినా అద్దె సమయానికిద్దామంటే పడకవొచ్చింది ఆ నెల. భార్యని పురిటికి పంపాల్సివొచ్చింది. పైగా హోటల్ భోజనానికి పెట్టుబడి పెట్టాల్సిన అవసరం పట్టింది. కందసామి చేత అడిగించుకోకుండానే, అద్దె ఇవ్వాలని విశ్వప్రయత్నం చేశాడు, వెంకటేశ్వర్లు. ఎంతోమంది స్నేహితుల్ని చేబదులు అడిగాడు. దొరకలేదు. ఎట్లానా భగవాన్! అని దిగాలు పడిపోయి, ఇక ఏమైనా సరేనని నిర్ధారణ చేసుకుని ఊరుకున్నాడు వెంకటేశ్వర్లు.

అయితే, వెంకటేశ్వర్లు అనుకున్నట్లు కందసామి అద్దెకోసం నిలదియ్యక పోవటం చాలా ఆశ్చర్యం కలిగించింది. ప్రతిరోజూ ఇవ్వాళ వుంది యుద్ధం అనుకోటం, అట్లా కాకపోవటం జరిగింది.

ఇక రేపు ఫస్టుతారీకు అనగా, వెంకటేశ్వర్లు ఆ వేళ సాయంత్రం ఆలస్యంగా ఇంటికి వొస్తూ గడప ఎక్కుతుండగా, కందసామి చాలా దిగాలు మొహం వేసుకుని, అరుగుమీద కూర్చుని ఉన్నవాడల్లా వెంకటేశ్వర్లుని చూడగానే లేచి, ''సారే ఒకమాట చెప్తాను వస్తురా?'' అని దిగులుగా పలకరించాడు.

ఇంటి బాడిగ గురించే కాబోలు. తన పరువు ఈ ఒక్క రోజు నిలబెడితే, రేపు జీతం వొచ్చునే? పారేయొచ్చునే! అన్నాళ్ళు ఆగినవాడు ఈ ఒక్క రోజు ఓపిక పట్టకపోవటం కుట్ర కాకపోతే, రేపు తనకి జీతం వొస్తుందని వాడికిమాత్రం తెలీదు? అని ఐదు నిమిషాలపాటు ఆలోచిస్తో ఆగిపోయినాడు, మాటామంతీ లేకుండా.

'' ఏమి సార్ యోచిస్తుంటివి? రా సార్. 2వ తారీకున ఇల్లు ఖాళీ చెయ్యాలి సార్'' అని మెల్లిగా జ్వరపడ్డవాడిలా అన్నాడు, కందస్వామి.

వెంకటేశ్వర్లు నిలువునా నీరైపోయినాడు. తను అనుకున్నదంతా అయింది. నుంచున్న పళంగా ఇల్లు ఖాళీ చెయ్యమంటే తను ఎక్కడికకి పొయ్యేట్లు? ఛట్, ఇట్లా కానేకాదు. ఇల్లు ఖాళీ చెయ్యకపోతే ఏం చేస్తాడు వీడు? అదీ చూదాం అనుకుంటూ, ద్వేషం, పౌరుషం కలగలిసిన గొంతు పెట్టి ''నేను ఖాళీ చెయ్యను: ఏం చేస్తావో చెయ్యి'' అన్నాడు.

కందసామి, అరుగుదిగి వెంకటేశ్వర్లు దగ్గిరకి వొచ్చి భుజంమీద చెయ్యివేసి, ''అదికాదు సార్. మన ఇంటివాడుండాడే మర్వాడీ, వాడు మొన్న బాడిగకి వొచ్చినాడు సార్. వాడికిదా నేను రెండుమాసాల బాడిగ బాకి ఉంటిని. ఏం చేస్తును? మీరే చెప్పుమి. మా భార్యకి జ్వరం వొచ్చినాది సార్. మీరు ఇచ్చిన డబ్బుగూడ డ్యాక్టర్‌కిస్తిని. అందుకుదా మర్వాడీ, నన్ను గూడదా ఇల్లు ఖాళీచెయ్యమని చెప్పేసినాడు సార్. నేనుదా ఏంచేస్తును సార్?'' అన్నాడు చాలా ఖిన్నుడై కన్నీళ్ళు పెట్టుకుంటో.

వెంకటేశ్వర్లుకీ కళ్ళవెంట నీళ్లు వొచ్చినై. అతడు ధైర్యంగా కందసామి, చెయ్యిపట్టుకుని ఊపుతో ''భయపడకు కందసామి. మనం ఇద్దరం కలసి నిలబడదాం. మనని ఖాళీ చెయ్యమంటానికి వాడికి ఎన్ని గుండెలో నేను చూస్తాను!'' అన్నాడు.

''వొద్దుసార్, వొద్దు. వాడికి మనకి జగడం ఎందుకుసార్? నేనుదా నిన్ననే వేపేరిలో వేరే పూరిల్లు చూస్తిని. రెండు భాగాలుదా వుండాది. మనం అక్కడికి పోతుమా?'' అన్నాడు కందసామి, సహజంగా దరిద్రులలో ఉండే సహజమైన మానవత్వాన్ని ప్రదర్శించి.

వెంకటేశ్వర్లుకి, నిజంగా చాలా జాలీ దుఃఖమూ వొచ్చింది. అనవసరంగా కందసామితో పేచీ పడ్డందుకు విచారిస్తూ ''కందసామి, నీతో ఆవేళ పోట్లాడినందుకు ఏమీ అనుకోకు. మద్రాసు నీదీ కాదు, నాదీ కాదు! డబ్బున్న వాడిది! రేపే మనం ఇంటి బాకీ అంతా ఇచ్చేసివెళ్ళిపోదాం!'' అన్నాడు, కృతజ్ఞతావేశంతో బొంగురుపోయిన గొంతు సవరించుకుంటో.

కందసామి, ''నిజంసార్. మీరు చెప్పినది నిజమే సార్, డబ్బు ఉన్నవాడిదే సార్ పట్నం'' అన్నాడు, యావత్తు తమిళ ప్రాతినిధ్యాన్ని మరిచిపోయి.

***(అక్టోబర్, 8, 1948 – తెలుగు స్వతంత్ర)***

# దేశమును ప్రేమించుమన్నా!

సామాన్యుడు దేశభక్తికోసం పెద్ద బజారంతా వెతికాడు. అంతా బ్లాకుమార్కెట్టు. ఎక్కడా దొరకలేదు. అతను దేశభక్తుణ్ణి వెతికిపట్టుకుని అడిగాడు, ఎక్కడ దొరుకుతుందని. దేశభక్తుడు ఖద్దరు టోపీ చేతిలోకితీసుకుని సామాన్యుణ్ణి అనుమానంగా ఒకసారి ఎగాదిగా పరకాయించి చూసి, 'నువ్వు ఏ ఇజం' అని అడిగాడు. సామాన్యుడు 'నేను ఏ ' ఇజమూ' ఎరగనే!' అన్నాడు అమాయకంగా. అతనికి ఆశ్చర్యంగా ఉంది ఆ ఇజం ఏమిటోనని. దేశభక్తుడు శాంతించిన హృదయ స్పందనానికి గుర్తుగా ఖద్దరు టోపీ నెత్తిన బెట్టుకుని, 'అయితే చిన్న బజారు స్వదేశవస్తు విక్రయశాలలో దేశభక్తి కంట్రోలు రేటుకి అమ్ముతున్నారు. అక్కడికి వెళ్లు, దొరుకుతుంది' అని చెప్పి వెళ్లిపోయినాడు.

సామాన్యుడు దేశభక్తికి మూల్యం తెలియక ఇదివరకే అవస్థపడ్డాడు గాబట్టి స్వదేశ వస్తువిక్రయశాలలో ప్రవేశిస్తూనే పది రూపాయలనోటు చేతబుచ్చుకుని విక్రయశాల యజమాని త్యాగశీలం గారిని కనుక్కున్నాడు ' ఓ సవాశేరు దేశభక్తి ఎంత' అని.

త్యాగశీలంగారు, ఇంకెవ్వరికో అప్పుడే 'దేశసేవ' ఇచ్చి, సామాన్యుడి వంక చూసి, ' ఇంకా తెలీదుటయ్యా దేశభక్తి ధరా?' అని గదమాయించాడు.

'తెలీకనే కదండి అడుగుతూంటా!' అన్నాడు సామాన్యుడు కాస్త లజ్జపడి.

'నువ్వు వొడికిన నూలు వీశెడు తెస్తే, సవాశేరు దేశభక్తి ఇస్తాం. అదిగో బోర్డు రాసి లేదుటయ్యా? చూడు కావలిస్తే.

'బోర్డు చూశానండి. ఆ అక్షరాలేవో బోధపళ్లేదు లెండి. అయినా, నాకు నూలు వొడికే తీరిక లేదే. నాకు దేశభక్తి లేనట్టేనా?' సామాన్యుడు బాధగా, ఆశ్చర్యంతో కనుక్కున్నాడు.

'మంచి బేరమే తెచ్చావయ్యా మహానుభావా! హిందీబోర్డు తెలీదంటున్నావు. నూలు వొడక లేనంటున్నావు, పదపద' అన్నాడు త్యాగశీలం గారు చిరాకుగా, సామాన్యుడు తలగోక్కుంటూ కొంప చేరుకున్నాడు!

***(జనవరి 28, 1949, తెలుగు స్వతంత్ర)***

# ఆదర్శాల చిమ్మ చీకటి

ఆ పక్కనే కాలవ. ఆ కాలవ ప్రవాహాన్ని దాటివొచ్చే ప్రయత్నంలో పగలల్లా కమ్యూనిస్టు సైన్యాలు విఫలులైనా, పొద్దు గూకిన కొద్దీ విజయోన్ముఖులైనారనే ప్రభుత్వ సేనాధిపతులు అంచనా వేసుకున్నారు. దూరంగా డేరాల్లో కూచుని అంచనాలైతే సులభంగా వేస్తారు కాని, సైన్యాలుపడే బాధ అర్థమౌతుందా వాళ్ళకి? దూరంగా క్షితిజంనించి చీకటి చైనాభూభాగాన్ని ఆవరిస్తోంది. దానికి తోడుగా చలికూడాను. ఆ కాలవకి ఉత్తరపుగట్టున విప్లవోన్మత్తులైన చైనా ఎర్రసైన్యం; దక్షిణపు గట్టున ఉసూరు మనుకుంటో ప్రతిఘటన సాగిస్తున్న చైనా ప్రభుత్వ సైన్యం.

★ ★ ★

చీకటిలోంచి అవతలిగట్టున పేలే ఫిరంగుల దారుణాగ్నివర్షం కనిపిస్తోంది. దక్షిణపుగట్టున ఏవో పిచ్చిమొక్కల పొదల చాటున పడిపోయి దొర్లుతున్నాడు ఆ సైనికుడు. చీకట్లో ఖాకీ డ్రెస్సు నల్లగా, పిశాచికి మల్లే అతన్ని ఆవరించుకుని అతనికి అప్పజెప్పబడిన కర్తవ్యాన్ని, బలవంతంగా నిరూపిస్తోంది. అయినా అతను పక్కకు పడిపోయినాడు. అతను పడిపోయిన నేల తేమగా ఉంటానికి కారణం రక్తమూ కావొచ్చు; మంచు గాని కావచ్చు. స్పృహ లేకపోవటంవల్ల తుపాకీ దూరంగా పడివుంది. లేచి నిలబడే ఓపిక కొద్దోగొప్పోవున్నా, వీపుమీద వున్న భారమైన సామాగ్రివల్ల ఆ వోపిక నశిస్తోంది.

'దాహం...' చీకట్లోంచి, భయంకరమైన మారణాస్త్రాల మోతలనించి తప్పించుకుని, అతని గొంతులోంచి జీరగా, బాధగా ఆ ఒక్కమాట వెలువడింది. అతని ఊహలన్నీ మెల్లగా మేల్కొంటున్నై. తానున్నది యుద్ధరంగంలో గదూ?... తన దాహం సంగతి ఎవరికి పట్టింది? అయినా రెండు రోజుల క్రితం ఆహారం సప్లయి ఆగిపోయిందని చెప్పారు. అయితే ఈ యుద్ధాన్ని ఆపెయ్యగూడదూ?.... ఎత్తిన తల చప్పున వంచాడు. ఒక ఫిరంగిగుండు పొదల్లోగుండా దూసుకుని చెవి దగ్గరగా పోయింది. అదృష్టమే.

కాలులోంచి దూసుకుపోయిన గుండు. బాధగూడా ప్రారంభమైంది ఆలోచనలకేనా వ్యవధివ్వకుండా. మూలుగుతున్నాడు.

'ఎవరది...?' పక్కనే ఎవరిదో కొత్త స్వరం విని ఉలిక్కిపడ్డాడు. ' ఎవరు బాబూ, మీదగ్గిర వాటర్ బాటిల్ వుందా?' దీనంగా, దాహంగా వినపడ్డది నూతనుడి స్వరం. ఎడంవైపు రెండు గజాల్లో ఉన్నాడేమో? వెంటనే చేరుకున్నాడు.

'ఎక్కణ్ణించి మాట్లాడుతున్నావు?' తన స్వరం వినపడుతుందో లేదో అనుమానంగానే వుంది.

'ఇక్కడే...' దగ్గరగా దొర్లుకుంటూ వొచ్చింది ఒక మానవశరీరం. ఆ కటిక చీకట్లో ఆకారాన్ని మాత్రమే పోల్చుకోగల్గాడు గాని ఇంకేమీ కన్పట్టంలేదు.

'నా దగ్గరా నీళ్ల అయిపోయినై. నేను అల్లాడుతున్నాను దానికోసమే. ఇక మరీ ప్రాణంమీదికి వొస్తే నెత్తురు తాగాల్సిందేమో...' విసుగ్గా, చిరాకుగా అన్నాడు మొదటి సైనికుడు.

రెండవ సైనికుడు నవ్విన నవ్వు ఫిరంగి మోతలో వినిపించలేదు.

'నువ్వు ఏవూరు?' నవ్వాపి, కొత్త సైనికుడు కనుక్కున్నాడు తన పరిచితుణ్ణి.

నాదా? టీనేసీన్ పక్కనే చిన్నగ్రామంలే. దానికేంగాని, నువ్వు శుభ్రంగా మాట్లాడుతున్నావు గదా, పడుకున్నావేం తుపాకీ కాల్చకండా?' మొదటి సైనికుడిలో, ఇంకా ప్రభుత్వభక్తి నశించలేదు. నీరసంగా పనిచేస్తోంది రక్తంలో

' ఏం చెయ్యనుమరి? తిండీ తిప్పలూ లేకుండా, తుపాకీ ఎట్లా లేస్తుందంటావు?'

తూర్పున చంద్రబింబం మందమైన కాంతితో ఉదయిస్తోంది. విజయాసక్తితో ఇరుపక్షాలూ చేస్తున్న మారణహోమం కొద్దిగా కనిపిస్తోంది.

'మేమంతా చెయ్యగాలేనిది నీకే వొచ్చిందా అంతనీరసం?' మొదటి సైనికుడు కొంచెం మందలింపుగా విమర్శించాడు. నూతనుడి మొహంమీద నవ్వు మందమైన వెన్నెట్లో కనిపించింది.

'అవును గాని, ఎన్ని నెలలనించి జీతం ఇవ్వటం లేదు మనకు, తెలుసా? ఇంటిదగ్గర నా వాళ్ల తిండి లేక మాడిపోతోంటే, నేను ఏ ఆదర్శంకోసం యుద్ధంచెయ్యాలో నా కర్థం గావటం లేదు'.

రెండవ సైనికుడికి ఈ మాటలు తుపాకీ గుండ్లల్లే తగిలాయి. నిజమే! తన ఇద్దరు పసిపిల్లలూ, భార్యా, ఏమైనారో.... ఆరునెల్ల జీతంరావాలి. ఎందుకని జీతం ఇవ్వరు? అమెరికానించి అన్ని డాలర్లు వొచ్చినైగా!... అతని ఆలోచనలు పైకి పాక్కినై.

'అయితే ఇన్నాళ్ళనించి జీతం ఎందుకని ఇవ్వటంలేదంటావు?' ఈ ప్రశ్నవెనక శారీరకబాధ చేత, మూలుగు, నీరసం, వొణుకూ ధ్వనించినై. బహూశా రక్తం చాలినంతలేదు అతని శరీరంలో.

' ఏమో? నాకు మాత్రం తెలుసా? అయితే మనరెజిమెంటు సోల్జర్లు చాలామంది ఒకమాటన్నారు!' ఆగిపోయినాడతను, వాళ్ళపక్కనించి రెండు టాంకులూ, ఇరవైమంది సైనికులు పరిగెత్తడంవల్ల! పైగా పైన విమానాల రొద జాస్తయింది.

' ఏమన్నారు?' ఆదుర్దాగా ఆసక్తిగా కనుక్కున్నాడు అవసానదశలో ఉన్న మొదటి సైనికుడు. చిట్టచివరగా ఏదో కొత్త సంగతీ, అందులో నూతన జీవిత సమస్యకు సంబంధించినదీ ఐన సంగతి వినాలనే కోర్కె అతనిలో పనిచేస్తోంది.

'నేను చెప్పేది అందరికీ తెలిసిన రహస్యమే. నీకు తెలీదంటే ఆశ్చర్యంగా ఉంది. జీతం మొత్తాలేమో, సైన్యాధికారులకి వొస్తున్నాయి. కాని సైనికులకి రావటం లేదు.'

'అంటే.'

'అంటేనా? అంటే ఈ కర్నల్సూ. జనరల్సూ మింగుతున్నారు.'

'అయితే మనం యుద్ధం చెయ్యడం ఎందుకూ?'

'అదే నిన్నటిదాకా నాకూ అర్థంకాని విషయంగా ఉండేది. ఇవ్వాళ బోధపడ్డది.'

'ఏం తెలిసింది?' మొదటి సైనికుడి గొంతు సరిగా వినపట్టంలేదు. మరణావస్థపడుతూనే తను ఎవరికోసం మరణిస్తున్నాడో తెలుసుకోవాలని కుతూహల పడుతున్నాడు.

'వ్యాపారస్థుల లాభాలూ, భూస్వాముల భూములూ సురక్షితంగా ఉండేందుకూ, జనం ఆకలితో మాడి చచ్చేందుకున్నూ.'

'నిజమా?' మృత్యుముఖంలో అర్థమై, కానీ మాటలకి ఆశ్చర్యమూ కోపమూ కలిసిన సమాధానం ఇచ్చి మొదటిసైనికుడు కళ్లు మూశాడు.

రెండవ అతనికి ఈ సంగతి తెలీదు. అతను చెప్పుకుపోతున్నాడు. 'నిజమా? నువ్వూ నేనూ బతుకున్నంతనిజం. అందుకనే మన సైన్యాలు ఎక్కడికక్కడికే ఓడిపోతున్నాయి... ఓడిపోతున్నాయా? పొరపడ్డాను. అవతలి సైన్యాలతో కలిసిపోతున్నాయి. ఇటు విను మిత్రమా! మన రెజిమెంటుకూడా ఇంకా రెండు గంటలలో అవతల వాళ్ళతో కలిసేట్టుంది....' ఉత్సాహంతో అన్నాడు అతను.

సమాధానం గాని, వింటున్నట్టు సంజ్ఞగాని లేక పోయ్యేప్పటికి మాట్లాడుతున్నవాడు అగిపోయి శవంవైపు చెయ్యిచాపి చూశాడు. చల్లగా తగిలింది.

'పాపం....' అని మాత్రం అనేసి అతను తన రిస్టువాచిలో మెరుస్తున్న అంకెలవంక చూశాడు. ఎనిమిదిన్నర అవుతోంది. ' ఇంకా గంట వ్యవధి ఉంది... కార్యక్రమానికి' అంటూ, పొదలపక్క నించి ఆ సైనికుడు కాలవవైపు పాకుతూ మసక వెన్నెట్లో కలిసిపోయాడు.

***(ఫిబ్రవరి 4, 1949, తెలుగు స్వతంత్ర)***

# కోరికలే గుర్రాలయితే

1943లో రాయల్ఇండియన్ విమానశాఖలో పనిచేస్తూ పసిఫిక్ మహా సముద్రంలో ఒక విమాన ప్రమాదంలో ఎవరికీ తెలీకుండా పోయాం ఇద్దరం. మేము సముద్రంలో పారాఛూట్లతో దిగి, చాలా దూరం ఈది, కనపడ్డ ఓ దీవికి చేరుకున్నాం. ఆ దీవి నిర్మానుష్యంగా వుంది. బహుచిన్నది. ఆ దీవిలోంచి బైటబడి నాగరిక ప్రపంచాన్ని చేరుకోవాలని మేము చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయినై. నాల్గువైపులా ఘోషపెట్తూన్న మహాసముద్రమయ్యె! మేము ఏ దిక్కున ఉన్నామో తెలిసినా, ఎటు పోవాలో తెలీటం లేదు. ఇక నిరాశచేసుకుని, ఇద్దరం మిత్రులమూ, ఆ దీవిలోనే జీవితాన్ని గడపడానికి నిశ్చయించుకున్నాము. ఏదైనా ఓడ ఎప్పటికన్నావొస్తే బైటపడ వచ్చనే ఆశ మా ప్రాణాల్ని ఎప్పటి కప్పుడు నిలబెడ్తూవొచ్చింది. ఆ దీవిలో దొరికే అడవి మేకల్నీ, దుంపల్నీ తింటూ, మా పారాఛూట్లనే తాత్కాలికంగా డేరాలల్లే బిగించి వాడుకుంటూ, కొద్ది కాలానికిగట్టి నివాసాలేర్పరుచు కున్నాం. ఇట్లా ఎన్నేళ్ళు గడిచాయో తెలీదు. ఒకరోజు ఉదయం నా స్నేహితుడు తన దగ్గిరి ఉన్న దూరదర్శినితో మామూలుగా సముద్రం వేపు చూస్తున్నవాడు, ఎగిరి గంతేసి, 'రాజా, రాజా, ఇటుచూడు. ఏదో ఒక ఓడ ఇటువేపే వొస్తోంది. మనం కాస్త సంజ్ఞచేస్తే మనని గుర్తించవొచ్చు' అన్నాడు చాలా ఆదుర్దాగా. అట్లాగే ఇద్దరమూ, రెండు గుడ్డల్ని జండాల్లాగా పైకి ఎగరేసి ఊపాము, రెండు గంటలసేపు. మా అదృష్టంకొద్దీ, ఆ ఓడ దీవికి రెండు ఫర్లాంగుల దూరంలో ఆగి, మా వైపు చిన్నపడవ నొకదాన్ని పంపింది. నా మిత్రుడు ప్రకాశరావు దూరదర్శినితో ఆ ఓడ ఏ దేశపుదో పరీక్షిస్తూ సంతోషంతో వెర్రికేక వేసాడు.

' ఏమిటిరా అది?' అని అడిగాను వాణ్ణి.

'నువ్వేచూడు' అంటూ దూరదర్శిని నాచేతికిచ్చాడు. అట్లానే దూరదర్శినిలో చూశాను. ఆ ఓడమీద ఇంగ్లీషులో, సంస్కృతంలో, తెలుగులో, 'మాంచాల' అని పెద్ద అక్షరాల్లో ఉన్నది. ఆ పేరుకింద ' ఆంధ్రారిపబ్లికు' అని చిన్న అక్షరాల్లో వ్రాసివుంది. ఓడమీద కొత్తరకం జండా ఒకటి ఎగురుతోంది.

తర్వాత అరగంట కల్లా మా సరంజామాతో ఓడలో అడుగుపెట్టాం. ఓడలో వాళ్ళంతా ఆంధ్రులు; చెదురుగా ఒకరిద్దరు యూరోపియన్లు, ఇద్దరు తమిళులూ, ఒక గుజరాతీవాడూ, ప్రయాణం చేస్తున్నారు. ఓడలో అడుగుపెట్టిం దగ్గిరనించీ, తెలుగుదేశంలో ఉన్నట్టే ఉంది. కొంతసేపటికి మాకొక పెద్దమనిషిపరిచయమైనాడు. ఆయన విశాఖపట్నం హార్బర్లో ఏదో ఉన్నతోద్యోగిట. మేము ఆదుర్దాగా ప్రశ్నలవర్షం ప్రారంభించాం. ఆయన మా దురదృష్టం విని చాలా విచారపడ్డాడు. బహు ఆదరంగా సమాధానాలివ్వసాగాడు.

'ఇండియాకు స్వాతంత్రం వొచ్చిందా?'

'ఆహా!'

'బ్రిటిష్ వాళ్లు వెళ్ళిపోయారా? మన నాయకులు దేశం ఏకఖండంగా ఉండాలన్నారు గదా? ఆంధ్రారిపబ్లికు విడిగా వుంటానికి ఎట్లా అంగీకరించారు?'

'నెమ్మదిగా వినండి. మన నాయకులు స్వాతంత్ర్యం వొచ్చాక చాలరోజులవరకు, ఆంధ్రరాష్ట్రానికే అంగీకరించారు గాదు. ఆంధ్రులు ఒప్పుకోక చివరికి అన్ని రాష్ట్రాలూ విడిపోయి, ప్రత్యేక రిపబ్లికులైనాయి.'

'అయితే జిన్నాగారి సంగతేమిటి?' ప్రకాశరావు అడిగాడు ఉత్సాహంగా.

'మరిచిపోయినాను. వాళ్లు మొదటనే విడిపోయారు, పాకిస్తాను సంపాయించుకుని.'

'ఇన్ని ముక్కలుగా దేశంవిడిపోతే, బలహీనంగాదూ?' నాది మొదట్నించీ ఇదే ధోరణి. ఆఫీసర్ గారు నవ్వాడు భావగర్భితంగా.

'పొరపాటు పడుతున్నారు. విడిపోయినంత మాత్రాన, కత్తితో నరికినట్టు ముక్కలైందనా అర్థం? ఏ రిపబ్లికు కారిపబ్లికు బలీయమై మిత్రత్వసంధులు చేసికొని, చాలా బలమైన కేంద్రాన్ని స్థాపించుకున్నాయి. ఇప్పుడు భారత దేశం ప్రపంచంలోనే బలమైన రాజ్యాల్లో రెండవది'.

'అయితే యునైటెడ్ రిపబ్లిక్స్ ఆఫ్ ఇండియా అయిందన్నమాటా?' ఇంకా వందల ప్రశ్నలు వేశాం. ఆయన అన్నిటికీ ఓపికగా ఒక్క జవాబే ఇచ్చాడు, 'మీరు ఆంధ్రదేశంలో దిగాక అనేక ప్రశ్నలు తీరిపోతాయి' అని.

## 2

కాకినాడ హార్బరులో ఓడ దిగాం. అది కాకినాడ హర్బరని ఓడలోవాళ్ళు చెప్పబట్టి తెలిసింది. పెద్ద పెద్ద మేడల్నీ, ఫ్యాక్టరీల్నీ, నవీన పద్ధతితోటి నిర్మించబడ్డ హార్బరునూ చూసేప్పటికి ఇదేనా కాకినాడ అనిపించి సంతోషంతోటి కంపించి పోయాం. మేము దిగీదిగటంతో, కస్టమ్సు వ్యవహారాలు ముగించుకుని ఊళ్ళోకి బయల్దేరాం. పోతూపోతూ మా ఓడ పరిచయుణ్ణి కొన్ని వివరాలడిగాం. ఆయన మా ఆదుర్దాకి నవ్వి 'మీ రేమీ కంగారుపడవద్దు. మీరే సమాచారం కావాలన్నా ఊళ్లో స్టేట్ ఇన్ఫర్మేషన్ బీరో మీకు సహాయంచేస్తుంది. వెళ్ళండి' అన్నాడు.

సిటీలో అడుగు పెట్టిందగ్గిరనుంచీ మా పని కొంచెం తికమక అయినా, ప్రతిపోలీసు, మాకు చాలా సహాయంచేశాడు. 'మేము అడిగిన ప్రతి వివరమూ చెబుతూ, విసుక్కోకుండా మాకు దోవలు చూపాడు. మా ఆశ్చర్యానికి మేరలేదు! ఎంతమార్పు! ఇదివరకు పోలీసులంటే 'దండన' అని అర్థం. ఇప్పుడో - ప్రజాసేవకుడు! అంతే కాదు. కాకినాడ నిండా ట్రాములు, బస్సులు; రోడ్లన్నీ, ప్రతిసందుగూడా సిమెంటుతో నిర్మించారు. ప్రతిమేడా సిమెంటు కాన్క్రీటుతో, ఉక్కుతో నిర్మించారు. పదంతస్తుల్నించి, ఏభై అంతస్తులకి పెరిగిపోయాయి మేడలన్నీ. ఇద్దరు మిత్రులమూ, ఓహో అనుకున్నాం. అల్పాహారం అయింతర్వాత, స్టేట్ బస్సులో ఇన్ఫర్మేషన్ బీరోకి వెళ్ళాం.

అదొక పెద్ద ఇరవై అంతస్తుల భవనం. ప్రభుత్వ కార్యాలయాలన్నీ ఈ భవనంలోనే ఉన్నాయి. ఈ భవనంపైని కూడా మేము ఓడమీదచూసిన లాంటి జండా ఒకటి ఎగురుతోంది. మాకు ఆ జండా ఏమిటో తెలీక, ఇన్ఫర్మేషన్ బీరో ఆఫీసర్ని అడిగాం. ఆయన నెమ్మదిగా శాంతంగా చిరునవ్వునవ్వి, గర్వంగా 'అది మన తెలుగుజండా, మన రిపబ్లికు ఆమోదించిన తెలుగు పతాక' అన్నాడు.

నా మటుకునేను, తెలుగుతనంతో, నా జండా అనే మమకారంతో ఆపతాకముందు మోకరిల్లాను. నా పూర్వుల్ని, నా ఆప్తుల్ని, నాగతవేలయేండ్ల చరిత్రనీ కళ్ళముందు చూసినట్టయి, కళ్ళవెంట నీళ్ల తిరిగాయి. ప్రకాశరావుకూడా మమకారంతోటి, తెలుగుతనం తోటీ కంపించి పోవటం చూశాను.

ఇన్ఫర్మేషన్ ఆఫీసర్ మా చరిత్రంతా విని, 'ఇప్పుడు మీకే భోగట్టా కావాలో చెప్పండి. సాధ్యమైనంతవరకు మీకు సాయపడగలను' అన్నాడు.

'తెనాల్లో మా నాన్నా అన్నయ్యా వాళ్లూ ఉండాలి. ఇప్పుడు వాళ్లున్నారో లేదో, ఉంటే ఎక్కడ ఉన్నారో కాస్త చెప్పండి కనుక్కుని' అని అడిగాను. ప్రకాశరావు 'మావాళ్లు బెజవాడలో వుండాలి. వాళ్ల సంగతి కావాలండి' అని అడిగాడు.

ఆఫీసర్‌గారు ఒకక్షణం ఆలోచించి, మా దగ్గిర మావాళ్ల పేర్లూ అవీ అడిగి తీసుకుని, 'మీరు ఇక్కడ వుండండి. తెనాలికీ, విజయవాడకీ ఫోన్‌చేసి కనుక్కుంటాను. మీ వాళ్లుంటే, అక్కడ ఇన్ఫర్మేషన్ ఆఫీసులకి పిలిపిస్తాను. మీరే సరాసరి మాట్లాడుకోవచ్చు' అని లోపలిగదిలోకి వెళ్లాడు. మేము; ఆయన వొచ్చేవరకూ, గదిలో పరిచిన రత్నకంబళం ఖరీదూ, గోడలకు వేళ్లాడుతున్న విలువైన సిల్కు తెరల ఖరీదులూ అంచనావేస్తూ కూర్చున్నాం.

అరగంటకల్లా ఆయనవొచ్చాడు. రావటం తోటేనావైపు తిరిగి 'మీ వాళ్ళు తెనాలిలోనే ఉన్నారండి. మీనాన్నగారు కాలంచేశారుట. మీ అన్నయ్యగారున్నారు, వారితో పదినిమిషాల్లో మాట్లాడవచ్చు ఫోనులో' అనేసి, ప్రకాశరావు వైపు తిరిగి, 'మీ తమ్ముళ్ళిద్దరూ, చెల్లెలూ, ఆమె భర్తా విశాఖపట్నంలో ఉన్నారట. మీ పెద్దతమ్ముణ్ణి మీతో మాట్లాడ్డానికి పిలిపిస్తున్నాను ఫోనులో' అన్నాడు. మాకు ఇదంతా నిజమో, కలో బోధపడలేదు. ఇంత కొద్ది వ్యవధిలో ఇన్ని సంగతులు ఎట్లా తెలిశాయా అని నా నరాలు ఆశ్చర్యంతో కొంకర్లు పోతున్నాయి. ఇదివరకు యూరోపులో, అమెరికాలో ఇట్లాంటి సౌకర్యాలుండేవని వినేవాణ్ణి పదినిమిషాలకల్లా లోపల గదిలోకి వెళ్లాం. ఆ గదంతా నాకేమీ అర్థంకాని యంత్రనిర్మితంగా ఉంది. ఆఫీసర్ గారు మా ఇద్దర్ని రెండు ఫోనుల దగ్గిరకి తీసుకెళ్లి కూర్చోపెట్టి ప్రకాశరావు చేత 'విశాఖ 023' నెంబర్ డయల్‌చేయించి, నా చేత తెనాలి 023' డయల్‌చేయించాడు. రిసీవర్ చేతికి తీసుకున్నాను. నాకెదురుగుండా రేడియోవంటి ఒక యంత్రం ఉన్నది. దానిపై భాగంలో ఉన్న అద్దపు తెరమీద, మా అన్నయ్య రూపం కనపడ్డది. ఆ క్షణంలోనే నా చెవులో, 'హలో రాజా, ఎప్పుడొచ్చావు, ఎక్కడ ఉన్నావు....' అంటున్నాడు మా అన్నయ్య. ఇది టెలివిజన్ కాబోలుననుకుంటూ 'నేనే నన్నాయి' అన్నాను. తర్వాత రెండు నిమిషాలు నోట మాట పెగల్లేదు.

## 3

మరుసటిరోజు ఉదయం 8 గంటలకల్లా ఆంధ్రా రిపబ్లికన్ ఎయిర్ సర్వీసు విమానాల్లో నేను ఇటు తెనాలికీ, ప్రకాశరావు అటు విశాఖపట్నానికీ బయల్దేరాం, మళ్లీ కలుసుకుందామని సెలవు

తీసుకుని. ముప్పావుగంట ప్రయాణం తర్వాత దుగ్గిరాల విమానాశ్రయంలో దిగాను. మా అన్నయ్యా, ఆయనకొడుకు లిద్దరూ విమానాశ్రయానికి వొచ్చారు నన్నుతీసుకువెళ్ళడానికి. అందరం మా అన్నయ్య వొచ్చిన చిన్నకారులో ఇంటికి బయల్దేరాం. దారిలోనే ప్రారంభించాను నా సందేహాలడిగేందుకు.

'తెనాలి ఇదేనా?' నా మొదటి ప్రశ్న అది.

'అవును ఇటు దుగ్గిరాలవరకూ, అంతా కలిసిపోయింది రాజా' అన్నాడు అన్నయ్య.

'ఈకారు ఎవరిది అన్నాయి?' అని అడిగాను, ఓప్లీడరుగుమాస్తా కారు ఎట్లా కొనగలడని.

'నాదే రాజా!' అన్నయ్య గర్వంగా అన్నాడు.

'కారు చాలా ఖరీదుకదూ?' ఆశ్చర్యంగా కనుక్కున్నాను.

'ఎబ్బే, 300 రూపాయలు పెద్ద ఖరీదు' నవ్వాడు అన్నయ్య.

'నిజమా?'

ఇంతలోనే కారు ఆగింది. ఇంట్లోకి అడుగు పెట్టాను. ఎంత మార్పు! వెనక ఓ పూరింట్లో ఉండేవాళ్ళం. ఇప్పుడు ఒక మేడలో, అన్ని ఆధునిక సౌకర్యాలతోటీ, ఓచిన్న సైజు జమీందార్లే ఉన్నాడు అన్నయ్య.

ఆరాత్రి భోజనాలయాక, మేడమీద కూర్చుని మా అన్నయ్యతో బాతాఖాని ప్రారంభించాను.

'అయితే అన్నాయి, ఇంత మార్పు ఇంత సంపదా, ఆంధ్రదేశానికి ఎట్లా సంభవమైంది?'

'నువ్వు పిచ్చివాడివిరా, నీకు 1913 మనస్తత్వం పోలేదు ఇంకా'

'అది సరే నన్నాయి, ఇంతకీ ఏంజరిగిందో చెప్పు.'

'అన్ని రాష్ట్రాలూ, ప్రత్యేక రిపబ్లికులుగా విడిపోగానే దేనిసంపదని అది అభివృద్ధి పర్చుకోసాగింది. అట్లాగే తెలుగుదేశమూనూ. మొట్ట మొదట, అదివరకు బుట్టదాఖలైన ప్రాజెక్టుల ప్లానులన్నిట్నీ బయటకి తీసి నిర్మించటానికి పూనుకున్నారు.'

'ఎవరు?'

'అధికారంలో ఉన్న కాంగ్రెసు నాయకులే.'

'ప్రాజెక్టుల నిర్మాణానికి బోలెడుడబ్బుకావాలి గదా, ఎట్లా? కేంద్రం వారు ఇచ్చారా?'

'డబ్బుకేం? ఆంధ్రులకి డబ్బులేకనా, కేంద్రం వారిచ్చేందుకు? ప్రాజెక్టుల నిర్మాణానికి పూనుకుంటూ, ఆంధ్రరిపబ్లికు ప్రభుత్వం, ప్రజలకి ఓ విజ్ఞప్తిచేసింది, ప్రతి తెలుగువాడూ తలా కొంత ఇవ్వాలని. మూడోరోజుకల్లా బోలెడు తెలుగురూపాయలు పోగైనాయి.'

'ఎన్ని ప్రాజెక్టులు కట్టారు?'

'మూడు పంచవర్షప్రణాళికల్లో, రామపాద సాగరం ప్రాజెక్టు, ఇంకా చిన్న చిన్న ప్రాజెక్టులూ తయారైనాయి. దీంతో దేశంలో అదనంగా, వెనక బంజరుగా పడివున్న పాతిక లక్షల ఎకరాల భూమి పచ్చని పొలాలైంది. ఇదేకాకుండా, ఎక్కడెక్కడ ఏ మేం గనులున్నాయో వెతికి తవ్వసాగారు. ప్రాజెక్టుల్లో తయారయ్యే విద్యుచ్ఛక్తితో ఆంధ్రభూమి యావత్తూ, ప్రతిపల్లెటూరు దీపాలమయమైంది. ప్రసిద్ధమైన కర్మాగారాలు వెలిశాయి. పొలాలన్నీ ట్రాక్టర్లతో నిండాయి.'

'అయితే ఏ అమెరికాలాగో, ఫ్రాన్సులాగో తయారైందంటావు. భారీయంత్రాలు ఎట్లా వొచ్చినాయి?'

'మొదట విదేశాలనించే తెప్పించారు. ఇప్పుడు అన్నీ ఇక్కడే తయారౌతున్నాయి. మన విజయవాడ ఇప్పుడు ప్రపంచ పారిశ్రామిక నగరాల్లో ఒకటి; పెద్ద నగరాల్లో మూడోదీను!'

'మరి బొగ్గు, పెట్రోలు ఎట్లా?'

'రైళ్ళన్నీ చవకగా వొచ్చే విద్యుచ్ఛక్తితో వస్తున్నాయి. సింగరేణి బొగ్గు గనులనించి, పుష్కలంగా బొగ్గు లభిస్తోంది. పెట్రోలూ, తరుగుబొగ్గూ విదేశాలనించి వొస్తాయి.'

'సొంత సైన్యంగూడా ఉందా తెలుగు రిపబ్లికుకి?'

'ఉంది. సుప్రసిద్ధమైన నౌవికాబలం, వైమానిక బలం, అన్ని రకాలైన మిలిటరీబలాలూ ఉన్నాయి మనకు. వీటిన్నిటికి తోడు, ఇతర రిపబ్లికులతోటి మైత్రి ఒక అభేద్యమైన బలం.'

'అయితే అన్నాయి, ఇదివరకు హిందీ దేశ భాష కావాలనేవారు గదా, హిందీ ఏమన్నా నిర్బంధమా?'

'ఏమీ లేదు. మన విజయవాడ, రాజ మహేంద్రవరం, నెల్లూరు, కాకినాడ, రాయలసీమ, విశ్వవిద్యాలయాల్లోనూ, ఇతర కళాశాలల్లోనూ, ప్రపంచ భాషలన్నీ నేర్చుకోవచ్చు. తెలుగు ఒక్కటే తప్పని సరిగా రావాలి. నిజం చెప్పాల్సివొస్తే వెనక, ప్రపంచానికి ఫ్రెంచ్ సాహిత్యం ఎంత గొప్పగా వుండేదో, ఇవాళ్ల తెలుగు సాహిత్యం ప్రపంచానికి అంతగొప్పదైంది.

'అంతా సరేగాని, ఇంత మార్పురావటానికి అదివరకుకన్న ఇప్పుడున్న అవకాశాలేంటంటావు?'

'ఏముంది రాజా! విదేశీ క్షవరం ఒదిలింది ఉత్తరాది క్షవరం ఉన్నన్నాళ్ళూ ఆంధ్రఒకటి ఉన్నదన్న సంగతే ప్రపంచానికి తెలిసేదికాదు; ఆంధ్రజాతి విడిపోయి, తన కాళ్లమీద తానునిలబడి, తనసంపదని అభివృద్ధిచేసుకో నారంభించగానే ప్రపంచమే విస్తుపోయింది. ఆంధ్రదేశం ఒకప్పుడు కరువులతో మాడింది: కేంద్రం వారు దయదలిస్తే కాసిని గోధుమలు వొచ్చేవి. ఇప్పుడో? తెలుగుగడ్డనించి, తెలుగువారుకి పోను మిగిలిన బియ్యం, గోధుమలు ఇతరదేశాలకు సప్లయి చేస్తున్నారు.

'ఇంతకీ, తనకాళ్ళమీద తాను నిలబడి ఇలా సిరిసంపన్నమైందంటావు?'

'సరిగ్గా అదే'.

***(జూన్ 7, 1949, తెలుగు స్వతంత్ర)***

# సంస్కారం

'ఒరే బాబు! ఒరే'

అని ఇల్లదిరిపొయ్యేట్టు అరుస్తోంది సరస్వతి, ఆరేళ్ల కొడుకును పిలుస్తో. మల్లికార్జునరావు ఈజీచైర్లో పడుకుని చదువుకుంటున్న వాడల్లా విసుగ్గా ' ఎందుకే అట్లా అరుస్తావు?' అని కసురుకున్నాడు. సరస్వతి, వంటింట్లోంచి చెంగు నడుముకు బిగించుకుంటో, బయటికి వొచ్చి, '' అరుస్తున్నట్టే వుంటుంది మీకు; పిల్లాడు ఎక్కడికి పోయినట్టు? మీ కేమీ పట్టదు. ఒరేగోపాలూ' అంటూ మళ్లీ తారస్థాయిలో అందుకుంది.

మల్లికార్జునరావుకి భార్య అరుపుకి కారణం కొద్దిగా బోధపడింది. 'అబ్బ వూరుకోవే, వాళ్లింటో ఉన్నాడుగావును' అన్నాడు.

భార్యకి మరీ మండింది. 'అ! అట్లా వూరుకుంటే, సరిపోతుంది! మరీ ఇదయిపోతుందమ్మా! మనకైనా, సిగ్గుండాలి...' అంటో, పక్కభాగంలోకి విసురుగా పోయి, వరండాలోనుంచి, 'రారా! నీ దుంప తెగ, నీళ్లూ నిప్పులూ లేకుండా, పొద్దస్తమానం ఇక్కడే చచ్చావేరా.' అంటో కేకపెట్టేటప్పటికి, ఆరేళ్లగోపాలును ఎత్తుకుని ఆ భాగంలో ఉంటున్న సావిత్రమ్మ, బయటకొచ్చి, 'బిస్కట్లు తింటూ కూర్చున్నాడమ్మా' అని, సరస్వతి రౌద్రాకారపు వైఖరికి జంకి, మెదలకుండా, కుర్రాణ్ణి కిందికి దింపింది. కుర్రాడు భయపడుతూ, భయపడుతూ తల్లిదగ్గరకి వొచ్చాడు. సరస్వతి మూతివిరిచి కుర్రాణ్ణి బరబర లాక్కెడుతో, "మందే పెడుతున్నారో' మాకే పెడుతున్నారో క్షణం ఇంట్లో వుండడమ్మా.' అని పెద్దగా అంటూ ' ఇక అటూ పో చెబుతా వెధవా...' అని కుర్రాణ్ణి మందలించి తన మాతృత్వపు హక్కుల్ని ఖాయపరుచుకుంది.

మల్లికార్జునరావుకి ఏదో పత్రికకార్యాలయంలో మేనేజర్పని. రెండొందల పైచిలుకు జీతం. జీవితం సాఫీగానూ, కులాసాగానూ గడుస్తోంది. అతను ఒక పెద్ద ఇంటో ఒక భాగంలో కాపురం వున్నాడు. ఆ యింట్లోనే చిన్న భాగంలో సుందరం అనే ఆయన వుంటున్నాడు, భార్యా సమేతంగా. ఆయన ఏదో కాఫీ హోటల్లో పొయ్యి దగ్గిర పనిచేస్తున్నాడు. ఏభైయ్యో అరవయ్యో తెచ్చుకుని కాలం గడుపుకుంటున్నాడు ఆయన. చాలా మంచివాడు. ఆయన భార్యా అంతే. మల్లికార్జున రావు కొడుకు గోపాలు, ముచ్చటగా వుండడం వల్లనూ, పిల్లలంటే వస్తుతః సుందరంగారికి, ఆయన భార్యకి చాలా ఇష్టంగనుకనూ, గోపాల్ని ఎప్పుడూ తమ ఇంటోకి తీసుకెళ్ళి ఆడిస్తూ, ముచ్చటపడేవారు ఆదంపతులు. మొట్టమొదట ఈ విషయమై సరస్వతి ఏమీ బాధపడలేదు గాని - రాను రాను కుర్రాడు మరీ, వాళ్ళింట్లోనే

ఉండటం, పిన్నీ, పిన్నీ అంటో సావిత్రమ్మని వొదలకపోవటం, సరస్వతికి నచ్చలేదు. తన మాతృత్వానికి భంగం వస్తుందనో, కుర్రాడు వాళ్ళకి, ఆ డబ్బులేని, కాఫీహోటల్‌వాళ్ళకి అంతగా మాలిమి ఐపోవడమా అనే జెలసీ, మమకారంవల్లనో, సరస్వతి కుర్రాణ్ణి కోప్పడసాగింది.

పెద్దలకి ఉన్న మత్సరాలు కుర్రాళ్ళకి ఉంటాయా? సందుదొరికినప్పుడల్లా గోపాలు సావిత్రమ్మ దగ్గిరకి పరిగెడుతూనే ఉండేవాడు. 'పో నాయనా?' అని ఆమె అయినా ఎలా అంటుంది? ఏవో తింటానికి పెట్టి కుర్రాణ్ణి లాలించేది. పిల్లలులేని తల్లి, అందులోనూ నలుగుర్ని అర్థాయుషుగా పోగొట్టుకున్న తల్లి, పిల్లాడ్ని ఎలా పొమ్మంటుంది?

' ఆయనతోటి ఖచ్చితంగా చెప్పండి. లేదా, ఈ కొంపేనా మార్చండి, లేకపోతే నేను పిల్లాణ్ణి తీసుకుని మా వాళ్ళింటికేనా పోతాను'' అని మల్లికార్జున రావుతోటి తగూకి దిగింది.

'వాళ్లేం జేసారని, ఆయనతోటి చెప్పను? ఇంత వెర్రిభ్రమ పడతావేమే? పిల్లలు లేని వాళ్లు గనుక...'

'చాల్లేండి చెప్పొచ్చారు గాని, కుర్రాడెందుకైనా పనికొస్తాడా, ఆ సంప్రదాయం అబ్బితే? చదువా సంధ్యా? కప్పులు కడిగేవాళ్ళతో సాపత్యమండీ మనకి?....'

'ఛీ... నోరుముయ్యి, వాళ్లు వినగలరు. మరీ రెచ్చిపోతున్నావుగా...' అన్నాడు భర్త. భార్య బిక్కమొఖం వేసి, ఏడుపుకు దిగింది. మల్లికార్జున రావు విసిగి, బయటికి బయల్దేరాడు. రోడ్డు మీదే సుందరంగారు ఎదురుపడ్డాడు. ఆయన చేతిలో సెల్యులాయిడ్ బొమ్మ ఒకటి వుంది. మల్లికార్జునరావు అతనితో ఏదో మాట్లాడాలనుకున్నాడు. కాని ఏమీ మాట్లాడలేదు.

మల్లికార్జునరావు సాయంత్రం ఇంటికొచ్చి నప్పుడు, సుందరం ఇల్లు ఖాళీ చేసి వెళ్తున్నాడు. మల్లికార్జునరావుకి ఇది బొత్తిగా అర్థం కాలేదు. ఇంటోకి వెళ్ళాడు, వరండాలో దృశ్యం అతని హృదయాన్ని కలిచివేసింది. నిన్న సుందరంగారు కొనుక్కొచ్చిన బొమ్మ ముక్కలు ముక్కలైపడివుంది. కుర్రాడు ఏడుస్తోనుంచున్నాడు సరస్వతి దగ్గర. సావిత్రమ్మ గోపాల్ని దీనంగా చూస్తూ, సామాన్లు భర్తకు అందిస్తోంది. మల్లికార్జునరావు గబగబ లోపలకి పోయి, 'సరస్వతీ' అని కేకేశాడు. సరస్వతి కుర్రాణ్ణి లాక్కుని లోపలికి వొచ్చింది. మల్లికార్జునరావు కోపంతో మండిపోతూ ' ఏమిటిది?' అని మాత్రం అడిగాడు.

సరస్వతి మూతి విరుచుకుంటూ 'నాకేం తెలుసునండీ' అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

పదిహేను రోజుల తర్వాత ఓ రోజున మల్లికార్జున రావుకి ఆఫీసుకి ఫోన్ కాల్ వచ్చింది. ఏమిటోనని అలక్ష్యంగా కనుక్కున్నాడు. 'మీ ఇల్లు నిప్పంటుకున్నది, త్వరగా రండి' అని పొరుగువారెవరో చెప్పారు. అతడు చాలా తొందరగా జట్కామీద.

ఇల్లు అంటుకుని నిప్పు నాలుకలుసాచి మండుతోంది. సరస్వతి, ఘోరంగా ఏడుస్తూ నిలబడి వుంది వాకిట్లో; ఆవిడకి సగం స్పృహ లేదు. బయట జనం ఆదుర్దాపడుతున్నారు, అబ్బాయి...

అబ్బాయి ... అబ్బాయి లోపలేవున్నాడు' వాపోతోంది సరస్వతి. బయటిగడపగూడా అంటుకుంది. మల్లికార్జునరావు బండి దిగేప్పటికి ఫైరు ఇంజన్లు వొచ్చాయి.

మల్లికార్జునరావు, సరస్వతిని పట్టుకుని ఒక్క ఊపు ఊపి, అబ్బాయి ఏడీ?... అబ్బాయి....' అని అడిగితే, సరస్వతి పిచ్చిగా, మండుతున్న ఇంటికేసి చెయ్యి చూపించి, కెవ్వున కేకేసి కిందపడిపోయింది. ఇంతలో గుంపులోంచి ఎవరో గబుక్కున మండుతున్న ఇంట్లోకి జొరబడ్డాడు. గుంపు 'వొద్దు వొద్దు' అని కేకేస్తున్నా వినిపించుకోలేదు ఆవ్యక్తి. ఏడు ఎనిమిది నిమిషాలకల్లా, పిల్లాణ్ణి భుజం మీద పడుకోపెట్టుకుని అతడే బైటికి చాలా గాయాలతో వొచ్చాడు. కుర్రాణ్ణి మల్లికార్జునరావు అందుకున్నాడు ఆ వ్యక్తి కింద పడిపోయాడు. అతని గుడ్డలు కాలి, వొళ్ళంతా బొబ్బలెక్కినాయి. ఫైర్ ఇంజన్లు, ఇతర ఇళ్లు తగలబడకండా రక్షించగలిగాయంతే.



సరస్వతిని వెంటబెట్టుకుని మల్లికార్జునరావు జనరల్ ఆస్పత్రికి వచ్చాడు. ఈలోగా ఆమె ఏ మడిగినా ఏమీ జవాబు చెప్పలేదు. కుర్రాడు జరిగినదాన్ని ఏదో రకంగా వూహించుకుంటో తండ్రిని ప్రశ్నలతో చంపుతున్నాడు.

' ఎవరండీ ఆయన, అంత ప్రాణానికీ తెగించింది?' అని అడిగింది సరస్వతి ఆస్పత్రిలోకి ప్రవేశిస్తూ.

భర్త ఆమె చెయ్యి పుచ్చుకుని బరబర వార్డులోకి ఈడ్చుకెళ్ళి, వొళ్ళంతా కట్లు కట్టుకుని బాధతో నరక యాతన పడుతున్న సుందరంగారి పాదాల దగ్గిర నిలబెట్టి, 'చూడు.... నువ్వు, నీ మాతృత్వం, నీచుట్టూ నుల్చున్న గుంపు - నేను, ఎవ్వరమూ, రక్షించలేక పోయినాం. ఈ మహానుభావుడు...' ఆపైన అతను ఆవేశంతో మాట్లాడలేదు.

సరస్వతి కన్నీళ్ళతో, సుందరంగారి పాదాలు తడిసినాయి. కుర్రాడు 'బాబాయి.... బాబాయి' అంటూ ఏడవసాగాడు. సుందరం కలలో మేల్కొన్నట్టు, హీనస్వరంతో ' ఏడవకు బాబూ' అన్నాడు.

మల్లిఖార్జునరావు కృతజ్ఞతావేశంతో, అతనికి నమస్కరిస్తూ, 'సరస్వతీ' వృత్తికీ, సంస్కారానికీ, ప్రేమకి ఎన్నడూ సంబంధం లేదని, బోధపడిందా ఇప్పుడైనా?' అంటుంటే, సరస్వతి కొడుకు చెయ్యి సుందరంగారి చేతికి అందించి, 'నేను వీణ్ణి కన్నమాట నిజమేగాని పునర్జన్మ ఇచ్చింది మీరేనండి. ఇక వీడు మీ కొడుకే...' అంటూ ఆవేశంతో, ఏడవ సాగింది.

***(జనవరి 9, 1950, తెలుగు స్వతంత్ర)***

# సంస్కార హీనుడు

తన సర్వస్వమూ ఆరిపోయ్యేదాకా తిరిగి తిరిగి, విసుగెత్తి ఇంటికి వొచ్చాడు కృష్ణరాజు. అతని ఈ ప్రవర్తనపట్ల అందరికీ మోటూ అసహ్యమూ కలిగినా, కామేశ్వరికి ఒక్క రవ్వన్నా, కోపం కలగలేదంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇంట్లో అందరూ కృష్ణని అనరాని మాటలు అన్నారు. తండ్రి లేనేలేడు; తల్లీ, మేనమామా, పిల్లనిచ్చిన మామా, అందరూ అతన్ని తిట్టిపోశారు. భార్య మాత్రం ఏమీ అనలేదు. నలుగుర్లోనే గాదు అతన్ని ఒంటరిగా కలుసుకున్నప్పుడు గూడానూ. సామాన్యంగా, సంఘదృష్టిలో దుర్మార్గుడుగా పరిగణించబడ్డవాణ్ణి భార్య ఆవిధంగానే చూడ్డం సహజమే; కృష్ణరాజు కూడా దీన్ని అంగీకరించాడు. భార్యమౌనం, అందరి తిట్లకన్నా కూడా అతన్ని ఎక్కువ బాధపెట్టింది. ఆవేళ అందరూ తిండ్లుతిని పడుకున్న తర్వాత కామేశ్వరి మొగుడి దగ్గిరకెళ్ళింది మామూలుగానే. కృష్ణ, దొడ్లో మంచంవేసుకుని గాఢంగా ఆలోచిస్తున్నాడు, చీకట్లో ఊగే తులసిచెట్టువంక చూస్తో.

కామేశ్వరి అతన్ని అతి ఆప్యాయంగా చూస్తో దగ్గిరకెళ్ళి కూచుంది. ఆమెస్పర్శ తగిలిన ఉత్తరక్షణం కృష్ణే నీరసంగా ఆమెవైపు తిరిగి, 'కామూ, నిన్ను ఏనాడూ, పెళ్ళి అయిన నాలుగేళ్ళ కాలంలోనూ, ఒక్కసారైనా అప్యాయంగా పలకరించి ఎరగని నన్ను నువ్వు ఇంతగా ప్రేమించి సహించటానికి కారణం ఏమిటి? నన్ను పరీక్షిస్తున్నావా? చెప్పు?' అని అడిగాడు, దోషి, న్యాయాధిపతి ముందు క్షమార్పణ వేడుకునే స్వరంతో.

కామేశ్వరి, చాలా ధీరంగా, కాని, అప్యాయంగానూ, దయగానూ, 'అదికాదండి. మీరు చేసినపనులు ధైర్యంవున్న ప్రతివాడూ, ప్రతి ఆడదీ చేస్తుందని నేను నావరకూ గట్టిగా విశ్వసించాను. అంతకన్న ఇందులో ప్రత్యేకంగా సహనమేమీ లేదు. మీరు నన్ను చూసి ఎందుకు భయపడుతున్నారో నాకర్థం కాదు'' అన్నది.

కృష్ణ నిజంగా ఉలిక్కిపడ్డాడు. అతనికి గత జీవితం అంతా ఒక్కసారిగా జ్ఞాపకమొచ్చింది. అతనికి తను చేసిన పన్లు, తనకే తప్పుగా తోచినయి ఇదివరకు. అందువల్లనే అందరి తిట్లనీ భరించి ఊరుకున్నాడు. ఇప్పుడు కామేశ్వరి ఏమిటి ఇట్లా మాట్లాడుతోంది? - నిజంగా తను చేసినవన్నీ ధైర్యస్థుడైన ఓ వ్యక్తికి సహజమూ న్యాయమూనా? కృష్ణ, కామేశ్వరి జడ చాలా అనురాగంతో సర్దుతో, 'నువ్వు చాలా కొత్తగా మాట్లాడుతున్నావు; నేను ఇలాంటి భావాన్ని ఎదురు చూడలేదు నీనించి. అందువల్ల పొరపడ్డాను. నువ్వేది నిజమా?' అని అడిగాడు.

కామేశ్వరి, అతన్ని ఓ రకంగా చూసింది ఆ చీకట్లో. 'నిజమా అంటారా? కాక మరేమిటి? నేనన్నది నిజమే. నాకున్న కొద్దిపాటి తెలివితో ఆలోచించి ఈ నిర్ణయానికి వొచ్చాను. మీరు మీ

తాలూకు డబ్బుని, శక్తిని, చాలా త్వరగా ఖర్చు పెట్టారు. అందులో మీ లోపంకన్న పరిస్థితుల లోపం ఎక్కువగా వున్నది. ఏ జీవితానుభవమూ లేని స్తబ్దు అయిన మొగుడితో, నిరామయంగా వందేళ్ళు గడపటంకన్నా మీబోటి వారితో, ఒక్క ఏడాది గడపటం నాకు చాలా ఇష్టం.'' అన్నది.

ఆమె చెప్పేవన్నీ అతన్ని ప్రోత్సాహపరచినై. ఆమెలో ఇంతసంస్కారం వుంటుంది అని ఇదివరలో తను ఊహించి ఉండలేదు. భారత పతివ్రతలాగా, చాటున, దేవుళ్ళని 'నా భర్తని బాగుచెయ్యండి. వాడు దుర్మార్గుడు; కాని నా భర్తేసుమా' అని ఆమె వేడుకోకుండా తనని, అటు దుర్మార్గుడిగానూ కాకుండా, సన్మార్గుణ్ణిగాకాకండా, వొట్టి మనిషిగా మాత్రమే స్వీకరించి వూరుకోగలగటం, అతన్ని శాంతింప చేసింది. అతను లోలోపల, ఓ ప్రమాణం చేసుకున్నాడు. ఇక, తను ఏ పరాయిస్త్రీని ముట్టకుండా తాకకుండా సద్బుద్ధి కలిగివుండాలి' అని. గతపదిరోజుల బంధు తిరస్కారాల మోతనించి, ఆ రాత్రి అతను తన భార్యచేతుల్లో శాంతిగా చిన్న పిల్లవాడల్లే నిద్రపోయినాడు.



కృష్ణరాజు తాలూకు ఆస్తియావత్తూ ఆరిపోయినా, వాడిమీద ప్రేమకొద్దీ చచ్చిపోతూ పినతల్లి రాసిచ్చిన ఆస్తితో, అతను మళ్లీ కోలుకున్నాడు ఆర్థికంగా. సహజంగా అతనితో ఎప్పటిమల్లే ప్రవర్తిస్తోంది కామేశ్వరి. వస్తుతః ఆమె స్వాతంత్ర్యవాది. ఇతరుల స్వతంత్రాన్ని అరిగట్టడం కాని, తన స్వేచ్ఛకు ఇతరులు అడ్డం రావడం కాని ఆమెకు తల నెప్పిగా వుండేది. ఈ గుణం, చదువుతోనే గాక, ఆమెకు పుట్టుకనించే వొచ్చివుండాలి. ఆమె అందగత్తె. వొయ్యారం వొలకపోస్తూ వుండేది ఆమె ప్రతి చర్యా. మితభాషిణి కావడం ఆమెకొక ప్రత్యేక ఆకర్షణగా పరిణమించింది. కృష్ణ ఈ భార్యను వొదిలి ఇన్నేళ్లూ, దరిద్రగొట్టు ముండలతో కాలం గడిపినందుకు, చాలా పశ్చాత్తాపబడ్డాడు. ఆమెను ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా చాలా మాట్లు క్షమార్పణ వేడుకున్నాడు, అతని బలహీనత కొద్దీనూ. అతని కింకా మానవ జీవితం, గీట్లలో గోడల్లో ఇరుకుగా వుండజాలదని, ప్రతిక్షణం, సమాజ నిర్మిత నీతి చట్టాల్ని వ్యతిరేకిస్తూనే వుంటుందనీ, తెలీదు. తన భార్య గొప్పది కావటం వల్లనే తనని సహించిందనే అతని వుద్దేశం. ఈ గొప్ప దనాన్ని అతను గుర్తించి నప్పణ్ణించీ, భార్యని, సుగుణరాశిగా, వెనకటి పతివ్రతల లిస్టుకే చేర్చి పూజించ సాగాడు. ఆమె అతని మనస్సులో అత్యున్నతస్థానం ఆక్రమించింది. కామేశ్వరి దీన్నేమీ గమనించలేదు; తన భర్తకి తన మీద ఏర్పడ్డ గౌరవాన్ని పెంచటానికి ఆమె ఎట్టి ప్రయత్నమూ చెయ్యలేదు. అతన్ని సహజంగా ప్రేమించింది. అంతవరకే. అట్లానే రోజులు దొర్లిపోతున్నాయి.



ఒకరోజు కామేశ్వరి చీకటి పడ్డాక ఎక్కడికో పోవటానికి బయల్దేరింది. ఇంట్లో మరెవ్వరూ ఆమెని అడ్డగించరు. ఒక కృష్ణరాజే ఆమెని అడ్డగిస్తే. అప్పటికే చాలామాట్లు ఆమె అట్లా చీకటి పడ్డాక ఎక్కడికో పోవటం, పొద్దుపోయి రావటం కృష్ణరాజు గమనిస్తూనే వున్నాడు. ఆమె మీదగౌరవం కొద్దీ వూరుకున్నాడు ఇన్నాళ్లూ కారణమన్నా అడక్కుండా. కాని ఇవాళ ఆమెను కారణం అడిగేధైర్యం లేక, ఆమెని వెంబడించి, ఆమె ఎక్కడికి పోతుందో కనుక్కోవాలని నిర్ణయించుకున్నాడు కృష్ణరాజు. ఆమె గడప దాటగానే, చల్లగా తనూ వెంబడే వెళ్ళాడు.

ఆమె సరాసరి పార్కు రోడ్డెపోయి ఓ చిన్న ఇంట్లోకి వెళ్లింది. కృష్ణరాజు లోపలికి వెళ్ళక చుట్టూ తిరిగి దొడ్లోకివెళ్ళి, పూరిల్లు కావటం వల్ల, తడిక సందులోగుండా లోపలికి చూశాడు. లోపల ఎవరో ఒక అమ్మాయి, ఒకతను నుంచుని కామేశ్వరిని నమ్రతగా ఆహ్వానిస్తున్నారు కృష్ణరాజుకిచెవులు చురుకుగా పనిచెయ్య సాగినై.

మసకగా వెలుగుతున్న లాంతరు వెలుగులో, కామేశ్వరి మొహం వెలవెల పోతున్నది. ఆమె ఏడుస్తుందేమో అనిపిస్తోంది. ఆమెకీ ఆ దంపతులకీ అయిదారు గజాల దూరంలో ఓ ఆరేళ్ళ అందమైన కుర్రాడు కూచుని వున్నాడు. బెదురు చూపులు చూస్తున్నాడు. కామేశ్వరి అమ్మాయికేసి చూస్తో: 'అమ్మా! మీ రుణం తీర్చలేను. అబ్బాయికి ఈ రూపాయి ఇవ్వండి. వాడికి ఏ లోటూ రానివ్వకండి' అని, ఆ కుర్రాడి దగ్గరగా వెళ్ళి, ' రా నాన్నా, నీకు మంచి చొక్కా తెచ్చాను' అని ఎత్తుకుంది కుర్రాణ్ణి.

కుర్రాడు నిర్ఘాంత పోయినా, ఆమెని ఆ రెండు మూడు నిమిషాలకల్లా గుర్తుపట్టి సిల్కు చొక్కాయేనా? అంటూ ఆమె చేతిలో చొక్కాలాక్కుని 'బావుంది బావుంది' అని చంకలెగరేస్తో, ఆమెని గట్టిగా కావలించుకున్నాడు.

లోపల నుంచునివున్న అతను, 'రుణ మేముందమ్మా, ఇందులో, అబ్బాయి డబ్బులు అబ్బాయికే ఖర్చు పెడ్తున్నాం. ఇందులో మాలో దయేముందండి!' అన్నాడు చాలానమ్రతగా.

కృష్ణరాజుకి అర్థం కానిదేదో విషయం గొంతులో వెలక్కాయల్లే పడి ఊపిరాడనియ్యడం లేదు. అతనిలో ఒక విపరీతమైన సందేహం పట్టుకుంది. అది నిజమా? ఆ కుర్రాడిలో తన భార్య పోలికలు అగుపించడం తన పొరపాటా? ఈ నాటకం ఏమిటి? తనకి తెలీకుండా తన భార్యకి పిల్లాడా?

అతని బుర్ర ఆలోచించడం మానివేసింది. కారణం కామేశ్వరి అక్కణ్నించి బయిల్దేరి బయటికి వెళ్ళిపోవటమే. ఏమిటో ఈ రాత్రే తేల్చుకుందామని కృష్ణరాజు గబగబ నడచి వెళ్ళాడు. అతని నడకా ఆవేశం ఆ నిమిషాన అటూ ఇటూ ఆలోచించలేని తాగుబోతుని జ్ఞప్తికి తెచ్చింది.

భార్యా, భర్తా, ఇంటి గడపదగ్గరే తారసపడ్డారు. ఒకరు తీరని ఆవేదనతో - మరొకరు అత్యాంతావేశంతో. కృష్ణరాజు చాలా ఆవేశంతో కామేశ్వరిని గడపలోనే పట్టుకుని అగి, ' ఈ నాటకం ఏమిటండి, కామేశ్వరి గారూ!' అన్నాడు.

కామేశ్వరి, చాలా అధైర్యపడింది ఆ క్షణాన; తన భర్త ఈ రకంగా, తనని అడగడం ఇదే మొదటిసారి. కాని మరుక్షణమే ధైర్యం తెచ్చుకుని, 'లోపలికి పోనివ్వండి ముందు; తీరికగా మాట్లాడదాం.' అంటో అతన్ని విదిలించుకుని చరచరా లోపలికిపోయింది. కృష్ణరాజు, నిస్తబ్ధుడై మెల్లగా ఆమెని అనుసరించాడు. రెండడుగుల వేసేప్పటికి, అతనిలో అగ్ని రగులుకుంది; గబుక్కున తన గదిలోకి వెళ్ళి, తనెన్నడో కొన్న చాకు పంచెతో తుడిచి, తీసుకుని, కామేశ్వరికోసం వెదుక్కుంటూ ఆమె గదిలోకి వెళ్ళాడు. ఆమె గదిలో కిటికీ దగ్గిరగా నుంచునివుంది. బైట అప్పుడే ఉదయిస్తున్న చంద్రుణ్ణి నీరసంగా చూస్తో.

కృష్ణరాజు ఆమెదగ్గిరకి అత్యుద్రేకంతో పోయి ఆమె జుట్టు ఒక చేత్తో పట్టుకుని, బాకుని, గుండెల్లో గురిపెట్టి, 'చెప్పు, ఆకుర్రాడెవడో, వాడికీ నీకూ ఏం సంబంధమో' అన్నాడు.

పరిస్థితిని అర నిముషంలో అర్థం చేసుకుంది కామేశ్వరి. ఆమె తన భర్త సంస్కారాన్ని అదివరకల్లా తప్పుడు అంచనా వేసింది. అతను ఇంత బలహీనుడని ఆమె కిప్పుడే తెలిసింది. ఇప్పుడు అధైర్యపడడంవల్ల జరిగేది, తనకి అన్యాయమేగాక, అపజయం కూడానూ.

'ఆగండి. ఉద్రేకపడకండి. మీరు నన్ను పెళ్ళి చేసుకున్న తర్వాత, నన్ను నాగతికి వొదిలి నాలుగు సంవత్సరాలు ఎవరితోనో సుఖిస్తే, నేనేమీ మాట్లాడలేదు. అందులో మానవ సహజం ఉన్నదని భావించి వూరుకున్నాను. మీరు - నన్ను ఏమీ అర్థం చేసుకోకుండానే నాకు హాని చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. కానీండి' అంది ఆమె జారిపోతున్న ధైర్యాన్ని కూడతీసుకుంటో.

కృష్ణరాజు వస్తుతః అధైర్యవంతుడు. అతను దుర్మార్గం చెయ్యగలడు గాని, ఇంకోళ్ళకి తెలిసేటట్టు ఎన్నడూ చెయ్యలేడు. ఇదివరలో చెయ్యలేదు కూడానూ. భార్యని ఊరికే బెదిరించటానికే బాకు తెచ్చాడు గాని పొడవటానికి కాదు. అతను కోపంతోనే, 'వెధవ వుపన్యాసం చెప్పొవుగాని, ఆ పిల్లవాడెవరో చెప్పు ముందు. లేకపోతే' అన్నాడు, పొడిచేవాడికిమల్లే, కత్తి వొణికించి. కాని చెయ్యి భయంతో సగం తనే వొణకుతోంది.

కామేశ్వరికి ఈసంగతి కొద్దిగా తెలిసింది. ఆమె ఇంకా ధైర్యంగా, 'పొడిస్తే పొడవండి. జరిగింది చెప్పేస్తాను. మీరు ధైర్యవంతులనీ, ఇతరుల తప్పులని మానవనైజంగా అంగీకరించే సంస్కారం మీకుందనీ నేను భావించాను. కాని మీరింత పిరికివారనీ, కనకనే ఆవేళ నాక్షమార్పణకోసం అంత తాపత్రయపడ్డారనీ ఇప్పుడు తెలుస్తోంది. నేను స్కూలులో చదువుతుండగా ఒకతను నన్ను ఒకరోజు పరిస్థితుల అనుకూలతని అండగా చేసుకునీ, నా చిన్నతనపు అజ్ఞానాన్ని పురస్కరించుకునీ, అనుభవించాడు. దాని ఫలితంగా గర్భవతయినాను. నా స్నేహితులు నాకు ఈ విషయంలో సహాయంచేసి, ఆపిల్లవాణ్ణి ఇంధాక మీరు చూసిన దంపతులకి ఇచ్చి వేశారు. ఆకుర్రాడంటే నాకు చాలా మమకారం వుంది, అతని పోషణని ఇన్నాళ్ళబట్టీ నేనే భరిస్తూవచ్చాను. ఇకముందు భరిస్తాను. ఇది, మన పెళ్ళికాకముందు సంగతి. అప్పుడు అకస్మాత్తుగా జరిగిన దురదృష్టానికి నన్ను ఇవ్వాళ మీరు సంజాయిషీ అడిగేట్టయితే నేనేమీ చెప్పలేను. నేను ఇంకొకర్ని దేనికోసమూ సంజాయిషీ అడగను. ఇంకొకరు నన్ను దేనికోసమూ సంజాయిషీ అడగటం అనవసరం' అని తెగేసి చెప్పింది.

కృష్ణరాజు, కోపోద్రేకంతో, కత్తి కిందికి విసరిపారేశాడు. 'ఉద్ధరించావు - లం .... నిన్ను ఖూనీచేసి... ఆ స్త్రీ హత్య ఎక్కడ మొయ్యను. పో - ఈ ఇంటోనుంచి; నీ పిల్లాడి దగ్గిరకో, నీ రంకు మొగుడి దగ్గిరకో - ... సంస్కారమట - ధైర్యమట - ...' అంటో, ఆమెని వాకిలిదాకా ఈడ్చుకొచ్చి, రోడ్డుమీదికి నెట్టి తలుపేసుకున్నాడు నిశ్చింతగా.

కామేశ్వరి, ఏమీ ఆశ్చర్యపడకుండా, ఆవేశపడకండా, అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

*(జూన్ 7, 1950, తెలుగు స్వతంత్ర)*

# మర్యాదస్థుడు

## 1

సుబ్బన్నగారు వాకిట్లో కుర్చీలో కూర్చుని పెద్ద ఉత్తరాది పొగాకుచుట్ట వెలిగించి కాల్చుతున్నాడు. ఏదో తీవ్రమైన ఆలోచనలో మునిగివున్నాడాయన. చిరుచీకట్లు కమ్ముకుంటున్నవి. ఆయన ఆలోచనలు చప్పున తెగిపోయినాయి. వసారా దిగువున ఆ సందులోకి అతికష్టంమీద మెల్లిగావొచ్చి ఆగింది గుర్రపు బండి; కాస్త మసకబడితే దూరపుదృష్టి బాగా ఆనని కారణంవల్ల సుబ్బన్నగారు, ఆవేళటప్పుడు తనకోసం వొచ్చేవాళ్లెవరా అని ఊహించటానికి ప్రయత్నిస్తున్నారు. ఇంతలోకే ఆయన పెద్దకూతురు ఊర్మిళ లాంతర్ వెలిగించి పట్టుకొచ్చి వసారాకున్న తీగెకి వేళ్లాడేసి పోయింది.

గుర్రబ్బండినించి టౌన్ సబ్ ఇన్స్పెక్టర్ సదాశివరావుగారు దిగి గంభీరంగా అడుగులేస్తూ రెండు మెట్లెక్కి ''ఏం సుబ్బన్నగారు, వంట్లో కులాసా!'' అంటూ అటూ ఇటూ చూశాడు ఎక్కడైనా కూర్చోటానికి ఏదైనా వుందా అని.

సుబ్బన్నగారు '' ఓహో....హో! ఇన్స్పెక్టర్ గారా, అలా కూర్చోండి'' అన్నారు చాలా గౌరవపురస్సరంగా. సుబ్బన్నగారి తెల్లగా నెరిసినగిరజాలు - ఇంకా అంతబాగా నెరవని మెలితిరిగిన మీసాలూ విశాలమైన నుదురూ మెరిసేకళ్ళూ, ఆయన వయోధికత్వాన్ని - దృఢత్వాన్ని వ్యక్తంచేస్తాయి. ఆయన ''అమ్మాయి! ఇంకో కుర్చీ తెచ్చి ఇలావెయ్యమని చెప్పు నాగన్నతోటీ!'' అని కేకవేశారు.

వెంటనే ఇంకోకుర్చీని తెచ్చి నాగన్న అన్న పనివాడు వసారాలో వేసివెళ్ళాడు. ఇన్స్పెక్టర్ గారు, ''మీతో కాస్త ఆంతరంగికంగా మాట్లాడాలని వచ్చాను. ఇక్కడ మాట్లాడవచ్చా, లోపలికి పోదామా!'' అని ప్రశ్నిస్తూ కూర్చున్నాడు.

సుబ్బన్న గార్కి ఇన్స్పెక్టర్ రాకకైన కారణం మెరుపల్లే స్ఫురించింది; అయితే అలా తన కావిషయం తెలిసినట్టుగా ఏభావాన్ని ప్రదర్శించకండా, ''మీకు అభ్యంతరమైతే లోపలికే వెళ్దాం'' అన్నారు.

ఇద్దరూ లోపలికెళ్లారు. మేడ లోపలి భాగంలో ఓ గదిలోకెళ్ళి కూర్చున్నారిద్దరూ.

''సుబ్బన్నగారూ మొహమాటం లేకుండా అడుగుతున్నా ననుకోండి. ఇది నావిధి. ఆటీన్ సోమన్న ఎక్కడ దొరుకుతాడో మీరేచెప్పాలి!'' అన్నాడు ఇన్స్పెక్టర్ గారు చాలా మెత్తగా.

సుబ్బన్న గారి మసకబారిన కళ్లల్లో కాంతి మెరిసింది, గదిలోని లాంతర్ వెలుగులో. ''సోమన్న

ఎక్కడ వుంటాడో నాకెలా తెలుస్తుంది! అయినా ఇప్పుడేం అంత అవసరంవొచ్చింది వాడితోటి?'' అని అడిగారాయన.

గదిబైట ఎవరూ తమ సంభాషణని రహస్యంగా వినడం లేదని స్థిరపరుచుకోడం కోసం ఇన్స్పెక్టర్ గారు ఒకసారి వాకిట్లోకి తొంగిచూసి ''మీకు తెలియకపోవడం అంటే నమ్మశక్యం కాదు. మీరూ సోమన్న పరిచితులని అందరికీ తెలుసును ఆ పైసంగతులన్నీ నేను చెప్పేదేముంది? సోమన్న మీద పోలీసుశాఖ హత్యానేరం మోపి అతనికోసం తిరుగుతున్నారు. మీకేమైనా తెలుసుననీ, న్యాయం జరగటానికి తోడ్పడతారని అనుకుంటూ నేను ఇక్కడికివచ్చాను!'' అన్నాడు ఇన్స్పెక్టర్గారు.

సుబ్బన్నగారు రెండునిముషాలు ఇన్స్పెక్టర్ వంక చూస్తూ కూర్చున్నారు. ఆ తర్వాత మాటలు పెగిలి బైటికివచ్చాయి. ''హత్యానేరమా! ఏంహత్య - ఏంకథ!'' అని ప్రశ్నించాడు కొంచెం వొణుకుతున్న గొంతుకతోటి. అయితే ఈ సందిగ్ధత ఒక క్షణం మాత్రమే. తిరిగీ ఆయన యథాప్రకారపు గాంభీర్యంతోటి ఇన్స్పెక్టర్గారి జవాబుకై నిరీక్షించసాగారు.

ఇన్స్పెక్టర్ ''మెరకవీధిలో అతని ఉంపుడుగత్తెని చంపేసి వెళ్లాడు నిన్నరాత్రి! చాలా ఘోరమైన సంఘటన; బరిశెపెట్టి ఇటునుంచి అటుదిగేట్టు పొడిచి చంపేశాడు... వాడే పొడిచాడనేది స్పష్టం. వాడి ఉంపుడుగత్తె తల్లి చూస్తూవుండగానే జరిగింది... మీరు కాస్త వాడిజాడ మాకు చెప్పాలి సుబ్బన్నగారు. ''సోమన్న తోటి పరిచయం వుంది నిజమేగాని అతని నివాసం ఎక్కడో ఏమిటో నా కెలాగ తెలుస్తుందండి?'' అన్నాడు నిర్లిప్తంగా.

ఇన్స్పెక్టర్గారు, '' మీకేమీ తెలీయదనే అంటారా! అయితే నేనిక్కడికి రావడం వ్యర్థమే!'' అంటూ లేచాడు.

''క్షమించండి ఇన్స్పెక్టర్గారూ! నా కేమీ తెలియదండి'' అన్నారు సుబ్బన్నగారు ఇన్స్పెక్టర్గార్ని వాకిలిదాకా వొచ్చి వొదిలిపెట్టి. జట్కా సాగిపోయింది గతుకుల రోడ్డుమీద.

లోపలికి వచ్చిన సుబ్బన్నగారు ముందు గదిలో మంచంమీద కూలబడ్డారు. ఆయన భార్య లోపల్నుంచి ఆదుర్దాగా వొచ్చి '' ఇన్స్పెక్టర్గారేమన్నా రేమిటండి?'' అని ప్రశ్నించింది.

సుబ్బన్నగారు, చాలా చిరాకుగా, ''పోనీవే వెధవ గోల! ఆటీన్ సోమన్న ఉంపుడుగత్తెను ఖూనీ చేసాట్ట. పోలీసువారు నన్నడగడానికి వచ్చారు, వాడెక్కడ దొరుకుతాడా అని! బాగోలే? నాకేం తెలియదని పంపించేశాను!'' అన్నారు.

ఆయన పెద్దకూతురూ, చిన్న కూతురూ, భార్యా ఇకనేమీ మాట్లాడకుండా ఉండిపోయినారు. లాంతర్ వెలుగు ప్రసరించని మూలలవైపు చూస్తూ ఆలోచనలలో పడిపోయినారు సుబ్బన్నగారు.

## 2

ఆటీన్ సోమన్న అంటే ఆరోజుల్లో రాజమండ్రి పట్నం లోనూ చుట్టుపక్కల గూడా అందరికీ

హడలే. ఈ భయం నివారించడానికి పోలీసులు సోమన్నని జైల్లో పెట్టాలని అనేక తడవలు ప్రయత్నించారు గాని - అతని మీద ఏ నేరమూ రుజూ కాకపోవడంతోటి ఏమిన్నీ చెయ్యలేక పోయినారు. సోమన్న ఎక్కణ్ణించి వొచ్చాడో ఎవరికీ తెలియదు. ఎప్పుడూ గ్లాస్కో మల్లుపంచె కట్టి, అరిచేతులదాకా పెద్దాపురం సిల్కు తొడిగి, టర్కీ టవల్ తలకు చుట్టాడు. భారీమనిషి; ఎర్రవాగైన కళ్ళు, చామనచాయ, కోరమీసాలు నిగనిగలాడుతూ మొహానికెంతో గాంభీర్యాన్నిస్తాయి.

సోమన్న చీట్లపేకలో ఘటికుడు. ఒకప్పుడు, అతను ఆటీన్ తురుపుముక్కతోటి ప్రత్యర్థుల్ని చిత్తుగా ఓడించి వున్నాడు. అప్పణ్ణించే అతనికి ఆటీన్ సోమన్న అనే పేరు స్థిరపడిందని ఆ చుట్టుపక్కల చెప్పుకుంటారు. సోమన్న రాజమండ్రి పరిసరాల్లో రహస్యంగా చీట్లపేకలాడే ప్రదేశాల్లోకి వెళ్లి చీట్లాడే జీవనం చేస్తూ వుండేవాడు అతను ఆ ప్రాంతాలకొచ్చిన కొత్తల్లో. కొద్దిరోజుల్లోనే అతడు దొంగతనాలు చేస్తున్నాడనీ, భయస్తుల్ని - ఏం? ధైర్యస్థుల్ని సైతం బెదిరించి డబ్బులు గుంజుతున్నాడని వదంతులు వ్యాపించాయి. వీట్ని వదంతులుగానే భావించారందరూ. వేటినీ రుజా చేసుకోలేకపోయినారు పోలీసులు.

మొత్తం మీద సోమన్న అంటే అందరికీ లోలోపల ఒక బెదురు స్థిరపడిపోయింది. కొన్ని సంఘటనలవల్ల సోమన్న ధైర్యసాహసాలు ప్రజలకి తెలియడంతోటి ఈ బెదురు పెరిగింది. గోదావరి ఉధృతమైన వరదలో ప్రమాదవశాత్తు పడిపోయిన ఐదేళ్ళ పిల్లని అతడు ప్రాణానికి తెగించి గోదావరిలోకి దూకి రక్షించి వొడ్డు వేశాడు; ఆ నిమిషాన గోదావరిలోకి దూకడానికి గజ ఈతగాళ్ళు సైతం వెనకంజవేస్తారు.

ఒకసారి చీట్లపేక తగాదాలో తనమీదికి వొచ్చిన ముగ్గురు ప్రత్యర్థుల్ని గుండపిండిగా కొట్టాడతను; అప్పణ్ణించీ అతనంటే ఊళ్లోనే కాకుండా, 'రౌడీ'లన తగ్గవారు గూడా జంకి మర్యాదగా ప్రవర్తించసాగారు.

అటువంటప్పుడే ఒక చిత్రమైన సంఘటన జరిగింది. రాజమండ్రిలోనే ఆర్యాపురం ప్రాంతంలో ఒక ఇరుకు సందులో పోలీసుల కభేద్యంగా వుంటూవచ్చిన ఒక చీట్లపేకలాట కేంద్రం వుంది; అది పెంకుటిల్లు, ఇంట్లోనే చెక్కలతోటి అటకలాగా ఒక అంతస్తు కట్టి, దానికి నిచ్చెన వేశారు; నిచ్చెన మెట్లెక్కి పైకివెళ్తే విశాలమైన గది వుంటుంది. ఈ గదిలో - నెలకు పది రోజులు జోరుగా చీట్లపేక సాగుతూవుంటుంది. చుట్టుపక్కల పెద్ద పెద్దవారే ఇక్కడ పోగై వేలకొలదీ డబ్బు పణం పెట్టి చీట్లాడుతారు.

ఆ పెంకుటిల్లు పైనించి చూడడానికి చాలా నిరపాయకరమైనదీ, పాతబడ్డ కొంపానూ. దానిలో చిన్న హోటలున్నది. ఒక నాడు సాయంత్రం వేళ; కిందహోటల్లో సామాన్యులు కూర్చుని కాఫీలు తాగుతున్నారు. పైన అప్పుడే ఆట మొదలెట్టారు. ఈతాకుల చాపపరిచి దానిమీద ఏడెనిమిదిమంది కూచున్నారు; అందరూ బాగా డబ్బులు వుండి వేరే పనిపాటలు లేని రకం; చేతులకి ఉంగరాలు మెరుస్తున్నాయి. జరీఅంచు కండవాలూ సిల్కు పంచెలూ వొంటిమీంచి జారిపోతున్నాయి. కత్తెరమార్కు సిగరెట్లు పొగతోటి వాతావరణం వూపిరాడకుండా వుంది. వాళ్ళ తలలమీద పెద్ద లస్టర్

లైటు వెలుగుతోంది. ఈ సమాజంలో సుబ్బన్నగారూ వున్నారు. ఆయనగారుగూడా అప్పుడప్పుడు వొచ్చి చీట్లాడ్తం కద్దు.

చీట్లాటకు ఇంకో చెయ్యి తక్కువ. అత నింకా రాలేదేమని మిగతా ఆటగాళ్లు ఎదురుచూస్తున్నారు. అంతక్రితం, ఆటీన్ సోమన్న అంటే ఎవరో చూడనివాళ్లూ, అతనంటే గొప్పగా చిత్రించుకుని అతన్ని చూడాలని అభిలాష మిక్కుటంగా గల వాళ్లూ అక్కడ ఐదారుగురున్నారు. అందులో సుబ్బన్నగా రొకరు. ఆయన, తనపక్కన కూచున్న ఒకాయనతోటి, '' ఏమండి సింహాచలం గారు, సోమన్న ఎప్పటికొస్తాడు!'' అని ప్రశ్నించారు;

సింహాచలం, '' ఈపాటికి వస్తూనేవుండాలి. అతనులేంది ఆటవుషారుగా వుండదు!'' అన్నాడు.

ఏడు గంటలు దాటాక ఆటీన్ సోమన్న వొచ్చాడు పైకి అతను అందర్నీ ఒకసారి కలయజూశాడు; సుబ్బన్న గార్ని చూసినప్పుడెందుకో అతని నొసట ప్రశ్నార్థకం, ఆశ్చర్యార్థకం కన్పించాయి. అయితే వీటిని బలవంతంగా అణిచేసుకుని ఆటలోకొచ్చి కూర్చున్నాడతను.

అతన్నది వరకే చూడాలని అభిలాషగలవారు, గొప్పహీరోను చూసినట్టు చూశారు. సుబ్బన్నగారు ఒకటి రెండు నిమిషాలు అతన్ని రెప్పవాల్చకండా చూశారు; తర్వాత సాఫీగా ఆటలో నిమగ్నమైపోయినారు. అరగంటసేపు ఇలాగే సాగింది ఆట మౌనంగా.

ఆ తర్వాత డబ్బులు ఎవరెవరివ్వాలో, ఎవరెవరు పుచ్చుకోవాలో అదే పంపిణీ వ్యవహారం జరిగింది. ఈ ఆటలో సోమన్న కాట్టే లాభం కన్పించలేదు, సుబ్బన్నగారు కొద్దిగాగెలుచుకున్నారుగూడా. సోమన్న రెండో ఆటకు ఉషారుగా వున్నాడు. డబ్బులు ప్రతి ఆటగాని ఎదట చిన్న చిన్న కుప్పలుగా పోసుకుని కూర్చున్నారు. నిజానికి అక్కడ ఆడేవాళ్లు దేనికోసం ఆడుతున్నారో దాన్నే అతి నిర్లక్ష్యంగా కాళ్ళకిందకి తోసి - ఆడుతున్నారు. ప్రతివారి పక్కన సిగరెట్ పీకలగుట్ట ఒకటీ నిప్పుల్లల పొగు ఒకటీ తయారౌతోంది.

రెండో ఆట ముగిసేవరకూ 9 గంటలయింది. ఆటచివర సోమన్న అకస్మాత్తుగా మహోగ్రుడై లేచి తన ప్రత్యర్థి ఒకాయన మీద విరుచుకుబడ్డాడు. ఆట అకస్మాత్తుగా ఆగిపోయి మరునిమిషం ఆ చెక్కల గది రణరంగం అయింది. '' ఏమిటి? ఏమిటి?'' అని అందరూ కలిసి వాళ్ళిద్దర్నీ విడదియ్యడానికి ప్రయత్నించారు. సుబ్బన్నగారు ఏమీ మాట్లాడకుండా ఒకపక్క గోడకానుకుని ఈ ద్వంద్వ యుద్ధాన్ని పరికిస్తూ నిలబడివున్నారు.

సోమన్న తనతోటి సమబలుడైన తన ప్రత్యర్థిని కిందపడేసి తల చెక్క కూర్పుకేసి బలంగా బాదుతున్నాడు. ఇలాగే ఇంకో పదినిమిషాలు సాగితే ఎలావుండేదో... మిగతా సభ్యులందరూ నిశ్చేష్టులై నిలబడివున్నారు ఏమీతోచక, ఏమిటో అర్థంకాక.

ఈ సమయాన, సుబ్బన్నగారు ఆకస్మాత్తుగా తాను నుల్చున్న చోటినించి గబగబ రెండడుగులు ముందుకువేసి, సోమన్న చొక్కాని మెడదగ్గిరపట్టుకుని బలవంతంగా పైకి లేపి నుల్చోపెట్టారు; ఆయన

మొహం మాత్రం ఏమీ మార్పుచెందలేదు. ''సోమన్న గారు! దయచేసి ఈ ద్వంద్వయుద్ధం మానేసి ఏం జరిగిందో మాకే చెప్పండి!'' అన్నారు.

సోమన్న ఒక్కసారి బెబ్బులి లాగా హుంకరించాడు; కాని సుబ్బన్నగారి వేపొకసారి తేరపారిచూసి చప్పున ఉద్రేకం తగ్గించేసుకున్నాడు; తిరిగి తన కాళ్ళకింద లేవటానికి ప్రయత్నించుచున్న ప్రత్యర్థివేపు అసహ్యంగా చూస్తూ, ''దొంగవెధవ, దొంగముక్క జేబులో పెట్టుకొస్తాడా పెద్ద ఆటకి! మీరు అడ్డం రాకపోతే ప్రాణం తీసేవాణ్ణి!'' అన్నాడు. అతని మాటల్లో అసహ్యమే ధ్వనించిందిగాని మొదట్లోవున్న కోపావేశం ఉద్రేకం లేవు.

అక్కడ సమావేశమైనవాళ్లకి సోమన్న యుద్ధం విరమించినందుకూ ఆశ్చర్యం కలగలేదు; ప్రత్యర్థి దొంగముక్క తోటి ఆట ఆడినందుకూ కోపం రాలేదు. ఊరంతా గజగజలాడే సోమన్నని - సుబ్బన్నగారు పిల్లిని పట్టుకున్నట్టు పట్టుకుని లేవదీసి అతన్ని ఒక క్షణంలో లొంగదీశాడేమిటి! అందులోనూ వెనకాముందు పరిచయమైనా లేని వ్యక్తిని! అని ఆశ్చర్యం వేసింది వాళ్ళకు.

ఆవేళటకి ఆట విరమించారు వాళ్లు. దెబ్బతిన్న వాడిదగ్గిర ఒక ఇస్పేటు ఆసుముక్క దొరికింది. అతన్ని అంతటితో వదిలేశారు. వెళ్ళేప్పుడు, సుబ్బన్నగారు అందరిదగ్గరా మామూలుగానే శెలవు తీసుకున్నారు. అట్లాగే, సోమన్నతో గూడా, ''సోమన్న గారు, వెళ్ళొస్తా''. అన్నారు గంభీరంగా.

సోమన్న నిచ్చెనమెట్లు దిగుతూన్న ఆయనవంక వింతగా చూస్తూ తలవూపాడు. తర్వాత ఐదారునిమిషాలు నిశ్శబ్దంగా నిలబడి పోయినాడు. సుబ్బన్నగారి చూపులు అతనిహృదయాన్ని తీవ్రంగా కలిచివేసినట్టయింది అతనికి.

3

ఆ తర్వాతగూడా ఇతరులు ఆశ్చర్యపడేట్టుగా కొన్ని సంఘటనలు జరిగాయి. ఆటీన్ సోమన్న ఇంకెవ్వరిని లెక్క చెయ్యడు; ఇంకెవర్న యినాసరే వాళ్ల పెద్దా చిన్నా అనే తారతమ్యం చూడకండానే వ్యవహరిస్తాడు. మరి సుబ్బన్నగారొచ్చి '' ఏమిటి సోమన్నా!'' అని కొంచెం కళ్లెర్రచేస్తేచాలు స్తబ్దుగా నిలబడిపోతాడు!

సుబ్బన్నగారు ఎంత అతనికి! ఊరివారికీ, సోమన్న స్నేహబృందానికీ ఇది ఆశ్చర్యం కలిగించింది. సోమన్న సుబ్బన్న గారి విషయమై ఎక్కడా ఏమీ నోరుమెదపడు; సుబ్బన్నగారూ అంతే; ఎవరైనా సోమన్నగురించి ఏమైనా అంటే, ''పోనీండి రౌడీవెధవ! వాడికిదడుస్తారేమిటి!'' అని హేళనగా నవ్వి ఊరుకునేవారు.

కాని మిగతా వారిపరిస్థితులంత తేలికగా లేవు. సోమన్న పలుకుబడి అలాగేవుంది. అతనువెళ్లి అడగడం తరవాయి ఎన్నడూ ఎవరికి కానీ ఇవ్వని లుబ్దులుగూడా పదీ పరకా మారుమాట్లాడకుండా ఇచ్చేస్తారు; చీట్లపేక సమాజాల్లోనూ అతని పలుకుబడి యథాప్రకారం సాగిపోతోంది.

ఒకనాడు సోమన్న నడి బజారులో ఒకాయనమీద కలియబడ్డాడు. పోలీసులొచ్చి విడదీశారు

ఇద్దర్నీ. సోమన్నని స్టేషన్‌కి పట్టుకుబోయారు. రెండవతను బాగా డబ్బున్న వాడు కావటంతోటి సోమన్నకి ఎలాగా ఆరునెలలయినా ఖైదు తప్పదు అని అనుకున్నారంతా.

కాని, సుబ్బన్న గారి చెవిని ఈమాట సోకగానే ఆయన స్వయంగా స్టేషన్‌కి వెళ్లి సోమన్న 'భావిసద్వర్తన'కి తాను పూచీ బడి అతనికి జైలు తప్పించి విడిపించుకువచ్చారు. ఇంతకీ పోలీసు స్టేషన్‌లో గాని, బైటకు వచ్చాకగానీ ఆ ఉభయులూ ఒక్కమాటయినా మాట్లాడుకోలేదు.

అదివరదాకా పోలీసుల్నిగూడా ధిక్కరిస్తూ - హుంకరిస్తున్న సోమన్న చప్పున చల్లబడి సుబ్బన్నగారితోటి బైటికి వచ్చేశాడు. పోలీసుస్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ గూడా ఆశ్చర్యపోయినాడు; ఏమిటిది? సుబ్బన్నగారంటే సోమన్నకి భయమా? గౌరవమా?

మరి సుబ్బన్న గారికి సోమన్న అంటే ప్రేమ ఎందుకో?

ఇన్ని ప్రశ్నలూ సోమన్న తన ఉంపుడుగత్తెను ఖూనీ చేసి పారిపోయిననాడు పోలీసులకి కలిగాయి. అందుచేతనే ఇన్‌స్పెక్టర్ గారు సుబ్బన్న గార్ని కలుసుకొని సోమన్నగా రెక్కడవుంటాడో అని అడిగి వెళ్ళాడు... 'సద్వర్తన'కు పూచీ అంతే మరి!

ఇన్‌స్పెక్టర్ సదాశివరావు గారు మర్నాడు సుబ్బన్నగారింటికి వచ్చి ''సోమన్న దొరికేవరకు మిమ్మల్ని...'' అన్నాడు. సుబ్బన్నగారు 'సరే' అని బయల్దేరారు మారుమాట్లాడకండా. దీని అర్థమేమిటో తెలిసిన ఆయనభార్య ఇద్దరుకూతుళ్లూ లోలోపల కుమిలిపోతున్నారు. సోమన్న దొరక్కపోతే! వాడు పరమదుర్మార్గుడు; ఏమైనా చెయ్యడానికి సాహసుడు. అతనికి 'సద్వర్తన'కి ఈయన పూచీపడడమేమిటి!.... వాళ్లు దైవాన్ని ప్రార్థిస్తూవుండడం తప్ప వేరేగత్యంతరం లేకపోయింది.

ఈ సంఘటనగురించి ఊళ్లోగూడా రకరకాల ఊహలు వ్యాపించాయి. తలా ఒక మాట అనుకుంటున్నారు. '' ఇంక సోమన్న కనపడతాడురా? వొట్టిమాట'' అన్నారందరూ ఏకగ్రీవంగా.

''సుబ్బన్న గారికెందుకొచ్చింది ఆ రౌడీ వెధవతోటి? వాడెవడూ, ఈయన ఎవరూ? పరువుగా బతికేవాడల్లా ఇదొక గండం తెచ్చిపెట్టుకున్నాడు నెత్తికి'' అన్నారు సుబ్బన్న గార్ని ఎరుగున్నవాళ్లు.

అయితే సుబ్బన్న గారు మాత్రం నోరు మెదపలేదు; జైల్లో అధికార్లు ఏమేమో ప్రశ్నలు వేశారు; వేటికీన్నీ ఆయన జవాబివ్వనే లేదు.

రెండు రోజులు జరిగిపోయినాయి. సోమన్న జాడ పోలీసులకేమీ అంతుపట్టలేదు.

## 4

మూడో రోజు మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతాల సోమన్న స్టేషన్ దగ్గిర ప్రత్యక్షమైనాడు. సరాసరి హుందాగా లోపలికి నడిచివచ్చిన అతణ్ణి చూసి ఇన్‌స్పెక్టర్ గారు చకితుడైనాడు. పక్కనే నిలబడివున్న పోలీసు తుపాకీగురి చేసుకున్నాడు గూడా. కాని సోమన్న ''ఏం ఇన్‌స్పెక్టర్‌గారు! సుబ్బన్న గార్ని ఖైదులో పెట్టారటే, నాకు బదులు! నాకిందాక తెలిసింది. ఆయన్నొదిలండి. ఇదిగో నేనొచ్చాగా!'' అన్నాడు, ధైర్యంగా రెండు చేతులూ చాచి.

ఇన్స్పెక్టర్ అతని చేతులకి 'పోలీసు కంకణాలు' తగిలించి, ''మరి నీకు ఆయన జామీన్ ఉన్నాడు గదూ?'' అన్నాడు.

''ముందు ఆయన్ని వొదలండి'' అని అరిచాడు సోమన్న ఉద్రేకంతోటి.

''మరెందుకు పారిపోయావు రెండు రోజులనించిన్నీ?'' అంటూ ఇన్స్పెక్టర్ సుబ్బన్నగార్ని వొదలటానికి కావల్సిన ఉత్తర్వులు జారీచేశాడు.

ఇంతకీ ఇన్స్పెక్టర్‌గారికి ఈ విచిత్రం అర్థం కానేలేదు. సుబ్బన్న గారిని విడిపించటంలో సోమన్న కింత ఆసక్తేమిటి?

పది నిమిషాలలో సుబ్బన్నగారు బైటికొచ్చారు. ఆయన మొహం తేటగా లేదు. తీవ్రమైన బాధతోటి ఎర్రబారి వుంది. సోమన్న ఆయన వొస్తూవుంటే తలొంచుకున్నాడు. సుబ్బన్నగారు, చెరొకవేపునా పోలీసులతోటి మధ్యని నిలబడ్డ సోమన్నని చూడగానే ఉద్రేకం పట్టలేక '' ఏం బతుకురా నీది! సోమన్నా! చివరికి ఖూనీకోరువి గూడా ఐనావు!'' అన్నారు అతనిదగ్గిరగా వొచ్చి నిలబడి.

సోమన్నని ఇంకెవరన్నా ఈ మాటలే అంటే చేతికున్న బేడీలతోటే అవతలవారిమీదబడి చంపేసివుండేవాడు. ఇప్పుడితను తల వొంచుకుని ఏమిన్నీ మాట్లాడలేదు. ఒకటిరెండు నిమిషాలైనాక చాలా మెల్లిగా, గొణుగుడుగా, ''నా బతుకే అంత! మీరిప్పుడు విచారించి లాభంలేదు'' అన్నాడు విరక్తిగా.

సుబ్బన్నగారు, ''సిగ్గులేకపోతే సరి, ఇంకా మాట్లాడుతున్నావు గాని! నోరు మూసుకో'' అని అతన్ని కసిరి, ఇన్స్పెక్టర్ వేపు తిరిగి, ''నేను వెళ్ళొస్తానండి'' అని వెళ్ళిపోయినారు. ఆయన వర్చస్సునుబట్టి ఆయన హృదయావేదన ఎంతగా ఆయన్ని వేధిస్తోందీ ఇన్స్పెక్టర్‌కి బోధపడింది.

సుబ్బన్నగారు వెళ్లాక సోమన్నని ఇన్స్పెక్టర్‌గారు ప్రశ్నించాడు. ''సుబ్బన్నగారికీ నీకూ ఏమిటి పరిచయం!'' అని.

సోమన్న యధాప్రకారం గంభీరంగానే '' ఏమీ లేదు. సుబ్బన్న గారు సుబ్బన్న గారే; నేను నేనే. అంతకుమించి నేను చెప్పేదేమీ లేదు'' అన్నాడు.

మర్నాట్నించీ ఖూనీకేసు విచారణ ప్రారంభమైంది.

విచారణ జరిగినంత కాలమూ సుబ్బన్న గారు కోర్టుకి వస్తూనే వున్నారు. అయితే నేరం స్పష్టంగా వుండడంవల్లనూ, సోమన్న తాను 'నేరస్తుణ్ణి' అని వప్పుకోడం వల్లనూ ప్రాసిక్యూషన్ వారి పని తేలికయింది; సుబ్బన్నగారు సోమన్న తరపున ఏదైనా వాదించి ప్రయోజనం లేదని మౌనంగా వూరుకున్నారు.

తీర్పు ఇచ్చేరోజు; ఆవేళ కోర్టుకి సోమన్న స్నేహితులు చాలామంది వచ్చారు. సుబ్బన్నగారూ ఆయన భార్యా కూతుళ్ళిద్దరూ వచ్చారు. సోమన్న యధాప్రకారమే పోలీసుల మధ్య చాలా నిర్లక్ష్యంగా నిలబడివున్నాడు. సుబ్బన్నగారి మొహాన దిగులు వేళ్లాడుతోంది స్పష్టంగా.

అందరికీ తెలుసు సోమన్నకి విధించబొయ్యే శిక్ష ఏమిటో.

జడ్జీ, ''సోమన్న ఖూనీ చేసినట్టుగా చూసిన సాక్ష్యం ఒక చత్వారపు ముసల్ది... మేమీ కేసులో నిజాన్నిగురించి చాలా తర్కించాము. సోమన్నే వప్పుకుంటున్నాడు గదా అని ప్రాసిక్యూషన్ వారి వాదన. అంతకంటే సోమన్నను అపరాధిగా నిరూపించటానికి వేరే సాక్ష్యాధారాలేమీ లేవు; అయితే సోమన్న తాను దోషిని కానని నిరూపించుకోలేదు. కనుక నేరస్థునిగానే భావించి, సరిగ్గా నిరూపణ కాలేదు గనక, పదేళ్ల శిక్ష విధిస్తున్నాను.'' అని ముగించారు తన తీర్పు.

సోమన్నని తిరిగి తీసుకెళ్లుతూ వుంటె సుబ్బన్నగారు ఒకటి రెండు నిమిషాలు నిలబడి మాట్లాడాలని ప్రయత్నించారు; సోమన్న గూడా ఆయనవంక చూశాడు ఏమైనా మాట్లాడుదామని. చివరికి ఆయన ఏమీ మాట్లాడకపోయేవరకూ, ''నేను ఖూనీకోరుని. మీరు మర్యాదస్థులు, నాతో మాట్లాడకండి!...'' అన్నాడు. అతని కండ్లల్లో నీళ్లు నిండివున్నాయి. గొంతు తడారిపోయింది. ఎప్పుడూ తల ఎత్తుకుని గర్వంగా తిరిగే అతని తల వాలిపోయింది.

సుబ్బన్నగారికి ఈ మాటలు గుండెలకి తగిలి వేధించాయి. ఆయన అక్కడ గుమిగూడివున్న జనాన్ని సైతం మర్చిపోయి సోమన్నని అమాంతం కావిలించుకున్నారు. ''సోమన్న, నిన్నీ గతికి తెచ్చింది నేనే... తప్పు నాది... ఫలితం నువ్వు అనుభవిస్తున్నావు?'' అని గాఢమైన శోకంతోటి విలపించారు.

అక్కడ నుంచున్న వారందరినీ ఈ దృశ్యం కదిలించింది. అయితే ఎవరికీ ఏమీ అర్థమైందికాదు. సోమన్న సుబ్బన్నగారి ప్రేమపూర్వకమైన ఆలింగనంలో మైమరిచిపోయినాడు; తరవాత అతన్ని పోలీసులు తీసుకెళ్లిపోయారు. పోతూ పోతూ సోమన్న తిరిగి చూసిన రెండు మూడు చూపులు సుబ్బన్న గార్ని మరింతగా వేధించాయి.

కొందరు మిత్రులు సుబ్బన్న గార్ని ఇంటిదాకా తీసుకొచ్చి వదిలిపెట్టారు. అందులో సుబ్బన్నగారికి బాగా స్నేహంగావున్న ఒకరు, ''సోమన్న ఎవరూ? మీకేమిటంత సానుభూతి'' అని మామూలుగా ప్రశ్నించారు.

5

మా నాన్నకి మొదటి సంబంధం కొడుకును నేను; మా అమ్మకి నేనొక్కణ్ణే. మా అమ్మ పోయాక నాన్న రెండోపెళ్లి చేసుకున్నారు. అప్పటికి నాకు పది పన్నెండేండ్లుంటాయి. మా పిన్ని మంచిది. అందరూ అనుకున్నట్టుగా ఆమె నన్ను ఏమీ బాధపెట్టేది కాదు; పైగా సొంతకొడుకును చూసినట్టు చూసుకునేది; అయితే ఆమె గర్భవతి ఐందగ్గిరనించీ పరిస్థితి మారింది; ఆమెలో మార్పుకి కారణం నాకు మొదట అగమ్యంగా వున్నా, రానురాను బోధపడింది రహస్యం.

అప్పట్నించి పిన్నమ్మ ప్రవర్తలోనూ మార్పువొచ్చింది. నాలోనూ చెప్పలేని ద్వేషం పెరిగింది. ఆద్వేషం, పిన్నిమీద కొంతగానూ, పిన్నికి కలిగిన శిశువుమీద మరింతగానూ రగుల్కొంది.

దీనికి దోహదమిస్తున్నట్టు నాన్నగూడా నా తమ్ముని మీద ఎక్కువగా ప్రేమాతిశయాలు ప్రదర్శించసాగారు. అది సహజం అనే ఆలోచన పన్నెండ్లేండ్ల కుర్రవాణ్ణయిన నాకు బొత్తిగా కలగలేదు; 'పాపాయి పాపాయి' అని నాన్నా పిన్నీ 'వాడికే' అన్ని అవకాశాలూ కల్పిస్తుండేవారు. ఇదివరలో నేనడిగిందే తరవాయి అన్నీ వొచ్చేపరిస్థితి మారిపోయి, నన్నాయింట్లో పలకరించే దిక్కే లేనట్టుగా ఐపోయింది. పైగా అయిందానికీ కానిదానికి పిన్ని నన్ను దండిస్తూ వుండేది. నాలో రగులుతున్న ప్రతీకారాగ్నిని కుర్రవాడిపైన చూపించేవాడిని. అనేక తడవలు వాణ్ణి ఎవరూ లేకండా చూసి కొట్టేవాణ్ణి; గిచ్చేవాణ్ణి... మొత్తం మీద నాలో నా తమ్ముని మీద ఒక ద్వేషభావం కుర్రతనంతో పాతుకుపోయింది...

కాలం ఆగదుగదూ? కొంత కాలానికి నాన్నపోయారు; ఇంటిపెత్తనం నా కొచ్చింది. నాకు పెళ్ళయి భార్య కాపరానికొచ్చింది. పిన్ని గూడా ఒకనాడు - ఎన్నాళ్ళనించో ఆమెని వేధిస్తూవుండిన ఉబ్బసపు వ్యాధికి బలి ఐపోయింది. ఆమె చనిపోతూ పదిహేనేళ్ళ - తన కొడుకుని నాకు అప్పగించివెళ్లింది. ''నేను ఉన్నానుగా'' అన్నాను పిన్నితో. కాని ఆ చిన్నప్పటి కసి నన్నొదిలిపోలేదనే చెప్పాలి...

బాగా తల్లీదండ్రి గారాబంతో పెరిగిన నా తమ్ముడు 'తల్లీ దండ్రీ' లేనివాడు పాపం, అని ఊళ్లోవాళ్ళూ, ఇరుగూ పొరుగూ జోకొట్టటంతోటి మరింత బిగిసి నామాట ఖాతరు చేసేవాడు గాడు. ఎప్పుడూ ఊళ్లో పిల్లలతోటి పోట్లాడి వచ్చేవాడు. న్యాయం ఎవరివేపున ఉన్నా నేను మాత్రం ఎప్పుడూ నా తమ్ముణ్ణే బాదేవాణ్ణి. ఇంకో విశేషం ఏమంటే, వాడు ఎంత నామాట ఖాతరు చెయ్యకపోయినా, నేను గనక కన్నెర్రచేస్తే సరి, నోరెత్తేవాడు గాదు. నేనంటే లోపల ఏమనుకునేవాడో ఏమోగాని పైకి చాలా గౌరవం చూపేవాడు.

''నా భార్య అతన్ని ప్రేమగా చూసేది. చాలా తడవలు వాణ్ణి సహించలేక ''వీడికి కూడుపెట్టక'' అని నేను ఆజ్ఞపెట్టినా వినక దొంగతనంగా అన్నం పెట్టేది.

వాడికి పెళ్ళీడు వొచ్చింది. వాడి భాగం వాడికి పంచి ఇచ్చిపెళ్ళిచేసి పంపిస్తే సరిపోతుందని మా కుటుంబానికి చెందిన పెద్దలు నాకు సూచిస్తూవచ్చారు. కాని నా పరిస్థితి తలకిందులుగా వుంది. నాన్నగారు మా ఉభయులకీ ఉంచిన ఆస్తిలో కొంత భాగం నేను దుర్వ్యసనాలకింద వ్యయపరిచివున్నాను; ఇప్పుడు నా తమ్ముడికి నేను గనక ఆస్తిపంచాల్సివొస్తే - నాకు మిగిలేది స్వల్పం... నాలో ఆదినుండీ తమ్ముడంటే వున్న ద్వేషం తిరిగి వొకసారి ప్రబలింది. ఇప్పుడెలాగైనా వాడికి ఈ ఆస్తి పంచివ్వకుండా చేయగలిగితే... అని నేను ఆలోచించసాగాను.

దీనికి తగ్గట్టే వొకనాడు, నా తమ్ముడు, ఊళ్లో ఉన్న మంచినీటి బావిదగ్గిర ఒక అమ్మాయిని ఏదో అన్నాడని వాళ్ళ వాళ్ళు వొచ్చి గోలచేశారు నా ఇంటిముందు. ఆ రాత్రి వాడు, భయపడుతూనే నేను నిద్రపోయివుంటానని భావించి ఆలస్యంగానే వొచ్చాడు ఇంటికి. నేను వాడే వేళకైనా రానీ, ఇవ్వాళ అటో ఇటో తేల్చుకోవాలని కూర్చునివున్నాను.

వాడు లోపలికి రావటంతోటి '' ఏరా, ఏం రానురాను ముదిరిపోతోంది వ్యవహారం! నేనేమైనా మర్యాదగా తలెత్తుకుని నలుగుర్లో తిరగాల్నా అక్కరలేదా!'' అన్నాను కోపంతోటి మండిపోతూ. వాడేమీ

నోరెత్తలేదు; వాడికీ ఇరవై ఏళ్లున్నాయని అయినా ఆలోచించక నోటికొచ్చినట్టు దుర్భాషలాడాను; ఆ పక్కనే ఉన్న వసికర్ర తీసుకుని గొడ్డును బాదినట్టు బాదాను. నా భార్య అడ్డం వస్తే దాన్నీ బాదాను.

'ఆవేళ వాడు, వొచ్చే ఏడ్పును బలవంతంగా అణచుకున్నాడు. ఆగ్రహాన్ని తమాయించుకున్నాడు. నేను తప్ప, వాడు మావూళ్లో ఇంకెవరికీ తలవొగ్గే రకం కాదు. చివరికి వాడు కళ్లెర్ర బారి, మొహం సిగ్గుతోటి చిన్నబుచ్చుకుని, ''నేనీ యింట్లో వుండడానికి అనర్హుణ్ణి అన్నయ్యా... వెళ్తాను'' అంటూ, నా భార్య ఎంత బతిమాలినా వినిపించుకోకుండానే వెళ్ళిపోయాడా చీకటి రాత్రిలోనే....

''పోతే పోయాడు వెధవ! నన్ను పరువుగా బతకనీయకండా వున్నాడు!'' అనేసి వూరుకున్నాను నేను. నా ఉద్దేశం వాడు త్వరలోనే తిరిగి వస్తాడని... ఈపైపై ఊహలకి అట్టడుగున 'రాకపోతే' బాగుండునే అనిపించింది...

ఆ నెల చూశాను... నెల సంవత్సరమైంది... అనేక ఇతర కారణాలవల్ల నేను శ్రీకాకుళం వొదిలి పెట్టి, రాజమండ్రి వొచ్చేశాను... పదేళ్ళయింది. నా ఆస్తి కరిగిపోవడం ఒక కారణం... నా తమ్ముడు భాగం అలా నేవుంది... దానిమీద వొచ్చే రాబడితోటి కాలం గడుపుతున్నాను... చీట్లపేక గూడా కొంత ఆదాయాన్నిస్తూ వుండేది...

'' ఆవేళ, ఆర్యాపురంలో పదేళ్ల తరవాత సోమన్నని చూశాను... చీట్లపేక ఆడుతూంటే...

''వాడు బాగా పెరిగి నా అంతవాడై వున్నాడు! ఆటీన్ సోమన్న అంటే నాకూ యథార్థంగా ఎవరో తెలియదు అంత క్రితం. నా తమ్ముడు సోమన్నే, ఆటీన్ సోమన్న అని తెలుసుకున్నాక ఏమీతోచలేదు. అయితే ఆవేళ వాడు, ఇంకోడితో ఘర్షణపడితే నేను విడదీశాను... వాడూ నన్ను పోల్చుకున్నాడు. ఉభయులం అన్నదమ్ములము బైటపడడానికి కొంచెం జంకాము. ఏమిటో! ఆటీన్ సోమన్న అంటే ఊళ్లో రౌడీ - దొంగ అనిగదా ప్రసిద్ధి! వాణ్ణి నా తమ్ముడని చెప్పుకోడం నాకంతగా ఇష్టం లేకపోయింది. పరాయివాణ్ణి పలకరించినట్టే పలకరించి వచ్చేశాను. నేను 'తమ్ముడూ!' అనలేదనే ఆవేదన వాడి మొహంలో కనిపించింది అప్పుడే.

ఆవేళ రాత్రి సోమన్న నా యింటికి వచ్చాడు. నాకు ఆస్తి దిగులు పట్టుకుంది. ఈ సుఖజీవనానికి భంగం వస్తుంది... అంతే గాదు, నా కూతుళ్లిద్దరికి పెళ్లిళ్లు చెయ్యాలి.

సోమన్న, నా భార్యతోటి మాట్లాడాడు. నా కూతుళ్లిద్దరూ 'బాబాయి బాబాయి' అని వాడిచుట్టూ తిరిగారు. నాకేమో ఎవరేనా చూస్తారేమో! '' ఆటీన్ సోమన్న సుబ్బన్న గారి తమ్ముడా!'' అని నిరసనగా మాట్లాడుతారేమో అని భయం.

చివరకి సోమన్నా, నువ్విక్కడికి రావటం తగదు... నేనెంతో పరువుగా పెద్దమనిషిగా బతుకుతున్నాను'' అన్నాను. అప్పుడుగూడా 'తమ్ముడూ' అనలేకపోయాను. నాకు చిన్నప్పట్నించీ వాడు తమ్ముడన్న భావన లేదు... ఏదో శత్రుత్వం!

సోమన్న ''రానులే అన్నయ్యా! నాకు తెలుసు మర్యాద, పరువూ అంటే ఏమిటో!'' అనేసి

వెళ్లిపోయినాడు. వాడు వెళ్లాక నా భార్య నాతోటి పోట్లాడింది వాణ్ణి అలా అన్నందుకు. ఆమె నోరు మూయించాను...

ఒకనాడు వాణ్ణి పోలీసులు పట్టుకుపోతే 'పూచీకత్తు' రాసిచ్చి విడిపించాను. నాభార్య వత్తిడిమీదనే. బైటికి వచ్చాక ''మీ కెందుకు ఇంత శ్రమ ''సుబ్బన్నగారు!'' అని అడిగాడు అవహేళనగా. వాడు నన్ను 'సుబ్బన్నగారూ!' అని సంబోధించేటప్పటికి నా హృదయాన్నెవరో రంపం పెట్టి కోస్తున్నట్టుంది... అయినా మెదలకుండా వూరుకున్నాను.

తరవాత సంగతి మీకు తెలిసేవుంది... సోమన్న ఇందాక కళ్ల నీళ్లు పెట్టి, ''మీరు మర్యాదస్థులు - నాతో మాట్లాడకండి'' అన్నాడు.

నాకు ఆత్మహత్య చేసుకుందామన్నంత విరక్తి పుట్టింది. లోకంలో మర్యాదకోసమూ, పరువుకోసమూ, ధనంకోసమూ నేను, నా నిజమైన శ్రేయస్సు కోరే 'తమ్ముణ్ణి' చేతులారా పోగొట్టుకున్నాను. వాడు హత్య జరగటానికి ముందు రాత్రి నా యింటికి వొచ్చాడు.

వాడి వొదినతో మాట్లాడుతూ కాసేపున్నాడు. ''వొదినా, అమ్మాయిలకి పెళ్ళెప్పుడు చేస్తారు?'' అని అడిగాడు గావును. నా భార్య. '' ఎలాగ తెములుతుందో నాయనా, మీ అన్నయ్య ఏమి పట్టించుకోరు. ఆయన భాగం ఆస్తి అంతా అమ్మేసుకున్నారు. ప్రస్తుతం నీ భాగం ఆస్తిమీద వొచ్చే ఆదాయంతోటి, జీవిస్తున్నాం...'' అన్నది ... ఆమెకి మనఃపూర్వంగా నా తమ్ముడి ఆస్తివాడికిచ్చెయ్యాలనే ... వుంది!

నేను నా గదిలో పడకకుర్చీలో పడుకుని ఈ సంభాషణంతా మౌనంగా వింటున్నాను. వాడేమంటాడో! 'నా ఆస్తి నాకు పంచి ఇవ్వండి...' అంటే తప్పేదేమీ లేదు. కనీసం పరువు ప్రతిష్ఠలకి దడిసి ఐనా ఇచ్చేస్తాను కదా! ప్రేమ లేకపోయినా గాని!

''అదేమిటి వొదినా, అన్నయ్య భాగం ఏమిటి, నా భాగం ఏమిటి! ఉన్న ఆస్తి అంతా మనది. అందులో కొంత అమ్మేసి, అమ్మాయిల పెళ్ళి చెయ్యమను అన్నయ్యని. దీనికి నన్ను అడగాలా!'' అన్నాడు నిజమైన ఔదార్యం స్ఫురించే స్వరంతోటి.

అటువంటి తమ్ముణ్ణి పోగొట్టుకున్నాను... ఇప్పుడు తెలుస్తోంది, వాడి విలువ. నేను గనక వాణ్ణి చిన్నప్పుడే ప్రేమించి, సంస్కరించి వున్నట్టయితే వాడు ఇలా రౌడీగా తయారుగాకపోను... చివరికి హంతకుడైనాడు గదా! ఆ తప్పంతా నాది!...

సుబ్బన్నగారు ఆపైన ఏమీ మాట్లాడకుండా కూర్చుండి పోయారు. పశ్చాత్తాపంతోటి ఆయన కళ్ళల్లో నీళ్లు నిండాయి. మిత్రులు ఆయన్ని వోదార్చి ఎవరిళ్ళకి వాళ్లు వెళ్ళారు, ఈ కథకి ఆశ్చర్యపడుతూ.

***(1955 – 56, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక)***

# పరిష్కారాలు

''ఏంరా అన్నయ్యా, నీకు జీతం ఎప్పుడొస్తుందేమిటి?'' అని అడిగింది - చెల్లెలు విజయ - రాఘవరావును ఆవేళ ఆఫీసు నుంచి రాగానే.

''నీ కెందుకు?'' అన్నాడు రాఘవరావు టెక్కుగా. సరాసరి తనగదిలోకెళ్ళి కుర్చీలో కూర్చోబడ్డాడు: విజయ కూడా వెళ్ళింది '' ఎందుకంటా వేమిటిరా, నాకో ఐదురూపాయలు ఇవ్వు. ఓ రవిక గుడ్డ కొనుక్కుంటాను. మా అన్నయ్య ఇచ్చాడని అందరికీ చెప్పుకుంటాను!'' అన్నది విజయ.

''ఏడ్చినట్టేవుంది. జీతం రావటంతోటే ముడుపుకట్టి అమ్మకు తెచ్చి ఇస్తాను. అమ్మ ఇష్టం!'' అన్నాడు రాఘవరావు.

''మిగతా అంతా యిచ్చెయ్యరా! ఒక్క రెండంటే రెండు రూపాయలుమాత్రం ఇవ్వు, చాలు. గాజులేనా తొడిగించుకుంటారా!'' అన్నది చెల్లెలు బతిమాలుతూ.

''ఏం మాట్లాడకూడదు! అమ్మకిస్తానన్నాను. అమ్మకే ఇచ్చేస్తాను. అంతే'' అనేశాడు రాఘవరావు. ''కోప్పడకుమరి'' అని గూడా అన్నాడు.

''కోపం ఎందుకేమిటి? బుద్ధిమంతుడివి గనక జీతం తెచ్చి అమ్మకిస్తానంటున్నావు!'' అంటూ మూతితిప్పి వెక్కిరించి లోపలికి పోబోయింది - ఇంకా రెండు మూడు నెలలకు కాపరాని కెళ్ళవల్సినచెల్లెలు. ఈ సంభాషణంతా వింటూనే తల్లి సుబ్బమ్మగారొచ్చింది యింతలో.

''ఏమిటిరా అన్నా చెల్లెలు తర్కం? పని చేసి చేసి వచ్చాడుగదా, వాడికి కాఫీ తెచ్చిద్దాం అన్నాలేకుండా ఏమిటే వాడితో నీకుతర్కం?'' అని కోప్పడిందామె కూతుర్ని.

''వొదిన ఏంచేస్తోందేమిటి? ఆవిడ ఇవ్వగూడదూ?'' అన్నది విజయ లోపలికివెళ్తూ.

''అమ్మా, జీతం ఇవ్వగానే తెచ్చి ఇచ్చేస్తాను. నువు ఏం చేసుకున్నాసరే!'' అన్నాడు కుమారుడు.

''నాకెందుకురా డబ్బు దస్కమూను? నాకు గంగానమ్మ మొక్కొకటివుంది. అది తీర్చుకోవాలి; అంతే'' అన్నది సుబ్బమ్మగారు

''దేనికీ మొక్కులు?'' అన్నాడు రాఘవరావు.

''ఏముంది? నీకు ఉద్యోగం ఐతే, నీ మొదటిజీతం అలాగే ముడుపుకట్టి చెల్లిస్తాను అని మొక్కుకున్నారా... అదీ!'' అన్నది తల్లి.

''ఉం....'' అన్నాడు కొడుకు.

ఇంతలో తండ్రికూడా వొచ్చాడు ఆఫీసునుంచి, క్లబ్‌కి పోయి, కాస్త కాలక్షేపంచేసి. '' ఏమిట్రా ఏదో, ముడుపూ విడుపూ అంటున్నది మీ అమ్మ!'' అని ప్రశ్నించాడాయన.

''మనగంగానమ్మకండీ, మొక్కుబడి'' అన్నది సుబ్బమ్మగారు.

''అదేమిటి? 'మన' అంటున్నావు? నీ పుట్టింటి కుల దేవత గంగానమ్మగావును. మా కులదైవం ఆదికేశవస్వామి వారు'' అన్నాడు తండ్రి. రాఘవరావు ఏమీ మాట్లాడకుండా నుంచున్నాడు.

''అయితే ఏమంటా రిప్పుడు? ముడుపు చెల్లించక్కర్లేదనా?'' అన్నది సుబ్బమ్మగారు భర్తనుద్దేశించి.

''ఆదికేశవస్వామివార్కి నేనూ మొక్కుకున్నాను మరి, వాడి మొదటిజీతంతో అభిషేకం సహస్రనామార్చనా చేయిస్తానని'' అన్నాడు తండ్రి గోపాలంగారు.

''మా పుట్టిల్లంటేనే మీకు సరిపడదు. మీ ఇష్టం వొచ్చినట్లు చేసుకోండి'' అని సుబ్బమ్మగారు బయలుదేరింది.

రాఘవరావు '' ఏమిటమ్మా, దీనికి ఇంత రగడ. గంగానమ్మకి సగం, ఆదికేశవస్వామికి సగం చొప్పున జీతం పంచేస్తాను సరా'' అన్నాడు సర్దుతూ.

''అదీ కొంతవరకు ధర్మమే మరి'' అన్నాడు గోపాలంగారు.

★ ★ ★

రాఘవరావు ఇంట్లోంచి బైటికివచ్చి రోడ్డుమూలమీద కిల్లీకొట్టుదగ్గరకెళ్ళాడు. ఇంట్లో కాల్చడానికి వీల్లేని సిగిరెట్లు తగలేసి వద్దామని. అక్కడ స్నేహితులున్నారు.

''ఒరే, మనవాడికిజీతం నాలుగోతారీఖున వస్తుందిరా!'' అన్నాడు చిదంబరం, పక్కనేవున్న రామ్మూర్తితోటి.

రామూర్తి రాఘవరావుని ప్రేమగా వీపుమీద దభేలున చరచి, ''అందరూ సంతోషించవలసిన విషయమే మరి!'' అన్నాడు. రాఘవరావుకి కళ్ళుతిరిగాయి. క్రిందపడి పోవడం తరువాయి.

''మీకెందుకోయ్ సంతోషం'' అన్నాడు రామారావు.

''దేనికి అంటావేమిటిరా దేభ్యం. వీడికి ఆఫీసులో జీతం ఇస్తారనుకో, ఆ వేళ ఏంవారం? శనివారంగదూ? వెంటనే మనంఅందరం సరాసరి కృష్ణా కేఫ్‌కి వెళ్ళడం యెవడివోపిక యెంతో అంతా తినటం!'' అన్నాడు రామూర్తి.

చిదంబరం, ''అక్కడినుంచి సరాసరి సినిమాకెళ్ళడం. అంతేనా రాఘవరావు?'' అని ప్రశ్నించాడు.

చిదంబరం పక్కనేవున్న అచ్యుతరావు, '' ఒరే మీ బుద్ధులు ఏమిటి యిలా ఐపోతున్నాయి! మర్నాడు ఆదివారం కదా? ఆవేళ ఉదయమే బయల్దేరి యెక్కడికన్నా పిక్నిక్‌కి పోదాం! సరదాగా వుంటుంది'' అని అందించాడు.

''చాలా సరదాగా వుంటుందిరా! అమరావతికివెళదాం!'' అన్నాడు రామ్మూర్తి. ''అచ్యుతరావు యెప్పుడూ తెలివిగలవాడులే'' అని గూడా అన్నాడు.

రాఘవరావును వాళ్ళసలు మాట్లాడనివ్వనేలేదు. రాఘవరావు వాళ్ళతో ''సరే'' ''సరే'' అని ఎలాగో బైటపడి ఇల్లు జేరుకున్నాడు. '' ఎందుకు జేరాముురా ఈ ఉద్యోగంలో!'' అనిపించిదతనికి.

ఆవేళరాత్రి అతనిభార్య, ''మొదటి జీతం పంపిణీ సక్రమంగా జరిగిందా'' అన్నది పుల్లవిరుపుగా.

''ఏమిటి?'' అన్నాడు రాఘవరావు విరక్తిగా. ''నువ్వే బాకీ అనుకుంటున్నా యింక అడగడానికి'' అన్నాడు.

''నేనెందులో జమలెండి! కానివ్వండి! నోరు మూసుకుని పడివుంటే పోయేదానికి ఎందుకొచ్చిన గొడవ నాకు?'' అన్నదామె.

''అబ్బ! వూరుకోవే. ఇంకా ఆ రూపాయలెట్లావుంటాయో కళ్ళతోనైనా చూడలేదు. అందరూకలిసి చంపుతున్నారు; ఇదిగో చూడు పిచ్చిదానా! ఎందుకలా ఇదయిపోతావు? నేను సంపాయించేది నీకోసం గాక యింకెవరి కోసం!'' అన్నాడు సముదాయిస్తూ.

★ ★ ★

వాళ్ళమ్మ గంగానమ్మ మొక్కుబడి తీర్చటానికి పూజ, అభిషేకాలకు ఏర్పాట్లుచేస్తోంది. తండ్రి ఆదికేశవస్వామివారి అభిషేకం, అర్చనలకు ఏర్పాట్లుచేసి వచ్చాడు.

స్నేహితులు ప్రయాణ సన్నాహం చేస్తున్నారు.

చెల్లెలు గాజులు తొడుక్కోడానికైనా అన్నయ్య డబ్బు లిస్తాడులే అని సంతోషిస్తోంది.

రాఘవరావు జీతం తీసుకున్న రోజున చల్లగా స్నేహితుల కంటబడకండా తప్పించుకుని ఎటో పోయినాడు.

పొద్దుగూకిన తర్వాత ఇంటికి వచ్చాడు. రావడంతోటే తల్లికి నమస్కరించాడు. అతని చేతిలో సంచీ వున్నది! ''దీర్ఘాయుష్మాన్‌భవ!'' అని దీవించింది తల్లి. ఇంటిల్లిపాదీ ఆశతో చూస్తున్నారు అతనివంక.

''అమ్మా!'' అని ప్రారంభించాడు కొడుకు.

అతనిభార్య వంటింటి గడప దగ్గిర నుంచుని చూస్తూంది.

రాఘవరావు సంచీలోంచి పెద్దపొట్లంతీసి బైటపెట్టాడు.

''అంతా చిల్లరగా ఇచ్చారా ఏమిటిరా అన్నయ్యా లేక అవన్నీ కరెన్సీనోట్లేనా?'' అన్నది ఆశ్చర్యపడుతూ చెల్లెలు.

''అమ్మా నువ్వు ముత్తైదువుకు పెట్టుకోవాలనుకుంటున్నావు కదూ ఈ మధ్య!'' అంటూ ప్రారంభించాడు సుపుత్రుడు.

''అవునురా'' అన్నది తల్లి.

''ఇదిగో, ఫస్టుక్లాస్ చీరెతెచ్చాను. ఎటుతిరిగీ ముత్తైదువకు పెడ్దామనుకుంటున్నావుగా. మీ కోడలికి పెట్టుకో పై శుక్రవారం!'' అన్నాడు రాఘవరావు చిరునవ్వు నవ్వుతూ. అతని భార్య వంటింట్లోకి పోయింది - నోటికి చెంగు అడ్డం పెట్టుకుని నవ్వుతూ.

''చీరె ఎంతేమిటిరా?'' అన్నది ఉక్రోషం కొద్దీ చెల్లెలు.

''ఏభై రూపాయలు'' అన్నాడు అన్న ఆమెవైపుకు చూడకుండానే - గోడవంక చూస్తూ.

''జీతం సరిపెట్టావు!'' అన్నారు తల్లీ తండ్రి ఒక్కసారే.

# కళారాధకుడు

## 1

వినీలాకాశం కారుమబ్బులుకమ్మివుంది. విశ్రాంతిగా షికారుపోదామని లీలవచ్చింది. వాన వస్తుందేమో అని భయపడ్తూనే, వస్తే ఫర్వాలేదులెద్దూ అనుకుంటూ గొడుగు పుచ్చుకొని బయల్దేరాం:, మా అమ్మ వెనకనించి అన్నది ''చలిగాలి వీస్తోందిగదుటే, ఇప్పుడేం షికారు?'' అని. చదువుకుంటున్న వాళ్ళం ముసలమ్మలమాట వింటామా? బయల్దేరాం. తేనాంపేటమీదుగా ఆళ్వార్‌పేట టర్నింగ్‌దగ్గరికి వొచ్చాం. 'కొంచెం పైకిపోదామా?' అన్నాను లీలవంక చూచి. లీల నాకన్న వస్తుతఃకొంటెది. అది నా ప్రశ్నకి నవ్వి 'నిన్నెవర్నీ ఎత్తుకెళ్ళనీయను లేవోయ్! భయపడకమ్మా!' అన్నది, ముందు నడుస్తో.

''ఇట్లా నడిరోడ్డుమీద పరాచకాలాడవద్దని ఎన్నోసార్లు చెప్పాను. బుద్ధుంటేగా!'' అన్నాను లేనికోపంతో. ఆకాశంలో నల్లనిమబ్బుల్ని చీల్చుకుంటూ పడమరనుండి కొబ్బరి ఆకులమీదపడే ఆరంజిరంగు సూర్యకిరణాలు లీల మొహంమీద వింతగా ప్రతిఫలిస్తున్నాయి. ఆమె కిలకిలా నవ్వింది.

''ముసలాళ్ళ ఛాందసం నీకు వొంటబడ్తోంది.'' అన్నది చకచక నడకసాగిస్తూ.

ప్రకృతి సౌందర్యం పురుషుడికీ స్త్రీకి ఒకేవిధమైన వుద్వేగాన్ని కలిగిస్తుంది గావును! నేనూ లీలా ప్రకృతి శోభకి ముగ్ధులమై మౌనంగా లజ్‌వేపుకి నడుస్తున్నాం. మబ్బులు నల్లబడి, సన్నగా తుప్పర ప్రారంభమైంది. లీల గొడుగు విప్పి 'గొడుగులోకి రావోయ్! తడిస్తే కరిగిపోగలవు' అంది మళ్ళీ పరాచకంగా. నేనేమీ మాట్లాడలేదు. రెండు మూడు గజాలు నడిచేప్పటికి వాన జోరుగా కురియసాగింది. గొడుగు యిద్దర్నీ వాననుంచి రక్షించలేకపోతోంది. ఒక పక్క సగం తడుస్తూనే గబగబ నడిచాం, ఎక్కడన్నా నుంచుందామని. అరుగులన్నా లేవు... లీల భారత్‌కేఫ్‌లో జొరబడి, స్త్రీల ప్రత్యేకస్థలం అని వున్న గదిలోకి వెళ్ళింది. నేనూ ఆమెని అనుసరించాను. కుర్చీమీద కూర్చోబోతూ, ''రావే కల్యాణీ! ఎప్పుడూ ఆలస్యమే'' అని పిలిచింది లీల. నేనూ ఆమెకి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాను తడిసినపైట పిండికుంటూ మొహంమీది నీళ్ళు తుడుచుకొని, ''కాఫీ తాగుదాం?'' అన్నది లీల.

''సరే'' అన్నాను సంసిద్ధురాల్నై.

మేము గబగబ లోపలికి రావటంచూచి కొంతమంది మొగరాయుళ్లు, హేండ్ కర్చీపులు అడ్డం పెట్టుకుని ముసి ముసినవ్వులు నవ్వుతున్నారు. ఆ నవ్వులు చూస్తే నాకు వొళ్లు మండింది. గడపలో మా ఆర్డర్‌కోసం ఎదురుచూస్తున్న సర్వర్ వంక చూడకుండానే లీల, ''రెండు కాఫీ, స్ట్రాంగ్'' అన్నది.

కాఫీ వొచ్చింది. నిదానంగాతాగాం. వాన వెలుస్తుందేమో బయటికి పోదామని చూస్తున్నాం. ఎంతకీ వెలిసేకళ కనపడలేదు. లైట్లువెలిగాయి. 7 గంటలు కావస్తోంది. మా అన్నయ్య కోప్పడతాడేమో అని నాకు దిగులేస్తోంది. గదినుండి బయటికివచ్చాం. ఇంకా చినుకులు పడుతున్నై. బయటికి ఎట్లా పోవడం?... లీలకి ఇదే తాపత్రయం. హోటల్ గడపమీద నుంచొని చెయ్యిజాపి చినుకులు తగ్గాయేమో అని చూస్తున్నది లీల. ఒక మగపెద్దమనిషి మా తాపత్రయం గమనించి కాబోలు '' ఎక్కడికి వెళ్ళాలండి? బండి పిలవమంటారా?'' అని అవ్యాజప్రేమ ప్రకటించాడు. మగవాసన ఏమాత్రమూ గిట్టని లీల ''మీ సహాయాన్ని ఎవరూ కోరడం లేదు. మీకు ధన్యవాదాలు'' అని విదిలించింది అతన్ని. నాకు అట్లానే అనాలనిపించింది... కాని అతను వొదల్లేదు. ఓ జట్కాపోతోంది రోడ్డుమీద. పిలిచాడు. జట్కావాడికి ఆ పెద్దమనిషి మమ్మల్ని చూపి, ''వీర్ని ఎక్కడికి వెళ్లాలో అక్కడికి తీసుకెళ్లు'' అన్నాడు. లీలకి నాకు అతనిచొరవమీద కోపంవచ్చింది. కాని ఇంటికివెళ్ళడం అవసరమయ్యె... మనసులో అతన్ని అభినందించుకుంటూ, పైకి అతన్ని రుసరుసచూస్తో ఇద్దరం జట్కా ఎక్కాం. అడక్కుండా అంత సాయంచేసిన పెద్దమనిషి పేరైనా అడక్కపోడం మరియాదగా తోచలేదు నాకు. బండి లోంచే తల బైటికి పెట్టి ''మీ పేరు?'' అని అడిగాను. లీలకి ఇది నచ్చదని తెలిసే. బండి దగ్గిరికి వొచ్చి, ''నా పేరు సోమసుందర్. అసిస్టెంట్ డైరెక్టర్, వీణాఫిలిమ్స్'' అన్నాడతను. పైగా, మరియాద ధ్వనించే గొంతుతో, ''మీ రెవరో తెలుసుకోవచ్చా?'' అని అడిగాడు నమ్రతగా. లీల ఆగ్రహంగా, ''దానికేం, నేను లీల డాటర్ ఆఫ్ రంగారావుగారు డ్కాక్టర్, తేనాంపేట. ఈమె కల్యాణి. డాటర్ ఆఫ్ ఆనందరావుగారు లాండ్ లార్డు... తేనాంపేట. చాలునా? ఇంకేమన్నా కావాలా?'' అని, బండివాడితో ''తోలవోయ్!'' అంది. మా అపరిచిత వుపకారి కాస్త చిన్నబోయాడు. దీపాలకాంతిలో జట్కావాడిదగ్గిరికి వెళ్ళి, హిందీలో ఏదో అన్నాడు. తర్వాత నా వంక చూచి ''నమస్తే'' అని హోటల్లోకి వెళ్ళిపోయినాడు. బండి తొరతొరగా తేనాంపేటవైపుకి సాగిపోయింది. లీలకు నా చొరవకి నా మీద కోపంగాబోలు. దారిపొడుగూతా మౌనంగా వుండిపోయింది.

## 2

రెండురోజులు లీల మాయింటికి రాలేదు. కాలేజీలోనూ నాతో మాట్లాడలేదు. ఏమిటీ! దాని కింత కోపంవుంటే, నాకుమాత్రం వుండదూ? కాని, దసరా సెలవులిచ్చారు. మొదటి రోజునే లీల మాయింటికి రాకతప్పలేదు - పొద్దుపోక. ''కోపం ఇప్పటికన్నా పోయిందా లీలా?'' అన్నాను. లైబ్రరీరూంలో కూర్చుని '' ఎక్కువైందిగూడానూ!'' అన్నది చేతిలో పుస్తకం ఎదురుగా బల్లమీద పడేసి.

''మరి ఇంకోవారం మాట్లాడకపోయివుందువే, కోపం ఎక్కువైతేనూ!'' అన్నాను వెటకారంగా.

''జరిగిందేమిటో సాంతం వినకండా మాట్లాడితే చెప్పలేనే!'' అంది విసుగ్గా.

''ఏం జరిగిందేమిటి?'' అన్నాను కుతూహలం కనపరుస్తూ.

''అతను కనపడ్డాడు!''

''ఎక్కడా?''

''అళ్వార్‌పేట టర్నింగ్ దగ్గర ఎదురైనాడు నిన్న సాయంత్రం. అతన్ని చూచిగూడా తలొంచుకుని వెళ్తున్నాను. కాని అతను చాలా సన్నిహితుడల్లే పలకరించాడు. నాన్సెన్స్!''

''అతన్నిగాని నువ్వు కొట్టలేదుకద?''

''అంతపని అయ్యేదేగాని....''

''కాని......''

''విను మరి. ఎక్కడికి వెళ్లన్నారు?'' అని అడిగాడు. ''ఎక్కడికైతే ఎందుకులెండి?'' అని రెట్టించి వెళ్ళబొయ్యాను. కాని, అతను ''క్షమించండి, నేనేదైనా తప్పుచేసివుంటే!'' అనేప్పటికి ఆగిపోయాను. 'తప్పేముందండి' అన్నాను ఫీలై.

''తరువాత...!''

''తరువాత, అతని పరిస్థితులూ అవీ చెప్పి సినిమాల సంగతి ఎత్తాడు. నా సంగతి వేరే అడగాలా? తెలుగుసినిమాల మీద నా ద్వేషం అంతా వెళ్ళబోశాను. అంటే చచ్చేట్టుతిట్టాను. అతను నాతో చాలా విషయాల్లో ఏకీభవించాడు. ఈ పాత డబ్బా నటీమణులందర్నీ వెళ్ళగొడితేగాని తెలుగుసినిమారంగం బాగుపడదన్నాను నేను. అతనుకూడా వొప్పుకున్నాడు. అంతటితో వూరుకోక, ''మీబోటి కుటుంబస్త్రీలూ, విద్యాధికులూ సినిమాల్లో నటించటానికి వొస్తే మీరన్న పరివర్తన వొస్తుంద''ని మొహానఅన్నాడు. నిజమేననుకో అతనన్నమాట. కాని మనబోటివాళ్ళం సినిమాల్లో నటించటానికి, అక్కడి వాతావరణం ఎంతమాత్రం అనుకూలించదు. అదొకనరకం. ఈమాటే అతనితో నిర్మొహమాటంగా అన్నాను. శీలవతియైన స్త్రీ ఈరోజున తెరమీదచూపే అసహ్యదృశ్యాల్నే చూడ లేకుండావుండే. ఇక సినిమాల్లో నటించటానికి రావడమా?'' అని నేననేటప్పటికి అతని మొహం ఎర్రబడ్డది.

''ఏమన్నా సమర్థించాడా. అదంతా అబద్ధమని?''

''చెప్పేది వినవే సాంతం. సినిమాల్లో నటిస్తే శీలాన్ని కాపాడుకోవచ్చునట! శీలవతియైన స్త్రీ ఎక్కడైనా తన ప్రవర్తనవల్లనే శీలవతి ఔతుందిగనక, సినిమాల్లో కుటుంబస్త్రీలు నటించటంవల్ల వాళ్ళకేమీ నష్టం వుండదట. ఇది అతనివాదన. మీ మొగాళ్ళు, ఎంతశీలవతినైనా ఏదోవిధంగా నాశనం చేయడానికే చూస్తారన్నాను తీవ్రంలేని వ్యంగ్యధోరణిలో. అతను చాలా అవమానం ఫీలైనాడు. 'అందరూ అట్లావుండరండీ. పొరబడుతున్నారు' అన్నాడు. ఇంతలో ఏం జ్ఞాపకం వచ్చిందో ఏమో, ''టైం అయిందండి, వెళ్తాను'' అని జయాస్టూడియోస్ వైపు వెళ్ళిపోయాడు.

''పోతే పోయినాడుగాని, ఎప్పట్నించో సినిమాల్లో నటించాలనుకుంటున్నావుగదా! ఈ అసిస్టెంట్ డైరెక్టర్‌గారి హామీతో, సినిమాల్లో చేరుతావా?'' అన్నాను హేళనగా. లీల శాంతంగానే చెప్పింది!

''ఇంకా కొన్ని సందేహాలున్నై. అవిగూడా తీరినట్టయితే సినిమాల్లోకి వెళ్ళాలనేవుంది'' అన్నది.

''ఎంతయినా కళాభిమానివి! కాని, ఇప్పటి ఈ సమాచారం గూడ మొగవాడి ఎత్తేనేమో అని నాభయం'' అన్నాను నిజంగానే అట్లా ఫీలై.

''అదేనా ఆలోచనగూడాను! అయితే నా సంగతి తెలుసుగద! ఏదైనా కాస్త అనుమానానికి ఆస్పదమైన విషయం గోచరించినా, ఎడం కాలు స్లిప్పరు వుండనేవుందాయెను'' అన్నది ధీమాగా. నిజమే లీల దేనికీ వెనకాడే స్వభావం గలది కాదు. అంత మొండిధైర్యం కలది మా స్నేహితురాళ్ళలో లేనే లేరని చెప్పాలి!

''ఏమో జాగ్రత్తగా వుండాలి సుమా!''

''ఏం ఫరవాలేదు'' అని షికారు బయల్దేరింది లీల. నేనూ వెళ్ళాను కూడా.

### 3

ఐదారు రోజులవరకూ లీల పత్తాలేదు. నేనైనా దాని కోసం వాళ్ళింటికి పోవడానికి పడలేదు. వారం తర్వాత మా యింటికి వొచ్చింది. సంతోషంగా కనపడ్డది. '' ఏమిటోయ్! చాలాకులాసాగా కనపడ్తున్నావు!'' అని అడిగాను. లీలని కదిలిస్తేగాని వాగుడులోకిదిగదు. లైబ్రరీరూమ్‌లో టేబుల్ మీద కూర్చొని కళ్లు ఓరగాపెట్టి, ''కళ్యాణీ! నేను ఏపోజులో బావుంటానో చెప్పు!'' అంటూ గొల్లుమని నవ్వింది. నాకేమీ అర్థంకాలేదు దానిధోరణి. ''కల్యాణీ! నేను ఈవారంరోజులూ ఏంజేస్తున్నానో తెలుసా?'' అని అడిగింది నవ్వాపి.

''నాకు జ్యోతిషం రాదుగా!'' అన్నాను.

''ఊహించి చెప్పుకో!'' అంది కొంటెగా.

నాకు ఓ ఆలోచనపోయి, '' ఆఁ!... అసిస్టెంటు డైరెక్టరుగారితో ఏ స్టూడియోకన్నా వెళ్ళావేమో!'' అన్నాను.

''రైట్! అంతే! స్టూడియోకివెళ్ళాను. స్టూడియోలో నేననుకున్నట్టు నరకంగాలేదు. అయితే ప్రతిమగవాడు ఇదొక జాడ్యమా అన్నట్టు, నన్ను తెగచూచాడు. నేను వాటిని లెక్కజేయలేదు. సోమసుందరంగారు నన్ను అతి ఆప్యాయంగా తీసుకెళ్ళి మేకప్ చేయించి నాల్గైదు 'స్టిల్సు' తీయించాడు. ఆయనకి మంచి గౌరవమే వుందక్కడ''.

''అయితే సినిమా కళోద్ధరణకి దిగావన్నమాటే!''

''చెప్పేది వినవే అడ్డం మాట్లాడకండా. ఆ తర్వాత స్టూడియోలో వివిధభాగాల్ని చూశాను. బైటికి వచ్చింతర్వాత సోమసుందరంగార్ని అడిగాను - నా పర్సనాలిటీ ఎట్లావుందని.''

''చక్కని కవిత్వం అల్లివుంటాడు.''

''ఛీ! వినవే. మరియాదగా అన్నాడుగదా, మీ ఫేస్ కట్ ఫిలిం కెమరాకి సూట్ అయింది. మీ గొంతుగూడా మైక్‌కి సరిపోయింది. మీకు అభ్యంతరం లేకపోతే, మేము తీయబొయే సాంఘిక చిత్రంలో నటించవచ్చు. కంట్రాక్టు మీ ఇష్టప్రకారమే రాసిస్తా'' నన్నాడు. ఏమే కల్యాణీ! సినిమాల్లో చేరనా?'' అని అతి వుత్సాహంగా అడిగింది లీల.

''చేరవచ్చు...కాని...''

''ఆ 'కాని' ఎందుకూ మధ్య?''

''నురి సంఘం అంటూ వుందిగా, అది ఏమనుకుంటుందో అని నా జిజ్ఞాస.''

''ఆ సంఘం ఏమనుకున్నా, నేనేం తప్పుడుపన్లు చేయడం లేదుగా? పోతే, కళోపాసనగూడా దానిదృష్టిలో తప్పె ఐతే, నేను ఈ సంఘాన్ని గాని దాని తాతనుగాని లెక్కచేయదలుచుకోలేదు.''

''సరే నీ యిష్టం... నా సలహా అల్లా, ఈ మొగాళ్ళతో జాగ్రత్త అనిమాత్రమే'' అన్నాను నవ్వుతూ హృదయస్ఫూర్తిగా. '' ఏమీ ఫరవాలేదు. ఎడం కాలిస్లిప్పరు లేదుటే!'' అన్నది లీల ధీమాగా.

## 4

అర్జంటుగా మా అన్నయ్య పెళ్ళి ఒకటి వచ్చి మా కుటుంబమంతా గుంటూరు వెళ్ళవల్సివచ్చింది. నెలరోజులకి తిరిగివచ్చాం. ఆవేళే మేమొచ్చామని తెలిసింది గావును, లీల పరిగెత్తుకొచ్చింది. ఇద్దరం డాబాగదిలో కూర్చున్నాం చల్లగాలికి. నేను అడిగాను మొదట.

''షూటింగులు జరుగుతున్నాయా? ఫిలిం పేరేమిటి? నీపాత్ర ఏమిటి? కథ ఏమిటి? అని ప్రశ్నల వర్షం కురిపించాను. లీల మాట అన్నదా జరిగితీరుతుందని నాకు గట్టినమ్మకం. కాని లీలవర్ఛస్సు ఉద్రిక్తంగా మారింది.

''ఏం గొడవగా కంగారుపడి పోతున్నావు! నిదానించు. షూటింగులూ లేవు, ఏమీలేవు'' అన్నది శ్వాస గట్టిగాపీల్చి.

''కంట్రాక్టు రాసుకునేదాకా వచ్చిందిగా కథ! ఇంతలో ఎట్లా మార్చుకున్నావు?''

''వొచ్చినమాట వాస్తవమే, కాని అక్కణ్ణుంచి కథ అడ్డం తిరిగింది. విను చెబుతా. నేనూ సోమసుందరం రోజూ కలుసుకుంటూ, వాళ్ళు తియ్యబొయ్యే పిక్చర్నుగురించీ, దాని కథ, నా కిస్తానన్న వేషం గురించీ వివరంగా మాట్లాడుకున్నాం. ఇన్నాళ్ళుబట్టి రోజూ కలుసుకుంటూవుంటే మాలో చనువు ఏర్పడదూ మరి?''

''చనువేం ఖర్మం? చులకనగూడాను మగవాడికి'' అన్నాను నేను.

''అదే చెప్పొస్తుంటే నువ్వే చెప్పావు. నాకు వాళ్ళ పిక్చరునుగురించి యావత్తూ తెలిసింతర్వాత స్టూడియోకి వెళ్లాను కంట్రాక్టువ్రాసుకోడానికి. కంట్రాక్టులో అన్నీ నా యిష్టప్రకారమే వ్రాశారు.

కంట్రాక్టుపత్రం మా నాన్నకి చదివి వినిపించింతర్వాత సంతకంచేస్తానని తీసుకుని సంచిలో పెట్టుకుని బయల్దేరాను. అప్పటికే పొద్దుకూకింది. చీకటిపడ్డది స్టూడియోబయట వరండావరకూ అసిస్టెంటు డైరెక్టరుగారు నన్ను సాగనంపడానికి వచ్చారు. వరండాలో ఎవ్వరూ లేరు. బావురుమంటోంది.

''ఒక్కమాట'' అన్నాడతను.

వెనక్కితిరిగి చూశాను. సహజంగా అతని మొహంలో కళలు నాకు బోధపడలేదు చీకట్లో. ''ఏమిటది, చెప్పండి'' అన్నాను నవ్వుతో. ''మిమ్మల్ని'' అంటూ నా దగ్గిరికి వొస్తున్నాడు. నాలికతడబడుతోంది అతనికి, నావళ్ళు జలదరించింది. కాని అతనిపై నేరారోపణచెయ్యడానికి అంతవరకు ఏ అవకాశమూ ఇవ్వలేదతను. '' ఏమిటో చెప్పండి!'' అని రెట్టించాను.

''చెప్పలేకపోతున్నాను'' అంటూ నా భుజం మీద చెయ్యేశాడు.

వెంటనే ఏమీ అనకుండా, రెండడుగులు వెనక్కితగ్గి చప్పున ఎడం కాలి స్లిప్పరు వూడదీసి చెంప చెళ్ళుమనేట్టు దెబ్బపీకాను. వెంటనే ఇంటికివచ్చి కంట్రాక్టుకాగితం చించివేశాను. మానాన్న నాలో ఈ అకస్మాత్తు మార్పుకి చాలా ఆశ్చర్యపడి '' ఏమిటిది?'' అని అడిగాడు. ''అక్కడి వాతావరణం బాగులేదు నాన్నా'' అని సర్దేశాను. లేకపోతే...''

''లేకపోతే, నువ్వు ఊడగొట్టినవిపోను మిగతాపళ్లు మీ నాన్న వూడగొట్టేవాడే...''

'' ఆఁ! అంతపనీ అయ్యేదే. కాని మనబోటి వాళ్ళం ఇప్పట్లో సినిమారంగంలోకి దిగే అవకాశం కనిపించడం లేదు కల్యాణీ!'' అన్నది లీల బాధగా.

''నిజమే. ఈ సినిమా మగాళ్ళు, మనసులు మార్చుకొంటే తప్ప!''

''కాదు! కాదు! చదువుకున్న వాళ్లూ, స్త్రీలని నిజంగా గౌరవించగలవాళ్ళూ సినిమారంగంలోకి వస్తే అప్పటికేమన్నా...''

''అవును!''

***(కథావాహిని 1955)***

# ఎగిరేపళ్లెం

వెంకటేశ్వర్రావూ నేనూ సన్యాసం పుచ్చుకుందామన్న తీర్మానానికి రాక తప్పలేదు ఈ పరిస్థితులదృష్ట్యా. ఒక్కొక్కడికీ కుచేల సంతానమయ్యేను! సంతానోత్పత్తి నిష్పత్తికి సరిపోయినట్టు ఆదాయం పెరగటం లేదు. అంచేత మేమిద్దరం ఎవరికీ చెప్పకంగా సన్యాసం పుచ్చుకుందామని ఆలోచించాము. కాని, ఇదివరకటి మా అన్ని ఆలోచనల్లాగానే ఇదిగూడా నీళ్లుగారిపోయి, ఎందాకా వచ్చిందంటే, ఎలాగో ఒక వారంపాటు ఈ రొదనించి తప్పించుకుందామని అనుకున్నాం. నవ్వకండి. మరేం చెయ్యడం? వెంకటేశ్వర్రావు కుటుంబభారాన్ని వాడితమ్ముడినెత్తిన వేసి బయల్దేరాడు. నేను మా ఆవిడకే అప్పజెప్పి బయలుదేరాను.

ఇద్దరం నిజాంపట్నం సముద్రతీరం విశాలంగానూ ఖాళీగానూ వుంటుందని అక్కడికి వెళ్లాం. ఆవేళ నిండుపౌర్ణమి. మేము ఆవూరుచేరి అక్కడ మా బంధువు లొకరింట్లో దిట్టంగా ( సన్యాసం పుచ్చుకునేవాళ్ళ లక్షణాలేనా ఇవి? ) భోంచేసివెన్నెల్లో షికారుగా ఊరికి దూరంగావున్న సముద్రపు వొడ్డుకువెళ్లాం. మరిచిపోకుండా చేతిలో కర్ర ఒకటి, సిగరెట్టు పెట్టెలూ, అగ్గిపెట్టెగూడా తీసుకుని వెళ్లాం.

దారిపొడుగునా తాటిగుబుర్లు; భూమంతా వొట్టి ఇసుకపర్ర. కొంతదూరం పోయాక అక్కడక్కడ కూతలు వినిపించి చాలా భయంవేసిందిగానీ, ఓ గంట అలా తిరిగి వొద్దామనుకున్న వాళ్ళం నక్కలకు భయపడడమా అని ధైర్యంచెప్పుకుని నడిచాం. నీలివెన్నెల అందంగా అక్కడి ఇసకనేలమీదా, కన్పించే సముద్రంమీదాపరుచుకుంటోంది. అది ఎండాకాలం కావడంతో ఆ సముద్రపు చల్లగాలి ఎంతయినా హాయిగొల్పుతోంది.

వెంకటేశ్వర్రావు వేదాంతంపిచ్చి గలవాడు. ఆ చల్లగాలీ, వెన్నెల అన్నీ ఒక్కసారిగా వాణ్ణిఆనందంలో పడేసే వరకు వాడు ''మారిపోవురా'' అని పాట ప్రారంభించాడు. నేనే అసలు బస్తీలో ఆ రికార్డుల సంగీతమంటే ప్రాణం విసిగి, సగం సన్యాసం పుచ్చుకుందామని ఇటువొచ్చాను. కాశీపోయినా శనివదలనట్టు వీడు అవేపాటలు ఇక్కడా తగులుకున్నాడు. ఖర్మం! ఏం చెయ్యడం! పైగా వెంకటేశ్వర్రావుకి ఏ పాటా సొంతంరాదు చచ్చి. అన్ని చచ్చుపాటలూ మొదటి చరణంమాత్రం వొచ్చు. వెంకటేశ్వర్రావు ఫర్లాంగు నడిచేసరికి ఏడెనిమిది పాటల మొదటి చరణాలు ఆలాపించేశాడు. అందులో ముఖ్యం, వాడికి మరీ ఇష్టమైన ఒకవేదాంతపు పాట ' ఏనాడు మొదలిడితివో'ను మరీ గాద్గదికంఠంతో ఆలాపించి నాకు సన్యాసంమీద యిష్టాన్ని మరీ ఎక్కువ చేస్తున్నాడు. వొద్దంటే వీడెక్కడ సన్యాసం పుచ్చుకుంటానంటాడోనని ఆ మాట అనలేదు నేను.

వాడి పాటల బాధనించి ( ఈ మధ్య వాడు పాడకుండా వుండేపక్షాన నెలకు ఐదు రూపాయల

చొప్పున తామిస్తామని మున్సిపాలిటీవాళ్ళే వొచ్చారట. కారణం, వీడింటిచుట్టూ వున్న ఇరుగు పొరుగువారందరూ కలిసి పిటీషన్ పెట్టడమే). నన్ను ఆక్షణాన తప్పించిన సంఘటన చాలా చిత్రమైనది. వెంకటేశ్వర్రావు '' ఏనాడు!'' అని 66వ సారి మొదలెట్టి వాడు తెరిచిననోరు తెరిచినట్లేవుంచి, నన్ను వీపు చరిచి ఆకాశంవేపు చూడమన్నాడు. అటుచూద్దునుగదా ఆకాశంమీదనారింజరంగుకాంతి వలయం వొకటి అతివేగంగా తిరుగుతూ భూమివేపు వొస్తుండడం కన్పించింది. ఆ నారింజ రంగు వలయం లోపలిభాగమంతా నీలంగా ఆకుపచ్చగా కన్పిస్తోంది.

మేము ఒక్క అడుగేనా ముందుకు వెయ్యకండా అలాగే నిల్చుండి చూస్తున్నాం ఆకాశంవేపు. మాకు ఈ మధ్య పత్రికల్లో చదివిన ఎగిరేపళ్లాల సంగతి జ్ఞాపకవొచ్చింది. ఆ కాంతివలయం రానురాను మాకుచేరువగా భూమిమీదికే దిగుతూవుంది. ఇందాకటికన్న మరింత కాంతివంతంగా కన్పిస్తోందిప్పుడు.

వెంకటేశ్వర్రావు ''కొంపతీసి ఆ ఎగిరే పళ్ళాల్లో ఇది వొకటి కాదుకదా?'' అన్నాడు మెల్లిగా.

''అయితే కావచ్చు. నీకు భయమేమిట్రా? అది ఎగిరేపళ్ళేమే అయి ఇక్కడే మన ప్రక్కనే దిగితే నేను చాలా సంతోషిస్తాను'' అన్నాను.

నేనీమాట అన్న రెండుమూడు నిమిషాలకే ఆ కాంతి వలయం, ఏమాత్రం చడీ చప్పుడూ లేకుండా, ఆ విశాలమైన సముద్రతీరపు ఇసకమీదకు వొచ్చి వాలింది. దాని ఆ కాంతి ఇందాకమేమనుకున్నట్టుగాకాక పొడుగ్గా చేపలా వుంది. దాని కాంతికి చుట్టుప్రక్కల అంతా పట్టపగల్లే అయిపోయింది. అది చేప ఆకారపు వెలుగే నిలువుగా గిరగిర తిరగడం వల్ల కాంతి వలయంలా కన్పించింది గావును!

ఇందాకట్నించీ ఎంతో ధైర్యంతో వున్న నాకుగూడా కాళ్లు గడగడ వణకసాగాయి. వెంకటేశ్వర్రావు మలేరియా రోగిలా, ఊడిపోయిన గడియారం స్ప్రింగ్ లాగా దడదడలాడి పోతున్నాడు. అయినా మాకు ఎటు పారిపోవటానికీ తోచడం లేదు. అంతవెలుగులో ఎలా ఎక్కడికని పారిపోవడం? పైగా ఆ నారింజరంగు వెలుగూ, గాఢమైన నీలి ఛెలుగూ మమ్మల్ని అయస్కాంతంలా ఆకర్షించి ఆపేశాయ్. కదలలేక పోతున్నాం.

ఆకాంతి ఆకారం మాకెంతో దూరంలో లేనట్టు తోచింది. పదిగజాలలోనే జాజ్వల్యమానంగా వెలిగిపోతోందా ప్రదేశ మహోర్ణవంనుండి దిగిన వెలుగుపదార్థం.

మరొక్క నిమిషానికల్లా అందులోనుండి తలుపులు తెరచుకుని ముగ్గురు దివ్యవ్యక్తులు కిందికి దిగారు. ఇద్దరు పురుషుల్లాగా వున్నారు. ఒకరు స్త్రీ. ఒకొక్కళ్ళూ తొమ్మిదేసి అడుగుల ఎత్తున్నారు. చాలా అందంగావున్నారు. వాళ్లు ధరించిన దుస్తులు స్వచ్ఛమైన తెలుపుగావుండి మెరిసిపోతున్నాయి. శరీరపురంగు అవర్ణనీయమైన లేత నారింజరంగుగా వుంది. జుట్టు నల్లగా నిగనిగలాడుతోంది. ఒంటిమీద దుస్తులు మినహాయించి మరో ఆభరణాలే లేవు వాళ్ళకు. ఆ స్త్రీకి సయితం!

వెంకటేశ్వర్రావూ, నేనూ చాలాభయపడిపోయాం. ఇక తిరిగి కొంపలకు పోవటం వుండదనే నిర్ణయించుకున్నాం. ఆ యెదురుగా వున్న వాళ్ళు ఎటువంటివాళ్లు! మమ్మల్ని బతకనిస్తారా?... ఇలా మేమొక్కసారిగా ప్రాణభీతితో కంపించి వొళ్ళంతా చమటపోసి ఉక్కిరి బిక్కిరి ఐపోతూవుంటే, ఆ

ముగ్గురు దివ్యవ్యక్తులూ మా సమీపానికే వొచ్చేశారు.

మాయెదట నిలబడ్డ ఆ బ్రహ్మాండమైన వెలుగువ్యక్తులు తమలో తామేదో ఒక స్వరంలో మాట్లాడుకొన్నారు ఒక నిమిషంపాటు. తర్వాత అందులో కొంచెం వయసు ముదిరిన వాడల్లే కనపడుతున్న వ్యక్తి మా భయాన్ని పోగొట్టే చిరునవ్వొకటి నవ్వి, ''భయపడకండి నాయనా, మేము అంగారకులం!'' అన్నాడు స్వచ్ఛమైన తెలుగులో.

నాకు కొంచెం ధైర్యం కలిగింది. ''మీరు అంగారకులా! మీకు మానవులతరఫున ఇదే మా స్వాగతం! అందుకోండి. మా మానవులకీ మధ్య ఎగిరే పళ్లాలనుగురించి అనుమానాలు ఏర్పడి వేధిస్తున్నాయి. వాటిని ఇవ్వాళటితో మీరు తీర్చెయ్యాలి'' అన్నాను ఇంకా పూర్తిగా వొణుకు తగ్గని గొంతుకతో.

''అలాగే, రండి, ఆ ఇసుకతిన్నెమీద కూర్చుని మాట్లాడుకుందాం'' అన్నాడు యువక అంగారకుడు.

నాకుకూడా కూర్చొని మాట్లాడ్డమే శ్రేష్ఠమనిపించింది. మనకంటె నాలుగడుగులు ఎత్తుగా వున్న వాళ్ళతో మెడ పైకెత్తి ఎంతసేపని నుంచుని మాట్లాడగలం? అసలే నరాల సత్తువలేని కుచేలురం!

అంతా పక్కనేవున్న ఇసకతిన్నెపై సముద్రానికి అభిముఖులమై కూర్చున్నాం ఆ వెన్నెల్లో, అంగారక విమానపు దివ్యకాంతిలో.

## 2

వెంకటేశ్వర్రావు అంగారకులలో ఆ అమ్మాయివైపే చూస్తూ కూర్చున్నాడు. వీడెక్కడ ఆ అమ్మాయినిచూస్తున్న తిక్కలో మళ్ళీ పాట ప్రారంభించి అంగారకుల్నీ బెదిరించేస్తాడేమో అనుకున్నాను. కాని వీడి పుణ్యాని కట్లాంటిదేమీ జరగలేదు.

''అయితే మీరు తెలుగు బాగా మాట్లాడుతున్నారే, ఇది ఎలా సంభవించిందీ?'' అని మెల్లగా సంభాషణ ప్రారంభించాను నేను, సిగరెట్టు వెలిగించి.

పెద్ద అంగారకుడు, ''భాషలు కొత్తవీ పాతవీ అని మీరు అంటే మనుష్యులు కష్టపడతారుగాని, స్వరాన్నిబట్టి భావాల్ని ఊహించి తద్వారా భాష తెలుసుకునే మాకు ఏ భాషయినా ఒక్కటే'' అన్నాడు నవ్వుతూ.

వెంకటేశ్వరరావు ''మీ లోకంలో భూమిమీదలాగానే పంటలూ అవీ పండుతాయా?'' అని ప్రశ్నించాడు.

''అన్నీ పండుతాయి. చాలా పెద్దపెద్ద వురువులలో వుంటాయి. మీ కూరగాయల్లాగా ఈసురోమంటూ వుండవు'' అన్నాడు రెండో అంగారక యువకుడు.

వెంకటేశ్వరరావు ''అయితే మీకు మీ భూమిసంగతి యిదివరకే బాగా తెలుసున్నట్టుందే!'' అని అడిగాడు. నాకూ అదే అనుమానం వేసింది.

యువక అంగారకుడు, ''మీకు అంగారకుల్ని గురించి ఏమీ తెలియదని మే మిదివరకే అనుకున్నాం. అంతే జరిగింది! ఏం అన్నయ్యా?'' అన్నాడు తనసోదర అంగారకుణ్ణి చూసి. అంగారకయువతిగూడా

నవ్వింది.

నాకు సిగ్గేసింది. మానవుడు తన అపారమైన వైజ్ఞానిక పరికరాలతో విశ్వమహార్ణవాన్నంతా గాలించి ఏమూల యేమున్నదో కనుక్కుంటున్నాడు. వెధవది పొరుగుగ్రహం అంగారకుడిలో ఏమున్నదో తెలుసుకోలేదే!....

నే నిలా ఆలోచిస్తూవుండగానే పెద్ద అంగారకుడు మొదలెట్టాడు. ''దీన్నిగురించి మీరింతగా సిగ్గుపడిపోవాల్సిన అవసరమేమీ లేదండి. నేను చెప్పేవి వింటే మీకే తెలుస్తుంది...'' ఆయన నా మనోభావం గ్రహించినట్టే అన్నాడీమాటల్ని. ''అంగారక నాగరికతంతా ప్రారంభమై ఇంకా పదివేల సంవత్సరాలు కాలేదు. అంగారకగ్రహం మనోహరమైన ఆరోగ్య ప్రకృతిసంపద కలిగి వుంటుంది. విశేషమేమంటే అంగారకుల జీవితపరిమాణం మీ కాలమానం ప్రకారం వెయ్యేండ్లు. మాకు నాగరికతనూ, విజ్ఞానాన్నీ అభివృద్ధి చేసుకోటానికి ఆయుర్దాయమూ ఉంది, తీరికా ఉంది.'' అంటూ వుండగానే వెంకటేశ్వర్రావు ''అంత ఆయుఃప్రమాణం వుండడానికి కారణం ఏమిటో?'' అని ప్రశ్నించాడు.

''అది ఒక ముఖ్యమైన ప్రశ్న. మేము ఎప్పుడూ దేన్ని గురించీ విచారించం; దుఃఖించం; నవ్వుతూ వుంటాం. మీదు మిక్కిలి మెదడును లేనిపోని కుట్ర ఆలోచనలతో గందరగోళం చెయ్యం. అందువల్ల మాకు జీవిత ప్రమాణం ఎక్కువౌతున్నది. వైజ్ఞానికులు చాలా విషయాలు కనిపెట్టారు. మా కిప్పుడు జీవితం ఆనందమయం'' అన్నాడాయన గర్వంగా.

''ఆ లెఖ్ఖకొస్తే మా సైంటిస్టులుగూడా చాలా విషయాలు కనిపెట్టారు లెండి. మీకు రేడియోలున్నాయా?'' అని అడిగాడు వెంకటేశ్వర్రావు.

అంగారకులు గొల్లున నవ్వారు. ''మానవుల రేడియోలు భూమివరకే పరిమితం; వారి ప్రసారాలు వారికే వినిపిస్తాయి. అంగారకులం మా శబ్దగ్రహణయంత్రాలద్వారా భూమినుండి వినిపించే అన్ని రేడియోప్రసారాల్నీ వింటూ వుంటాం. మీ భూమి చరిత్ర యావత్తూ ఎప్పటికప్పుడు మాకు తెలుస్తూనే వున్నది.'' అన్నాడాయన.

''కొంపతీశారే! మీలోకంలోగూడా వున్నాయా రేడియోలు!'' అన్నానేను సంగీతమంటే వున్న భయంకొద్దీ.

''అంత భయం అక్కరలేదు. అంగారక గ్రహంలో 'ఆనందం' కాని దేదీలేదు. అక్కడ కొచ్చేస్తే ప్రతిదీ ఆనందమే అనిపిస్తుంది మీకున్నూ'' అన్నాడు అంగారకుడు. పైగా ''భూమి వాసులకు ఆనందం అంటే బాధా నివారణే!'' అని గూడా అన్నాడు. నవ్వాడు మానవజాతి మొహాన్నే! ఎంత నిజం చెప్పాడు అనిపించిందినాకు.

''మీ గ్రహంలోని ఆర్థికవ్యవస్థ ఎట్లాంటిది? మీ రాజకీయాలు ఎలావుంటాయి?'' అని అడిగాడు వెంకటేశ్వర్రావు. అతనికెప్పుడూ ఆర్థికగొడవలే.

అంగాకరకులు నవ్వారు. ''మేమూ చూస్తున్నాము వెయ్యేండ్లనుంచి మా దూరదర్శిని యంత్రాలనుంచి. భూమ్మీద మానవులు ఆర్థిక బాధలనుంచి బయటపడ్డానికి యుద్ధాలు చేసి, రాజకీయ వ్యవస్థలు మార్చుకునీ నానా అవస్థలూ పడుతున్నారు. మీరింకా ఏం పురోగమిస్తారు? మాకు ఎలాంటి రాజకీయ వ్యవస్థకూడా ఏనాడూ లేదు; ఆర్థిక బాధలనేవి అసలే లేవు. లోహపు బిళ్ళలకోసం,

లోహపుముద్దకోసం, యుద్ధాలు చేసుకోటం అంగారకగ్రహవాసులు ఎరుగరు; అసలు ఇంకొకణ్ణి బాధించటమే ఎరగం మేము. ఇంకో చిత్రమైన వ్యత్యాసం వుంది అంగారకులకూ, మీకూ. మీరు ఎల్లప్పుడూ ఎవరో ఒకరు పరిపాలిస్తేనేగాని వుండలేని మనస్తత్వానికి అలవాటుపడిపోయారు - రాజులో, శాసనసభ్యులో - నియంతలో - ఎవరో ఒకరు! మీరీ రోజున శాసనాలు చేసుకుంటున్నారంటే వాటిని అమలుజరపటానికి పోలీసులూ, న్యాయస్థానాలూ వుండాలి. నిన్నటిధర్మం నేడు అధర్మం అయిపోతోంది మీకు. మీరు చేసే ప్రతి శాసనాన్నీ ఎవరో కొందరు ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూనే వుంటారు. నిజానికి మానవులు ప్రకృతి ధర్మాలకే కట్టుబడక వ్యతిరేకించి నాశనమైపోతున్నారని మా విశ్వాసం!'' అన్నాడు పెద్ద అంగారకుడు దృఢంగా.

''అయితే మీ పద్ధతులేమిటి? వాటి విశిష్టత ఏమిటి?'' అని అడిగినాను నేను. మానవుడు వేల సంవత్సరాలుగా నిర్మించిన నాగరికతనంతా ఈ అంగారకులు నిముషంలో ఎగతాళి చేసి పారేశారే! అనిపించింది నాకు. ''మాకు ఏ రాజకీయ వ్యవస్థ గానీ లేకపోవటమే మా విశిష్టత. నూరుకోట్లమంది అంగారకులం వున్నాం. అంతా సరిసమానంగా ఏకకుటుంబంలాగా అంగారక గ్రహంలో ప్రకృతిసంపదను ప్రకృతి సిద్ధంగా నే వాడుకుంటూ వుంటాం. మీ మానవభాషల్లోవున్న ద్వేషం - భయం - అసూయ, అహంకారం లాంటి శబ్దాలు అంగారక భాషలో లేనేలేవు. మమ్మల్ని ఎవరూ పరిపాలించనక్కరలేదు. శాసనాలు అక్కరలేదు'' అన్నాడు అంగారకుడు.

''మీ వైజ్ఞానిక పరిశోధనలు ఈనాడు ఏ దశలో వున్నాయి?'' అని అడిగాను నేను.

''అవా? మా కాంతివేగంతో నడిచే విమానాలు ఈనాడు ప్రదేశమహార్ణవాన్నంతా తిరిగివస్తున్నాయి. మీ వైజ్ఞానికులు పదార్థపు టణువులను విచ్ఛిన్నం చెయ్యడాన్ని ఇప్పుడే కనిపెట్టారు కదూ? మేము, పదార్థంనించి కాంతిని విడదీసి దాన్ని నిలవచేసుకుని అనేకమైన పరికరాలను చేసుకుంటున్నాం. ఏ పరికరాలూ అవసరం లేకుండా సినిమాలు నడుపుకుంటాం. ఐదారువందల ఏండ్లక్రితం, మా దుస్తుల్ని బంగారంతో, వెండితో, గాజుతో తయారు చేసుకునేవారం. ఇప్పుడు సూర్యకాంతినీ, చంద్రకాంతినీ వాడుకుంటున్నాం'' అని తన వొంటిమీది చొక్కాను చూపించాడు.

వెంకటేశ్వర్రావూ, నేనూ ఆ చొక్కాల్ని పట్టుకొని చూశాం. బరువులేవు; ఏ మాత్రం బరువూ లేవు... కాంతికి బరువేం వుంటుంది?

''మీరు ముగ్గురూ వేసిన దుస్తులు వేరు వేరుగా వున్నాయే?'' అని అడిగాడు వెంకటేశ్వర్రావు. అంగారక యువతి. ''అవును. అంగారక స్త్రీలు ఎక్కువగా వెన్నెలతోటి తమదుస్తుల్ని తయారుచేసుకుంటారు. పురుషులు, సూర్యకాంతినో, నక్షత్రకాంతినో ఉపయోగించుతారు. ఇవి చిరగవు; మాయవు. ఎన్నటికీ మెరుగు తగ్గని కాంతితో నిగనిగ లాడతాయి'' అన్నది.

నాకూ, వెంకటేశ్వర్రావుకీ ఇలాంటివి మనకుంటే ఎంత బాగుణ్ణో అనిపించింది. కాని ఎలా దొరుకుతాయి అవి? నూలుగుడ్డలకే చస్తూవుంటే!

''చాలా చిత్రంగా వున్నాయి మీ వ్యవహారాలు! సరేగాని, ఏమండీ, మీకు, మృత్యువు ఎలా'' అని ఏదో అడగబోయి సగంలో మానేశాడు వెంకటేశ్వర్రావు.

యువక అంగారకుడు ''మృత్యువా? మా భాషలో దానికి పర్యాయపదం లేదు. కాని, ఆ 'చర్య'

వున్నది. అంగారకులు వెయ్యేళ్ళయినాక కాంతిలో లీనమైపోతారు. ఎవరూ ఈలోగా పోరు. మానవులలాగా అకాల మరణాలు, రోగాలతో చావడాలూ మేమెరగం. ఎందుకని? అని మీరు అడుగుతారు; దానికి కారణం మేము, దుర్గుణాలు లేకుండా 'భయం' లేకుండా, ద్వేషాలు లేకుండా ప్రేమతో పరస్పరం నమ్మకంతో ఎల్లప్పుడూ ఆనందంగా సమిష్టిగా జీవించడమే'' అన్నాడాయన.

''భేష్! భేష్! కొందరు మంచి మానవులుగూడా ఇదే చెప్పినట్టు నాకు గుర్తు. అసలు మీకు ఆధ్యాత్మికంగురించి ఏమైనా అభిప్రాయం వుందా?'' అని ప్రశ్నించాడు వెంకటేశ్వరరావు కుతూహలంగా.

''మాకు ఆనందమే - ఆధ్యాత్మికానికి పర్యాయపదం'' అన్నాడు అంగారకవృద్ధుడు.

''అయితే దేవుడు?'' అన్నాడు వెంకటేశ్వరరావు దిగులుగా.

''అంగారకుల యిళ్ళన్నీ దైవమందిరాలే. ప్రేమ, ఆనందాలే దైవమంతా అని మా విశ్వాసం, దేవుడు అని ప్రత్యేకం ఏమీ లేదు'' అన్నాడాయన. తర్వాత వాళ్ళు ముగ్గురూ చప్పున లేచి. ''మేమిక వెళతాం'' అన్నారు. మాట అన్నారంటే బ్రతిమాలినా వుండేటట్టులేరని తోచింది నాకు. అయినా మర్యాదకదా అని, '' ఇంకా కాసేపు వుండండి. లేదా మాతో గూడా రారాదూ? రేపో యెప్పుడో వెళ్ళొచ్చు!'' అన్నాను. వెంకటేశ్వర్రావూ యిదే అన్నాడు.

''లేదు వెళతాం. మానవుల్లోకి వొచ్చి మేము మెలిగే అంత సంస్కారం యింకా మీకు కలగలేదు. దొంగ మర్యాదలూ, అబద్ధాలూ మానితేగాని యితర గ్రహవాసులలో మానవులమీద విశ్వాసం ఏర్పడదు'' అన్నాడు అంగారక యువకుడు.

తలలు వొంచుకున్నాం మేము. వెంకటేశ్వర్రావు ''అయితే మీరు మానవులకిచ్చే సందేశమేమిటి?'' అని అడిగాడు.

'' ఏముంటుంది? మిమ్మల్ని మీరు ప్రేమించుకోండి. 'నాది' అన్న వ్యక్తిభావం, దాచుకోడం అన్న దుర్గుణం పోయి, ప్రేమ - సాంఘిక సమిష్టిభావం అలవర్చుకోండి'' అంటూనే వాళ్లు, చేతులు వూపుతూ తమ వెలుగు విమానం యెక్కి త్రుటిలో గగనపథంలో కెగిరిపోయారు. ఆ యెగిరేపళ్ళెం కాంతి వేగంతోటి మరో త్రుటికాలంలో నక్షత్రాల్లో నక్షత్రంలా ఎగసి కలిసిపోయింది.

మేమిద్దరం ఊళ్ళోకి బయిల్దేరాం. వెంకటేశ్వర్రావు ''అంగారకుల జీవనవిధానం వింటే, మనబుద్ధుడూ, ఏసుక్రీస్తూ చెప్పిన సూక్తుల ననుసరించే వున్నాయి!'' అన్నాడు నాలుక చప్పరించి.

''అవును, ఏం ప్రయోజనం? మానవుల్లో మహత్తరులైన ఆ దైవజ్ఞులు చెప్పినమాటల్ని చెవిని బెట్టని ఈ జాతి, అంగారకులు చెబితే వింటుందా? నాకు నమ్మకం లేదు'' అన్నాను, నడుస్తో.

తాటిగుబుర్ల చీకట్లోకి జొరబడుతూ నక్కకూతకు జంకుతూ చేతిలోకర్ర తిప్పుతూ వెంకటేశ్వర్రావు ''మానవ జాతిచరిత్ర పరస్పర అవిశ్వాసాలతో ప్రారంభమై నడుస్తోంది'' అన్నాడు.

''నిజమే'' అన్నాను నేను.

***(కథావాహిని 1955)***

# జీవిత సారం

నేను రెండుతడవలు రాజారాంగార్ని కలుసుకోవల్సిన అవసరం ఏర్పడ్డది. ఆయన నాకు కొత్తగా పరిచయం అయినవాడు. ఆయన స్వభావమెలాంటిదో, తత్వమెలాంటిదో రెండు తడవలు కలుసుకున్నంత మాత్రాన తెలీదుగా! అయితే ఒకటి: నేను ఆయన్ని చూసి చాలా ఆశ్చర్యపడ్డమాట మాత్రం నిజం. '' ఆ సంఘటనయేమిటో చెప్పకపోతే నాకు తోచకుండా వుందిరా, శేషగిరీ!'' అన్నాడు శ్రీనివాసరావు. అతని కళ్ళల్లో ఆశ్చర్యం స్పష్టంగా కనిపించింది.

శేషగిరి పార్కు కాంపౌండుగోడకి అంటించివున్న వాల్‌పోస్టర్‌లవేపు చూస్తూ, '' ఎందుకో అంత ఆశ్చర్యం! ఆయనేం మనిషికాదా, ఆయనతత్వాలలో ఏమన్నా దేవత్వాలు కన్పించినాయా!'' అని ప్రశ్నించాడు వేరుశనగకాయ వొలిచి నోట్లో వేసుకుంటూ.

శ్రీనివాసరావు దట్టంగా పచ్చగా పెరిగివున్న గడ్డిమీద ఏటవాలుగా పడుకుని బహుశా పరధ్యాన్నంగా వున్నాడేమో, పచ్చగడ్డిలోకీ, అటూ ఇటూ నవనాగరిక యువతులకుమల్లె విహరిస్తూన్న సీతాకోకచిలకల్ని చూస్తూ, ''రాజారాంగార్ని అర్థంచేసుకోలేకపోయానురా. ఎలా అర్థం చేసికోగలను? నువ్వే చెప్పు'' అన్నాడు.

'' ఏమిటో చెప్పరాదూ!'' అని ప్రశ్నించాడు శేషగిరి శ్రీనివాసరావును, వేరుశనగకాయలు ముగించి, సిగరెట్ వెలిగిస్తూ.

చల్లని సాయంకాలపు పిల్లవాయువుల్ని అనుభవిస్తూ శ్రీనివాసరావు చెప్పసాగాడు:

★ ★ ★

అదే రాజారాంగార్ని కలుసుకోటం మొదలు; ఆయన్ని వాళ్ళింట్లోనే కలుసుకున్నాను. ఆయన ఆట్టేవున్న వాడు కాదు. మధ్యరకం. ఊళ్లో మంచి పలుకుబడిగల పెద్దమనిషి. ఆయన తోటి నాకు అవసరం కలిగింది; వూళ్ళో వున్న ఫ్యాక్టరీ కూలీ వొకడికి కుడిచేతి బొటనవేలు తెగిపోయింది. అతని ''కంపెన్సేషన్'' ఎంత ఇవ్వాలి అన్నవిషయమై సమస్య ఏర్పడింది. ఇది లేబర్ ఆఫీసర్లకు తెలిసి, రభస అయిపోవడంకంటే, మధ్య వర్తి పరిష్కారానికి వెళ్ళడం ఇటు యజమానికి అటు కూలీకీ మంచిదనిపించి, రాజారాంగార్ని మధ్యవర్తిగా ఎన్నుకున్నారు. రాజారాంగారు మంచివాడు. బీదసాదా అంటే కనికరం వున్న మనిషిగనక ఆ కూలీకిగూడా ఆయన తీర్పులో నమ్మకం ఏర్పడింది కాబోలు. '' ఆయన ఏం చెబితే అది వింటా'' నన్నాడతను.

ఇటు ఫ్యాక్టరీయజమాని నాకు ముఖ్యుడు. ఆయన తరఫున నేను వెళ్ళాల్సి వచ్చింది రాజారాంగారి దగ్గిరికి. నా స్నేహితుడు ఫ్యాక్టరీ మూసేసే స్థితిలో వున్నాడు. ధాన్యం ధరలు పడిపోవటంతో విపరీతమైన నష్టాలు సంభవించి, బాకీలు పడి ఐ. పి. పెట్టే స్థితికి వొచ్చివున్నాడాయన. ఆయన 'కంపెన్సేషన్' ఏదో కొద్దిగా ఇచ్చి ఎలాగో సర్దుకోవాలి ఈ బాధనించి, అనుకుంటున్నాడు. అతని ఇష్టాన్ననుసరించి మాట్లాడాలి నేను.

నేను రాజారాంగారింటికి ఒక ఉదయం పదిగంటల కెళ్ళాను. ఆయన ఇంటివసారాలో వాలుకుర్చీలో పడుకుని పత్రిక చదువుకుంటున్నాడు. మనిషి ఆజానుబాహువు. చామనచాయగా వున్నాడు. 'ఖచ్చితమైన మనిషి' సుమా అనిపించే మీసాలూ, దట్టమైన కనుబొమలూ, విశాలము, తీక్షణమైన కళ్ళూ.

రాజారాంగారు నన్ను కూర్చోబెట్టి ''మీరేనా, రామనాధంగారి తరఫున మాట్లాడ్డానికి వొచ్చింది? నేనొకటి రెండు మాటలు చెబుతాను. వాటి కిష్టపడితే తర్వాత మనం మాట్లాడుకోవచ్చు. లేదా ఈ విషయం విరమించడమే'' అన్నాడు.

నేను ఆయన కభిముఖంగా కూర్చుని ''చెప్పండి'' అన్నాను.

''నేనిలాంటి మధ్యవర్తిత్వాని కొప్పుకునేవాణ్ణి కాదండీ అసలు; అవతల బాధపడే కూలీ. అతను నాకు కొంచెం పరిచయస్తుడు. అందుకని... నేను చెప్పేతీర్పును ఉభయులూ అంగీకరించితీరాలి. అట్లా ఐతేనే నే నిందులో జోక్యం చేసుకుంటాను. ఆ వేలు పోగొట్టుకున్న అతను నా తీర్పు వొప్పుకుంటాడు. మీరూ అంగీకరిస్తారా! ముందే చెప్పండి'' అన్నాడాయన ఖచ్చితంగా.

ఆయన స్వరంలోని నిర్మొగమాటం, ఖచ్చితం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. అయినా తీరా వొచ్చి వొప్పుకున్న తర్వాత ఎలా కాదనటం? రెండు నిమిషాలు ఆలోచించుకుని, ''మీరన్నమాట కాదంటామా? అయినా మీరు మా ఫ్యాక్టరీయజమాని స్థితిని కూడా కొంచెం ఆలోచించి...'' అనిఅన్నాను.

''నేను అన్నీ విన్నాను. మీ సంగతీ ఆలోచించాను. మీరు ముఖ్యంగా అవతలవాడికిజరిగిన అన్యాయాన్ని గుర్తించాలి. కుడిచేతి బొటనవేలు అంటే సామాన్యమా! ఒక మనిషి జీవితమే అది. ఆ వేలు లేకపోయినతర్వాత అతను వృత్తిపనులు చేసుకోటానికి ఎలాగా వీలులేదు. మీరతన్ని జీవితాంతం పోషించలేరుగదా? కనుక...'' అని రాజారాంగారు ఆగిపోయి, లోగడ ఎక్కడెక్కడో ఇటువంటి కేసుల్లో కాంపెన్సేషన్‌లు ఇచ్చిన వివరాల కాయితాలు చూసి, మెల్లగా, ''ఐదొందలివ్వండి ఎలాగో సరిపెట్టేస్తాను. వెయ్యీ, పదిహేను వందలిచ్చిన ఉదాహరణలు చాలా వున్నాయి. అయినా మీ స్థితినిబట్టి అలా అడగలేకపోతున్నాను. మీకుకనక నా మాట నచ్చితే ఐదొందలు ఇచ్చివెళ్ళండి. లేదా, మీరు ఆ కూలీ ముఖాముఖీని మాట్లాడుకోవాల్సివుంటుంది'' అనేశాడు. ఇక ఆ మాటకు తిరుగులేదన్నట్టుంది ఆధ్వని.

నేను లేచాను. సంగమేశ్వర్రావును - అదే, ఆ ఫ్యాక్టరీ యజమానిపేరు - కనుక్కోందే నేనే మాటా చెప్పలేకండా వున్నాను... రెండొందల వరకయితే నాక్కథత వుంది... 'నేను వెళ్ళి సంగమేశ్వర్రావుగారితో సంప్రదించి సాయంత్రంవొచ్చి ఏమాట చెబుతానండి!'' అన్నాను.

  

నేను సంగమేశ్వర్రావూ చాలా సేపు ఆలోచించాము. ఎంత ఆలోచించినా ఆ సమయానికి ఐదొందలు పుట్టించటం కష్టమైంది; నేను తిరిగివెళ్ళి రాజారాంగార్ని కలుసుకొని బ్రతిమాలుకున్నాను ఓ వందయినా తగ్గించమని.

రాజారాంగారు నిష్కర్షగా చెప్పేశాడు. 'దమ్మిడీ తగ్గదని, లేదా లేబర్ డిపార్టుమెంటే తేలుస్తుందిలే' అనేశాడు. ఆయన మాటకు తిరుగులేదు. ఏంచెయ్యడం? చివరికి ఏభై అయినా తగ్గించమని బతిమాలాను. వీలుకాదన్నాడు.

ఓ వారం గడువు పెట్టాం. ఈలోగా ఎలాగో డబ్బు పుట్టించి తీసుకెళ్ళి ఇచ్చేద్దామనుకున్నాం. అలాగే ఓ వారం ఐనాక ఓ ఉదయంపూట సంగమేశ్వర్రావూ నేనూ డబ్బు పట్టుకుని రాజారాంగారింటికి బయల్దేరాం.

రాజారాంగారింటిదగ్గరగా వెళ్ళాక ఆ యింట్లోంచి ఏదో విషాదస్వరం వినిపిస్తే కాస్త శంకిస్తూనే లోపలికెళ్ళాం. రాజారాంగారు తలొంచుకుని వసారాలో పచారు చేస్తున్నాడు. లోపల ఆయన భార్య కాబోలు, ఏడుస్తూంది

ఏమిటో విషయం? నాలో ఆదుర్దా ఎక్కువయింది.

మేము లోపలికెళ్ళగానే రాజారాంగారు తిరిగి గంభీరమైనగొంతుకతో, ''అలా కూర్చోండి'' అని ఆహ్వానించారు. ఎంత గంభీరంగా అగుపించాలని ప్రయత్నిస్తున్నప్పటికీ మనిషిఎందుకో తీవ్రంగా బాధపడుతున్న ఛాయలు మొహాన కన్పిస్తూనే వున్నాయి.

''ఐదొందలు ...'' అనబోతున్నాను నేను.

రాజారాంగారు తలవంచుకుని తిరుగుతున్నవాడల్లా ఓ వసారా స్థంభాన్నానుకుని నిలబడి, ''మీరు రేపో ఎల్లుండో రాకూడదటండి! నా మనసేమీ బాగులేదిప్పుడు'' అన్నారు కొంచెం విరక్తిగానూ బాధగానూ.

''ఏం జరిగింది?'' అని అడిగాడు సంగమేశ్వర్రావు. ఉదయపు ఎండకాంతి ఏదో తీవ్రమైన బాధతోను, నిద్రలేమి తోటి ఎర్రబారిన రాజారాంగారి కళ్ళమీదపడి మెరుస్తోంది. ఆయన నిశ్చలమైన యోగిలా నిలబడి, పెదిమకొరుక్కుంటూ, ''నా చంటికూతురు నాలుగేళ్ళది. నిన్నసాయంత్రం లారీకింద పడి చనిపోయింది... నా మనసు మనసులోలేదు. క్షమించండి'' అన్నాడు తడబడుతూ మా గుండెలు ఝుల్లుమన్నయ్. వారం క్రితం నేను ఇక్కడికొచ్చినప్పుడు ఆ పసిది ఓ పరికిణీ అడ్డదిడ్డంగా కట్టుకుని వసారాలో బంతిలాగాగెంతుతోంది. ఎంతో ముద్దుగా ముచ్చటగా వుంది!

''అయ్యో! ఎంతపని జరిగిందండి! ఎవడా లారీవాడు? వాణ్ణిఏంజేశారు? వొదిలేశారా?'' అన్నాడు కచ్చగా.

రాజారాంగారు, ఇదివరకటిదాకా పైకప్పువంక చూస్తున్నవాడల్లా, ''పాపం, లారీవాణ్ణి అని

ప్రయోజనం లేదు; మా పిల్లదే అకస్మాత్తుగా రోడ్డుకి అడ్డంగా పరిగెత్తింది; అక్కడికీ లారీడ్రైవరు బ్రేక్ వేశాడు. ఏం ఉపయోగం! లారీ వెనక చక్రాలకింద పడి నలిగిపోయింది అమ్మాయి... పంచాయితీ తీర్పులో కూడా ఇదే రుజువైంది. ఒకళ్ళదాకా ఎందుకు? నేను ఈ అరుగుమీదకూర్చుని చూస్తూనేవున్నాను గదా! అబద్ధం ఎలా చెప్పగలం! లారీ వాళ్ళ తప్పులేదు. హారన్ వాయించాడు; మెల్లిగానే వొస్తోందిగూడానూ ఆ లారీ...'' అని ఆగిపోయాడు ఆయన. తను చూస్తూండగా తనచిన్ని కూతురు భూతంలాంటి లారీకింద పడి గుమ్మడికాయ చితికినట్టు చితికిపోయి రక్తపు మడుగులో పొర్లాడి బాధపడి చనిపోవటం ఆయన మనోనేత్రంముందు మళ్ళీ ఒకసారి గోచరమైంది గాబోలు. అంత స్థైర్యంగల వ్యక్తీ గొల్లుమని ఏడ్చేశాడు; ఆశోకాన్ని వారించడం మాతరం కాదు, కాలేదు.

ఆయనంతట ఆయనే ఐదునిమిషాలకు తమాయించుకున్నాడు.

మేమిద్దరం లేస్తూ, ''కాస్త ఓర్పు వహించాలి మీరు. మీరే బెంబేలుపడిపోతే ఇంట్లోవాళ్ళు మరీ బేలపడిపోతారు. ఊరుకోండి'' ఓదార్పుగా అని 'వెళతా' మనబోతున్నాను.

ఇంతలోనే ఓ చిన్నకారు ఇంటిముందుకొచ్చి ఆగింది. దాన్లోంచి ఇద్దరు, ఖరీదైన సిల్కుదుస్తులు ధరించినవ్యక్తులు దిగి లోపలికి వచ్చారు.

''మళ్ళీ యెందుకొచ్చారిక్కడికి?'' అన్నాడు రాజారాంగారు కాస్త తీవ్రంగా.

వాళ్ళల్లో పొడుగాటి ఆయన లారీ యజమాని అనీ, రెండో ఆయన వకీలు అనీ మాకు తెలిసింది.

వకీలు మెల్లిగా సంభాషణ ప్రారంభించాడు. ''నాక్లయింటు మీకు జరిగిన ఈ ప్రమాదానికి చాలా విచారిస్తున్నారండి'' అంటూ.

రాజారాంగారు అడ్డువచ్చి, ''నిన్ననే తేలిపోయింది గదండీ వ్యవహారం! మళ్ళీ ఆ సంఘటనను జ్ఞాపకం చెయ్యకండి. దయచేసి వెళ్ళండి. మీ తప్పేంవుంది ఇందులో? లారీ డ్రైవరు ట్రాఫిక్ రూల్ ప్రకారం నిర్దోషి అని రుజువైంది గదూ? ఇంక నాతోటి మీకేం పని?'' అని అడిగాడు:

వకీలుకు బదులు లారీయజమాని రాజారాంగారిదగ్గరికి వెళ్ళి ఆయనరెండుచేతులూ పట్టుకుని ''మీరు మీ కూతుర్ని పోగొట్టుకునిగూడా ఎంతో శోకంతో వుండిగూడా పంచాయతీ వాళ్ళకు నిజం చెప్పారు. అభాగ్యుడైన ఆ డ్రైవర్‌ని శిక్షనించి తప్పించారు... కాని... కాని, నా మనస్సు ఊరికే బాధపడిపోతున్నదండి... ఈ మహాపాపానికేదైనా పరిహారం చెయ్యాలని... మీరు ఏమీ అనుకోకుండా...'' 'అంటూవుంటే రాజారావుగారు కన్నీళ్ళు తొణికిసలాడుతున్న కళ్ళు మెల్లిగా పైపంచతో తుడుచుకుంటూ, ''పరిహారమా! ఇందులో 'పరిహారం' అనే ప్రసక్తే లేదు!'' అన్నారు మెల్లిగా.

ఇంతలో వకీలు జేబునుంచి తళతళలాడుతున్న కొత్త నోట్లకట్టలు బైటికి తీసి, ''మాక్లయింటుకి పంచాయితీ తీర్పుతో పరిహారం ఇవ్వాల్సిన అవసరం చట్టరీత్యా కలగని మాట నిజమే; కాని, అంతరాత్మ

అనేది ఒకటి వుందిగదాండి? మీకు ఏదో తృణమో పణమో ఇచ్చి మా మనస్సుకి కొంత సంతోషం కలుగచెయ్యాలని మాకు తోచింది. అలా కాకపోతే మాకు మనశ్శాంతి వుండదు. ఈ ఐదువేలూ తీసుకోండి. ఇది మీరు పోగొట్టుకున్న విలువకి ఎలాగూ సమానంకాదనుకోండి'' అన్నాడు, ఆ నోట్లు రాజారాంగారికియ్యబోతూ.

ఆ వచ్చిన యిద్దరూగూడా చాలా జాలిగొల్పుతున్నారు మాకు. నాకాక్షణాన ఒక ఆలోచన కలిగింది. బొటన వ్రేలికి ఐదొందలు విలువగట్టి ఇవ్వాలి - అని పట్టుబట్టిన వ్యక్తి ఒక ప్రాణానికి ఎంత డిమాండ్ చేస్తాడో! చట్టరీత్యా ఐతే వాళ్ళ దుంప తెంచేసివుండేవారు; ఈ నిమిషాన ఆయన 'నాకు ఐదువేలు చాలవు, పదివేలు కావాలన్నా వీళ్లు ఇచ్చేట్టున్నారు,' అనిపించింది నాకు. అందులోనూ రాజారాంగారు మహానిక్కచ్చిమనిషాయెను!

కాని రాజారాంగారు ఆ యిద్దర్నీ ఉరిమి చూశారు కళ్లు పెద్దవిచేసి. ''వెళ్ళండి, వెళ్ళండి... ఊఁ.పొండి... నా కూతురు ప్రాణాన్ని వెధవడబ్బుతో విలువకట్టజూస్తున్నారా! నా కూతురు ఐదువేలుచేస్తుందా! లక్ష యిస్తేమాత్రం నా కూతురు వస్తుందా? వెళ్ళిపోండి'' అని వాళ్ళను విదిలించాడు.

ఆ తర్వాత వాళ్ళు యింకా ఐదువేలు యిస్తామన్నారు ''చాలదు'' అంటున్నాడేమో ననుకుని. కాని రాజారాంగారు, ససేమిరా దమ్మిడీ పుచ్చుకోనన్నారు. అలా డబ్బు పుచ్చుకోటం, తనకూతుర్ని మృత్యువుకి.విక్రయించడం లాంటిదని ఆయన ఉద్దేశం వెలిబుచ్చారు. వచ్చిన యిద్దరూ తలవంచుకొని వెళ్ళిపోయారు'' అని కథముగిస్తూ శ్రీనివాసరావు, ''రాజారాంగారి ప్రవర్తన విచిత్రంగా లేదూ? డబ్బు నెవడైనా పోగొట్టుకుంటాడా! ఏమిటా మనిషి! నాకు ఆశ్చర్యంగా వుందిరా శేషగిరీ!'' అన్నాడు.

శేషగిరి, ''నాకేమీ ఆశ్చర్యంగా లేదు. వేలుకీ, కాలుకీ ఐతే విలువకట్టగలంగాని, ప్రాణానికి విలువేమిటి?'' అన్నాడు.

''అంతేనేమో! కూతురు దారుణ మరణానికి ప్రతిఫలంగా వచ్చేడబ్బును సైతం ఆయన భరించలేకపోయినాడు గాబోలు'' అన్నాడు శ్రీనివాసరావు.

*(కథావాహిని 1955)*

# పరోపకారి

మా రూము కిటికీ దక్షిణవైపు వుండడంవల్ల ఒక రకంగా ఇబ్బంది, ఇంకొకరకంగా సౌకర్యమూను. మంచి గాలి వచ్చేది. కాని... ఆ వైపున పొరుగింటివారి దొడ్డి వుంది. దొడ్లోకి పొద్దుకూకులు ఎవరో ఒక స్త్రీ రావటం, స్నానానికి సిద్ధపడడం, మేము కిటికీతలుపును దభేలున వేసుకోవాల్సి రావటం సహజమైనాయి. సంవత్సరంనుంచీ వున్నా ఆపొరుగింటిలో ఎందరున్నారో, వాళ్ళంతా ఆడవాళ్ళేనేమో, మొగవాళ్ళుకూడా వున్నారేమో అనే వివరాలు రూంలో వున్న మాముగ్గురికీ అనేక కారణాలవల్ల తెలీదు. విశ్వం అప్పుడప్పుడు కిటికి వెయ్యాల్సొచ్చినప్పుడు మాత్రం, ''ఆ యింట్లో ఆడవాళ్లు తప్ప ఇంకెవరూ లేరు!'' అనేవాడు విసుగ్గా. ఆ ఒపీనియన్‌తో నేనూ, వాసూ ఏకీభవించకపోయినా, ఆ పొరుగింట్లో కనీసం (మేము చూసినంతవరకు) అరడజన్ మంది యువతులూ, ఇద్దరు ముసలమ్మలు వున్నారని తేల్చుకున్నాం.

ఆవేళ పొద్దుటిపూట, వాసు సెల్ఫుషేవ్ చేసుకుంటున్నాడు. నేను కాలేజీ సరంజామా సర్దుకుంటున్నాను. విశ్వం బైటికి వెళ్లినవాడు ఇంకా తిరిగిరాలేదు. దక్షిణపు కిటికీ బార్లా తీసివుంది. చల్లగాలి ఆగదంతా కలయదిరుగుతోంది. వాసు గీసేగడ్డం ఆపి, కిటికీవంక చూశాడు హఠాత్తుగా. ఎందుకో అనుకున్నాను నేను. అట్లా ఒకక్షణంచూసి, నావైపు తిరిగి, '' ఏమో! ఇక్కణ్నించి ఎన్ని ప్రమాదాలు వచ్చినా, కిటికీ వెయ్యొద్దు మనం!'' అన్నాడు సీరియస్‌గా.

'' ఎందుకని? శతమానంభవతి మంత్రపుష్పాలు తినాలని కోర్కెగావుందా నీకేమైనా?'' అన్నాను అంతకన్నా సీరియస్‌గా.

'' ఏమీ అవసరంలేదు? మనం కిటికీ తెరిచేవుంచడానికి మనని ఎవరు ఏవిధంగా నిరోధిస్తారో చూచితీరాలి! అని నా పట్టుదల!'' వాసు గట్టిగా నొక్కి మాట్లాడుతూ ఇంకా కిటికీవంకే చూస్తున్నాడు.

''నీ పట్టుదలకి అంతకన్న వేరే ఏకారణమూ లేదని నేను నమ్మడం ఎలా? సంవత్సరంబట్టి లేని ఈ చైతన్యం ఇవ్వాళ పొద్దున్నే ఆకస్మాత్తుగా కలిగినందుకు కారణం అసలే లేదంటే, నేను నమ్మనోయ్ సుతరామూ'' అన్నాను గట్టిగా.

వాసు గడ్డంపని పూర్తిచేసి తువ్వాలుతో మొహం తుడుచుకుంటూ, ''నువ్వన్నదిగూడా నిజమే. పన్నెండురోజుల ఆలోచన తర్వాత ఈనిర్ణయానికి ఇవ్వాళే వచ్చాను. ఇక ఆ నిర్ణయాన్ని అమల్లో పెట్టడమే!'' అన్నాడు సహజంగా. నాతో మాట్లాడుతున్నాడన్న మాటేగాని వాడికళ్ళన్నీ కిటికీ మీదే వున్నాయ్. నా కనుమానం వేసి కిటికీవైపు చూద్దును గదా, అవతల దొడ్లో ఒక యువతి - దాదాపు

ఇరవైయేళ్ళు వుంటయి, ఎర్రగా వుంది - అంట్లుతోముతున్న దృశ్యం కనిపించింది. ఓ! ఇదా సందర్భం అనుకున్నాను. వీ డేదో ప్రణయగాధ నడుపుతున్నాడల్లేవుంది అని భావించుకుని ''అయితే వాసూ, నేను ప్రస్తుతం ఇక్కణ్ణించి కాసేపు ఎటన్నా షికారుపోతాను; లేదా కాలేజీకి వెళ్ళి నీకోసం వెయిట్‌చేస్తూవుంటాను!'' అన్నాను అర్థోక్తిగా.

'' ఆ మాత్రం లౌక్యం నీకు తెలుసుననే నావుద్దేశం వేణూ!'' అన్నాడు - వీడి అఖాయిత్యం మండ! నేనూ వెంటనే బయటికి పోవాలని 'బైక్' బయటికి తెచ్చుకుంటున్నాను. సరిగ్గా ఇట్లాంటి సమయంలోనే విశ్వం గదిలోకి వచ్చాడు. వచ్చినవాడు వూరుకోవచ్చునా! ఏదో నిర్ఘాంతపోయినవాడికి మల్లే పోజుపెట్టి, '' ఆశ్చర్యం! ఆశ్చర్యం! 81/2 కే వేణు కాలేజీకి బయల్దేరడం వాసు ఇట్లా ఒంటరిపాటున గదిలో కూర్చుండడం...'' అన్నాడు సగంలో ఆపి.

నేను, బైక్‌ని బైటనేవుంచి, మళ్ళీ రూంలోకొచ్చాను. వాసు విశ్వాన్ని వురిమిచూసి, '' ఆహా! ఏమాశ్చర్యడ్డావురా! ఇక్కడేంవింతలు జరిగినాయని కంగారుగా అరుస్తావట్లా?'' అన్నాడు కోపంగా. విశ్వం నవ్వడం తప్ప ఇంకేమీ చెయ్యలేదు.

నాకు ఏదో వింతజరక్కపోతే విశ్వం వెంటనే అట్లా డ్రామాలోలాగా పోజ్ పెట్టి మాట్లాడడు అనిపించి, ''వాసుదేవరావు ఇవ్వాళ కాలేజీకి అటెండ్‌కాడని తోస్తుంది గనక, మేమిద్దరం పోవచ్చా?'' అని కిటికీవంక చూశాను.

వాసు వుద్రేకం కనపరుస్తాడనుకున్నాను. కాని మామూలుగా వాడు ఎప్పుడూ నవ్వేపద్ధతిలోనే చిరునవ్వు తెచ్చుకున్నాడు. రిస్టువాచివంకచూసి, ''నాకూ టైంఅయింది. హోటల్‌కెళ్ళి భోంచేసి వెళ్దాం పదండి'' అన్నాడు వెళ్ళటానికి తయారై.

విశ్వం, నేనూ కాస్త ఆశ్చర్యచకితులమైనాం. ప్రణయగాధలో, పన్నెండురోజులబట్టి అహర్నిశలు ఆలోచించి, కనీసపు నిర్ణయాలు తీసుకుని చూపులు ప్రారంభించినవాడు, ఛాన్సంటూవస్తే వొదులుకుని వొచ్చేస్తాడని మేంమాత్రం ఎట్లా అనుకోగలం?

ఆవేళ సాయంత్రం పెందలాడే రూంకు బయల్దేరాడు వాసు. వాణ్ణి వెంబడిద్దామని నేనంటే, విశ్వం వప్పుకోలేదు. ''నీకెందుకు ఆదుర్దా? వాడిగొడవేదో వాణ్ణి పడనీయరాదూ?'' అన్నాడు.

'అంతేలే' అనేసి నేనూ అంగీకరించి వూరుకున్నాను. ఇద్దరం బీచ్‌కి బయల్దేరాం. చేపాక్ బీచ్ ఎట్లాగైనా కాస్త విశ్రాంతిగా వుంటుంది. రేడియోగోలకి దూరంగా లేవర్సు పాత్‌లో సిమెంటుబల్లమీద కూర్చుని వొచ్చేపోయ్యే కార్లని మనుష్యుల్నీ పరిశీలిస్తూ సంభాషణ ప్రారంభించాం. మేమ్ముగ్గురం బి.యే. ఫస్ట్ ఇయర్ చదువుతున్నాం. అనేక కారణాల వల్ల ఒక్క రూంలోనే వుంటున్నాం. మా రూం తేనాంపేటలో వుంది! పరిసరమంతా రమ్యంగా వుంటుంది. మద్రాసు నగరంలో వుండే నిరంతర అశాంతి, కార్లగోలా మాగదికి కాస్త దూరంగానే వుంటాయి.

ఈ గదినిగురించి వివరాలు తెలియడం చాలా అవసరం. గది అంటే చిన్నదీ చితకదీ కాదు.

పెద్దగది. నాలుగు అల్మేరాలూ, ఒక కిటికీ తూర్పువైపున సింహద్వారం, పడమట వైపు ఒక వాకిలీ, వున్నాయి. పడమటవైపు వాకిలి ఇంటివాళ్ళ పోర్షనులోకి వెడుతుంది గనక అదెప్పుడూ మూసేవుంటుంది. గదికి ఒక్క కిటికీ మాత్రమే వున్నా తూర్పు వాకిలిగుండా సముద్రపుగాలి వస్తుంది. అల్మేరాలనిండా పుస్తకాలూ, పాతపత్రికలూ పడి వుంటాయి. చిందరవందరగా దక్షిణపు కిటికీ మీద మంచినీళ్ళకూజా, గాజుగ్లాసూ వుంటాయి. పడమట వైపు సింహద్వారానికి ఎదురుగా, పెద్ద టేబిల్ మీద సినిమా యాక్టర్ల ఫొటోలు, జాతీయ నాయకుల ఫొటోలు స్టాండ్ ఫ్రేంలలో అమర్చివుంటాయి. ఇంటివారు ఆంధ్రులు. కృష్ణా జిల్లా నియోగులు. చాలా నిదానస్తులూ, మంచివాళ్ళూను. అంచేతనే కాలేజీ దూరమైనా ఈరూంలోనే వుంటూ వచ్చాం ముగ్గురం. కాలేజీలో మిగతా స్టూడెంట్లతో అట్టే సంబంధం వుంచుకోక ప్రత్యేకంగా వుండిపోయినాం. దానికి కారణం దాదాపు మా ముగ్గురి భావాలూ ఒక్క రీతిగా వుండటమే. ఈ కారణంచేత, కాలేజీలో మిగతా స్టూడెంట్లను మేము వెలిగా చూస్తున్నామని అర్థం కాదు. సోషల్ఎఫైర్సులో కలసి మెలసి వున్నా, వ్యక్తిగతంగానూ, చదువులోనూ మా ప్రత్యేకతని నిలుపుకోవాలని ప్రయత్నించాం; అంతే.

ఆరోజున రాత్రి 8 గంటలవరకు, నేనూ, విశ్వం, లేవర్సు పాత్‌లో కూర్చున్నాం. అనేక విషయాల్లో చర్చలు చేస్తూ 'హస్కాలజీ' అనే శాస్త్రంయొక్క లోతుపాతులు తీసి హోటలుకి బయల్దేరాం. వాల్‌జారోడ్ దాకా నెమ్మదిగా నడుస్తూ మౌనం పాటించిన విశ్వం బస్‌స్టాండ్ దగ్గిరికి రాగానే అకస్మాత్తుగా కాలుస్తున్న సిగరెట్ కిందపారేసి ''వేణూ! వీడు ఇట్లా ప్రణయనాటకంలో దిగితే చదువు నాశనం అవుతుంది గదరా?'' అన్నాడు దిగులు వెలువరించే స్వరంలో.

ఆ మాటేనేనూ అనుకొంటున్నారోయ్. విరహవేదనలో ఎడ్యుకేషన్ ఐస్ ఐ కరిగిపోగలదు!'' అన్నాను. ఇంతలో బస్ వచ్చింది. మౌంట్‌రోడ్‌వరకూ వేరేబస్‌లో వెళ్ళి హోటల్‌కు జేరాం.

భోజనం దగ్గర విశ్వం మళ్ళీ వాసుమాట ఎత్తాడు - '' ఇన్నాళ్ళూ మనం ఈ విషయాన్ని గ్రహించకుండా వూరుకోటం ప్రమాదించింది!'' అన్నాడు.

''అమ్మాయి ఎవరూ అసలు? వీణ్ని ప్రేమించే అంత సాహసం వున్నదంటే ఆమె అసాధ్యురాలే అయివుండాలి'' అన్నాను.

'' ఆ లెఖ్ఖన వీడేమన్నా తక్కువవాడా? అయితే, చదువు పూర్తయేదాకా పెళ్ళి చేసికోనని, స్త్రీ వంకే చూడనని, ప్రగల్భాలుకొట్టిన వీడు ఇలా ప్రవర్తిస్తాడనుకోలేదు... కాని... ఇదంతా నిజమేనా? వీడు నిజంగా ప్రణయ నాటకం సాగిస్తున్నాడంటావా?''

''అనుమానం కూడానా? పొద్దున గంటసేపు కిటికీ వంకే చూస్తూ కూచున్నాడు. పైగా పన్నెండు రోజులనుంచి 'అబ్జర్వు' చేస్తున్నానని చెప్పాడు. ఇంకా తార్కాణం ఏం కావాలి?''

''అయితే ఇప్పణ్నించి వీణ్ణి మనం దారినపెట్టాలి!''

''తప్పకుండానూ!''

భోజనం పూర్తిచేసేప్పటికి రాత్రి తొమ్మిదిన్నర అయింది. వెన్నెల హాయిగా కాస్తోంది. ఆకాశంనిండా నక్షత్రాలు. ''వాసు భోజనం చేసి వెళ్ళిపోయినాడు'' అని వడ్డించే కుర్రాడు చెప్పాడు. బయల్దేరాం. ఇంకేం! వాసు గదిలో ఒంటరిగా దక్షిణపుకిటికీగుండా ప్రేమగాథ సాగిస్తుంటాడు. ఈ గొడవనించి వాణ్ణి తప్పించాలి. అది స్నేహితులమైనందుకు మనకర్తవ్యమయింది. యెవరూ యివ్వకపోయినా గాని, ఆ అధికారం మేము తీసుకుని వెన్నెల్నీ ప్రకృతి సౌందర్యాన్ని గమనించకుండా గబగబా మా రూమ్‌వైపుకి నడకసాగించాం. రూమ్ దగ్గిరపడ్డకొద్దీ వాసు ఏం చేస్తుంటాడో అనే జిజ్ఞాస యెక్కువైంది యిద్దరికీ. రూం వాకిలిగుండా టేబిల్‌లైట్ వెలుగు బైటకు ప్రసరిస్తోంది. వీడు యింకా మెలుకువతోనే వున్నాడన్నమాట! లోపలికెళ్ళాం. వాసు కిటికీదగ్గిర ఈజీచైరులో పడుకుని సిగరెట్ తగలేస్తో యేదో పుస్తకం పరధ్యానంగా చదువుతున్నాడు. ఆ చప్పుడువిని తిరిగిచూశాడు. విశ్వం చెప్పులు బయట విడిచి లోపలికివస్తూ ''నాటకంలో యిది యెన్నో రంగంరా బ్రదర్'' అని అడిగాడు గొంతు ఓ మాదిరి వెక్కిరింపుగా పెట్టి.

వాసులో ఏ కదలికా రాలేదు సరిగదా, చిరునవ్వన్నా నవ్వలేదు. వాడిచదువులో వాడు వుండిపోయినాడు. విశ్వం ఈ మౌనవాతావరణాన్ని భరించలేకపోయినాడు. ఐదు నిమిషాలకన్న. ''వాసూ'' అని గట్టిగా పిలిచాడు. వాసు చేతిలో పుస్తకం మడతపెట్టి, లేచి కూచున్నాడు విసురుగా. ''యేం మునిగిపోయిందని అలా అరుస్తున్నావురా!'' అన్నాడు విశ్వాన్ని కొంచెం విసురుగా చూచి. నాకు కోపంవచ్చింది. ''మేము పలకరించినా పలకనంత బిజీగా వున్నావే మరీ'' అన్నాను.

వాసు నన్నూ, విశ్వాన్ని కాస్త తీక్షణంగా చూశాడు ఒక క్షణం. తర్వాత ఆజ్ఞాపూర్వక స్వరంలో ''అబ్బాయిలూ నామాట కాస్త వినండి. ఈపూట వెంటనే మీరిద్దరూ మంచంమీద పడుకుని నిద్రపోండి... నా వ్యవహారంలో మీరు జోక్యం కలుగజేసుకోవద్దు. తెల్లారి మీకు విషయం అంతా చెబుతాలే'' అన్నాడు.

మాలో ఇదేగొడవ. ఎదటివాడు కాస్త నిక్కచ్చిగా ఏదన్నా చెప్పాడా ఆపైన మాటామంతీ లేకుండా ఆప్రకారం నడుచుకోటమే! వెంటనే విశ్వం నేనూ క్యాంప్‌కాట్‌ల మీద పడుకున్నాం. కాని నిద్రపట్టలేదు. వాసు ఎవరికోసం అట్లా కూచున్నాడో ఆమెని చూడాలని మాకూ ఆశగానేవుంది మరి. వూపిరి బిగపట్టిదుప్పటి ముసుగుతన్ని కదలకుండా పడుకున్నాం.

రాత్రి పదకొండుగంటలు కావస్తోంది. చాలవరకూ లోపలవున్న తృష్ణకొద్దీ నిద్రపట్టక, మసక మసకగా వెలుగుతున్న టేబిల్‌లైట్‌కాంతిలో వాసుని పరీక్షిస్తూపడుకున్నాను. దాహమవుతున్నా లేకండా పడుకునే వుండాలాయె! విశ్వం గూడా అట్లాగే పడుకునివున్నాడు అని నావూహ. కిటికీబైట వెన్నెల పిండారపోసినట్లు వుంది. ప్రకృతి అంతా నిశ్శబ్దంగా, నిశ్చింతగా గాఢనిద్రపోతోంది. వాసు కిటికీవైపే చూస్తో, ఎదురుచూస్తున్నాడు ఆమెకొరకు. సిగరెట్ తర్వాత సిగరెట్ తగలేస్తున్నాడు. నాకూ సిగరెట్ తాగాలని బుద్ధిపుడ్తోంది... కాని లేస్తే వాడికి కోపం వస్తుందిగద! ప్రణయం! దీనికోసం ఎన్నెన్ని అఘాయిత్యాలు చేస్తాడు మనిషి! వాసు-! వీడు ఎంత మంచివాడని అనుకున్నాను... వీడుగూడా చివరకి ఇట్లా అర్థరాత్రిదాకా దెయ్యంమల్లే మేల్కొని కూచుని.... నా ఆలోచన చప్పున ఆగి కిటికీ

అవతల కనపడ్డ స్త్రీరూపాన్ని గమనించింది... పొద్దున చూచిన అమ్మాయే ... గదిలో దీపం మరీ గుడ్డిగా వుంది... వెన్నెల వెల్తురు స్పష్టంగా వ్యక్తుల్ని కనపర్చేంతగా లేదు... వాసు కిటికీదగ్గరగా లేచినిలబడ్డాడు. సన్నగా గాలిలో ఈ సంభాషణ తేలివచ్చింది.

''నన్ను రక్షించాలి!'' స్త్రీ స్వరం బ్రతిమాలింది.

'' ఇందులో రక్షించేందుకు నేనెవర్ని?'' వాసు అన్నాడు సహజంగా.

''అయితే నా మాటమీద ఇదివరదాకా వేచివున్నారే!'' ఆశ్చర్యపడ్డది ఆమె.

''మీ కోర్కెని తిరస్కరించలేక'' వాసు ఆమెని తీక్షణంగా చూస్తున్నాడు.

''మిమ్మల్ని ఎట్లా... ఇదిగో ఈ కాగితం చదివితే నా పరిస్థితి మీకు బోధపడ్తుంది'' అని ఆమె ఒక కాయితం వాసు చేతిలో పెట్టింది.

''దీన్ని చదవ మంటారా?''

''అవునండి!''

''చదివి?''

''నా పరిస్థితి అర్థమైతే... నన్ను...''

'' ఓహో! సరే... శలవు...''

''వెళ్తానండి...''

ఆమె వెన్నెల్లోకలసి వెళ్ళిపోయింది. వాసులేచి, టేబిల్‌లాంప్ పెద్దది చేశాడు, ఆమె ఇచ్చినకాయితం చదవాలని. నేనూ, విశ్వం ఇక ఓపికపట్టలేకపోయినాం. గభాలున లేచికూర్చున్నాం. వాసు మా వంక చికాకుగా, పరిహాసంగా చూశాడు. నన్ను లోలోపల ప్రశ్నలు వేధిస్తున్నై. వాళ్ళిద్దరి సంభాషణద్వారా వ్యవహారం ఏమాత్రం నాకు బోధపడలేదు.

విశ్వం ఆదుర్దాగా, వాసు దగ్గిరికి వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. నేను టేబిల్ మీద కూర్చున్నాను.

'' ఏమిటిరా వాసూ! ఇదేం వ్యవహారంరా? మా తల చెడిపోతోంది! నీ చదువు నాశనమౌతుంది ఈ ప్రణయాలతో!'' అన్నాడు విశ్వం. వాసు పకపక నవ్వాడు.

''నవ్వితే సరా? ఆలోచించు!'' అన్నాడు సీరియస్‌గా.

వాసు మా యిద్దర్నీ తీక్షణంగా పరికించి, ''మీరు అతి తొందరపడుతున్నారు. నేచెప్పేది వినండి. ఆమె ఎవరో అసలు అర్థమన్నా చేసుకోలేకుండా మాట్లాడుతున్నారు'' అన్నాడు.

విశ్వానికి కోపంవచ్చింది. '' ఆమె ఎవరైనా, నీకు ప్రేమలేఖలు అందించే వరకూ రానేవచ్చింది. అది నిజమే కదా?'' అన్నాడు.

వాసు కోపం తెచ్చుకోలేదు. ''నిదానించండి. ఆమె ఇచ్చిన లేఖ లేక మరేదో దాన్ని చదువుతాను. విని, మరీ ఆలోచించండి!'' అన్నాడు.

''సరే చదువు'' అన్నాం.

వాడు చదవనారంభించాడు.

''మీ పేరు వాసు అని మీ స్నేహితులు మిమ్మల్ని పిలుస్తోంటే విన్నాను. అయినా మీ పేరుతో నాకేపని లేనట్టే భావిస్తున్నాను. కాగా, నన్నుగురించి మీకు కాస్తో కూస్తో వుపోద్ఘాతం ఇవ్వాలనుకుంటున్నాను. మాది బాపట్ల. మా అమ్మా నాన్నా భుక్తికి సరిపడా వున్నవాళ్ళే. అయినప్పటికీ, నా ఖర్మకి నన్నొదిలేశారు; బాపట్లలో నన్ను - నా అందం కోసమేననండి... మరెందుకోసమన్న కానీయండి, ఇద్దరు ముగ్గురు కుర్రాళ్లు ప్రేమించారు; వెంటబడేవాళ్ళు. నా ఒక్క చూపుకోసం తహతహలాడే వాళ్లు. వాళ్ళల్లో ఎవ్వరికి నన్నిచ్చి పెళ్ళిచేసినా, నన్ను పూలలో పెట్టి పూజించుకునేవాళ్ళు. మావాళ్ళే కాదు, ఈ దేశంలోనే సగం వివాహాలు పిల్లల ఇష్టాలతో పనిలేకుండానే జరుగుతున్నై; అసలు వివాహమంటే అర్థం తెలియని పసివాళ్ళకి పెళ్లిళ్లు చేసే పెద్దలు తమ గురుతర బాధ్యతల్ని వొదిలించుకుని చేతులు కడుక్కుంటున్నారు. అలాగే, మావాళ్ళు, నన్ను ఇక రెండేళ్ళకి ఉద్యోగంనుండి రిటైర్ కానున్న ఓ పెద్దమనిషికి అంటగట్టారు. ఆయనకి ఆస్తి చాలావుంది. దానికోసమే మావాళ్ళు నాకీ పెళ్ళి చేశారు... మా ఆయనకి ఇక్కడే డెడ్‌లెటర్ ఆఫీసులో పని; ఆయనకి బంధువులు ఎక్కువ; వీళ్ళందరికీ, నేను చాకిరీ చేయాల్సి వచ్చింది. మామూలుగా, అందరు స్త్రీలకుమల్లె భౌతిక సుఖాలు నాకూ లభ్యమైనట్టయితే, చాకిరీని లెఖ్ఖ చెయ్యకపోదును. నాకు పదహారేళ్లు; నా భర్తకి యాభైయేళ్లు. ఆయనకి యౌవ్వన సుఖాల అనుభవం పూర్తయింది; నాకు ప్రారంభమైందని వేరే చెప్పడమెందుకూ?

ఈ పరిస్థితుల్లో, నా జీవితంలో ఒక తుఫాను రేగింది. నాభర్తకి దగ్గిర చుట్టం అతను. మద్రాసులో వుద్యోగంకోసం వచ్చి మాయింట్లో మకాం పెట్టాడు.

అతనికి ఇరవైరెండేళ్లు వుంటాయి. చాలా కలుపుగోలు మనిషి. అందమైనవాడు నెల్లాళ్ళలో మా ఇద్దరిమధ్య పరిచయం ప్రకృతి శక్తుల ప్రయత్నం వల్ల ప్రేమగా మారింది.. దీన్లో నా తప్పేమీ లేదు అని మీరు అంగీకరిస్తారని భావిస్తాను. భావించడమేగాదు, ప్రాధేయపూర్వకంగా వేడుకుంటున్నాను. మేమిద్దరం మీ కంటపడ్డప్పుడు నేను భయపడ్డాను. కాని, మీరు వుదారులై నా రహస్యాన్ని - జీవిత రహస్యాన్ని దాచి వుంచడానికి అంగీకరించారు. మీ దగ్గిర దాచేందుకేమీ లేదు. నాకు అన్నయ్యలూ తమ్ముళ్ళూవున్నారు. మీరు నాకు అన్నయ్యవంటివారని భావించి మీకు ఇంకోవిషయం విన్నవిస్తున్నాను. ఈ విషయాన్ని మా అన్నయ్యకన్నా చెప్పనేమో.

నా ఈ జీవనరకాన్నించి... నన్ను స్వర్గసీమలకు తీసుకెళ్తానని నా ప్రియుడు వాగ్దానం చేశాడు. నేనూ అంగీకరించాను... మా రహస్యాన్ని మీ ముందు వుంచాను. మీరు నాకు చేసే సాయమల్లా నా రహస్యాన్ని బయటపెట్టకుండా వుండడమే. మీరు నాకు ఈ సాయంచేస్తారని నేను పూర్తిగా గాఢంగా నమ్ముతున్నాను. ఎందుకని అంటారా? ఒక స్త్రీని ఆమె ప్రేమరహస్యాలు తెలిసిగూడా, ఆమెని ప్రియుడితో చూసిగూడ తనకి ఛాన్సు కావాలని ఏ మొగాడు ఎగబడకుండా వుంటాడు? అయితే మీరట్లా ఎగబడలేదు: ఉపేక్షించి వూరుకున్నారు! ఇది చాలదా మిమ్మల్ని నమ్మేందుకు!

నాకు మీ సలహాని ఒక చీటిరాసి, కిటికీకింద పడెయ్యండి. తీసుకోగలను.

వాసు ఆ లేఖను జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకుని, '' ఇప్పుడేమంటారు?'' అన్నాడు వాడి మామూలు వ్యంగ్య పూరితమైన నవ్వుతో. నాకు ఏమనాలో తోచలేదు. విశ్వం పదినిమిషాలు విభ్రాంతుడై మౌనంగావున్నాడు. కిటికీనుంచి వచ్చిన గాలితరంగం మాలో సంచలనం కలిగించి, మౌనవాతావరణాన్ని భగ్నపర్చింది. విశ్వం వాసుచెయ్యి అతి ప్రేమతో పట్టుకొన్నట్టుగా షేక్‌హాండ్ ఇచ్చి '' ఆహా! త్యాగివి! పేరు నిలబెట్టావురా!'' అన్నాడు సంతోషంతో.

''ఏం పేరు?'' అన్నాను నేను.

''మన నీతిపేరు!'' అన్నాడు విశ్వం ఆనందంతో వాసుకీ, నాకు సిగరెట్లు అందిస్తో.

''తరవాత!'' అని అడిగాను, ఇంకా ఏం జరగబోతోందా అన్నట్టు.

''ఏం జరుగుతుంది? వాళ్ళిద్దరూ, వాసు ఆశీర్వాదంతో రేపీపాటికి స్వర్గసీమల్లో విహరిస్తోంటారు!'' అన్నాడు విశ్వం.

తరవాత ముగ్గురం, ఏదో మాకేతెలియని ఆత్మశాంతితో పడుకొని నిద్రపోయినాం.

తెల్లారి ఏమీ వింతలు జరగలేదు. మరుసటిరోజున కొద్దిగా మబ్బుపట్టి ఆకాశం చాలా అందంగా కన్పిస్తోంది. ఆదివారం కావటం వల్ల ముగ్గురం పదింటికే భోంచేసివచ్చి టేబిల్ గదిమధ్యకి లాక్కొని కుర్చీలో తాపీగా కూర్చుని పేక ఆడుకుంటున్నాం. పక్కయింటిలో ఏదో కలవరం జరుగుతుందనుకున్నాం. అది ఎంతకీ జరక్కపోవడంతో నాకు నిరాశఎక్కువౌతోంది. పేకసాగుతోంది. సిజర్లు మశౌతున్నాయి... మధ్యాహ్నం 12 గంటలవరకూ పేక ఆడింతర్వాత కాస్తవిశ్రాంతి తీసుకుందామనిపించి ఈజీచైర్‌లో వాలబోతున్నాం... దక్షిణపుకిటికీ అవతల దొడ్లో, ఆ ఇంట్లో జనాభా అంతా పోగై గుసగుసలాడుతున్నారు. మే మనుకున్నదే ఐవుంటుంది... కానీ, ఆ తర్వాత ఏవిషయమూ పైకి పొక్కలేదు. రిటైర్డు ఉద్యోగి జరిగిన పరాభవాన్ని భరించి, మౌనంగా వూరుకున్నాడల్లేవుంది. ఇది మామూలేగా! స్త్రీ హత్యల్ని, భ్రూణహత్యల్ని సహించి వూరుకునే మన సమాజ అసహజ నీతి వ్యవస్థ ఒక యువతి లేచిపోతే దాన్ని బైటపెట్టుకుని బజార్లపాలు కావడానికి ఎప్పుడూ అంగీకరించదు. అసలు, మన సాంప్రదాయధర్మాల దృక్కోణప్రకారం అన్యాయం - లేక అధర్మం బహిరంగంగా జరిగితేనే దానికి శిక్ష! రహస్యంగా జరిగే లక్షల తప్పులకి, అది స్పష్టంగా తప్పు అనీ అవినీతి అనీ ఆ సాంప్రదాయ ధర్మప్రకారమే రుజువైనా, ఏ శిక్షా లేదు! తప్పులు కాని వాట్ని తప్పులని నిర్దేశించడం, ఆ తప్పులు చేయడానికిగల మూలకారణాల్ని తొలగించలేకపోవడమూ దౌర్భల్య చిహ్నమేగదా! కానీ, వీట్ని గాఢంగా ఆలోచించేవాళ్ళే వుండరు. ఎవరికి వారే ఎప్పటికప్పుడే ఏదో వెధవ సమాధానాలు చెప్పుకుంటో, 'రొటీన్'గా 'లోర్' అవుతూవుంటారు ఈ నీతులమధ్య! ఆ లెఖ్ఖన మేం మాత్రం అట్లాకాదూ వుంది? ... ఇట్లా ఆలోచిస్తోపడుకుని నిద్రపోయినాం ఆవాళ్టికి.

(*కథావాహిని 1955*)

# అవసానం

రోగుల మూలుగులూ, శిశువులవార్డునించి వినిపిస్తున్న ఏడుపులూ, బైటినించి విన్పిస్తున్న వానగాలి హోరులో అంతగా వినిపించడంలేదు. ప్రమాదాలకు లోనైనవార్ని పడుకోబెట్టివున్న వార్డులో మూడవమంచంమీద పడుకుని రక్తం గడ్డగట్టే ఆ చలిలో ఆస్పత్రిలోపల వెచ్చగా పడుకోగలిగినందుకు కొంత తెలిసీ తెలియని సంతోషంతోటి పెద్దఅద్దాల కిటికీలోనుంచి బైటికి కనిపిస్తున్నంతవరకు చూస్తున్నాడు ప్రసాదరావు.

తెల్లని ఆస్పత్రి గోడలూ ఏవో మందులవాసనా, అప్పుడప్పుడు వచ్చిపోతున్న నర్సుల బూట్ల టకటకలూ ప్రసాదరావుకు మగతగా వినిపిస్తున్నాయి. స్ఫురిస్తున్నాయి. అతనికి వొళ్ళంతా కట్లు వేశారు. ఎటూ కదలటానికి వీల్లేదు. తలమాత్రం పక్కకిపెట్టి కిటికీనుండి బైటికి చూస్తున్నాడు.

బాగా చీకటి పడలేదింకా.

మసకబారే వెల్తురు, మబ్బులు కమ్మివుండటంవల్ల భయంకొల్పుతోంది. సన్నగా చినుకు రాలుతోంది గావును కిటికీ అద్దాలు స్పష్టంగాలేవు. అయినా ఏదో కన్పిస్తోంది.

ఆస్పత్రి కాంపౌండ్ కవతలవున్న పెద్దవేపచెట్టు చీకటి నిలయంగా గాలికి వూగుతోంది. ఆకులులేని కొమ్మలు వికారంగా కన్పిస్తున్నాయి. ప్రసాదరావు ఇందాకణ్ణించి అటే చూస్తున్నాడు. అతను ఆ కారు ప్రమాదానికి గురై స్మృతి తప్పి ఇప్పటికి వారం అవుతోంది. ఇవ్వాళ్ళ ఉదయంనించే పరిసరాన్ని గుర్తించే బాహ్యజ్ఞానం కలిగింది.

ప్రసాదరావుకు పాతికేళ్ళుంటాయి. 'ఫరవాలేదు' అనుకోగలిగే స్ఫురద్రూపి. వొడ్డూ పొడుగ్గా వుంటాడు అతని ఆలోచనలు చాలా మసకమసకగావుండి బైటవాతావరణంలాగే అస్పష్టంగా అస్థిమితంగా వున్నాయి.

అతను వూగేచెట్టువంక చూస్తూ, తన గత జీవితాన్ని ఎందుకో నెమరువేసుకుంటున్నాడు. ఆ చెట్టుకింద రోడ్డుమీద గొడుగులేసుకుని తొందర తొందరగా యిళ్ళకు వెళ్ళేవాళ్ళు కన్పిస్తున్నారు. ఓ కుర్రాడు నెత్తిని తుండుగుడ్డ కప్పుకుని పరిగెత్తాడు. ఇదంతా లీలగా గోచరిస్తోంది ప్రసాదరావుకి. ఆ కుర్రాడు తన కేదో తీరని వ్యధని రగిల్చిపోయినట్టూ, తన ఆశలన్నీ ఆ కుర్రాడు వెళ్ళిపోవడంతో పోయినట్టూ వూహించుకుని బాధపడసాగాడు ప్రసాదరావు. అతని శక్తిలేని శరీరంలో నరాలు దడదడలాడాయి. అతని హృదయంలో దావానలం రగుల్కొన్నది.

ఆ కుర్రాడి నడక, వాలకం అన్నీ ప్రసాదరావు మెదడులో ఒక్క క్షణంపాటు విప్లవాన్ని రేపినై. బాబు అంతా ఇలాగే వుండేవాడు...

ప్రసాదరావు ఇక ఆ చెట్టువంక చూడలేకపోయినాడు. అసలు చూడడానికి వీలులేదు గూడాను. ఆస్పత్రి వార్డులలో దీపాలు గప్‌మని వెలిగాయి. విద్యుద్దీపాల కాంతి అన్ని విశాలమైన గదుల్నీ ఆవరించుకుంది.

ఆస్పత్రిలో ఎక్కడో వున్న గోడగడియారం ఏడు కొట్టిన శబ్దం చాలా అస్పష్టంగా వినిపించింది. బైట గాఢాంధకారం. వాన, గాలి. ప్రసాదరావు విసుగ్గా తలతిప్పేసుకుని పైకప్పు వంక చూస్తూ పడుకున్నాడు.

ప్రసాదరావు కళ్లు మూసుకుని ఆలోచిస్తూవుండగానే బూట్ల టకటక వినిపించింది. చాలా పరిచయమైనస్వరం. అందులో ఎంత ఆప్యాయత, కరుణ తొణికిసలాడతాయి! ''కాస్త నోరు తెరవండి, మందు తాగాలి!'' అంది.

ప్రసాదరావు ఉదయంనించి ఈ నర్సుకోసం ఎదురుచూస్తున్నాడు ఎవరో బంధువుకోసం ఎదురుచూసినంత ఆదుర్దాతోటి.

'' ఉం...'' అని మూలుగుతూ మెల్లిగా నోరు తెరిచాడు. హాలాహలంలాంటి చేదుద్రవాన్ని ఆమె నిదానంగా పసిపిల్లవాణ్ణి బుజ్జగిస్తున్నట్టుగా అతని పెదిమ పట్టుకొని నోట్లో చుక్కలు చుక్కలుగా పోసింది. ప్రసాదరావు మందు చాలా అయిష్టంగామింగి, '' ఎందుకు సిస్టర్, నాకీమందులూ మాకులూ, కాస్త విషంపోసి కడతేర్చరాదూ.'' అన్నాడుగొణుగుడుగా.

'' ఎక్కువగా మాట్లాడకండి. మే మిక్కడ వున్నది మందులు పొయ్యడాని కేనండి.''అంది నర్సు అతనివంకచూస్తూ. ఆమె తేజోవంతమైన ముఖవర్చస్సూ, ధగధగలాడే రెండు జ్యోతుల్లాంటి కళ్ళూ, ఒక మాతృదేవికి వుండవలసిన దయనూ, జాలినీ ప్రతిఫలిస్తున్నాయి. ప్రసాదరావు ఐదారునిమిషాలు అలాగే ఆమెవేపే నిశ్చలంగా చూస్తూవుండి ఒకసారి బాధతోటి మూలిగి ''నాతో ఏదైనా మాట్లాడు సిస్టర్, నాకోసం వచ్చేవాళ్ళెవరూ లేరు. నన్నూ కాస్త మాట్లాడనియ్యి. లేకపోతే నా మెదడు పేలిపోతోంది'' అన్నాడు చాలా నీరసంగా నిదానంగా - అయితే ఎంతో బాధగా.

నర్సు అతని పక్కనే నిలబడి, అతనిజుట్టు నిమురుతూ '' ఇంకా చూడవల్సినవారున్నారు. చూసివస్తాను. మిమ్మల్ని మాట్లాడనియవద్దు అని డాక్టర్ చెప్పి వెళ్ళారు. మీకు మాట్లాడకపోవటమే బాధ ఐతే ఏదో కాసేపు మాట్లాడుకుందాం. కొంచెం కాఫీ తాగుతారా'' అని ప్రశ్నించింది.

ప్రసాదరావు తలవూపాడు ఆమోదకరంగా.

నర్సు పక్కనేవున్న చిన్న వలల బీరువా తెరిచి అందులోవున్న ఫ్లాస్కునుంచి కాఫీ గ్లాసులోపోసి అతనికి నాలుగు గుక్కలు పట్టింది? ''నే మళ్ళీవస్తా. పూరికే కొరగాని ఆలోచనలు చెయ్యకండి దయచేసి. టెంపరేచర్ పెరుగుతుంది'' అని హెచ్చరికచేసి నర్సు మిగతా మంచాల దగ్గరికి వెళ్ళిపోయింది.

ప్రసాదరావు ఆమె వెళ్తోంటే ఆమె వేపే తిరిగిచూస్తూ వుండిపోయినాడు. బక్కపల్చగావుంది. అందంగానే వుందేమో ఆమెలోని ఆకర్షణ ప్రసాదరావులో ఒక పూజ్య భావాన్నీ దానికి విరుద్ధమైన చపలత్వాన్నీ సైతం రెచ్చగొట్టాయి. ఆమె నల్లటి మెరిసేకళ్లు, సన్నని ఎర్రని పెదాలూ, మృదువైన స్వరమూ, తనకు స్మృతికలిగిన తొలి క్షణం నుంచీ బాగాపరిచయమైనాయి. ఆమె ఉదయం

తనకుమందిచ్చి కాఫీ ఇచ్చి వెళ్ళింది. తిరిగి రాత్రిడ్యూటీకి వస్తుందని ఇందాకటి ఇంకోనర్సు అన్నది. ఆ నర్సుకీ-ఈమెకీ ఎంత తేడా! ఆ నర్సు తనది 'డ్యూటీ' అని భావిస్తున్నట్టే యాంత్రికంగా చూసింది. ఈమె! తల్లిలాగా, సోదరిలాగా, ప్రేమగా, దయగా .... ప్రసాదరావు ఆమెకోసం నిరీక్షిస్తూ ఏదో వూహిస్తూ పడుకున్నాడు. తనలో తెములుతున్న ఆలోచనల్ని ఎవరికన్నా చెప్పెయ్యకపోతే తల పగిలిపోతుందనిపిస్తున్నది అతనికి. ఆమె విని 'అయ్యోపాపం!' అని హృదయపూర్వకమైన జాలి ప్రకటిస్తే తనకు కొంతలో కొంత ఉపశాంతి చిక్కుతుందని ఒక వెర్రి ఆశ.

2

ఇప్పుడు ఆస్పత్రి గోడగడియారం ఎనిమిది కొట్టింది టంగుటంగుమని. ఇందాకటికన్న ఇప్పుడాధ్వని మరింత స్పష్టంగా వినిపిస్తోంది. బైట ప్రకృతి కల్లోలంగూడా ఉపశమించింది. కాని, చీకట్లు మాత్రం దట్టంగానే వ్యాపించివున్నాయి. రోడ్డు దీపాల వెలుగు దూరంగా మసకగానే కన్పిస్తోంది అద్దాలకిటికీ గుండా. ఆస్పత్రి కిటికీలనుండి దీపం వెలుగు వేపచెట్టుమీద ప్రసరిస్తోంది. ప్రసాదరావు బరువైన మనస్సును స్థిమితపర్చుకోటానికి ప్రయత్నించినప్పుడల్లా ఇందాకటి ఆ కుర్రాడూ, నర్సూ జ్ఞాపకం వచ్చి బాధపడి పోతున్నాడు.

రోగుల మూలుగు ఇందాకటికంటె తగ్గింది. చలికీ, నర్సులుపోసిన నిద్రమందుల ప్రభావానికీ లొంగిపోయారు గావును, రోగులు చాలామంది నిద్దట్లో పడ్డారు.

ఆస్పత్రి వాతావరణం ప్రశాంతిలో పడింది.

మరొక్క అరగంట గడిచింది. నర్సు నిదానంగావచ్చి ప్రసాదరావు ప్రక్కనేవున్న ఇనపకుర్చీలో కూర్చుంటూ, '' ఎందుకండీ రమ్మన్నారు? నాకో అరగంట వ్యవధివుంది, ఏదైనా మాట్లాడండి'' అన్నదామె చిన్నగా నవ్వి.

ప్రసాదరావు ఆమెవేపు కన్నార్పకుండా చూశాడు. ఆమె తన 'విధి' ని నెరవేరుస్తున్నట్టా! తన కథలో ఆసక్తివుండి ప్రశ్నిస్తున్నట్టా?... ఏమైనా చెప్పితీరాలి. ఈ తీరని మనోవ్యధనుభరించటం కష్టసాధ్యం... 'సిస్టరు, చెప్పనా!' అన్నాడు.

''చెప్పండి! క్లుప్తంగా మాట్లాడండి వీలున్నంతవరకు! ఏం?'' అన్నది ఆమె.

''నీ పేరేమిటి?'' అని అడిగాడు రోగి.

''కళ్యాణి'' అన్నది సిస్టర్.

''మంచిపేరు! కల్యాణీ! నాకు రాను రాను జీవితం మీద విరక్తి ఏర్పడిపోతోంది. నేను కారు ప్రమాదంలో చిక్కింది అకస్మాత్తుగా కాదు. కావాలని వెళ్ళిపడ్డాను. దాన్నెవరూ గుర్తించలేదు....''

''ఆః! మీ అంతట మీరేవెళ్ళి ఆ కారుకిందపడ్డారా?'' కళ్యాణి ఆశ్చర్యపడింది.

''ఏం చెయ్యను! చదువు మానేసి ఎన్నాళ్ళయింది! ఎన్నేళ్ళయింది! కళ్యాణీ! నిరుద్యోగం అంటే దానివెనుక ఎంతదారిద్ర్యం! ఒక్క సంవత్సరంలో తల్లిదండ్రులు పోయినారు... వాళ్లు ముసలివారు, పోయినారంటే సహజం. కాని నా తమ్ముడు పన్నెండేళ్ళవాడు....'' ప్రసాదరావు ఆగిపోయినాడు.

కల్యాణి '' ఏమైంది కుర్రాడికి?'' అని అడిగింది ప్రేమగా. ఆమె కళ్ళలోని ప్రేమ వాత్సల్యం ప్రసాదరావుపై మంచుతుంపరలా వర్షిస్తున్నదేమోనన్న భ్రమ ఎవరికైనా కలుగుతుంది.

''కుర్రాడు నాకు మల్లేనే వుండేవాడు సిస్టర్. హైస్కూల్‌లో సెకండ్‌ఫారం చదువుతున్నాడు.'' ఆమె మూర్తి ప్రసాద రావును కదిలిస్తోంది. అతనిలోని ఉద్వేగాలు కట్టలు తెంచుకున్నాయి. అతను కల్యాణి ఎర్రని పెదాలవంక చూస్తూ రెండు నిమిషాలు ఆలోచన మానేశాడు. విద్యుద్దీపపు కాంతి ప్రతిఫలిస్తున్న ఆ ఎరుపు అతనికి కొత్తగా, వింతగా అవుపిస్తోంది.

కల్యాణి '' ఇప్పుడు మీ తమ్ముడేం చేస్తున్నాడు? ఎక్కడ వుంటున్నాడు?'' అని అడిగింది.

''తల్లిదండ్రులుపోయిన శోకంతోటి మంచంపట్టాడు; ఎవరెవరో సాయం చేశారు, లేదనను; కాని ధర్మాస్పత్రి మందుకు లొంగకనే టైఫాయిడ్‌తో వాడూ పోయినాడు... సిస్టర్! మరణమంటే నాకు భయంలేదు... పదహారేళ్ళు భుజాన మోసికూడా బడికి తీసుకెళ్ళి - టైఫాయిడ్ కప్పగించా తమ్ముణ్ణి... తీవ్రమైన విరక్తితోటి వొచ్చి రొడ్డుమీదనిల్చున్నా... జేబు ఖాళీగా వుంది ఇంటికెళ్ళటానికి భయం... ఇల్లు బావురు మంటున్నది... ఎటు చూసినా తమ్ముడి విగ్రహమే ప్రత్యక్షమవుతుంది... ఆమూల తలుపు దగ్గిర కూచుని వాడు లాంతరు వెలుగులో చదువుకోడం, దొడ్లో చిక్కుడు పాదుకింద నీళ్ళు పోసుకుంటూ ''అన్నయ్యా! లెక్కలు వేసి చూపించవూ?'' అనడమూ, రాత్రిళ్ళు నా పక్కనే పడుకుని '' ఇంగ్లీషు 'నాండిటెయిల్' కథ తెలుగులో చెప్పు అన్నయ్యా!'' అంటూనే నన్ను కావలించుకుని నిద్రపోవడమూ నా మనస్సును చిత్రవధ చేస్తున్నాయి సిస్టర్...

''అందరి వంటివాడు కాదు నా తమ్ముడు. కుటుంబ పరిస్థితులు తెలుసుకున్నవాడు గావటంవల్ల అందరు పిల్లలకి మల్లె 'కొనుక్కు తింటా' అనైనా అడిగేవాడు కాదు... మూడుపూటలు అన్నం... వుంటే - లేదా రెండుపూటలే. అమాయకుడైన కుర్రాడికి సైతం మా యింట్లో ఆర్థికదారిద్ర్యం పాఠాలు నేర్పింది. ఘోరంగా లేదూ సిస్టర్... ఈరోజుననేను ఎవరూ లేనివాణ్ణయిపోయినాను తమ్ముణ్ణి శ్మశానంలో అప్పజెప్పి తిరిగి తడిగుడ్డలతో ఇంటికి వస్తోవుంటే ఆ కారు ఎదురుపడింది.''

ప్రసాదరావు ఆగిపోయినాడు దుఃఖభారంతో బొంగురు పోయినగొంతుక సవరించుకుంటూ.

నర్సు - కల్యాణి కంట్లో జాలి శోకంగా మారింది. కళ్ళల్లో రెండు బొట్లు కన్నీళ్లు మెరిసాయి. ''పాపం! అందుకని ఆత్మహత్య కొడబద్దారా! తప్పుకాదూ? ఆశ కలిగి వుండాలండి...'' అన్నదామె.

''ఆశ! ఏమి ఆశతోటి బ్రతకమంటారండి? నా అన్నవారందరూ పోయినాక ఎవరికోసమండీ? నా కోసమే నంటారేమో! నాకైనా ఉద్యోగం దొరకలేదు... దొరకదు. ఇంక ఏం చూసి...?'' అని ఆగాడు ప్రసాదరావు ఆయసంతోటి.

నర్సుకిప్పుడు ఇతని నెలా ఓదార్చాలో స్ఫురించలేదు. ఎలా ఇతనిలో ఆశగలిగించడం? లేకపోతే బ్రతకడే... ఆ గాయాలూ, టెంపరేచర్ - ఎలా నయమౌతాయి? ప్రమాదమే.... ఆమె కొక ఆలోచన కలిగింది. ''మిస్టర్ ప్రసాదరావు! మీ రొక్కరే అలాంటి అభాగ్యులుకారు... ఎందరున్నారో! నేనే.... వున్నాను'' ... అని ఆగిపోయింది.

''చెప్పండి. మీరూ నాకు మల్లేనేనా?... పాపం!'' అని జాలిపడ్డాడు రోగి. అతని ఆలోచనలు ఇప్పుడు నర్సువేపు మళ్ళినయి.

కల్యాణి ''మీరు బాధపడుతున్నారు. మీ బాధ నాకథవిని అధికమౌతుందేమో!'' అన్నది.

''ఫర్వాలేదు, చెప్పండి'' అన్నాడు ప్రసాదరావు ఆసక్తిగా ఆమె ప్రకాశవంతమైన, స్వచ్ఛమైన కళ్ళల్లోకి చూస్తూ.

కళ్యాణి ఒకసారి ముంజేతి గడియారం వంక చూసి, ''అరగంట అయింది. వెళ్ళివస్తాను, మళ్ళీ అరగంట కూర్చోవచ్చు. మీరేమీ అధైర్యపడకండి. మీకెవరూ ఆత్మీయులు లేరనుకోకండి. నేనున్నాను'' అన్నది తగని కరుణ వుట్టిపడే స్వరంతో.

ఆమె వెళ్లినవేపే చూస్తూ ప్రసాదరావు కిటికీవైపు తిరిగాడు. వేపచెట్టు కన్పించనంత చీకటి. రోడ్డు నిరామయంగా వుంది. తన జీవితం గూడా ఇలా నిర్మానుష్యమై - ఆ వేపచెట్టులా అంధకారంలా, దెయ్యంలా నిలబడి ఘనీభవిస్తోంది.

3

తిరిగి నర్సు వొచ్చి ప్రసాదరావు పక్కనే కూర్చుంది. '' ఇంకా నిద్రపోలేదూ మిస్టర్?'' అన్నది. రోగికి తిరిగి కాఫీ ఇచ్చింది. ప్రసాదరావు ఏమీ మాట్లాడకుండా పడివున్నాడు, ఆమె చెప్పేది విందామని... కల్యాణి అతనికి మందుకూడా ఇచ్చి, ''నాకూ జీవితమంటే విరక్తిపుట్టిపోయింది... ఇలా నర్సుపని చేసుకుంటూ బతికున్నాను. నన్నుచూసి ఎవరూ జాలిపడరు. '' ఏం రోగమా?. నెలకు డెబ్బయి ఐదూ తింటూను!'' అంటున్నారు... మీరేచెప్పండి. ఇదేనా సుఖం? సంసారం చేసుకుంటూ...'' సిగ్గో భయమో, ఆగిపోయిందామె.

''అనుకుంటే ఏదైనా సుఖమే!'' అన్నాడు ప్రసాదరావు. ఇతర్లకయితే ఉపదేశం చెయ్యటం ఎంత తేలిక! అనుకున్నది నర్సు.

''ఇంత లేతవయస్సులో విరాగిఅయి ఏకాంతంగా జీవించడం కష్టం కదండీ?'' అన్నది ఆమె ఏదో బాధపడుతున్నట్టే.

''వొంటరితనమెందుకండి? మిమ్మల్ని నిక్షేపంగా ఎవరు పడితే వాళ్లు చేసుకోరూ?'' అన్నాడు ప్రసాదరావు.

కల్యాణి కొంచెం రూక్షణస్వరంలో ''నాకు పెళ్ళి అయింది...'' అన్నది

''అలాగునా?'' అన్నాడు రోడి, గుండెలెందుకో వేగంగా కొట్టుకున్నాయి.

అతని వైరాగ్యం కల్యాణికి స్ఫురించింది. ''పెళ్ళయి ఏం సుఖపడ్డాను? భర్త రెండో ఏటనే పోయినాడు. అక్కణ్ణించి ఏంచెయ్యాలో తోచక దిగులుపడి కూర్చున్నాను కొంతకాలం; మనం వూరుకుంటే ఆకలి వూరుకుంటుందా? ఎలాగో తిప్పలుపడి నర్సింగ్ కోర్సు పూర్తిచేసి ఇందులో చేరాను. ఎన్నిబాధలు పడ్డాను... ఇప్పుడు ఒంటరిదాన్ని. మా అమ్మ ఎప్పుడో చనిపోయింది. కళ్లులేని తండ్రి ఇంట్లో మంచంపట్టి వున్నాడు... ఆయనకు మతి చాంచల్యం... ఆయన నాతో మాట్లాడడు... ఇంటికిపోవడానికే భయం. అంతా శూన్యమండి! నేను నా భర్తని ప్రేమించినదాన్నే - ఆ తీగె అలాగే తెగిపోయి వేళ్ళాడుతోంది.... నేను ఎలాగో ఆశతోటి జీవిస్తున్నాను... మీరూ అలాగే..... చూడండీ! దిగులు పెట్టుకోకండి'' అన్నది కల్యాణి.

ప్రసాదరావు దయగా, ఆశగా ఆమెలోకి చూశాడు.

''నేను వెళ్తానండి. వెళ్ళి టీ తాగివస్తాను. లేకుంటే నిద్ర ముంచుకొస్తుంది. మీరు వూరికే దిగులు పెట్టుకోకండి!......'' అనేసి లేచి వెళ్ళింది నర్సు.

ప్రసాదరావు మనస్సులో ఒక ఆలోచన ఆశతోటి కలిసి తృటిలో పెరిగి పెద్దయింది. బైట ఆకాశంలో మబ్బులలో నుంచి దశమి చంద్రుడి గుడ్డివెన్నెల అతిదారుణంగా, వెకిలిగా వేపచెట్టుమీద పాకుతోంది. ఆకులులేని ఒక కొమ్మ మీద ఓ కాకి కూర్చుని తెల్లారిందో అని భ్రమపడి రెక్కలు టపటప లాడించి ఒకసారి 'కా కా' అని అరిచింది.

కల్యాణిమీద ప్రసాదరావుకు ఒకరకం వ్యామోహం కలిగింది. ఇద్దరు వొంటరిగాళ్ళు. ఇద్దరి స్థితిగూడా వొకటే.... ఆమె ఒకవేళ తనను ప్రేమించవచ్చును. ఏం? ఎందుకు ప్రేమించరాదు?

తిరిగి ఆమెవొస్తే బాగుణ్ణు.... ఆమె తనపక్కనే కూర్చుని మాట్లాడుతూవుంటే తన శారీరక, మానసిక బాధలు తగ్గిపోతాయి. తనలో ఎక్కడలేని ఆశలూ చిగురుస్తాయి. ప్రసాదరావు వూహల్లో పడి, కళ్లుమూసుకుని ఇందాకణ్ణించి చావు తప్ప గతిలేదనుకున్న వాడల్లా, ' ఎల్గాగైనా బ్రతకాలి' అనే ఆలోచించసాగాడు. కల్యాణి మూర్తిలోని ప్రతి అందాన్ని తూచి వర్ణించుకుంటున్నాడు అతను.

'ఆమెలో సహృదయం, ప్రేమ వాత్సల్యాలు లేకపోతే అందరు రోగులకంటె తనపట్ల ఇంత ఔదార్యంచూపిస్తుందా?'' అనే దొక ఊతగా పరిణమించిందతని మనస్సుకి.

4

రాత్రి పన్నెండుదాకా తిరిగి కల్యాణి అటువేపు రానేలేదు. పన్నెండింటికి ఒకసారి వచ్చి అందరి రోగులకూ టెంపరేచర్ తీసుకుని మందులియ్యవల్సినవారికి మందులిచ్చి - వరుసగా అందర్నీ చూస్తూ ప్రసాదరావు దగ్గరకి వచ్చింది. ఆమె వొచ్చి చూసేటప్పటికి ప్రసాదరావు కొంచెం నిద్రలో వున్నాడు. కల్యాణి అతనిప్రక్కనే వున్న ఇనపకుర్చీలో కూర్చుని ఆప్యాయంగా అతనిలోకి చూసింది.

ఇంతవరకు తాను చూసివున్న వందలకొలది రోగులందరికంటే ఇతను భిన్నంగా వున్నాడు. అతన్ని ఓదార్చి నయంచేసి పంపడం ఇక్కడ వున్నవారి ధర్మం... ప్రత్యేకం తన విధి... రోగులు రకరకాల కథలు చెప్పేవారు తనకు. అన్నీ విని వాళ్ళకు తగిన సమాధానం చెప్పి, ' ఈ అమ్మాయి మంచిది' అనిపించుకున్నది తను. ఈరోజున ఇతను సరికొత్త కథ చెప్పాడు - తను ఎన్నడూ వినని కథ.

ప్రసాదరావు నిద్రమందుశక్తికి బడి మగతలో పడివున్నా ఏదో కలవరిస్తున్నాడు. మొహంలో భావాల మార్పు అతను కంటున్న కలల్ని ప్రతిఫలిస్తున్నాయి.

కల్యాణి చెరిగిపోయిన దుప్పటి సరిగ్గాకప్పిందతనికి. ఆమెకి ఏదో ప్రత్యేకమైన శ్రద్ధ కలిగిందతని మీద. ఇతన్నింక పదిరోజులకల్లా 'డిస్చార్జి' చేసేస్తారు. ఆ రోజున బైట దిక్కులేని ఇతన్ని - నీరసుడైన ఇతన్ని ఎవరుతీసుకెళ్ళిపోషిస్తారు? .... పాపం!

ఆమెలోని సహజమైన వాత్సల్యప్రవాహం కట్టలు తెంచుకుని ప్రవహిస్తోంది. తను తీసుకెళ్ళి మరొక పదిహేనురోజులు పోషించి పంపిస్తే కాస్త దృఢంగా వుండి, ఏదైనా పనిలోకి చేరే వోపికలో వుంటాడు మనిషి. చదువుకున్నవాడులా కన్పిస్తున్నాడు.

మనిషి మనిషికి చెయ్యవల్సిన కనీస సేవకదా అది! అని సమర్థించుకున్నదామె.

తెల్లారి ఆమె డ్యూటీ దిగి వెళ్ళేప్పుడు అతన్ని పలకరించి ''అధైర్యపడకండి ప్రసాదరావుగారు! కోట్లమంది బ్రతికే ఈభూమిపై మీ కొక్కరికే స్థానం లేదా?'' అనేసి వెళ్ళింది.

ప్రసాదరావు మొదటిసారి చిరునవ్వు నవ్వాడు. ''నీ హృదయంలో నాకు స్థానం ఇయ్యి చాలు!'' అనుకున్నాడతను.

పదిహేనురోజులు గడిచినాయి. ప్రసాదరావు శరీరమూ, మనస్సూకూడా చాలాభాగం రోగవిముక్తమైనాయి. కల్యాణి ఆప్తబంధువులాగా అతనికి వుపచారాలు చేసింది. మందుకంటేఎక్కువగా ఆమె ధైర్యవచనాలు ప్రసాదరావు మనస్సుకు ఆందోళన తగ్గించి ఆశరేకెత్తించాయి. ఆమెను ధైర్యంచేసి అడిగితే సరిపోతుంది. రేపో ఎల్లుండో తనను బైటికి పంపించేస్తారు. రేపు సాయంత్రం ఆమె డ్యూటికి రాగానే అడిగేద్దాం... అని అనుకున్నాడతను.

తనను ప్రమాదానికి గురిచేసిన కారుయజమాని పరిహారంకింద ఐదొందలు పంపిస్తానని కబురుచేశాడు. నిన్ననే కళ్యాణి చెప్పింది. తను మరీ వెతుక్కోనక్కర్లేకండా ఆ ఐదొందలతో ఏదో వ్యాపారం చేసుకుని బ్రతకవచ్చు. తను ఉద్దేశించినట్టు కల్యాణిగూడా'అంగీకరిస్తే...

ఆవేళ రాత్రి డ్యూటీకి కల్యాణికి బదులు ఇంకో నర్సు వచ్చింది.

ప్రసాదరావు అడిగాడు: ''కల్యాణి రాలేదేం సిస్టర్?'' అని.

ఆ నర్సు విసుగ్గా '' ఏం? ఆమే కావాలా?'' అన్నది.

''అదికాదు సిస్టర్'' అన్నాడు బ్రతిమాలుతున్నట్టుగా ప్రసాదరావు.

''ఏమిటి కాదు! నాకు తెలీదేమిటి? 'అది' మీ దగ్గిర కొచ్చి కులకడం, నవ్వడం! ఛీ. ఛీ. ఎంత సిగ్గు విడిచేసింది!'' అన్నదామె ఈర్ష్యగా.

''అదేమిటి సిస్టర్ అలా అంటావు? ఆమె సిగ్గు విడిచేసినపని లేమీ చెయ్యలేదే నా దగ్గిర! మీరు పొరపడుతున్నారు'' అని సవరించాడు ప్రసాదరావు.

''నాకెందుకు చెబుతావయ్యా! ఆస్పత్రి అంతా గోలగా వుంటే! మీరు ఆమెను రిజిష్టర్డు మేరేజ్ చేసుకోబోతున్నారటగా!'' అన్నది కొత్తనర్సు అకస్మాత్తుగా.

ప్రసాదరావు మనస్సొక క్షణంపాటు స్తంభించిపోయింది సంతోషంతోటి. ఈ పుకారు ఎలా పుట్టింది? ఎవరితోటి ఐనా కల్యాణి అన్నదేమో! తన వుద్దేశం నిజమే నన్నమాట.

''అది నిజమే ననుకుందాం మాటవరుసకి. దాంట్లో తప్పేంవుంది సిస్టర్?'' అన్నాడు ప్రశ్నార్థకంగా ప్రసాదరావు.

''నాకెందుకండీ అవన్నీ, నిన్నటిదాకా పెద్ద నీతి మంతురాలుగా మాట్లాడుతూ వుండేది అందర్నీ వెక్కిరిస్తూ. అందుకని అడిగాను'' అన్నది కొత్తనర్సు.

అంతకుపైన ఏం మాట్లాడ్డానికీ ఇష్టపడకపోవడంవల్ల వూరుకున్నాడు ప్రసాదరావు. అయితే, అతనికీ సంభాషణ బ్రహ్మాండమైన ఆశ కలిగించింది. తనవుద్దేశం నిజమౌతున్నందుకు తన అదృష్టాన్ని తనే మెచ్చుకున్నాడతను.

ఇటుపైన కల్యాణి ఎప్పుడు కనపడ్డా తనవుద్దేశం వెంటనే బైటపెట్టవచ్చుననే ధైర్యంకూడా కలిగిందతనికి.

కాని మర్నాడూ కల్యాణి రాలేదు. ' ఎందుకని?' అని ఎవర్నడిగినా ఏమీ సమాధానం రాలేదు. ప్రసాదరావుకు ఏదో అకారణమైన భయం పట్టుకున్నది. '' ఏమైంది కల్యాణి? ఎవరూ ఏమీ సమాధానం చెప్పరేమిటి?'' అని విసుక్కున్నాడు.

6

ఆ మర్నాడూ కల్యాణి రాలేదు. ప్రసాదరావును ఆ వేళ ఉదయం పదిగంటలకు బైటికి పంపే ఏర్పాట్లు జరిగాయి. పెద్ద డ్యాక్టర్ స్వయంగా వచ్చి ఐదొందలు చేతికిచ్చి ''వెళ్ళిరా తమ్ముడూ, జాగ్రత్త! ఇది మహానగరం. ప్రమాదాలు తరుచు జరుగుతున్నాయి... రోడ్డుమీద నడిచేవాడు ఎంత జాగ్రత్తగా వున్నా చాలదు...'' అన్నాడు.

ప్రసాదరావు ఆయనకు వందనసమర్పణచేసి, ''కళ్యాణి అని ఒక నర్సు ఉండేది చూడండి... ఆమె ఏది?'' అని అడిగాడు. '' ఆమెకి నేనెంతయినా రుణపడి వున్నాను. ఆమెతో రెండు మాటలు చెప్పి వెళ్దామనుకుంటున్నాను'' అన్నాడు.

డ్యాక్టర్ అతన్ని ఎగాదిగాచూసి, ''మీకూ, కల్యాణికి... ఏదో ముడిపెట్టి అందరూ అనుకుంటున్నారిక్కడ నిజమేనా?'' అని అడిగాడు.

ప్రసాదరావు : ''మే మిద్దరం అలాంటిమాటలేం అనుకోలేదండి ఇంతవరకు'' అన్నాడు.

''అయితే నాతోరండి. కల్యాణి లోపల వుంటుంది... గుండె నిబ్బరం చేసుకోండి. కారుప్రమాదాలు ఎక్కువౌతున్నాయండి'' అన్నాడు డ్యాక్టర్.

ప్రసాదరావుకి అకారణంగా గుండెలు దడ దడ లాడసాగినాయి.

డ్యాక్టర్ 'అతి ప్రమాదరమైన కేసులు' వుండే వార్డుకు తీసుకెళ్ళాడు.

ప్రసాదరావు సాధ్యమైనంత త్వరగా నడిచాడు. నాలుగైదు మంచాలు దాటాక ఆగాడు డ్యాక్టర్. కల్యాణియొక్క భౌతిక కాయం తుది మర్యాదలకోసం అక్కడ భద్రంగా వుంచబడింది.

ప్రసాదరావు '' ఆం... ఏమిటిది?...'' అంటూ ఆమెని సమీపించాడు.

డ్యాక్టరు అతన్ని ఆపాడు, '' ఆమె కూడా నిన్ను ప్రేమించిదోయ్. నిన్న ఆస్పత్రికొస్తూ బస్ దిగుతూ వెనకనించి వస్తున్న ఇంకో చిన్న కారుకింద పడిపోయింది ఇంతక్రితమే చనిపోయినది. కొనవూపిరితో నీకు 'ధైర్యంగా వుండమని' చెప్పమంది. పాపం! ఆమె ఆత్మశాంతికి ప్రార్థించడంతప్ప ఇప్పుడు మనం చేసేదేమీ లేదు...'' అన్నాడు.

ప్రసాదరావు కుప్పగా కూలిపోయాడు. అతని పదిహేను రోజుల కలల ప్రతిఫలం - దేవత - దాటిపోయింది. ప్రసాదరావు మాటాపలుకూ లేకుండా ఆమె మంచం పక్కనే కూలబడి పోయినాడు.

***(కథావాహిని 1955)***

# కౌముది

అది ఒక వీధి. వీధి అనటంకన్న రాచబాట అనటం సమంజసం. గతుకులులేకుండా, పెద్దరాళ్ళు పదునుపట్టి వేశారు. బాటకిరువైపులా గుబురుగా చెట్లూ, వాటి ననుసరించి పూల తీగెలు. వెనక్కి తిరిగి చూశాను. అంతా అపరిచితంగా వుంది. అస్తమయసూర్యుని రక్తారుణకాంతిలో ఒక్క అర్మైలు దూరంలో ఎత్తయిన కోటగోడలూ, దేవాలయ శిఖరాలూ ధగధగమెరుస్తున్నె. ఎంత జ్ఞాపకం చేసుకున్నా నేనెక్కడ వున్నానో తెలీటం లేదు. నాపక్కనే వెనకాలా, ముందూ, పురుషులూ, స్త్రీలూ కాలినడకనా, గుర్రాలమీదా, పల్లకీలమీద వెడుతున్నారు. నాకు గొప్ప కలలాగు తోస్తోంది ఇదంతా. ఆ ప్రదేశమంతా శుభ్రమైన సువాసనలతో గుబాళిస్తోంది. కాస్త పరిశీలనగా ఆ వెళ్ళే ప్రయాణికుల్ని చూడసాగాను. పంచెలు కట్టుకుని, గిరజాలు గంభీరంగా దువ్వుకుని, పురుషులు పై పంచెలు వల్లెవాటుగా వేసుకుని తమ గమ్యం వేపుకి చకచక సాగిపోతున్నారు. కొందరు పొడుగాటి కత్తులవొరలు నడుముకు వేళ్లాడుతూవుంటే రాచగర్వంతో, తలపాగా వాళ్ళహోదాల్ని నిర్ణయిస్తుండగా నిదానంగా, నిర్లక్ష్యంగా నడుస్తున్నారు. పల్లకీల్లో, మేలిముసుగుల చాటున నూతన యౌవనోద్భవం పురిగొల్పే చిరునవ్వు తొణికిసలాడే యువతులు నన్నాకర్షించారు. సౌందర్యం ఇక్కడ పోగులుపడి వుందా అనిపిస్తోంది. ఆభరణాలకి వన్నె తెచ్చే వాళ్ళవొయ్యారమైన శరీరమూ, ఎన్నిసార్లు చూసినా, తనివితీరని శరీరచ్ఛాయా, నాకు విభ్రమం కల్పించాయి.

కాలినడకనపోతూ, ఏ అపవిత్రపు ఆలోచననీ ఎరగని పసిపిల్లలవంటి యువతుల వొయ్యారపునడక, ఎప్పటివో ప్రాచీనాభరణాలంకారంలో, అజంతా శిల్పాలూ, రాయవెల్లూరు సౌందర్యప్రతిమలు ప్రాణంపోసుకున్నాయా, అనిపించే విన్నాణం ఒలికే దేహనిర్మాణంతో, పూజాద్రవ్యాల, పుష్పాల సుగంధపరిమళాలు మిళితమైన పిల్లగాలికి జుట్టు ఉంగరాలు మొహాన పడుతున్నా గమనం తగ్గించనివాళ్ళ విన్యాసం నా చారిత్రక జ్ఞానాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి.

నేనెక్కడవున్నానో నా కర్థమవలేదు. ఒకసారి నావంక నేనే చూసుకున్నాను. రిస్టువాచీ, సిగరెట్‌పెట్టె, సిల్కు లాల్చీ నున్నగా దువ్విన క్రాపు, ఇంగ్లీషుట్విల్ పైజమా, ఈ వాతావరణంతో నాకున్న సంబంధం ఆశ్చర్యంగ వుంది.

''నుల్చున్నారేం ఆర్యా'' అనే గంభీర సంబోధన విని పక్కకు చూశాను. నా పక్కనే, ఇరవై ఏళ్ళ ఆజానుబాహువైన యువకుడు మొలలో వేళ్లాడే కత్తిని సవరిస్తోనన్నీ ప్రశ్నవేశాడు. అతనిదుస్తులు వొంటికి అతుక్కుపోయినట్టు అమరివున్నై. గొప్ప వీరత్వమూ సాహసమూ అతని విశాలమైన వక్షస్థలంలో, వైఖరిలో ద్యోతకమౌతున్నై.

''ఆశ్చర్యంగా చూస్తున్నారు! మీదేగ్రామం?'' అని మళ్ళీ ప్రశ్నించాడు. అతని ప్రశ్నలో

అనురాగమూ, అతిధిసత్కారపూర్వకమైన మర్యాదా గోచరిస్తున్నై. రెండు నిమిషాలు అతణ్ణే తేరిపారచూసి ''మాది గురజాల'' అన్నాను. అతని ముఖంలో విచిత్రమైనమార్పు గోచరించింది.

''గురజాల'' అనేసి అతను ఏదో జ్ఞాపకం తెచ్చుకునే ప్రయత్నంలో ఆకాశంవంక చూసి, ''గురజాల సీమలో మీలాగా ఎవ్వరూ దుస్తులు వేసికోరే!'' అన్నాడు; మా యిద్దరి మధ్యా ఆవరిస్తున్న సంజచీకట్లతోపాటు అప్పుడే తూర్పున ఉదయించిన పూర్ణచంద్రబింబపు చల్లని వెన్నెల ఛాయా కాలగమనాన్ని సూచిస్తున్నై.

నేనందుకున్నాను: ''మా వైపునేకాదు, ఆంధ్రప్రదేశమంతటా ఇలాగే' అని నేను మాట పూర్తిచెయ్యక ముందే అతడు పకపక నవ్వేడు. నవ్వాపుకుని, నా భుజంమీద నెమ్మదిగా తడ్తూ, తూర్పున కనిపిస్తున్న కోటగోడల్ని చూపిస్తూ, అతను ''శాతవాహన ప్రభువు పరిపాలనలో ఎక్కడా ఈ రాజ్యం మొత్తంలో ఈ వేషధారణ బొత్తిగా అసంభవం'' అన్నాడు.

నేను అదిరిపడ్డాను కాలగతిలో ఏదో విపరీతం సంభవించింది. ఇరవయ్యో శతాబ్దం మనిషిని, ఎలాగో శాతవాహనశకంలో పడ్డాను. ఈ అపూర్వస్థితిలో, అతనూ నేనూ, సమన్వయపడడం చాలా కష్టం. కాని, ఎలాగో అడ్జస్టు కావాలి; అనుకుంటూ, ''కావచ్చునుకోండి. వేషంతో ఏమేమిటి? - అది సరే ఈ వూరి పేరేదో చెప్పగలరా?'' అని అడిగాను ప్రార్థనాపూర్వకంగాను, స్నేహభావంతోనూ.

ఆ క్షత్రియ అపరిచితుడు, చిరునవ్వు నవ్వి, '' ఇదే విజయపురం. దీనిని విజయాదిత్యభూపాలుడు పరిపాలిస్తున్నాడు. అది సరేగాని ఆర్యా! తమ నామధేయమేదో సెలవిస్తారా?'' అని ప్రశ్నించాడు.

ఒకగండం తప్పిపోయినందుకు సంతోషిస్తూ ''వేంకటామాత్యుడు'' అన్నాను. ఈ శకంలో పేర్లు ఇలాగే వుంటాయి అని వినివున్నాను. ''తమ పేరూ?'' అని ప్రశ్నించాను.

''ఓహో! సరే. నా పేరు ఉదయసింహుడు. మేమూ క్షత్రియులమే. రాజప్రాసాదంలో సైన్యాధికారిగా వుంటున్నాను. ఇవ్వేళ కార్తీకపౌర్ణమి గదా! అందుకని మన్మధ పూజకి వెళ్తున్నాను'' అని ముగించాడు, చలి ప్రారంభించటంవల్ల వల్లెవాటుని బిగించుకుంటూ.

నేను, చుట్టూ వెళ్తున్న ప్రజల గమ్యస్థానం వేపుగా నడక సాగిస్తూ, '' ఇవ్వాళ ఉత్సవం కాబోలు'' అని అడిగాను, తెలిసినట్టే ప్రశ్నించి, తెలియని వాటిని తెలుసుకోటం నాగరీకుల లక్షణం.

ఉదయసింహుడు నాతోటే నడుస్తూ, బాటకి కుడివేపుగా ఓ ఫర్లాంగు దూరంలో ఉదయచంద్రుని లేవెన్నెల కాంతిలో మెరుస్తూన్న ఓ పాలరాతి దేవాలయాన్ని నాకు చూపించాడు. దేవాలయమూ, దానిచుట్టూ డేరాలూ; అక్కడక్కడ కాగడా వెలుగులో, ప్రజాసమూహం క్రిక్కిరిసి వుంది; దేవాలయపు దక్షిణప్రాంగణంలో పడమరనుంచి తూర్పుకి ప్రవహిస్తోంది ఓ పెద్ద నది.

ఉదయసింహుడు మళ్ళీ చెప్పసాగాడు. ''సంవత్సరానికి ఒక్కసారి - ఒక్క రోజైన, ఈ రోజెంత మనోజ్ఞమైంది! చూడండి. ఆ వెళ్ళే యువతులను! ఎంత ఉల్లాసం! ఏమండీ! మీరు బ్రహ్మచారులేనా?'' అని ప్రశ్నించాడు అకస్మాత్తుగా.

''అవును'' అన్నా దేనికి అన్నట్టు అతనివేపు దృష్టి సారించి.

''దేనికని అంటారా? ఇవ్వాళ దంపతులు, బ్రహ్మచారులను యధోచితంగా సత్కరిస్తారు. పదండి త్వరగా. మన్మధుని దర్శించి, మనమూ ఉత్సవములో పాల్గొందాము'' అన్నాడు గమనాన్ని త్వరితంచేసి.

''అవునండీ. ఆ వేడుకల్లో పాల్గొనాలని నాకు చాలా కుతూహలంగా వున్నది'' అంటూ అతన్ననుసరించాను. జరగబొయ్యే దేదైనా, దాన్ని కొద్దిగానైనా ఊహించుకోగలను గనక ధైర్యంగానే వున్నాను.

2

నక్షత్రాలతో, చంద్రకాంతితో ఆకాశం రత్నకంబళం లాగా వుంది. దేవాలయప్రాంగణంలో అడుగు పెట్టేటప్పటికి చంద్రకాంతి బాగా తెలుపు తిరిగింది. చలిగాలి వీస్తోంది, అనేక విచిత్ర పరిమళాల్ని మోసుకొస్తో దేవాలయపు లోప్రాంగణమంతా, ప్రజా సమూహంతో క్రిక్కిరిసి వుంది. అక్కడే నిలబడి అన్నీ మరిచిపోయి సింహద్వారం మీదే నాచూపు నిలిచిపోయింది. ఇద్దరు తరుణవయస్కులైన కన్యలు అర్ధనగ్నంగా, సింహద్వారానికి రెండువేపులా నిలబడి వచ్చేవార్ని ఆహ్వానించే భంగిమలో, శిలవరాతితో చెక్కబడి వున్నారు. సన్నని నడుమూ, కోలమొగమూ, చిరునవ్వులొలికే పెదాలూ - నన్ను సమ్మోహితుణ్ణి చేస్తున్నాయి.

నా క్షత్రియ మిత్రుడు గంభీరంగా, ''లోపలికి రండి'' అని పిలిచేవరకూ నాకు స్పృహే లేదనాలి. దేవాలయంలో అడుగు పెట్టాను. ఎంత శుచిగా, ఎంత అందంగా వుంది! వందలకొలది ప్రమిదల్లో సువాసనతైలాలుపోసి వెలిగించారు. ఆ పూజ్యమైన కాంతిలో, - మన్మధ దర్శనానికి వొచ్చిన యువతీ యువకుల కోలాహలంలో - మంగళ వాయిద్యాల రాగమూర్ఛనల్లో, కర్పూరం, రకరకాల పువ్వుల పరిమళాల్లో ఆ రతీమన్మధసన్నిధి ఎంత గొప్పగా వుందీ!

ఒకసారి దేవాలయాన్నంతా కలయచూచాను. గోడల నిండా యువతీ యువకుల విగ్రహాలు, అనేక భంగిమల్లో, అపూర్వంగా చెక్కబడి వున్నాయి. లతలు, వాహనాలు, పద్మాలూ అన్నీ శిల్పసౌందర్యం వుట్టిపడుతున్నాయి. కళ్యాణ మండపం దాటి, మౌనంగా, ఆ సౌందర్య పరిమళ వాతావరణంలో లీనమై గర్భగుడిముందున్న దర్శనమంటపంలో ప్రవేశించాను.

ఒక యువతీ యువకుడూ రతీమన్మధుల కెదురుగా, ఐదారు గజాల దూరంలో సంభోగభంగిమలో నగ్నంగ నిలబడివున్నారు! కళ్ళు నులుముకుని మళ్ళీ చూసాను. ఆశ్చర్యం! రెండూ శిలలు; సహజ వర్ణాలివ్వబడ్డ రాతి విగ్రహాలు; వాటి చుట్టూ, వాటికన్న అందమైన అమ్మాయిలు స్నానంచేసి, ఆరి ఆరని జుట్లు వొయ్యారంగా ముడేసుకుని, విలువైన చీరెలు ధరించి, సమస్తాభరణాలతోటి అలంకరించుకుని, మన్మధుణ్ణి, పూజించేందుకు వరసగా నిలబడి వున్నారు. మరోవేపున యువకులు నిలబడి కామదేవతలని పూజిస్తున్నారు. నన్నొకరిద్దరు విలక్షణంగా చూసినా ఎవరూ అంతగా నన్ను గమనించలేదు. నేను పక్కకు తిరిగి, నా మిత్రుడి చెయ్యి పట్టుకుని ఉల్లాసంగా వూపుతూ, ''బైటికి వెడదామా?'' అని అడిగాను.

''పదండి పోదాం'' అని అతనూ నన్ననుసరించాడు, దేవాలయ ప్రాంగణం దాటినతర్వాత అతడు నాకు దూరంగా కాగడాల వెలుగులో కన్పిస్తున్న ఒక యువకుల గుంపును చూపించి ''అదిగో ... ఆ

బ్రాహ్మణ బ్రహ్మచారులున్నారే... అక్కడికెళ్ళి వుండండి. ఎవరేనా దంపతులు పిలువగలరు. నేను అటు వెళ్తాను. మళ్ళీ ఉదయం, కృష్ణరేవులో కలుసుకుంటా మిమ్మల్ని'' అని, నాదగ్గిర మర్యాదా పురస్సరంగా శలవు తీసుకుని, అక్కడ తిరుగుతున్న తిరునాళ్ళ ప్రజలలో కలిసిపొయ్యాడు.

నేను అతడు నిష్క్రమించినవేపే చూస్తూ, దేవాలయం బైట రాతిపై కూర్చుని, సిగరెట్ వెలిగించాను. వేళ్లు కొంకర్లుపొయ్యే చలి; ఏవేవొ కలల్ని కలిగిస్తున్న వెన్నెల; ఉన్నతంగా గంభీరంగా నా వెనుక నిలబడివున్న దేవాలయం; ఇవన్ని నాలో నిద్రిస్తున్న కోర్కెల్ని రగిల్చినాయి.

ఈ సుందర యువతులలో ఒక్కతె నా మీద కనికరిస్తే ఈ రాత్రి ఎంత అందంగా, ఆనందంగా గడుచును; కాని - దేవాలయంలో గంటలు గణగణ మోగినాయి. మంగళ వాయిద్యాలు ఉచ్ఛస్థాయి నందుకున్నాయి. ఆ విశాలమైన ప్రదేశంలో తీరుగాడుతున్న వారందరిలోనూ, ఏదో విచిత్ర పరివర్తన వొచ్చింది. హడావుడి హెచ్చింది. అందరూ ఏవో కేకలేసుకుంటూ మంత్రాలు వల్లిస్తూ, ఇంకా వేగంగా, దేవాలయంలోకి వస్తున్నారు. ఈ తడవ విడివిడిగా రావటం లేదు. జంటలు జంటలుగా, యువతీ యువకులు ఖరీదైన పట్టువస్త్రాలు కట్టుకుని దేవాలయంలోకి వెళ్తున్నారు. నేనీ పరిస్థితిని అర్ధంచేసుకోకముందే, నావేపొక వృద్ధపురోహితుడు రావటాన్ని అకస్మాత్తుగా గమనించాను. దేనికి? అనే ప్రశ్న వేసుకుంటూండగానే అతడు నన్ను సమీపించాడు.

గౌరవసూచకంగా లేచి నిలబడి, అతనికి నమస్కరించాను. ఆయన రుద్రాక్షమాల, విభూతి ధరించి, శుచిగావున్నాడు. నా నమస్కారం అందుకుని ఆయన ''దీర్ఘాయుష్మాన్‌భవ'' అని నన్ను ఆశీర్వదించి ''తమనామ ధేయం?'' అని ప్రశ్నించాడు.

''వేంకటామాత్యుడు, గురజాల కాపురస్తుణ్ణి'' అన్నాను.

''ఓహో!.... సరే సరే. తాముగ్గూడా అతిధిసత్కారార్ధమే వేచివున్నారా?'' అన్నాడయన.

''అవునండి'' అన్నాను.

''ఒక సంపన్నులైన గృహస్థు మిమ్ము ఆహ్వానిస్తున్నారు. దయచెయ్యండి'' అంటూ నడవసాగాడు. ఆయన్ననుసరించాను మౌనంగా. చుట్టూ ఏవేవో పూలూ, ఇతర వస్తువులూ అమ్మే దుకాణాలముందు, కాగడాల వెలుగులో నిల్చున్న జనాన్ని దాటి, కృష్ణసమీపంగా ఇసకలో ఒక నడికారు వ్యక్తి, ఆయనభార్యకాబోలు నిల్చుని పురోహితుని రాకకు ఎదురుచూస్తున్నారు. అక్కడికివెళ్ళాం. పురోహితుడు ముందుగా నన్ను వాళ్ళకి పరిచయం చేశాడు. ఆ నిల్చున్న సుందరి నన్నొకసారి ఓరకంటితో చూసి, చిరునవ్వు నవ్వింది. ఇందాక దేవాలయంలో చూసిన శిల్పకన్యలు జ్ఞాపకం వొచ్చారు.

గృహస్తు గంభీరంగా అందుకున్నాడు: '' ఈ పర్వదినాన గ్రామాంతరంనుండి వొచ్చిన ఒక అతిథి మాకు లభించటం ఎంతో పుణ్యం'' అని పురోహితుని వేపు తిరిగి ''అయ్యా, వీరిద్దర్ని కృష్ణదగ్గరికి తీసుకువెళ్ళి కార్యక్రమాన్ని పూర్తి చేయించండి'' అన్నాడు. నాకిదంతా గందరగోళంగావున్నా, పురోహితుని వెంట నడిచాను. అసలు - ఆమె వెనకాలే నడుస్తూ ఆమె అంగసౌష్ఠవాన్ని అనుభవించటం నా ఉద్దేశం

3

కృష్ణరేవును సమీపించగానే పౌరోహితులవారు ఆమెనీ, నన్నూ స్నానంచెయ్యమని ఆజ్ఞాపించారు. చలివొణికిస్తోంది. నేనింకో పరిస్థితిలో ఐతే చచ్చినా స్నానం చేయకపోదును; పురోహితుడి ఆజ్ఞకన్న, నా అపరిచతసుందరి, ''సంశయిస్తా రేమండీ? వేళమించిపోవటం లేదూ?'' అంటూ మృదువుగా అన్నమాటకోసం సిల్కులాల్చీ, పైజామా విప్పి వాళ్ళిచ్చిన కొల్లాయివస్త్రం కట్టుకుని, ఆమె చెయ్యి ఊతంగా తీసుకుని నీళ్ళల్లోకి దిగాను, రేవంతా మంత్రఘోషతో నిండిపోతోంది. వెన్నెల కృష్ణతరంగాలమీద ఆడుకుంటోంది. నా అపరిచితసుందరి ఒక సుగంధచూర్ణంతో నా వొళ్లు రుద్దుతోంది నేను చలికి వొణుకుతోవుంటే పకపక నవ్వుతూ, ''చలికి భయపడతారా మీ గురజాలసీమవారు!'' అన్నది.

'క... క... క... కాదు ... లే. పొద్దుపోతోందిగాని...' అంటూ ఆమెకి చక్కిలిగింతలు పెట్టాను.

ఆమె సమ్మోహనకరంగా నవ్వుతూ నీళ్ళల్లోకి మునిగిలేచింది. ఆమె వొంటిమీద నీటిబొట్లలో వేలాది చంద్రబింబాలు మెరుస్తున్నాయి. తలకి తుండుగుడ్డ బిగించి వొడ్డెక్కుతూ, ''రండి...'' అంటూ నన్ను పైకి లాగింది. నేను పురోహితుడిచ్చిన పట్టుపంచె కట్టుకుని, అతని ఆజ్ఞప్రకారం ఆమె కుడిచెయ్యి పట్టుకుని నుంచున్నాను. ఆకలేస్తోంది. ఏమిటీ తతంగం! అని లోలోపల అనుకుంటున్నాను నేను.

పురోహితుడు ఏవో మంత్రాలు వల్లించి, ఆమెచేత నాకు బొట్టు పెట్టించాడు. ఆమె నా నుదుట కుంకుమపెట్టింది. నా వొళ్ళు జల్లుమంది. ఆమె అనంతసౌందర్యానికి చుట్టూవున్న ఎత్తయిన కొండరాళ్ళు కూడా వొణుకుతున్నాయా అనిపించింది. ఆ కార్తీకమాసపు బొమికలు కొరికే చలి, వెన్నెలసొగసు, వివిధ పరిమళాలు మోసుకొచ్చేగాలి, నన్ను ఏవేవొ తియ్యటికలల్లోకి తీసుకెళ్తున్నాయి.

నా అపరిచితసుందరి, తడిచీర విప్పేసి నిగనిగలాడే రక్తవర్ణపు పట్టుచీరె ధరించింది. లేత ఎరుపురంగు మజ్లీన్ రవికె తొడిగింది. ఆమెవేపు చూశాను. ఉన్నతమైన వక్షస్థలం అస్పష్టంగా కన్పించుతోంది. కోలమొగంమీద చిరునవ్వులో కొంటెతనం, నమ్రత కన్పిస్తున్నాయి.

''రండి, మన్మధదర్శనంచేసుకుని వద్దాం'' అన్నది ఆమె.

''సరే పద'' అన్నాను.

ఆమె వొయ్యారపు నడకమీదే వుంది నా మనసంతా. బిగించి కట్టిన చీరెగుండా కన్పించే శరీరపు వొంపులమీద ఊగులాడే తాచుపాములాంటి జడ, మధురమైన ధ్వని కలిగిస్తూన్న కాళ్ళ అందెలూ, పాపిటగుండా తీర్చిన స్వర్ణాభరణం వెన్నెట్లో - నన్నొక పిచ్చివాణ్ణి చేస్తున్నాయి.

దేవాలయం ఇందాకటికన్న ఇప్పుడెక్కువ జనసంకీర్ణంగా కోలాహలంగా వున్నది. కల్యాణమంటపంలో వేశ్యలు నృత్యం చేస్తున్నారు. ఎవరో జావళీ పాడుతున్నారు చాలా భావయుక్తంగా. దాన్ని విననట్టే మేమిద్దరం ముందుకుసాగాం. ప్రమిదలకాంతిలో చందనం, కర్పూరం, సాంబ్రాణి పరిమళాల్లో మగత ఆవరించిననేను, నా అపరిచిత శ్రీమతితోపాటే, మంత్రోక్తమైనపూజలో పాల్గొని కామదేవతకి నమస్కరించాను.

''సాష్టాంగనమస్కారం చెయ్యండి'' అంది ఆమెనవ్వుతూ.

'' ఆహా....'' అంటూ మన్మధుడికి సాష్టాంగపడ్డాను.

'' ఇక లేవండి. పొద్దుపోతోంది'' అంది ఆమె.

4

విశాలమైన ఆ మైదానప్రాంతంలో కాగడాల వెలుగులో వేసివున్న ఒక డేరాలోకి ప్రవేశించాం ఇద్దరం. పక్కనే కృష్ణప్రవహిస్తోంది మందకొడిగా. ప్రజల కోలాహలంతగ్గి దేవాలయంనుంచి శ్రావ్యమైన సంగీతం వినిపిస్తోంది.

'' ఇదంతా ఏమిటి సుందరీ!'' అని అడిగాను డేరాపరికిస్తూ.

''మన్మధపూజ చేస్తున్నామండీ!'' అంది. ఆమె; నిద్రతో, బరువుగా తేలిపొయ్యే కొర్కెలతో మూసుకుపొయ్యే కొంటెచూపు చూసి.

నా చుట్టూ ఆకాశ నీలవర్ణపు మొఖమల్ తెరలు, ఓ పక్క పెద్దమంచం. మంచంపక్కనే ఎత్తయినబల్లమీద ఓ పాత్రనిండా ఎర్రని ఏదో పానీయమూ, ఓ వెండిగ్లాసులో పాలూ, పళ్లెంలో రకరకాల పండ్లు - పలహారాలూ నోరూరిస్తున్నాయి. పక్కమీద రోజా రేకులు వెదజల్లారు. ప్రకాశమానంగా వెలుగుతున్న దీపంనుంచి మగత గొల్పే సువాసనలువొస్తున్నాయి.

''కూచోండి, ఆర్యా! ఆనందపూర్ణమైన, పూజ్యమైన రాత్రి గడవకముందే...'' అంటూ ఆమె నన్ను అతి గారాబంగా మంచంమీద కూచోబెట్టింది. ఇదంతా విచిత్రమైన స్వప్నంలాగా వుంది నాకు.

''ఆకలేస్తోంది'' అన్నాను ఆమెని గోముచేస్తూ.

''ఇవిగో... తినండి... తినిపించనా?'' అంటూ ఆమె నాకతి సమీపంలో కూర్చుని నానోట్లోకి పలహారాలు అందిస్తోంది. ఆమెని నావొళ్ళోకి లాక్కుంటూ ''నువ్వుతినూ!'' అని ఓముక్క నేను కొరికి మిగతా ముక్క ఆమెనోటికందించాను.

''ఎబ్బే... ఆడవాళ్ళు ఎంగిలి తింటారా.'' అంది ఆమె విరగబడి నవ్వుతూ. ఆమె పాలబుగ్గలు ఎర్రబారినాయి. రేగే కామతృష్ణ ఆమెకనుకొలుకుల్లో రక్తార్ణవ రేఖలుగా వ్యక్తమౌతోంది.

''ఈ పానీయమేమిటి సుందరీ? ఇంతకమ్మని వాసన వేస్తోంది! అమృతమా?'' అని అడుగుతూ ఓ గుక్క త్రాగి, ఆమె కిచ్చాను మిగతాది.

''సుర!'' అంటూ ఆమె గూడా రెండుగుక్కలు చప్పరించి, గ్లాసు నాకందిస్తూ '' ఎంత బావుందండి ఈ రాత్రి!'' అంది రొమ్ముల్ని వెనక్కి విరుచుకుంటూ.

నేనామెపక్కనే ఆమెమీదికి వొరుగుతూ, బిగుతైన ఆమె రవికముడి విప్పుతూ, '' ఎన్ని సుఖస్వప్నాల ఫలితమో ఈ సుందరి!'' అన్నాను. డేరా అందుల్లో గుండా, మజ్లీన్ తెరల అవతల వెన్నెల పాకుతోంది.

''మీరూ!... ఏమండి... మీ పేరేమిటండి?'' అని నన్ను బుజ్జగిస్తో, నా పొట్టని క్రాపు సవరిస్తోంది ఆమె.

''నా పేరు వేంకటామాత్యుడు. సుందరీ! ఇలాగే ఈ రాత్రులు శాశ్వతమైతే'' అంటూ ఆమెని పూర్తిగా ఆక్రమించుకుంటూ, ''నీ పేరు చెప్పావుగాదు'' అని అడిగాను.

తమలపాకులతో ఎర్రనైన చిన్న పెదిమలలోగుండా, జాజికాయ, పచ్చకర్పూరం, సుర, పరిమళాలతో కలిసినవ్వుతూ నా మొహాన్ని తనదగ్గరగా లాక్కుంటూ ఆమె ''కౌముది'' అంది.

''కౌముది!'' అన్నాను పెద్దగా. ఆమెకీ నాకూ గూడా సుర మైకంగొల్పుతోంది. కౌముది, ''ఏమండి, మీరు వివాహం చేసుకుంటేనన్ను జ్ఞాపకం వుంచుకుంటారా!'' అని ప్రశ్నించింది. ఆమెకేమీ జవాబివ్వకుండానే ఎర్రటి తియ్యటి పెదాల్నినా పెదాలతో మూస్తూ, ''దీపంతగ్గించనా?'' అని అడిగాను.

''వెలుగులో భయమేస్తుందా?'' అని పకపక నవ్వింది.

''భయంకాదు సుందరీ! ఇంత సౌందర్యాన్నీ నేనే అనుభవిస్తున్నానా? అనే భ్రమని భరించలేనని'' అన్నాను.

''దీపం వువండనివ్వండి. ఈ అనన్యసుఖాన్ని సంపూర్ణమైన జ్ఞానంతోటే అనుభవించుదాం. ఏమండి! పాడనా?'' అని అడిగింది.

''పాడతావా? నీ పాటవిని కృష్ణపొంగుతుంది! మన్మథుడు ఆలయంనించి లేచివస్తాడేమో ఇక్కడికి'' అన్నాను. ఆమె మెల్లగా లేచి అర్థనగ్నంగానే ఓమూలవున్న వీణ తీసుకుని తీగెలుమీటి పాడసాగింది. నామనస్సూ, చుట్టూ అచేతనంగా వున్న డేరా తెరల కృష్ణ నీలపునీళ్ళూ అన్నీ ఆ గానంలో లీనమైనాయి. బల్లమీద వుంచిన రిస్టువాచీ వంక చూచాను పదకొండుగంటలవుతోంది.

''రా - రా కౌముదీ! గానవాహినిలోనే నన్ను వొడ్డుతెలీని స్థితిలో పడేయకు. రా! -'' అన్నాను మైకంగా.

''వొస్తున్నాను. మిగిలిన సురగూడా తాగండి. రాజప్రాసాదంనించి ప్రత్యేకం తెప్పించారు'' అంటూ ఆమె, మంచంమీదకొచ్చి వాలుతూ, దీపం తగ్గించింది.

అబ్బ! ... వొళ్ళంతా నొప్పులు. ఏమిటిది? రాత్రి చూసిందంతా... నిజమేనా? అయోడిన్ వాసనలు... తెల్లని గోడలు... ఎత్తుమడమల బూట్ల టకటకలు... రోగుల దగ్గులు.... ఒక అందమైన దేవత నాలోకి తొంగిచూసింది. దేవత కాదు నర్సు... ... ''ఎలావుందండీ?'' అని అడిగింది. కళ్ళు బరువుగా మూసుకున్నాను.

*(కథావాహిని 1955)*

# శవం విలువ

ఆవేళ తన విధ్యుక్తధర్మం నెరవేర్చటానికి ట్రాఫిక్ పోలీస్ కాన్స్టేబిల్ 202 - పేరు వీరయ్య - సరిగా అయిదున్నరగంటలకే సెంటరుకొచ్చి ఎదురుగా కనపడుతున్న హోటల్లోకివెళ్ళి కాఫీ తాగాడు. ఆరింటికి పత్రికల కుర్రాళ్లు కేకలేసుకుంటూ సెంటరులో అమ్ముతున్నారు. వీరయ్య ఎర్రటోపీ ఒక్కసారి తలనుంచి తీసి తుడిచి, మళ్ళీ నెత్తిన పెట్టుకొని, పత్రికలోని పెద్ద శీర్షికలు మాత్రం చదివి, రోడ్డునడిమధ్య వున్న గొడుగు దగ్గిరకెళ్ళి నుంచున్నాడు.

నుంచున్న వాడల్లా ఒకసారి చుట్టూచూచాడు. ఏ వంకనైనా ప్రజలు గుమిగూడి ట్రాఫిక్కు అడ్డం వుండకుండా చూసుకోవాల్సిన పని వుందిగదా! అదీ అతనిక్షోభ. దానికి తగ్గట్టేపంటకాల్వమీద వంతెన మొదటగల పేవ్మెంట్ మీద జనం కొద్దిగా గుమిగూడి వున్నారు. దేన్నో చాలా ఆసక్తిగా చూస్తున్నారు. ఏడెనిమిదిమంది, ఐదారుగురు పిల్లలు పెద్దలు అడ్డం వుండడంతో ఎగిరి ఎగిరి చూస్తున్నారు.

పోలీసుకీ దృశ్యం చికాకనిపించక మానదు. వొంతెన అసలే చిన్నది, దానిగుండా కార్లురావాలె... ఎట్లాగా?....

వీరయ్య చప్పున, జేబులోనించి ఈలదీసి ఊదుతూ, వెళ్ళాడు గుంపు దగ్గిరకు.

అతన్ని చూడగానే ప్రేక్షకులు పక్కకుతప్పుకున్నారు కొందరు చల్లగా జారుకున్నారు. పిల్లలు పారిపొయ్యారు. తూర్పునుంచి పడుతున్న లేయెండపొడలో ఒక శవాన్ని పడుకోబెట్టి; ఇద్దరు స్త్రీలు గోడు గోడున ఏడుస్తున్నారు. శవంమొగా, ఆడా అని తెలియటం లేదు. నిలువునా ఓ పాతగుడ్డ కప్పారు; ఆ గుడ్డమీద పసుపూ కుంకుమ చల్లారు శవం పక్కన, రెండువేపులా కాన్లూ, అణాకాసులూ పడి ఉన్నాయి.

ఏడుస్తున్న ఆడవాళ్ళనీ, శవాన్నీ చూశాక పోలీసు వీరయ్య కొంచెం మెనకాడాడు. ఎవరికైనా వొచ్చే ప్రమాదమేకదా అది. అతను '' ఏమిటమ్మా ఇది, ఇక్కడ'' అని మృదువుగా అన్నాడు చేతిలో లాఠీ తిప్పుతూ.

ఇద్దరు స్త్రీలలోను వయసులో ఉన్న అమ్మాయి '' మా బాబు చనిపోయిండు బాబయ్యా, తగలెయ్యాల్నా! నలుగుర్నీ అడుక్కుని పోతం!'' అన్నది చాలా హీనస్వరంలో

పోలీసు, నమలలేకా మింగలేకా, ఏదోగొణుక్కుంటూ వెళ్లాడు తన స్థానానికి.

2

గంటపొద్దు గడిచేసరికి, శవం చుట్టూ బోలెడుమంది జనం పోగయినారు. అందులో చాలామంది పట్నవాసపు రొదలో నిరుద్యోగంగా తిరిగే మధ్యతరగతి వారూ, రోజు కూలీ చేసుకుబతికేవారున్నూ వీరందరూ పొద్దుపోక అలా పోగుబడి తమ తమ అభిప్రాయాల్ని వెలిబుచ్చుతున్నారు.

ఒకాయన, ''అంతా ఒకరోజున పొయ్యేవాళ్ళమే లే అమ్మా! ఏడవకు. మీదసలేవూరు?'' అని ప్రశ్నించాడు ఏడుస్తున్న అమ్మాయిని.

''మాది దచ్చాది బాబూ'' అన్నది ఆ అమ్మాయి బొంగురుపోయిన గొంతుకతో. ''పాపం! ఇతనికిక్కడ పోవాలని రాసివుంది గామాలు!'' అన్నాడాయన. జేబులోంచి ఓ పావలాకాసు తీసి శవంపక్కన పారవేశాడు పోతూ పోతూ.

ఇంకో పైజామా ఆయన, '' ఇతను నయం, మంచివూర్లో చచ్చాడు. నేను రాయలసీమలో చూచాను; మొన్నటి కరువప్పుడు, ఎన్నిశవాలు దిక్కూ మొక్కూ లేకుండా పడివుండేవని!'' అన్నాడు, గుంపులో ఎవర్నీ ఉద్దేశించకుండానే.

ఎవరో ''పాపం!'' అన్నారు.

''పాపమేమిటండి! దారుణం అనండి. డెల్టా జిల్లాల్లో చస్తే దహన సంస్కారానికైనా చందాలు దొరుకుతాయి. అక్కడ అదీకరువే; ఒకడుచస్తే వాడిభాగం తనకొస్తుందిగదా అనుకుంటారు ఇతరులు!'' అని చప్పరించాడు. తరువాత జేబులు తడుముకున్నాడు ''కానీ'' తగిలింది. ఇతరత్రా జేబంతా ఖాళీగావుంది. అతను కొంచెం సిగ్గుపడుతూనే ఆ కానీ తీసి శవంమీదికి విసిరేసి సర్దుకున్నాడు.

ఆ వొంతెన వూర్లోంచి వచ్చే రోడ్డుమీద వుంది గనక రాకపోకల వొత్తిడి జాస్తి. అటునుంచి సైకిల్‌మీద వొచ్చిన అర్జునరావు తన స్నేహితుడైన పోలీసు బీట్‌లో వుండడంతో సరాసరి అక్కడికేవచ్చి ఆగి, '' ఏమిటి మిస్టర్ : ఆ గందరగోళం'' అని ప్రశ్నించాడు వంతెనకేసి చూస్తూ.

వీరయ్య బీడీ వెలిగించి, '' ఎవడో చచ్చాడు. చందా వసూలు చేస్తున్నారు'' అన్నాడు చాలా నిర్లక్ష్యంగా.

''ఆ! ఎంత ఘోరం! నడివీధిన మనుష్యులు చనిపోవటమా! ఏం దేశమండి...'' అని విసుక్కుంటూ సైకిల్ పోలీసు గొడుగుకు ఆనించి - శవంవున్న మూలకు పరిగెత్తాడు అర్జునరావు. అతను చాలా సున్నితమైన మనిషి. అప్పుడప్పుడూ, భావ కవిత్వం రాయటంకూడా కద్దు.

అతను గుంపును తొలగమని తొంగిచూచాడు. ఆ అమ్మాయి శవంకంటే ముందుగా అతని దృష్టినాకర్షించింది. చవక బారు చీర కట్టుకొన్నది. అదైనా అన్నీ చిరుగులు ఆమె ఏడ్పులోనూ ఎంతో అందంగా అగుపించింది అర్జునరావుకి. అర్జునరావు సినీ పత్రికలూ, సెక్సుపత్రికలూ చదవటంలో ఉత్సాహిఅయినా, అతని అంతరాత్మ ఇప్పుడు ఎదురు తిరిగిచివాట్లు పెట్టింది.

ఆమె ఇప్పుడున్న పరిస్థితుల్లోగాక మంచి పరిస్థితుల్లో వుంటేఎలావుంటుందో అని ఊహించసాగాడు అర్జునరావు. వెధవమనస్సు. అందమైన ఆడది ఏ స్థితిలో ఉండి కనపడ్డా అటే చూస్తుందిగాని, ఆమె జాలిగొల్పే పరిస్థితిని అవగాహన చేసుకోదు గదా!... ఆ శవం ఏ పరిస్థితిలో వుందో! ఏ బొమికల పోగు పడివుందో మానవాకారంలో!

అర్జునరావు కొంచెం కంపించాడు. ఏ కుష్ఠురోగంతో, క్షయతో కృశించి చనిపోయాడో అతను! ఒక వేళ తిండి లేక ఆకలిచే వికవికలాడి చచ్చాడేమో! చచ్చాడనగానే అంత్యక్రియలకి ప్రతివాడూ తోచినదంతా ఇస్తున్నాడుగదా! ఇంతటితో సరి, ఇక వీళ్ళకివ్వక్కరలేదని కావును! ఛీ! ఛీ! మానవజాతి ఎంత కరుణారహితంగా ఆలోచిస్తుంది.

అర్జునరావు పది నిమిషాలు లోలోపల ఊహిస్తూ తనకు కనపడుతున్న దృశ్యాన్ని పోలుస్తూ నిల్చున్నాడు.

శవంమీద ఈగలు వాలుతుంటే తోలుతున్నారు ఆ స్త్రీలిద్దరూ. కాన్లూ, అణాలు, పావలాలూ పడివున్నాయి శవం పక్కన పరిచిన గుడ్డమీద. అర్జునరావు జేబు తడిమి ఒక బేడకాసు తీసి చాలా నమ్రతగా వొంగి శవంపక్కన పడేశాడు. అతనికళ్ళల్లో నీళ్ళే తక్కువ. అతను మెల్లగా నడిచి తిరిగి పోలీసుదగ్గరకువచ్చాడు. '' ఏం దేశం వీరయ్యా! శవాన్ని తగలెయ్యాలంటే చందా ఎత్తాల్సివస్తోంది గదా! - ఛీ! ఛీ!'' అన్నాడు నిష్కర్షగా.

''ఆఁ! పోనియ్యవోయ్. వెధవ న్యూసెన్సు. ఎవడైనా పైవాడొస్తే నాకు చీవాట్లు. ఇంకా ఎంతసేపు ఇలా కూచుంటారో వాళ్లు. మున్సిపాలిటీ వాళ్లకప్పజెప్తే తీసికెళ్ళి పారెయ్యరూ?'' అన్నాడు వీరయ్య విసుగ్గా.

అర్జునరావుకి కోపంవచ్చింది. అది వీరయ్యమీద; తర్వాత ఈ వ్యవస్థమీద, ఆర్థిక హెచ్చుతగ్గులమీద. తిరిగి వీరయ్యమీదే నిల్చిందా కోపం. ''వీరయ్యా! నువ్వు మనిషివేనా! శిలవి, కంచుబొమ్మవి. నీలో మానవత్వం లేదా? ఏమిటంత నిర్దయగా మాట్లాడుతున్నావు?'' అని కసురుకొన్నాడు.

వీరయ్య నవ్వుతూ, '' నువ్వేమైనా అనుకోవోయ్. ఎవణ్ణేనా బ్రతికున్నప్పుడే వీలైనంతవరకు కనికరించాలి, సాయం చెయ్యాలిగాని, చచ్చింతర్వాత నినాదాలు చెయ్యటం చందాలు వెయ్యటం ఘోరం!'' అన్నాడు - అర్జునరావు భుజంతట్టి. అర్జునరావుకీ మాట ఛాలెంజిలాగా తగిలింది. ఏమి సమాధానం చెప్పాలో తోచలేదు. ''వెళ్తున్నానోయ్ వీరయ్యా!'' అంటూ సైకిలెక్కి పోతూ పోతూ ఒకసారి తిరిగి శవాన్నీ, అమ్మాయినీ చూసి వెళ్ళిపోయినాడు.

## 3

పోలీసు అలా భోజనానికి వెళ్ళకుండా నాలుగుసార్లు కాఫీత్రాగి ఐదుగంటలకు డ్యూటీ దిగిపోయినాడు. ''డ్యూటీ'' దిగినా అతడు పక్కనేవున్న బీడీకొట్లో కూర్చుని, కొంచెం పొగాకు కొనుక్కొని చుట్ట చుట్టుకోసాగాడు.

అదే సమాయానికి అర్జునరావు వొంతెనమీదుగా సైకిల్‌మీద వొచ్చి బడ్డీకొట్టు బల్లమీద కూర్చునివున్న వీరయ్యను పెట్రోమాక్సులైటు వెలుగులో గుర్తుపట్టి అక్కడకు వచ్చి ఆగాడు. ''ఏమిటి వీరయ్యా! ఇంకా ఇక్కడే వున్నావు? ఇంటికి వెళ్ళలేదు?'' అని అడిగాడతను.

''లేదోయ్, ఏమిటో బద్ధకంగావుండి కూర్చుండి పొయ్యాను'' అన్నాడు వీరయ్య.

అర్జునరావు ఉదయం తానుచూసిన శవం గుర్తుకొచ్చి వంతెనవేపు చూశాడు. ఇప్పుడక్కడ ఏమీలేదు. అతను ఎంతో జాలిగా, వీరయ్య వేపు తిరిగి '' ఈ పాటికి శవదహనం జరుగుతూ వుండొచ్చు. పాపం ఆ యిద్దర్నీ అనాధలుగా ఒదిలేసి వాడిదోవన వాడు పోయినాడు'' అన్నాడు; అతనిగొంతులో ఆ నిమిషాన భారతీయవేదాంతసారమంతా పలుకుతున్నట్లు తోచింది వీరయ్యకు.

వీరయ్య, నోటిలో చుట్టతీసి తుపుక్కున ఉమ్మేసి, ఎదురుగా దెయ్యంలా చీకట్లో తలలూపుతున్న పెద్ద రావిచెట్టు కొమ్మల కేసి చూస్తూ, ''నీకెంతో జాలేసింది గాబోలు!'' ఎంత చందా ఇచ్చావేం? అని అడిగాడు.

అర్జునరావు '' ఎంత అయితే ఏం? మనశక్తికొద్దీను! బేడో పావలో!'' అన్నాడు. వీరయ్య పక పక నవ్వాడొక సారి మనసారా. తర్వాత ''అర్జునరావు! నేనిందాక ఏదో అన్నానని నువ్వు మనసు కష్టపెట్టుకున్నావు కదూ?....'' అన్నాడు. అర్జునరావు ''అవునుమరి! నువ్వు వాళ్ళనుచూసి జాలిపడకపోగా అథార్టీచేస్తుంటివి! అందుకు'' అని ఆగాడు.

వీరయ్య మళ్ళీ నవ్వి. ''అందుకే తిరిగి నేనొకమాట అంటాను. ఏమనుకోకేం! మనం బతికున్న వాళ్ళని కనికరించం అర్జునరావూ! వాడే చచ్చాడనగానే చందాలు కురిపిస్తాం. వీలయితే స్మారకసభలుచేస్తాం. పెద్దస్థూపాలు నిర్మిస్తాంగూడా. ఈ సంగతి ఆ ఆడవాళ్ళకికూడా తెలిసివుండటం విశేషం!'' అన్నాడు.

దీని అర్థం ఏమిటో అర్జునరావుకి మొదట ఏమీ బోధపడలేదు. కాని రెండు నిమిషాలు ఆగి కొంచెం అర్థమై '' ఏమిటీ! ఏమిటీ నువ్వనేది?'' అని ఆదుర్దాగా అడిగాడతను.

వీరయ్య, ''మరేమీ లేదు! చీకటి పడగానే వీళ్ళు వాణ్ణి ఎత్తుకుని అలాగా కొంత మేర వెళ్ళారు; నేనుచూస్తూనే వున్నానులే. ఆ ఒంతెనకింద మెట్లుదిగాక వెధవ లేచి నడవసాగాడు.., అంతే; అయితే నా కింకా ఆశ్చర్యమేమిటంటే ఆ ఆడవాళ్ళిద్దరూ బ్రతికున్న వాణ్ణి ముందేసుకుని చచ్చినవాడ్నై ఏడ్చినట్టే ఏడ్చారు చూడు!...'' అన్నాడు నవ్వుతూ.

''కూటికొరకు కోటివిద్యలు!'' అనుకుంటూ అర్జునరావు వెళ్ళబోతూంటే వీరయ్య అతన్ని ఆపి, ''లోకం తనను తాను మభ్యపెట్టుకుంటుంది. ఆ లోకాన్నే మభ్యపెట్టడం కొందరి కవుసరం అవుతుంది'' అన్నాడు.

*(కథావాహిని, 1955)*

